శ్రీ కపిలేశ్వరపురాధినాయక ప్రకటితము

# శ్రీ రాధామాధవము

శ్రీ

# రాధామాధవము

కవి

రాధామాధవబిరుదాంక

శ్రీ చింతలపూఁడి యెల్లనార్యుఁడు

మునివలుకు

విమర్శాదర్శక

శ్రీ నడకుదుటి వీరరాజప్రణీతము.


ముద్రాశాల

కాకినాడముద్రణాలయము

కాకినాడ.

# విజ్ఞాపనము

ఆంధ్రభోజుఁడను ప్రఖ్యాతిఁగని, కవిపోషకుఁడై, పండితుఁడై యలరారిన శ్రీకృష్ణరాయభూపేంద్రునికాలమున రచింపఁబడిన యీయమూల్యప్రబంధరత్నమును ప్రకాశమొనర్చు భాగ్యము నా కలవడినందులకు నే నెంతయో సంతసించుచున్నాఁడను.

పూర్వకవి విరచితములై, కాలగర్భమున దాఁగియున్న ఆంధ్రప్రబంధములఁ గొన్నిటినైనను యథాశక్తిని ప్రకటింపవలయునను నుద్దేశము నాకుఁ గలిగి, వానికై, తడవులాడుచుండఁ బ్రప్రథమమున మదరాసుదొరతనమువారి ప్రాచీనపుస్తకభాండాగారమున నీరాధామాధవముయొక్క మాతృక లభించినది.

దానినటనుండి తెప్పించి, ప్రతి వ్రాయించితిని. బ్ర॥ శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు చాలశ్రమపడి పరిష్కరించిరి. పిదప శ్రీపిఠాపురసంస్థానకవులగు బ్ర॥ శ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రులుగారు పరిచూచిరి. విమర్శాదర్శకులగు నడకుదుటి వీరరాజకవిగారు గ్రంథమునకు మునిపలుకును వ్రాసి యొసంగిరి. ఈవిధముగ నాయుద్యమమునకుఁ దోడుపడిన యీపండితత్రయమున కేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

కవితల్లజులలో నొకఁడై ప్రశస్తిఁగనిన రాధామాధవుని కవితామృతమును ఆంధ్రపాఠకలోకమునకుఁ జవిచూపించు

నదృష్టము నాకుఁ గలుగఁజేసినపరమేశ్వరునకు వందనముల నర్పించుచున్నాఁడను.

ఇంకను నిట్టిగ్రంథమణులను బ్రకాశ మొనర్పవలయునను నాశ నాకెంతయేని కలదు. కాని అట్టియవకాశమును నాకు లభింపఁజేయుభార మాజగన్నియంతమీఁదను, ఆంధ్రలోకము మీఁదను గలదని నావిన్నపము.

కపిలేశ్వరపురము,
తూ॥ గో॥ మండలము.
యువ; మాఘ శు ౭.

శ్రీ బలుసు బుచ్చిసర్వారాయఁడు,
జమీందారు.

శ్రీదేవాయనమః.

# ముని పలుకు

శ్రీమహావిష్ణుదేవుని యవతారములలో నెల్ల నెల్లవిధములఁ బరమోత్కృష్ట మైనది శ్రీకృష్ణావతారమే యని యసంఖ్యాకు లగు భారతవర్ష వాసులు విశ్వసించెదరు. కావుననే యమ్మహాత్ముని నిరతిశయమనోహర శైశవలీలలు, తదమేయదివ్యమహిమములు, తదీయాత్యద్భుతదుష్టశిక్షణ,శిష్టరక్షణాదిసచ్చారిత్రములు, నాతని యద్వితీయ రాజకీయ పరిజ్ఞానవిశేషములు మొదలగునవి యనేకములగు పురాణములయందును, నాటకములయందును, ప్రబంధములయందును, శతకములయందును, పద్యములయందును, పాటలయందును, వీథిభాగవతములయందును, గొల్లసుద్దులయందును, స్తోత్రములయందును, వేయేల?, బడిపిల్లలగిలకలపద్యములయందును భక్తి, నీతి, శృంగార, వైరాగ్యములఁ బ్రబోధించునట్లుగ, హృదయంగమముగ నభివర్ణింపఁబడి యున్నవి. అట్టిమహామహుఁడైన శ్రీకృష్ణభగవానునకును, శ్రీమహాలక్ష్మియపరావతార మని (ఈగ్రంథమునందు) పేర్కొనఁబడిన రాధామహాదేవికిని జరిగిన స్వయంవరవివాహమహోత్సవమును దెలుపు నీరాధామాధవప్రౌఢప్రబంధమును రచియించినమహాకవి చింతలపూఁడి యెల్లనార్యుఁడు. ఇక్కవిచంద్రుఁడు శ్రీవత్సగోత్రుఁడు; వల్లభరాయప్రపౌత్రుఁడు; - కృష్ణభట్టారక

పౌత్రుఁడు; ఇతనితండ్రి కామనార్యుఁడు; తల్లి లచ్చమాంబ. ఇవ్విషయము లీగ్రంథము ప్రథమాశ్వాసములోని (కవి, తనపితృ పితామహ ప్రపితామహ వర్గత్రయమును దెలిపికొనిన) 20 వ పద్యమునుబట్టి యెఱుంగనగును. మఱియు, నీగ్రంథములోని యాశ్వాసాంతగద్యములయందు గల 'కామయప్రభుసుపుత్త్రి' యను నీతనివిశేషణమునుబట్టి, యీతఁ డార్వేలనియోగిబ్రాహ్మణుఁ డనియు, నీతనివంశమువారు చింతలపూఁడి గ్రామమునకు నధికారులై యుండియుందు రనియు గ్రహింపవచ్చును.

ఇమ్మహాకవికులగోత్రాదులు తెలిసినవి గావున నీతనినివాసస్థలమునుగూర్చి కొంచెముగ నాలోచింపవలసి యున్నది. మనదేశమున సామాన్యముగా గ్రామములనుబట్టియు, బిరుదాదులనుబట్టియు గృహనామములు వెలయు చుండును:—

"ఓలేటివారు, ఉప్పులూరివారు, నడకుదుటివారు, పానుగంటివారు..." ఇట్టిపేరులు గ్రామములనుబట్టి యేర్పడినవి; "ఘటికవివారు, నిమిషకవివారు, ప్రబంధకవివారు, ద్వివేదులవారు, ఏనుఁగువారు..." ఇత్యాదులు బిరుదములనుబట్టి పుట్టినవి; నేతివారు, నూనెవారు, జిడ్డువారు, పెసలవారు, కందులవారు, వంకాయలవారు, పచ్చిపులుసువారు, తవ్వావారు, ఐదుసోలలవారు..." ఇత్యాదినామములు వర్తకవ్యాపారాదులవలనఁ గలిగినవి. (మఱియు ననేకవిధవిచిత్రతరగృహనామములింక ను గలవు.)

ఇక్కవిచంద్రునియింటిపేరు చింతలపూఁడివారని యీ గ్రంథముకడపట నున్న "సంతతభావశుద్ధయుత......, చింతలపూఁడి యెల్లకవిశేఖరు......" అనుపద్యమువలనఁ దెలియుచున్నది. ఇది 'చింతలపూఁడి' యనుగ్రామమునుబట్టియే యేర్పడి యుండె ననుట స్పష్టము.

బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎం. ఏ. గారు, తమ చెన్నపురివిశ్వవిద్యాలయోపన్యాసములలో నొకదానియందీయెల్లయకవినిగూర్చి ప్రశంసించునప్పుడు, "ఈతనిది కడపజిల్లాలో పెన్నానదీతీరమున నున్న చింతలపూఁడి" యని చెప్పినట్లు * విష్ణుమాయానాటకగ్రంథోపోద్ఘాతము ౧౧ పుటయందు వ్రాయఁబడి యున్నది. కాని, కడపజిల్లాలో—చింతకుంట, చింతలచెఱువు, చింతలచెలిక, చింతలజూటూరు, చింతరాజుపల్లె, చింతలకుంట—అను గ్రామములుమాత్రమే యున్నట్లు తెలియవచ్చుచున్నది. మఱియు నాజిల్లాలో 'చింతలపూఁడి' యనునది యున్నట్లే కానరాదు. కావున మనయెల్లనార్యుఁడు కడపమండలస్థగ్రామనివాసుఁడై యుండఁ డని యెన్నవచ్చును.

విష్ణుమాయానాటకప్రబంధమునకు నుపోద్ఘాతమును వ్రాసిన బ్రహ్మశ్రీ కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ. గారిక్కవి నివాసమునుగూర్చి చర్చించుచు,

---

* చెన్నపురి విశ్వకళాపరిషత్తునకుఁ (University of Madras) జెందిన ప్రాచ్యపరిశోధనాలయాంధ్రశాఖవారు (Oriental research Institute) ఎల్లనార్యవిరచితమే యగు విష్ణుమాయానాటకప్రబంధమును ముద్రింపించి ప్రకటించినారు.

"(విష్ణుమాయానాటకమున) గౌతమీతీరభూమినిగూర్చి యాతఁడు (కవి) చేసిన వర్ణనమునుబట్టి చూడఁగా, నీతఁడీ (గోదావరీమండల) ప్రాంతమువాఁడేమో యనుసందేహము బలపడుచున్నది. పుండరీకునిచరిత్రమునఁ జేయఁబడిన కృష్ణా గౌతమీతీరభూతలవర్ణనమునుబట్టియు, నైదవయాశ్వాసములోని నారదునికథకుఁ బ్రధానరంగమైన సర్వవరక్షేత్ర (కాకినాడసమీపగ్రామ)మును వర్ణించినరీతినిబట్టియు నాతనికి (కృష్ణాగౌతమీతీరప్ర)దేశమునందు గల విశేషాభిమానమును, బరిచయమును జాటుచున్న వనవచ్చును......కావున సాధనాంతరములచే నీతనినివాసస్థానము వేఱుదేశ మని నిరూపింపఁబడునంతవఱకు నీతఁడు గోదావరీకృష్ణామధ్యప్రదేశమువాఁడని, వేఁగిదేశీయుఁడని నిర్ణయింతముగాక."

అనునట్టి భావమును సూచించిరి. వీరినిర్ణయముసైతము కొంతవఱకు విమర్శింపఁ దగినదై యున్నది. ఆంధ్రదేశమున, 'చింతలపూడి' గ్రామములు,

1. అమలాపురముతాలూకా, (వన్నెచింతలపూఁడి, కాఁపుచింతలపూఁడి.)
2. ఎల్లవరము డివిజను,
3. ఏలూరుతాలూకా,
4. గుడివాడ తాలూకా,
5. తెనాలితాలూకా,
6. దర్శితాలూకా,
7. రేపల్లెతాలూకా,
8. గొల్కొండతాలూకా,
9. గొలుగొండ ఏజెన్సీ,
10. వీరవల్లితాలూకా (8. 9, 10—ఇవి విశాఖపట్టనమండలములోనివి.)

ఇత్యాది భిన్నప్రదేశములయం దనేకములు గానంబడు చున్నవి. ఇం దేది కవినివాసగ్రామమో నిర్ణయించుట కష్టమే.

ఎల్లనార్యుఁడు, కవులచరిత్రములయందు చేరకపోయినను, కాలపురుషునియనుగ్రహమున నాతని గ్రంథములు మూఁడు (1 రాధామాధవము, 2 తారకబ్రహ్మరాజము, 3 విష్ణుమాయానాటకము- అనునవి) బయలుపడినవి. ఏతద్గ్రంథత్రయములో నొకదానియందును కవి తననివాసస్థానమును దెల్పికొని యుండలేదు.*

ఒక్కప్పు డిక్కవి శ్రీకృష్ణదేవరాయలయాస్థానమునకు నరిగి, యచ్చట, అల్లసాని పెద్దనార్యునిచే 'నగరు, తగరు, తొగరు, వగరు, అనుపదములు ప్రాసస్థానములయం దుంచి రామాయణపరముగాఁ బద్యముఁ జెప్పునట్లు ప్రశ్నింపఁబడి, యాశువున,

"ఉ. నగరు పగాయె నింక విపినంబుల కేఁగుఁడు రాజ్యకాంక్షనుం
దగరు కుమారులార ! యని తల్లి వగల్ మిగులంగఁ దోఁపఁగాఁ
దొగరున రక్ష గట్టి మఱిఁ దోఁపక గద్గదఖిన్నకంఠయై
వగరుచు చున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనున్."

అను రమ్యతరపద్యమును జెప్పి సభవారి నానందపఱిచెనఁట ! పిమ్మట భారతభాగవతపరముగాఁ గూడఁ జెప్పునట్లు కోరఁబడి, యిక్కవి వానినిసైత మాశువుననే,

---

*విష్ణుమాయానాటకప్రబంధమునఁ గవి వ్రాసినయవతారికాభాగ మింకను లభియింపనేలేదు. కవి తనపూర్వనివాసస్థానము నందు వక్కాణించియుండెనేమో !

"చ. తొగరుచి కన్నుదోయిఁ గడుఁ దోఁపఁగఁ గర్ణుఁడు భీమసేనుపైఁ
దగరు ధరాధరంబుపయిఁ దాఁకినభంగిని దాఁకి నొచ్చి తా
వగరుచుచున్ వెసం బరుగువాఱిన నచ్చటిరాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటఁజేసి ధరాతలేశ్వరా ?"

"చ. వగరుపుమాత్రమే వరుఁడు వశ్యుఁడు కాఁడు సఖీసఖిత్వ మె
న్న గరుడవాహనుండు మము నాఁ డటు డించుట యెల్ల నుద్ధవా !
తగ రని కాక మోహపులతాతనువైన విడంగఁ జూతురే ?
తొగరుచి యోషధీశునకుఁ దోఁపఁగఁ జేయునె వీడనాడఁగన్ ?"

అని రచియించి చదివినట్లును, కృష్ణరాయ లాతనిని విశేషముగ మెచ్చుకొని బహూకరించినట్లును కవిజీవితాదుల వలనఁ దెలియుచున్నది.

మఱియు, మనకవి, తనరాధామాధవకావ్యమును శ్రీకృష్ణదేవరాయలకు వినుపించినట్లును, నాతనిచే 'రాధామాధవ' బిరుదము నందినట్లును- ఈగ్రంథము ప్రథమాశ్వాసములోని 30 వ పద్యమునఁ జెప్పి యున్నాఁడు. ఎట్లన,

"శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి, త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి, నా
*నాధాతృప్రతిమానసత్కవులలోనన్ భూషణశ్రేణితో
'రాధామాధవ' నామ మందిన జగత్ప్రఖ్యాతచారిత్రుఁడన్.

(ఏతద్గ్రంథమును సభలో వినుపించి సభవారి మెప్పును బడసినసమయముననే, యత్యంతసమర్థుఁడగు నిమ్మహాకవి,

---

* 'ధాతృప్రతిమాన' విశేషణముచే ఆంధ్రకవితాపితామహుఁ డల్లసాని పెద్దనార్యుఁడును స్ఫురించుచున్నాఁడు.

వినోదార్థము పై ప్రశ్నము లడుగఁబడి, పై రీతి నాయా పద్యము లను జెప్పియుండును.)

ఇవ్విషయములనుబట్టి యీతఁడు, కృష్ణరాయలయంతిమదివసములయందు దదాస్థానకవీంద్రుఁడుగాఁ బరిగణింపఁబడినట్లును, ఆరాజదేవేంద్రుని యాదరానుగ్రహములచే విజయనగరరాజధానీవాస్తవ్యుఁ డైనట్లును గన్పట్టుచున్నాఁడు. ఈతనినామ మష్టదిగ్గజకవులపట్టికయందు లేకపోవుటచే, నీతఁడు రాయల కడపటి దివసములలోనే తదాస్థానకవిగాఁ జేరినట్లు గ్రహింప నగుచున్నది. ఇఁక నీతఁ డక్కాలమున విజయనగర నివాసుఁ డై యుండినట్లు భావించుటకుఁ గలకారణమును దెలిపెదను:—

కృష్ణరాయలయనంతరము విజయనగరసామ్రాజ్యమును బరిపాలించిన యచ్యుతదేవరాయల మంత్రివర్యులలో నొక్కఁడగు సంజయ తిమ్మరుసు,† మనరాధామాధవకవి, తారకబ్రహ్మరాజకావ్యమును రచియించినాఁ డనియు, దానిని తనయిష్టదైవత మగు శ్రీరామవిభునకుఁ గృతిగా నిప్పింపవలయు ననియు సభవారితోఁ బలికి, యిక్కవిని "సబహుమానంబునం బిలుపించి, యీవిధముగఁ గోరినట్లు 'తారకబ్రహ్మరాజము' నఁ గలదు:-

"గీ. పరమహితుఁడవు తారకబ్రహ్మరాజ,
మనుప్రబంధంబు నీచెప్పినది మదాత్మ

---

† ఈతఁడు కృష్ణరాయలప్రధానమంత్రి యగు తిమ్మరుసు కాఁడు.

నాయకుం డగు శ్రీరఘునాయకునకు,
నంకితము సేయవలయు నా కభిమతముగ."

మఱియు, తారకబ్రహ్మరాజమునందే,

"ఉ. నావుడు నీకు నంకిత మొనర్పఁ దలంచినవాఁడ బాధునా
భావన; నీకు నిష్టముగ బ్రహ్మమయుం డగు రామభద్రధా
త్రీవరమౌళి కంకిత మిదే యొనరించిన, మంచిపైఁడికిం
దావి ఘటిల్లె నేమి యన? నంజయతిమ్మ! వివేకభూషణా."

అని మనకవి యమ్మంత్రితో నుడివినట్లును గలదు.

పైసంగతుల నన్నిటినిబట్టియాలోచింపఁగా, నెక్కడనో గోదావరీమండలములో నున్న యేలూరు తాలూకాలోని చింతలపూఁడిగ్రామమునుండి, బళ్లారిజిల్లాకడపటి (పశ్చిమపు) సరిహద్దున నున్న విజయనగరమునకుఁ బోయి కృష్ణరాయలను సందర్శించియుండు ననుటకంటె, నచ్చటికి (ఏలూరికంటెను) సమీపమున నుండు (నెల్లూరుజిల్లా) దర్శితాలూకాలోని, లేక, (గుంటూరుజిల్లా) రేపల్లెతాలూకాలోని, 'చింతలపూఁడి' నుండియే, మనకవి, రాయలయాస్థాని కేఁగి యుండి, తనకవిత్వ ప్రజ్ఞాదికములఁ బ్రకటించి, తదాస్థానకవియై, యారాజధాని యందే నివాసమేర్పఱుచుకొని యుండు నన్నియు, అచ్యుతరాయల యనంతరము, విజయనగరరాజ్యము, రాజకుటుంబము లోని (యంతః) కలహములవలనను, మహమ్మదీయయుద్ధయాత్రాద్యుపద్రవములవలనను నల్లకల్లోల మగుస్థితియం దుండు టచే నాతఁడారాజధానీనివాసమునువిడిచిపెట్టి, కాలక్రమమున,

కృష్ణాగోదావరీనదులచే సుక్షేత్రములై యున్న ప్రదేశములకు సకుటుంబముగ వలస వచ్చి యచ్చటఁ దగినకుటుంబజీవనోపాధిని సంపాదించుకొని, యచ్చటనే స్థిరనివాస మేర్పఱుచుకొని యుండు ననియు, పిమ్మట, ఏలూరితాలూకాలోని చింతలపూఁడిగ్రామము మనకవియింటిపేరితోనే వెలసియుండు *ననియుఁ దలంచుట సమంజసమై యుండునని తోఁచు చున్నది.

మఱియు నిమ్మహాకవి, యీనాఁటికి వయస్సు మరలినవాఁడై యుండుటచేఁ గాఁబోలు, రాజాశ్రయాదిప్రయత్నములు మాని గోదావరీప్రాంతదేశము చేరినతరువాత- ఈప్రపంచమంతయు మహామాయాసమాచ్ఛాదిత మను నెఱుకతోఁ గడపటిదశయందు, విష్ణుమాయానాటక మనుప్రబంధమును రచియించి యాయుత్తమగ్రంథరాజమును రాధామాధవమువలెనే తన యభీష్టదైవతం బగుమదనగోపాలమూర్తికి నంకితము చేసి ధన్యుఁ డయ్యె ననియుఁ దోఁచుచున్నది.

---

* సాధారణముగా, ఆఱువేలవారు మొదలగుపూర్వులలో ననేకులనేకహేతువులనుబట్టి దక్షిణపుజిల్లాలనుండి గోదావర్యాదిమండలములకు వలసవచ్చి, యచ్చట స్థిరవృత్తులను సంపాదించుకొనినట్లును, వారివారిపూర్వపుగ్రామనామములనుబట్టి పుట్టినయింటిపేళ్లతోనే, యాయామండలములందు కొన్నికొన్ని గ్రామము లేర్పడినట్లును జెప్పుటకుఁ బెక్కునిదర్శనములు గలవు.

గోదావరీమండలములోని, ఈఁదరపల్లె (ఈఁదులపల్లె భవానీశకవిపూర్వులపేర వెలసినది.) పెదపూఁడి, చెల్లూరు, నడకుదురు, నేదునూరు మొదలగున వన్నియు నిట్లేర్పడినవే. ఇవి మొదలగుగ్రామము లన్నియు దక్షిణపుజిల్లాలలో నున్నవియే.

(ఈపై నిర్ణయము, ముద్రింపఁబడిన విష్ణుమాయా నాటకమునందలి "కవి యొనర్చిన కృష్ణాగోదావరీమండలమధ్య గతభూతలవర్ణనాదులనుబట్టి, యాతఁడు వేఁగీదేశనివాసుఁడై యుండు"నను శ్రీకోరాడ రామకృష్ణయ్యగారి యభిప్రాయమునకు విరోధింపదు.)

## కవికాలము.

ఎల్లనార్యకవి కృష్ణరాయలకడపటిదశనాఁటికే యాంధ్ర గీర్వాణభాషాపాండిత్యసంపన్నుండై, యతిశయకవితాప్రౌఢుఁడై యామహారాజుమెప్పును గాంచెను గావున నీతఁ డించుమించుగ, క్రీ. శ. పదునాఱవశతాబ్ది ప్రారంభమునఁ బుట్టియుండు నని నిశ్చయింపవచ్చును.

## రాధామాధవకావ్యము.

కృష్ణరాయలనాఁటికి, ఆంధ్రకవితామతల్లిక, భాషాంతరీకరణపరాధీనతను వదలి ప్రబంధనిర్మాణస్వాతంత్ర్యమును వాంఛించుస్థితికి వచ్చినది. కావుననే ఆముక్తమాల్యద, మనుచరిత్ర, పారిజాతాపహరణము మొదలగు ప్రౌఢప్రబంధము లామహారాజుకాలమున వెలువడినవి. అట్టిసమయముననే యీరాధామాధవప్రబంధరత్నము సృష్టింపఁబడినది. ఏతద్గ్రంథావతారికయందు మనకవి, కవిస్తుతి నొనర్చుసందర్భమున,

"క. నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పిన విద్యా

చతురానను నీలాచల
పతిహితు జయదేవసుకవిపంచప్రదర్శ్." (3 పుట)

అని జయదేవమహాకవి * రాధామాధవకావ్యమును జెప్పినట్లు సూచించియున్నాఁడు. అక్కవీంద్రుని (మూల)గ్రంథ† మిప్పుడు లభియించి యుండనికారణమున మనకవి దాని నెంత వఱకు ననుసరించి యున్నాఁడో చెప్పుటకు వలనుపడలేదు. బహుశః, ఇది దానికి భాషాంతరీకరణ మై యుండదు. అట్లే యై యున్నచో నీతఁ డవ్విషయము నుగూడ నిందు వక్కాణించియే యుండును. అదియునుం గాక, యీరాధామాధవమున నాంధ్ర

---

* గీతగోవిందకావ్యమును రచించిన జయదేవకవియే యీజయదేవకవి యై యుండవచ్చు నని విష్ణుమాయానాటకోపోద్ఘాతమున వ్రాయఁబడి యున్నది గాని యీయిరువురు కవులు నొక్కరే యైనట్లు గాన్పింపదు. గీతగోవిందకారునిరాధ స్వీయ యైనట్లు తోఁపదు. రాధామాధవములోని రాధాదేవి కేవలము వివాహితమహిళారత్నము; లక్ష్మ్యంశసంభూతురాలు, కావున నీజయదేవు లిద్దఱును భిన్నులై యుందురు. మఱియు, వేఱొకజయదేవుఁడు 'శృంగారమాధవీయ' మను చంపూప్రబంధమును రచియించి యున్నట్లు గానవచ్చుచున్నది. మనకవియుదాహరించిన రాధామాధవ మాశృంగారమాధవీయమునకు నామాంతరమే యైనచో మనకవి స్తుతియించినజయదేవుఁ డాతఁడే యై యున్న నుండవచ్చును. ప్రసన్నరాఘవనాటకమును వ్రాసిన జయదేవుఁడు పైవారిలో నొకఁడో, అన్యుఁడో!

† ఉత్తరపశ్చిమదేశములయం దున్న వంగ, సంస్కృతలిపులు గల గీర్వాణభాషాగ్రంథవిక్రేతలకు జయదేవకృత 'రాధామాధవము'కొఱకు ననేక లేఖలు వ్రాసితిని గాని యాగ్రంథ మున్నట్లే తెలియరాలేదు!

రచనాజాతీయత విశేషించి కానంబడుచున్నది గాని, సాంస్కృతికగ్రంథరచనాపద్ధతి గోచరించుట లేదు. మఱియు నిందు మన కవీంద్రుఁడు పెక్కుచోటుల స్వతంత్రరచనమును మిక్కుటముగఁ జూపియున్నాఁడు.

## కవికవిత్వము.

రాధామాధవకవి కవిత్వము సహజధారావిలసితమై, మృదుమధురపదగుంఫితమై, ప్రౌఢమై, హృదయంగమమై యాతనికిఁ గలయాంధ్రగీర్వాణభాషాపాండిత్యవిశేషమును బ్రకటించుచున్నది. హృదయాకర్షక మగు నత్యంతభావసౌందర్యమును పిక్కటిల్లఁజేయు నపూర్వకల్పనలు గలపద్యరాజము లిందు లెక్కకు మిక్కిలినవి చూపట్టుచున్నవి. మనోజ్ఞపదభావవిలసిత మగు గ్రంథరచనమున నిమ్మహాకవి, కవిరాజశిఖామణి యగు నన్నిచోడమహారాజు, 'కవిబ్రహ్మ' బిరుదవిరాజి యగు తిక్కనసోమయాజి, 'సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి' యగు నాచనసోమనాథుఁడు మొదలగువారితోఁ దులఁదూఁగఁ గలిగినవాఁడు గాని సామాన్యుఁడు గాఁడు. ఈగ్రంథమునందు కవి తనకవితామాధుర్యమును గూర్చి,

"చ. సరసులు చిత్తగింపుఁ డని చాటను; మామకవాణి సన్మో
 హన యగు నేని వారిహృదయంబుల కింపొనరింపకున్నె? యె
 వ్వరుపిలువంగవచ్చియళివర్గములాత్మలఁ జొక్కుఁ, దేనియల్
 గురియుప్రసూనగుచ్ఛపరికుంచితమల్లిమతల్లికావని ?"

అని వ్రాయుచు, ప్రదర్శించుకొన్న యాత్మగౌరవము నకుఁ దగినట్లుగానే యీమనోహరగ్రంథరాజము రసవత్తరమై పరిఢవిల్లుచున్నది.

కవిబిరుదము

కవిత్వము-అను నిరుపమానమనోజ్ఞకళ యుదయించినది మొదలుకొని నేఁటివఱకు బయలువెడలిన గ్రంథములు సాధారణముగా,

"పరాశరస్మృతి, మనుస్మృతి, ...;* భారవికావ్యము, మాఘకావ్యము, ...; భాస్కరరామాయణము, సోముని హరివంశము, ...; అప్పకవీయము, రంగరాట్ఛందము, ...; బద్దెననీతులు, వేమనపద్యములు ..."

ఇత్యాదులు, కవినామమే భూషణముగా వెలసినవి పెక్కులు గలవు గాని, గ్రంథనామమే బిరుదభూషణముగాను, ఆబిరుదమే నిజనామముగాను, ధరింపఁగలిగినకవిచంద్రుఁ డీరాధామాధవకవి యొక్కఁడే కానవచ్చుచున్నాఁడు. తారకబ్రహ్మరాజమునఁ దనపూర్వనామమునకు బదులుగ, "రాధామాధవుఁడు సుకవిరత్నము చెప్పెఁ." "రాధామాధవుని సుకవిరత్నముఁ బలికెఁ" అని మంత్రియైన నంజయతిమ్మయను పలికినట్లు కవి రాధామాధవనామమే వ్రాసికొని యున్నాఁడు; ఆగ్రం

* కిరాతార్జునీయమునకు 'భారవి'యనియు, శిశుపాలవధమునకు 'మాఘు'మనియు వ్యవహారము గలదు.

థము గద్యమున, "ఇది శ్రీ మదనగోపాలచరణ... కామయ ప్రభుసుపుత్త్ర శుద్ధసారస్వతవిభవ రాధామాధవప్రణీతంబైన... ఆశ్వాసము" అనియు వ్రాసికొనినాఁడు.

అష్టదిగ్గజములవంటి సుప్రసిద్ధకవివృషభులకుఁ బోషకుఁడై, ఆనాఁటికిఁ బ్రచారముననున్న యనేకమహాకవుల కావ్యనాటకాద్యద్గ్రంథములను బెక్కింటిని పఠించి, తత్తద్రసవాహినుల నోలలాడినచిత్తముగల విష్ణుచిత్తీయ (ఆముక్తమాల్యదా) ప్రౌఢప్రబంధమునకుఁ గర్తయై యున్న యాకవిరాజశిఖామణి, యారాజరాజేశ్వరుఁడు, ఆ శ్రీకృష్ణదేవమహారాయ లీరాధామాధవసరసకావ్యమును శ్రోత్రపేయముగ నాకర్ణించి, యానందించి "నానాధాత్రప్రతిమానసత్కృతులలోనఁ భూషణశ్రేణితో" ననన్యలబ్ధమును, నపురూపము నైన 'రాధామాధవ' బిరుదమును (గ్రంథనామాంకిత మైనదానిని) బ్రసాదించుట, యా కవితారసజ్ఞశేఖరుని యౌదార్యాతిశయమును, మనకవితల్లజుని కావ్యనిర్మాణకౌశలమును వేనోళ్ల ఘోషించుచున్నది. మఱియు, కావ్యరసతాదాత్మ్యముం గాంచిన యమ్మహారాజకవి, కవితాతాదాత్మ్యముం గాంచిన యిక్కవిపురందరునిఁ గనుంగొని, 'అతని కతండె సాటి' యని భావించినట్లుగా, విద్వత్కవి,రా,జామాత్య,పురోహితాదిమహాజనసంకీర్ణం బగునానిండుసభయందు, "సెబాస్! కవిచంద్రమా! నీవు నిక్కముగ రాధామాధవుఁడవే!" అని బహూకరించి పలికినపలుకే మన

కవికి సాటిలేనిబిరుదభూషణమై, బిరుదములకెల్లఁ బరమావధిని జెందినబిరుద మైనది!

ఏతాదృశమహారాజ ప్రసాదితబిరుదగౌరవమే మనకవిరాజునకు నమూల్యాలంకార మై, యాతనిపురోభివృద్ధికిఁ గారణమై, యుత్కృష్టకావ్యనిర్మాణమునకు మార్గదర్శక మైనది. కావుననే మన రాధామాధవకవి, రాను రాను జానుమీఱినకవితాకళాకౌశలముతో 'తారకబ్రహ్మరాజము'ను, తన బిరుదమువలెనే (కవిత్వమున పరమావధిఁ గాంచిన 'విష్ణుమాయానాటక' ప్రబంధరాజమును సృజియించి సమానులలో నుత్తమశ్లోకుఁడై శాశ్వతకీర్తిని గడియింపఁగలిగెను.

రసగ్రహణపారీణు లైన మహారాజుల యాదరాతిశయాదులు సరసకళల కెంతటిప్రోత్సాహకరము లైన నై, యాచంద్రార్కయశస్సంపాదకము లగునుగదా!

రాధామాధవము నాలకించి నిరవధికానందరసనిమగ్నుఁడై యిట్టిపరమబిరుదము ననుగ్రహించి యిచ్చిన 'కవితా శ్రీలోలుఁ' డా శ్రీకృష్ణరాయమహారాజకవివతంసము, ఏతత్కవివిరచితమే యగు విష్ణుమాయానాటకకావ్యమును చిత్రగించుటయే తటస్థించి యున్నచో మనకవిసింహు నెట్లు గౌరవించి యెంతగా నానందించి యుండునో నిర్వచించుట యూహామునకును, లిఖించుట లేఖినికిని గూడ నందనిదై యుండి యుండును.

ఎల్లనార్యుని రాధామాధవకావ్యమును వీనులార విని, మనసార నామోదించి శ్రీకృష్ణదేవరాయ లాతనిని 'రాధామాధవుఁ' డనియే ప్రశంసించినాఁడు ! ఇట్లే రాధామాధవుఁడును, కృష్ణరాయని 'కవితాశ్రీలోల' త్వాదివిశిష్టగుణపరిపూర్ణతను మెచ్చుకొని రాధామాధవకావ్యమునందు,

"క. మఱచిరి గృహకృత్యంబులు,
మఱచిరి లజ్జాభయములు, మఱచిరి మగలన్,
మఱచిరి సర్వము గోపిక
లఱిముఱి శ్రీకృష్ణరాయఁ డాత్మఁ గరంపన్." (35పుట)

అని తనయిష్టదైవతమును, శ్రీకృష్ణదేవుని శ్రీకృష్ణరాయనామమున వ్యవహరింపకుండ నుండఁజాలక పోయెను.

ఆహా ! ఎక్కడి ద్వాపరయుగ ఘూర్జరదేశకృష్ణుఁడు ? ఎక్కడి యాంధ్రదేశి 'రాయ'శబ్దము ?-తనప్రభువు తనకు నభీష్టదేవతార్థబోధక మగుబిరుదము నీయఁగా, తన యిష్టదైవతమునకుఁ దనప్రభువునామమే బిరుదమగునట్లు చేసినాఁడు గుణగ్రహణపారీణుఁడు, స్వామిభక్తుఁడు నైన మనకవీశ్వరుఁడు !

పైవిషయములనుబట్టి చూడఁగా, రాధామాధవునికవితావైదగ్ధ్యమునుగూర్చి శ్రీకృష్ణదేవరాయలకును, కృష్ణరాయల రసగ్రహణపారీణతనుగూర్చి రాధామాధవునకును గల గౌరవప్రపత్తులు సామాన్యములు గావని చెప్పుట కెట్టిసంశయమును గోచరించుట లేదు.

## కవియిష్టదైవాదికము

ఉపలబ్ధము లైన యెల్లనార్యుని 'రాధామాధవ, తారకబ్రహ్మరాజ, విష్ణుమాయానాటకకోశములను బరీక్షించి చూడ, నిమ్మహాకవి, 'ప్రసన్న మదనగోపాల, రాధాకృష్ణకవచాది' మహామంత్రోపాసకుఁ డైన నిష్ఠాపరుఁడును, మహావిష్ణుభక్తుఁడును నై యుండినట్లు తోఁచుచున్నాఁడు. ఈగ్రంథము ప్రథమాశ్వాసము 17 వ పద్యము మొదలుకొని 27 వ పద్యము వఱకుఁ గలయవతారికాభాగమును బరికించినచో నివ్విషయము కొంతవఱకు విశదము గాఁగలదు. (మహాత్ములు మనస్సంకల్పబలంబున నభీష్టదేవతా సాక్షాత్కారమును బొందఁగలుగుదురనుటకు సనాతనాధునాతనదృష్టాంతము లనేకములు గలవు.)

రాధామాధవకవి తనగ్రంథమున నిష్టదేవతాస్తుతియందు దేవీసహితు లైన విష్ణు, శంకర, బ్రహ్మలను గ్రమముగా వినుతించి, పిమ్మట గణనాయకుని స్తుతియించినాఁడు. అనంతరము వాల్మీక్యాదిసంస్కృతమహాకవులను, కవిత్రయ మని పేరుగాంచిన నన్నయ, తిక్కన, శంభుదాసులను, శ్రీనాథునిని మాత్రమే కీర్తించినాఁడు.

## గ్రంథవిమర్శము

### రాధామాధవము — ప్రభావతీప్రద్యుమ్నము.

ఇంచుమించుగ సమకాలపువా రైనకవివర్యులచే రచియింపఁబడిన రాధామాధవ, ప్రభావతీప్రద్యుమ్న కావ్యములను

బాగుగఁ బరిశీలించుచోఁ బ్రధానవిషయములయందు రెంటికిని విశేషించిన పోలికలు గానవచ్చుచున్నవి. ఏతద్గ్రంథకర్త లిరువురును, ఒకరినొకరు మించినకవులే; విద్యాపారంగతులే. కావున నేతత్కవిద్వయవిరచితగ్రంథవిషయములను సంగ్రహముగ నిచ్చుటఁ బరామర్శించుచున్నాను.

కృష్ణదేవరాయల యాస్థానకవిశేఖరుఁ డగు 'అల్లసాని పెద్ద'నామాత్యునకుఁ బ్రభావతీప్రద్యుమ్నకావ్యకర్త యగు పింగళి సూరనార్యుఁడు (దౌహిత్రీభర్త) సమీపబంధుఁడును, అప్పటికిఁ బిన్నవయసువాఁ డయ్యుఁ గవితానైపుణ్యము గలవాఁడునునగుటచే నాతనికిఁ గృష్ణరాయలవిద్వత్కవిపరిషత్తుతో విశేషపరిచయము గలిగి యుండును. ఆమహారాజు రాధామాధవప్రబంధము నాలించి తత్కవికి సర్వాతిశయబిరుదప్రదానము గావించుటను సూరనార్యుఁడు స్వయముగ సందర్శించియే యుండును. అప్పటికి విద్యాగర్వము గల యాబాలకవి, ఆనిండుసభయం దనన్యసామాన్యగౌరవమును గాంచిన యీబాలకవి యగు రాధామాధవునికవిత్వమును లోలోన మెచ్చుకొని యుండును. అప్పు డట్టిమనోహరగ్రంథమును నిర్మింపవలయు ననుదృఢసంకల్ప మాతనిహృదయక్షేత్రమున నావాపితమై యుండును. (ఆయుద్దేశమును) సఫలపఱుచుకొనుటకే పింగళి సూరనార్యుఁడు రాధామాధవమునకు బదులుగా నారీతి నామమే కలప్రభావతీప్రద్యుమ్నమును గాలక్రమమున రచి

యించి కృతార్థుఁ డయ్యెను. అప్పటికి నాయికానాయకుల నామములతో నొప్పు నాంధ్రప్రబంధము రాధామాధవ మొక్కటియే యై యుండుటయు, అట్టిపేరితోనే విలసిల్లు రెండవయాంధ్రగ్రంథము ప్రభావతీప్రద్యుమ్న మై యుండుటయుఁ బైయూహమును స్థిరపఱుచు చున్నవి. ఇంతియ కాక యీయుభయ కావ్యములలోను- పాత్రసృష్టియందును, తత్పోషణమునందును గూడఁ బెక్కుసామ్యములు గానవచ్చుచున్నవి :—

రాధామాధవమునందు దౌత్యము నడపినమధురవాణి, సాక్షాద్వాణీదేవి; ప్రభావతీప్రద్యుమ్నదూతిక యైనశుచిముఖి, వాణీదేవిచే నాదరింపఁబడిన హంసి. మధురవాణీశుచిముఖి శబ్దములు గూడ గ్రంథనామములవలెనే కొంతసామ్యమును బొందుచున్నవి. రాధామాధవములోని కథానాయికకు 'వినుకలి' వలనను, ప్రభావతీప్రద్యుమ్నములోని నాయికకు, 'కనుకలి' వలనను తమతమనాయకులపైఁ బ్రేమోదయ మైనది. ఉభయకవులును తమతమపాత్రములలోని దూతికలను సమయోచితముగ నితరులచేఁ బొగడించి యానెపమున నాత్మవిద్యాప్రావీణ్యమును బ్రకటించుకొన్నారు. ఎట్లన,

"సీ. సద్వివేకనిరూఢసౌజన్యశీలవు
సుస్నేహసౌహార్దసులభమతివి
శ్రవ్యశక్యోక్తికౌశలకథాసరణివి
నిన్ను వర్ణింపంగ నేర్తు మెట్లు ?

* * * * *

అతివ! మధురవాణి యనుపేరు సార్థంబు
నీకు; నిన్నుఁ బోల నీవె నేర్తు
గాక! యొరుల సాటిగాఁ జెప్పవచ్చునే?
చెప్పనెడల వాణిఁ జెప్పవలయు!"

రాధామా. (82 పుట).

"సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలి
తలఁపెల్ల నకిల్లషతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబుపొంతఁ బోక

* * * * *

ఒకటఁ బూర్వోత్తరవిరోధ మొందకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె?"

ప్రభా. ప్ర. ద్వితీ. 3 ప.

"క. నీ వెవ్వరికొలఁదియుఁ గా
వో వరటామణి! విహంగమోషవె? భాషా
ప్రావీణ్యము చూడఁగ వా
గ్దేవతవో కాక యూకె దిద్దినకవివో!"

ప్ర. ప్ర. ద్వితీ. 4 ప.

మఱియు, మధురవాణీశుచిముఖులు తమతమకథానాయికలహృదయములను బరీక్షింపఁ జిత్రతరముగఁ బ్రయత్నించినారు. (ప్రయత్నము సమానమే.)

రాధామాధవము (83, 84 పుటలు)

"గీ. అనిన మధురవాణి హర్షించి యాయింతి
తలఁపు నిశ్చయంబుఁ గొలుపఁబూని
సందియంబు గలుగ సరసోక్తినైపుణి
నెఱిఁగి యెఱుఁగనట్టు లిట్టులనియె.

"ఉ. వాక్యము లిట్లియా! హృదయవాసన యెట్టిదొ కాని! శౌరితో
నైక్యము గల్గెనేని వినవమ్మ! సువర్ణకలాపయుక్తమా
ణిక్యశలాకవోలె రమణీయతఁ దాల్పవె నీవు? నవ్యచం
ద్రికృధిరాజబర్హసమతాభరణత్కచకేశమంజరీ!

"వ. అని సంశయంబుగాఁ బలికిన,

"క. ఏఁటికి ననుమానించెదు?
జోటీ! యామేటిఁ గవయఁ జూడక యొరునిం
గీటసమానుని మదిలోఁ
బాటింతునె? హరిణి వృకముపైఁ బడఁజనునే?"

పైపద్యములయందు, దూతిక యగుమధురవాణి, రాధాదేవిహృదయమును బరీక్షింప నెంతనేర్పు చూపినదో, రాధ తనహృద్గతాభిప్రాయము నెంతయమాయికముగా రూఢిపఱచినదో యారయ నగును.)

## ప్రభావతీ ప్రద్యుమ్నము

(శుచిముఖి ప్రభావతితో నిట్లు పలుకుచున్నది.)

"మ. అతివా! నీకు వినుపించువేళఁ బ్రతివాక్యం బేమియుంలేమిఁ ద
 ద్రతికాంతుని వెసఁ దెత్తుఁ బంపుమని పంతం బాడుకోరాదు; గా
 ని తగం దెచ్చెద నిశ్చలం బయినపూన్కిన్ సిద్ధగంధర్వదై
 వతదైత్యాదికులంబులం దొకని నెవ్వానిన్ మదిం గోరినన్."

త్రుతీ. (94 ప.)

(ప్రద్యుమ్నునిదక్క నింక నెవ్వరిఁ గోరినను దెచ్చెద నన్నది!)

ఏతత్పరీక్షకు నిర్వురునాయికలును దమతమ దూతికలకు నేకవిధప్రత్యుత్తరమునే యిచ్చినారు:—

"గీ. తల్లియును దండ్రియును నీదు తలఁపుకోలఁది
 జాగనిత్తురె? యంటివా! జలజనేత్ర!
 కృష్ణవర్త్మభిముఖతఁ దక్కించిరేని,
 కృష్ణవర్త్మభిముఖతఁ దక్కింపఁగలరె? (రాధామా. 84 పుట)

"క. విను! ప్రద్యుమ్నుని దక్కన్
 మనమున నే నొరు వరించుమాట వినవు; మా
 ఘనుఁ డొల్లకున్నఁ జెందుదు
 మనసిజశిఖిఁ దనువు వేల్చి మఱుసటిమేనన్."

(ప్ర. ప్ర. తృ. 102 ప.)

ఉభయకవులును తమతమ గ్రంథనాయికలు బ్రహ్మదేవునిసృష్టిలోనివారు గానియట్లే చెప్పియున్నారు:—

(రాధామాధవములో వాణిమైనమధురవాణి రాధను జూచి యిట్లనుకొనినది.)

"ఉ. ఈతరళాయతాక్షి రచియించెడిచాతురి యెట్లు గల్గెనో
ధాతకు? ధాతచేత రచితం బగునే యిటువంటిరూపు? నేఁ
జూతున కాదె యక్షసురసుందరులన్ సృజియించువేళలం?
దేతదనూనవిభ్రమము లెక్కడి వాచిగురాకుఁబోండ్లకున్?"
(73 పుట)

మఱియు, తనసుహృజ్జనబంధుసమక్షంబున సహస్రగో
పుఁడు రాధాజననవృత్తాంతంబును జెప్పుచు, వ్యాసుఁడు తనకొ
కదివ్యమంత్రం బుపదేశించినట్లును, తన్మంత్రసమాకలనంబువలన
వరప్రదాత యగుశివుండు రాధాదేవిని బ్రసాదించినట్లును జెప్పి
యున్నాఁడు.

(ప్రభావతీ ప్రద్యుమ్నములో, శుచిముఖి, ప్రద్యుమ్నునితో
బ్రభావతింగూర్చి చెప్పుపట్టున,)

"క. అ త్తరుణీమణిరూపముఁ
జి త్తరువున వ్రాయునేర్పు సేకుఱు నేనిం
దత్తుల్యవనిత నెందే
నత్తొలువేలుపు సృజింపఁడా తనసృష్టిన్?"
"ఆ. అజుఁడె యొకప్రసంగమై చెప్ప వింటి న
క్కాంత యతనిసృష్టి గాకునికియు,
నాదిశక్తి, శివుమహాదేవి తనదైన
చిత్రమహిమచే సృజించుటయును."

ఇత్యాదిగ నుగ్గడించినది. ఇప్పట్టున నుభయకావ్యముల యందును, కథానాయికలను- బ్రహ్మదేవుఁడు, రచియించుట కైనఁ జతురుఁడు గాఁ డని యొకకవియు, వ్రాయుటకైనను నేర్పరికాఁడని యొకకవియు నొకరీతినే వ్రాసియున్నారు.

రాధామాధవుఁడు రాధ "నీశ్వరుని"చే సృష్టింపఁజేయఁగా, సూరనార్యుఁడు ప్రభావతిని "ఈశ్వరి"చే సృజియింపఁజేసినాఁడు !

రాధికకు నిజసోదరుఁడైన భద్రకునివలనను, ప్రభావతికి నిజజనకుఁడైన వజ్రనాభునివలనను తమతమ యభిమతనాయకులను బడయుటకుఁ గలిగినయడ్డంకులయందును, కథానాయకులు తమతమప్రియురాండ్రను బరిగ్రహించుపట్టులను గూడ రెండుకావ్యములయందును సంనిధానసాదృశ్యము గనఁబడుచున్నది. (మొదటిది స్వయంవరవ్యాజము; రెండవది నాటకప్రదర్శనకైతవము.) మఱియు రాధామాధవమున స్వయంవరాగతులగు రాజేంద్రులను వివరించిచెప్పుటకై, వాణీదేవి, తనపెంపుడుచిలుకను బంపినది; ప్రభావతీప్రద్యుమ్నమున మఱియొకదూతికగా నొకచిలుక గల్పింపఁబడినది.

ఇట్టి కథాసంబంధమునకుఁ జేరినపోలికలే కాక యచ్చటచ్చట భావైక్యము సూచించు పద్యములును, సమానరచనలు గలవచనములును బెక్కులు రెంటను గానవచ్చుచున్నవి.

## నాయికానేత్రవర్ణనము

"క. వాలికచూపులు గలయా
   బాలికకన్నులు దనర్చు, బలువడి గ్రింగం
   జాలక పుక్కిటివెన్నెల
   లాలితగతి నుమియు వెన్నెలపులుఁగులగతిన్."
(రాధామా. 49 పుట)

ఉ. ఎప్పుడు భక్తభావమున నింపడరన్ ద్విజరాజుపాదముల్
   దప్పక సేవచేయు సుకృతంబునఁ గాంచె జకోరయుగ్మమీ
   యొ ప్పనవొప్పుఁ గన్ను;లవి యోలిన క్రోలిన తేటవెన్నెలల్
   చిప్పిలినట్లు మించు సతిలేనగవుల్ వెలినిగ్గుఁజూపులన్."
ప్ర. ప్ర. ద్వి. 73 ప.

(ఇందు భావ మించుమించుగ నొకటే.)

సీ. జలజాయతాక్షుకటాక్షములిఁ జేర్పని,
   కుచములు కుచములే కోమలాంగి!
(రాధామా. 79 పుట.)

* * * * * * *

"సీ. ఆరతికిఁ గరంబు లైతిరే నవ్విభుఁ,
   గాఁగిలింపఁగ నబ్బుఁ గరములార!
   ఆయింతికిఁ గుచంబు లైతిరే నతనివ,
   క్షోనిపీడన మబ్బుఁ గుచములార!

* * * * * * *

ప్ర. ప్ర. తృ. 105. ప.

ఇందు మొదటిపద్యము, మధురవాణి రాధికకు బోధించినది ; రెండవది నాయిక తనలో భావించుకొన్న పద్యము.

"సీ. కలికియొయ్యారంపుగతుల త్రేతలఁ గన్ను
లార్చి యిక్కువలకుఁ దార్పఁ డమ్మొ,
సహచరగోపాలచయముతో నెప్పటి
యట్ల సంప్రీతి మాటాడఁ డమ్మొ,
మణికుండలప్రభామండితగండస్థ
లుల హాసచంద్రికల్ నిలుపఁ డమ్మొ
నారదవాక్సుధాపూరంబు కడు నాని
చెవి కొంకుపలు కింపు సేయఁ డమ్మొ,
త్రిజగతీవిభ్రమశ్రీలఁ దేజరిల్లు
నాదిలక్ష్మికి నీడు జోడైనరాధ
మీఁదిమూర్మి మనంబులో మిక్కుటముగ
మాధవుం డొక్కకేవలమర్త్యునట్లు." రాధామా. 54పు.

ఇందు కవి శ్రీకృష్ణుని కేవల మానవునిఁ జేసినాఁడు. కాని వెంటనే-,

"సీ. విరహతాపంబున విహ్వలుం డయ్యును
భక్తులతాపంబు పరిహరించు,

* * * *

గీ. కామసుఖసక్తుఁ డయ్యును ఖలుల కెల్లఁ
గామసుఖసక్తతలఁ బాపుఁ గమలనేత్రుఁ
డాత్మసంపూర్ణకాముండు నగుటఁ జేసి,
యఖిలలోకైకకర్తయు నగుటఁ జేసి."

(రాధామా. 55 పుట.)

అని మరల నాతనిదేవత్వమును సైతము ప్రదర్శించి నాఁడు !

"సీ. కనఁ డొద్ద నున్నవారిని వీరు వారని
కనినఁ దదర్హ వర్తనలు మఱచు,
వినఁడు చెప్పినపల్కె వేమఱు చెప్పక
వినిన నే మే మంటి ? రనుచు నడుగు,
చనఁ డెత్తు లిడక మజ్జనముఖ్యవిధులకుఁ
జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు
కొనఁడు నానాసేవకులసేవ లెవ్వియుఁ
గొనిన వీడ్పాటుగాఁ బనులు పనుచు
శుచిముఖీవాక్యదర్పణస్ఫురితనిరుప
మానదనుజేంద్రకన్యకామణిమనోజ్ఞ
రూపరేఖావిలాససంబాధమైన
యాత్మ మరలింపనేరక హరిసుతుండు."

ప్ర. ప్ర. ద్వితీ. 108 ప.

ఇంక సూరనార్యుఁడు ప్రద్యుమ్నునిఁ గేవలమర్త్యునే చేసినాఁడు.

"...ప్రాణసఖులకు దాఁచెదు పనులు గలవె...?"

అని మధురవాణి రాధతోఁ బలికినది.

"అరయఁగఁ దల్లి కక్కసెలియంబ్రడకు...
......దోఁచురహస్యములు...
......చెలికిఁ బ్రాణము లిచ్చిన నప్పు దీఱునే?"

ప్ర. ప్ర. తృతీ. 98.

ఇది ప్రభావతి హంసితోఁ బలికినది.

రాధామాధవుని భావమును సూరన ప్రపంచించినాఁడు. ఇట్టిసాదృశ్యము లీరెండుగ్రంథములయందును బెక్కులుగలవు.

పై సందర్భములు మొదలగువానినిబట్టి యాలోచించు వారికి రాధామాధవకావ్య మాదర్శకమును, ప్రభావతీప్రద్యు మ్న మనుకరణమును నై యుండినట్లును, కావుననే సూరనా ర్యునకుఁ బ్రభావతీప్రద్యుమ్నమున జిలుగుమెఱుంగులు పెట్టు కొనుట కవకాశము గలిగియుండినట్లును బోధపడక మానదు.

నేర్పరి యగుచిత్రకారుఁడు తనబుద్ధివైశద్యముచే నేది యే నొకచిత్రమును వినూత్నపద్ధతిని మనోహరముగఁ జిత్రించి మెప్పొందఁగా, నట్టిసమర్థుఁడే యగు వేఱొకచిత్రకారుఁడు తన ప్రజ్ఞావిశేషమున నట్టిదే యగు మఱియొకచిత్రమును రచియింప నమకట్టి క్రొత్తక్రొత్త చిన్నెలను, వన్నెలను నచ్చటచ్చటఁ జేర్చి దిద్ది తీర్చి, కృతకృత్యుఁ డగుటకుఁ జాలినంతయవకాశ ముండును గదా!

చిన్ననాఁడు కృష్ణరాయలసభయందు రాధామాధవము వంటి యుత్తమకావ్యమును రచియింపవలయు నని పింగలిసూ రనార్యుని హృదయక్షేత్రమున నాటుకొనిన సంకల్పబీజమే, కాలక్రమమున నంకురించి, రేకెత్తి, తరుణవృక్షమై, యభివృద్ధిం గాంచుచున్న కవితాశక్తిదోహదముచే దృఢమహీజమై, తుదకు ప్రబభావతీప్రద్యుమ్నమునంటి మధురఫలమును లోక మాస్వా దించునట్లు చేయఁగలిగినది!

ప్రభావతీప్రద్యుమ్నమునకు రాధామాధవమే యాదర్శక మైనను, సూరనార్యుఁడు, కథాసంవిధానచాతుర్యమునందేమి, అభినవపాత్రసృష్టియం దేమి, జాతీయపదప్రయోగనైపుణ్యమునం దేమి, సమయోచితవచఃప్రాగల్భ్యమునం దేమి రాధామాధవకవిని మించునట్టి మేలిమెఱుంగులను జూపఁగలిగెను. కాని, మృదుమధురపదప్రయోగసారళ్యమునందును, విషయవర్ణనవైదగ్ధ్యమునందును, నిరర్గళధారాసమారూఢియందును, పాకబుజుత్వ శయ్యాసౌకుమార్యాదులయందును మన రాధామాధవకవికి దీటు గాఁజాలఁ డయ్యెను.

శ్రీకృష్ణరాయేంద్రప్రదత్త మగు నెల్లనార్యుని రాధామాధవ బిరుదగౌరవమువంటి గౌరవమును వాంఛించి దృఢసంకల్పుఁ డైన సూరనార్యుఁ డీవిధముగ, ప్రభావతీప్రద్యుమ్న కావ్యరాజమును సృజియించి, శుచిముఖికి బ్రహ్మాణి యగువాణిచేఁ బ్రసాదింపఁబడిన 'ఉపమాతిశయోక్తికామధేను' బిరుదమునకు భంగ్యంతరముగఁ దానే లక్ష్మీభూతుఁడై, చరితార్థుఁడై నాఁడు. ఈవిషయమునుబట్టి, బాగుగఁ బరిశీలింపఁగా, నింకను నిగూఢమైన పరమార్థ మొక్కటి స్ఫురించి, యేతదుభయకవుల సౌహార్దసామరస్యములను దృఢపఱుచు చున్నది. ఎట్లన,

ఎల్లనార్యుఁడు, తనరాధామాధవమునందు, మధురవాణీరూపమున (తాను) వాణి యై యున్నట్లును, సూరనార్యుఁడు, తనప్రభావతీప్రద్యుమ్నమునందు శుచిముఖీరూపమున (తన్ను)

వాణీదేవి దిద్దితీర్చినహంసియై యున్నట్లును ధ్వనిప్రధానకావ్య కర్తలైన యీయిరువురుకవుల రచనలను బట్టియు ద్యోతక మగుచున్నదిగదా! మఱియు, ప్రభావతీప్రద్యుమ్నమునందు వాణీదేవి శుచిముఖికి నొసగిన 'ఉపమాతిశయోక్తికామధేను' బిరుదము, అద్వితీయబిరుదాభిరాముఁ డగు రాధామాధవక విచే, ననన్యసామాన్యకవిప్రతిభానిధి యగు సూరనార్యు నుద్దేశించి చేయఁబడినయభినందనమే యై యున్నట్లు ధ్వనించుచు న్నది. అట్టిరాధామాధవునిచే మెప్పునొందుటయే సూరనార్యుని పరమోద్దేశమై యుండి, యట్టిసంకల్పము సిద్ధించుటచేతనే యా తఁడు (సూరనార్యుఁడు) ప్రకారాంతరమున నవ్విషయము నిట్లు ప్రదర్శించి యుండును. దీనివలన సమకాలికులైన యీ కవిద్వయములో నొకరియం దొకరికి నీర్ష్యాసూయలు లేవని యు, నుభయులును బరస్పరగౌరవాభిమానములు గలవారై యుందు రనియు నిర్ధారణ మగుచున్నది.

ఈసందర్భమున నొక్కమాటను జెప్పకుండ నుండఁ జాలము.

"శ్రీకృష్ణరాయయుగ" మని ప్రసిద్ధిని గాంచిన యాప్రబంధ యుగమునందు కావ్యరచనా ప్రావీణ్యమున నున్నతోన్నతస్థా నము నలంకరించిన కవిసింహులీయిల్లనసూరనార్యులిరువురే!"

## రాధామాధవులు

రాధామాధవుల ప్రేమవిలాసములనుగూర్చి వ్రాసిన కవులలోఁ జాలమంది, తమతమగ్రంథములయందు రాధను స్వ

ష్టముగానో, గూఢముగానో పరకీయ యైననాయికగాఁ బ్రవ ర్తించి యున్నారు. ఈపద్ధతిమీఁదనే రాధామాధవవిలాసము, రాధికాసాంత్వనము మొదలగు గ్రంథములు రచియింపఁబడినవి. వీథిభాగవతములలోఁ గూడ రాధ పరకీయయే! విశేషించి రాధనుగూర్చిన సామెతలును, జనప్రవాదములును గూడ నిట్లే యున్నవి! ఇది మిక్కిలి యన్యాయ్యము!

విష్ణుకథాసంకలితము లైనపురాణాదులలో—భాగవ తమునందుగాని, విష్ణుపురాణమునందు గాని, శ్రీకృష్ణప్రాధా న్యమును బ్రకటించుభాగము గలభారతమునందు గాని రాధా నామము గానరాదు. కాని, బ్రహ్మవైవర్తపురాణమున రాధా దేవీపరమాత్మ్యముత్తమ్యము వివిధవిశేషమహిమములతో వర్ణింపఁ బడి యున్నది. అప్పురాణమునందు విష్ణుదేవునకు లక్ష్మీదేవివ లెనే త్రిమూర్తులకును మూలకారణుఁ డైన శ్రీకృష్ణదేవునకు నీరాధాదేవి నిత్యానపాయిని యైనదేవిగా నభివర్ణింపఁ బడి యు న్నది. మఱియు నందు, రాధయే మూలప్రకృతిగను, శ్రీకృష్ణుఁడే యాదిపురుషుఁడుగను గీర్తింపఁబడిరి. అట్టిరాధాకృష్ణులు కార ణాంతరములచే వారి గోలోకమునుండి భూలోకమున నవతరిం చుటయు, వారిలో రాధ శాపవశమున జన్మించి రాయణపత్ని మాత్రముగ నుండవలసివచ్చుటయు నాపురాణగ్రంథముననే వక్కాణింపఁబడి యున్నది. రాధను పరకీయగా వర్ణించినకవు లకు నీవిషయమే యాధారమై యుండవచ్చును. దీనింబట్టి కొం

దటుకవులు రాధాకృష్ణుల విలాసమును 'గోరంతలు కొండంత లు'గాఁ జేసి వ్రాసి యున్నారు.

పరమభక్తాగ్రేసరుఁ డగుమనరాధామాధవకవి, బ్రహ్మవైవర్తపురాణములోనిరాధాతత్త్వమును సంపూర్ణముగ గ్రహించి యాదివ్యప్రకృతినే లక్ష్మీదేవిగా భావించి, యీరాధామాధవకావ్యమునందు రాధాదేవిని శ్రీమహాలక్ష్మియవతారముగాఁ గల్పించి ప్రశంసించి యున్నాఁడు. కవి యిక్కల్పనయందు మాత్రమే కొంచెము స్వాతంత్ర్యమును వహించెను. కాని, విశేషించి బ్రహ్మవైవర్తపురాణతత్త్వమునే యనుసరించినాఁడు. మఱియు, రాధ పరకీయ యను నయథార్థకల్పితమగు నపస్మృతికిఁ దనహృదయమునందువోలె నిక్కావ్యమునం దెచ్చుటను జోటియ్యలేదు.

భగవంతునియెడ భక్తునికిఁ గల యెడతెగని ప్రేమము, స్వైరిణికి నుపపతియందు గలుగు నిరంతరదృఢతరానురాగము వంటి దను ననుభవసాధ్యదృష్టాంతమును రూపకముగాఁ బ్రదర్శించుటకుఁగాను, బ్రహ్మవైవర్తపురాణకారుఁడు శాపమిషంబున మూలప్రకృతిస్వరూపిణి యైన రాధాదేవిని భూలోకమునకుఁ దెచ్చి, యామెకుఁ బరకీయాభూమికను గల్పించి, యాత్మభర్త యైన శ్రీకృష్ణునినే యుపభర్తగాఁ జేసి, యామెకు నాతనియెడఁ గల నిరతిశయానురాగవ్యాజమునఁ బరమభక్తినే (లోకమునకై) ప్రబోధించినాఁడు. ఇక్కథలోని బహిర్భావ

మును మాత్రమే కావ్యవస్తువుగాఁ బరిగ్రహించిన యితరకవులు, రాధికను కేవలజారిణిగనే ప్రదర్శించి, తమతమగ్రంథముల నతివేలశృంగారరసవాహినులలోఁ దేల్చివైచినారు. భక్తిప్రబోధమునకై పురాణకర్తచేఁ గల్పింపఁబడిన యిక్కథ, యిక్కవులచే వ్యత్యస్తముగాఁ బరిణమించినది. మనరాధామాధవకవి, యట్టిమార్గము ననుసరింపక లక్ష్మీనారాయణులనే రాధామాధవులనుగాఁ జేసికొని యిమ్మనోహర కావ్యరాజమును శృంగారరసానుప్రాణితమైన భక్తిరససుధాసాగరముగాఁ జేసివైచినాఁడు. మఱియు, వల్లవనాయకుఁడైన సహస్రగోపునితనయ యగు రాధను దేవీమూర్తిగనే భావించి, యామెను వర్ణించుపట్టునఁ (గవిసంప్రదాయానుసారము) బాదాదిగ శిరఃపర్యంతము నవయవవర్ణనము నొనర్చి యున్నాఁడు. ఇట్టిభక్తితాత్పర్యముచేతనే యీతనికిఁ గవితాతాదాత్మ్యము గలిగి, రాధామాధవత్వము ప్రాప్తించినది!

ఇక్కావ్యమునం దంతటను బవిత్రమైన రాధామాధవతత్త్వమే ప్రతిపాదితమై యున్నది.

సీతారాములవలెనే విష్ణుభక్తులకు రాధాకృష్ణులు నభీష్టదైవతములై యున్నారు. రాధాదేవి గాక, రుక్మిణ్యాద్యష్టమహిషులు శ్రీకృష్ణునకు ధర్మపత్నులై యున్నట్లు పురాణాములయం దున్నను, భక్తు లెల్లరు రాధాకృష్ణనామముననే ప్రియపడెదరు. మఱియు, వారు, తక్కిన యేదేవేరుల నామములతో

డను శ్రీకృష్ణనామమును జేర్చి సంస్తుతించుచున్నట్లు (రుక్మిణీకృష్ణ, సత్యభామాకృష్ణ......ఇత్యాదిగఁ) గానరాదు!

కవిమతము

రాధామాధవకవీంద్రుని కావ్యములను బరిశీలింప, నీతఁడు విష్ణుభక్తాగ్రేసరుఁడుగాఁ గానవచ్చుచున్నాఁడు. కాని, మతాభినివేశపరతంత్రులై, శివనామోచ్చారణమాత్రముననే భాగవతాపచారము సంఘటిల్లు నని భావించు వీరవైష్ణవులవలెను, విష్ణునామాకర్ణనమాత్రముననే స్వమతాచారభ్రష్టతాదోషము సంభవించు నని తలంచు వీరశైవులవలెను నీతఁడు, మతవైషమ్యమును బరిగణింపక, హరిహరాద్వైతతత్త్వమును విశ్వసించిన సత్యతత్త్వజ్ఞానిగాఁ దోఁచుచున్నాఁడు. కావుననే, వైకుంఠనగరమునకు "పార్వతీవల్లభుండు, దైవదుందుభి జయజయధ్వనులు చెలఁగ, మైత్రిని" వచ్చినప్పుడు, "మాధవుండు, కాంచి, వికసించి, యెదురేఁగి, కౌఁగిలించి, సంభావించి,"...విరూపాక్షుని కేలు కేలం గీలించి......తోడ్కొని వచ్చి, తమ కిద్దఱకును భేదంబు లేదని తెలుపుచు, నతంఁడును, దానును నొక్క దివ్యమణిసింహాసనంబుననే యధివసించె" నని చెప్పి, మనకవి, హరిహరాభేదతత్త్వమును విష్ణుదేవునిచేతనే సిద్ధాంతపఱిపించినాఁడు.

మఱియు నీతఁడు, ఈగ్రంథము 130 వ పుటలోని 55 వ పద్యము మొదలుకొని 69 వ పద్యమువఱకు నున్న పద్య

ములలోఁ, బారము ముట్టునట్లు, శివమహిమ నభివర్ణించి, (సహ స్రగోపముఖంబున) శివసంస్తుతిని గావించినాఁడు. ఇంతియ కాక, కథానాయిక యగు రాధాదేవియవతారమునకు శివునినే కారణభూతుఁడై నవరప్రదాతగా నొనర్చి హరిహరాభిన్నత్వము నందు దనకుఁ గలవిశ్వాసమునకుఁ బ్రాధాన్యమునిచ్చినాఁడు.

ఇకావ్యమునందు గోచరించు "వల్లవీవల్లభా," "అంబికాధవా" అను మకుటములు గల పద్యములనుబట్టి చూడఁగా, నిక్కవిచంద్రుఁడు చిన్ననాఁడు హరిహర స్తవరూపములగుశతకములను గూడ రచియించెనా యనుభావమును గలుగుచున్నది.

## ఛందోవ్యాకరణవిశేషములు.

రాధామాధవకావ్యములోని ఛందోవిశేషములలో 'రేఫద్వయ' మైత్రివిశేషముఁ తప్పఁ జర్చింపవలసినది వేఱొకటి గానరాదు.

రేఫద్వయమైత్రినిగూర్చి లాక్షణికులలోనే భిన్నాభిప్రాయములు గలవు. యతియందుగాని, ప్రాసమునందుగాని రేఫశకటరేఫములకు మైత్రిని సంఘటింపరా దని కొందఱు, వానిని బ్రాసమునఁ గూర్పరాదు గాని యతికిఁ గూర్పవచ్చు నని కొందఱు (లాక్షణికులు) నందురు. బాగుగఁ బరిశీలించినచో నీలాక్షణికుల కెవ్వరికిని శకటరేఫతత్త్వము పట్టువడినట్లు గానరాదు. శకటరేఫోచ్చారణము నన్నయభట్టారకునకుఁ బూర్వకాలమునందే శిథిలమైపోయినట్లు దెలుపుశాసనదృష్టాంతములు పెక్కు

లు గలవు. పురాతనశాసనములలోనే యొకదానియందు శకట రేఫముతోఁ గూడినపదము వేఱొకదానియందు రేఫయుక్తమై యగపడుచున్నది. వాని నెల్ల విమర్శించుట వ్యర్థము. ఉచ్చారణభేద మున్నకాలమందు- అనఁగా నన్నియకుఁ గడుంగడుఁ బూర్వమైనకాలమునందు రేఫద్వయమునకుఁ గలయిక నిందఘ్యమనునిబంధన ముండియుండును. కాలక్రమమున నాశకటరేఫమునకు రేఫోచ్చారణము ప్రాప్తించి పురాతనోచ్చారణ మస్తమించినను, నారెంటికిని మైత్రి కూడ దనునియమముమాత్రము (నేఁటికిని!) నిల్చియున్నది! ఇట్లుండుటయే కాని రేఫద్వయమునకు మైత్రినిగూర్చని లక్షణగ్రంథకారుఁడు గాని, కవి గాని కానరాఁడు. ఏదైన నిట్టికలయిక గలప్రయోగము నెవ్వరేని యేగ్రంథమునన నైనఁ జూపినచో నప్పదము ద్విరూపములలోని దని మనవారు సమాధానము సెప్పెదరు! ఈద్వైరూప్యనిర్మాణ మేఁటికో!

పై వివరణమువలన మనకవినైన "కలకుఁదనము మానియురలిపడక" (48 పుట. 163 పద్యము.) ఇత్యాదిప్రయోగములు గ్రాహ్యము లగుచున్నవి.

ఇఁక వ్యాకరణవిశేషములలో విశేషముగ విమర్శింపఁదగినవి యంతగా లేవు. ముఖ్యము లగువానిని రెండుమూఁడిటిని మాత్రము సంగ్రహముగఁ జర్చించెదను.

(1) స్వార్థకేకారసంధి,

"ఉ. నెయ్యపుబోటికత్తియల నేర్పునఁ గన్గొలఁగొక్క..."

(97 పుట-141 ప.)

(కన్నొలుఁగి + ఒక్క = కన్నొలుఁగొక్క)

ఈసంధి నింద్య మని కొందఱయభిప్రాయము. ప్రాచీన కవులలో సామాన్యముగా నందఱు నీసంధిని గూర్చినవారే యనియు, నది సాధువు గావుననే పెక్కురుకవులు దానిని వాడినా రనియు, "క్త్వార్థేతో నభవేత్సదా" యను సూత్రము (బాలసరస్వతికాలమున*) బయలుదేఱినతరువాత నది నన్నయవిబంధన మని భయపడి లేఖకులును, ముద్రితగ్రంథపరిష్కర్తలును పూర్వపాఠములను దిద్దివేసినా రనియు మఱికొందఱందురు. దీనింగూర్చి పత్త్రికలలోఁ బూర్వ మనేకవాదప్రతివాదములు జరిగినవి !

ఈవాదములలో దేనినిగాని ఖండించుట మనయిప్పటి పని గాదు. పూర్వగ్రంథములయందు పరిష్కర్తలు విడిచిపెట్టినవియుఁ (క్త్వార్థేత్సంధి గలవి) బెక్కులు గలవు. ఒకటిరెండుదాహరణము లిచ్చుట నిచ్చెదను:—

శా. ఆలో భీమునిపైఁ బురత్రితయసంహారంబు గావించు న
ప్పాలాక్షుండన నేఁగి మాధవుఁడు శుంభల్లీలతో బాహులం
గీలించెం బనునాల్గుతూపు; లది వీక్షించ జిష్ణుం డాహరిం
దూలించెన్ విశిఖంబులన్ సురలుసంతోషించిభూషింపఁగన్."

---

* ఈసూత్ర మాంధ్రశబ్దచింతామణిలోనిది. ఈవ్యాకరణమును బాలసరస్వతియే నన్నయపేరితో రచియించి ప్రకటించినాఁడని విమర్శకుల యాశయము.

(చరిగొండ ధర్మనామాత్యుని చిత్రభారతము, అష్ట. ౨౮ప.)

క. "...,...., ఎఱిఁగెఱిఁగి యుండి యకటా

కొఱవిం దలఁ గోఁకికొనుటకుం దలపెట్టెన్."

(మాదయగారిమల్లన రాజశేఖరచరిత్రము, ద్వితీ. ౨౩ ప.)

ఇట్టిప్రయోగములను జాలమంది ప్రౌఢకవు లాంధ్రకవిత్వము పుట్టినదాదిగఁ గ్వాచిత్కముగనైనఁ బ్రయోగించియున్నట్లు కానంబడుచునే యున్నది. కావున మనకవీంద్రుని ప్రయోగములును నట్టివే.

ఇత్వసంధి,

"తొల్కరని, (తొల్కరి + అని—94 పుట 133 ప.)

"వెండొర, (వెండి + ఒర—95 పుట. 136 ప.)

ఇత్యాదులు.)

అనేకహేతువులచే క్త్వార్థకేకారసంధియే సురక్షితమగుచున్నపు డీయిత్వసంధినిగూర్చి విశేషముగఁ జర్చింపనక్కఱ యుండదు. కాని, మహాకవుల యిట్టిప్రయోగములు రెండుమూఁడుమాత్రము చూపెదను:—

"క. ఇతని...,...,...కనుదోయిొలయన్." (తిక్కనభారభార. శల్య. ఆ 1. 273 ప.) (కనుదోయి + ఒలయన్.)

ఇట్లే కవిబ్రహ్మవి-ఇట్టితఁడు, పొయ్యెడుదు-ఇత్యాదులు గలవు.

"చిన్నిపైఁ డందెలు..." రాజశేఖరచ. ౧ ఆ. ౬3 ప. వెండుంగరము; తిత్తొల్చి. శ్రీనాథుఁడు; మోవిచ్చు=మోవి+ఇచ్చు, మొ॥- తెనాలిరామకృష్ణుఁడు...ఇత్యాదులు. (చూపఁ బూనినచో నిట్టివి పరస్సహస్రములు !)

* * * *

ఈ గ్రంథరాజమున నపురూపములును, ననన్యసామాన్యములును, మనోజ్ఞకల్పనావిలసితములును, సుకుమారపదభావసమన్వితంబులును, సహృదయహృదయంగమములును నగుపద్యములు రత్నాకరమునం దమూల్య మణిరాజములం బోలె విరాజిల్లుచున్నవి. దిక్ప్రదర్శనముగఁ గొన్నిటినిమాత్ర మిచ్చట నుదాహరించుచున్నాను:—

## ప్రథమాశ్వాసము

సీ. కపటదానవకోటి కాలంబుదద్రోక్క-
దుష్టమార్గులకు దుందుడుకు వుట్టె
సంయములకుఁ దపస్సంపద గొనసాఁగె
సాదులమది సంతసంబు వొడమె
సుప్రసాదశ్రీలఁ జూపట్టె దిక్కులు
జగతి నెల్లెడల నుత్సవము లొదవెఁ
బుష్పఫలాభిసంపూర్తి వృక్షము లేచె
నదమలసలిలలై నదులు దనరె

నఖిలలోకైకనాయకుం డాదిపురుషుఁ
డచ్యుతుఁడు లోకసంరక్షణార్థలీల
నవని నుదయింప సమ్ముఖుఁ డగుటఁ జేసి
యరయ నాతఁడు సర్వాత్ముఁ డగును గాదె?" (93 ప.)

(సూర్యోదయమునకు ముందు కను వెలుఁగువలెనే యిందు భావిశ్రీకృష్ణావతారచరిత్ర మంతయు సూత్రప్రాయముగ సూచింపఁబడినది.)

సీ. రమణికి మోహాంకురము సముద్భవ మయ్యె
వెలఁదికి మమతలు వేళ్లు వాఱె
రాజీవనయనకు రాగంబు కొనసాఁగె
సీమంతినికిఁ గోర్కి చిగురులొత్తె
లలనామణికి ముచ్చటలు చాలఁ బెనఁగొనెఁ
బడఁతికిఁ దమకంబు ప్రబ్బికొనియె
నలినీలవేణికి నాశలు బరువయ్యె
గురుకుచయుగళకుఁ గూర్మి ననిచె
హృదయ మనుప్రమదావని నేచు కలికి
జవ్వనం బను నామనిసమయమునను
గుసుమసాయకవనపాలకుండు పెనుప
లేమ కిఁక శౌరికరుణ ఫలించు ననఁగ. (128 ప.)

(ఇందు రాధాదేవి ప్రేమాంకురము, వనస్పతిబీజాంకురముం బోలె, ఫలప్రాప్తిపర్యంతరము, ఎట్లు క్రమాభివృద్ధి నందినదో రమ్యతరముగఁ జిత్రింపఁబడినది.)

## ద్వితీయాశ్వాసము

సీ. అబలవేనలిలోని యర్ధభాగము గాదె
పరగఁ జూచినఁ గృష్ణపక్షతమము ?
హరిమధ్యగతిలోని యష్టభాగము గాదె
తక్కినదైరావతంపునడక ?
సుదతిఫాలములోని షోడశాంశము గాదె
హరువమాళిశశిఖండ మరసిచూడ ?
లోలాక్షిచూపులలోని వేయవపాలు
గాదె శంకింపంగఁ గమలదళము ?
కోకములు, పాటలాధరగురుకుచములు
వియ్యములు గావె? వెడవిల్తువింటినారి,
కామినీమణినూఁగారుఁ గవలు గావె ?
యెట్లు వర్ణింపవచ్చు నీయిందుముఖిని? (58 ప.

(ఇందు రాధాదేవిలోకోత్తరసౌందర్యము, పరమోత్కృష్టమును, దివ్యతమము నైనట్లు, అత్యద్భుతముగను, అతిప్రౌఢముగను, అనుభవగమ్యముగను నభివర్ణిత మైనది.)

సీ. ఉడుగని పేఁడిపిట్టార్పులు, వడగాలిఁ
గదిసి కయ్యమునకుఁ గాలుద్రవ్వ,
నడరుకంపంబున నంగవల్లిక, మేఘ
సమయతటిల్లతఁ జౌకళింపఁ,

జేకొన్నపాండిమఁ జెక్కుటద్దంబులు
శారదశశిలక్ష్మి జాఱఁద్రొక్కఁ
బుంఖానుపుంఖమై పొడమెడుఁగరుపాటు
మించి హేమంతర్తు మేలుకొలుప,
మలయుచెమ్మట నెమ్మోము మంచువడ్డ
తమ్మి నెలయింప, దృగ్రాగతరళదీప్తి
పల్లవంబులు మధువేళఁ బరిహసింపఁ
జూడరే! యింతి వెడమూపుమాపె నేఁడు! (196 ప.)

(ఇందు విరహప్రపత్తయైననాయిక సాత్త్వికావస్థలకు ఋతుధర్మముల నారోపించి, కవి, కల్పనాచమత్కారమును మెఱయించినాఁడు.)

## తృతీయాశ్వాసము

చ. బలువగునారిపై శరము, బాణముపై నరదంబు, తేరిపై
విలు, విశిఖాసనంబుపయి వీరభటాళియు నొప్ప చిత్రభం
గుల నిజజూటదేశమునఁ గ్రుమ్మరుకూటపురాసురేంద్రులన్
గెలిచినయోధవర్య! నినుఁ గీర్తన సేయుదు నంబికాధవా!
(62 ప.)

(ఈపద్యము విచిత్రకల్పనాసముచితమై, యంబికాధవుఁ డగు త్రిపురాంతకుని యఘటనఘటనా సామర్థ్యమువలెనే యప్రతిమానమై యున్నది.)

చ. కమలజముఖ్యసన్మునులు గాఢవివేకులునైతనుఁ మనః
కమలతలాభిగమ్యములు గావని చెప్పుదు రేనియంఘ్రిప
ద్మము? లటువంటినందసుకుమారునిపాదముఁద్రొక్కఁజూచెదఁ
బ్రమద! మదీయసాహసముభంగి యెటింగితె? చిత్ర మయ్యెడిఁ!
(121 ప.)

(ఈపద్యము దుర్లభానురాగముచే, ఆశానిరాశలనడుమ నల్లాడుచున్న హృదయము యథాతథముగఁ జిత్రింపఁబడినది.)

చతుర్థాశ్వాసము

సీ. నెలఁత వేనలిపింఛు నీలిదట్టిచీర
సుదతి లేనగవులు చొక్కుమందు
ముదితక్రొన్నెలవంకనుదురు కన్నపుఁగత్తి
మెలఁతకన్దోయి తుమ్మెదలక్రోవి
*కలకంఠకంఠికీలంటు తాళపుఁగొంకి
పడఁతుకగోరు† బల్వంపుఁదునుక
జలజాక్షిమణితముల్ శకునంపుఁబలుకులు
మగువనితంబంబు మఱుఁగుతావు

---

* "కలకంఠిజడయల్లుకసరు" అని వ్రాతప్రతి. "కలకంఠి జడయల్లిక సుద" ‡ అని కవి వ్రాసియుండెనా యని తోఁచెడి. జడయల్లికతుద, తాళపుఁగొంకివలెనే వంకరగా (వఁగిసరితి) నుండును. 'కీలంటు' కొంకివలె నుండదేమో !

† ఇచ్చట 'గోరు' అనుపదము సాదృశ్యమునకుఁ బొందుపడదు. 'ఆరు' అని కవి వ్రాసియుండును. లేఖకప్రమాదమున "యారు" "గోరు" అయినదేమో !

చేసికొని పాంథహృత్తుక్కడ్యసీమ లగలఁ
ద్రవ్వి నిద్దంపుసన్మానధనము దిగిచెఁ
గిక్కు మనకుండ నేరికిఁ జిక్కువడక
సూనశరుఁ డను జగదేకచోర గురుఁడు. (89 ప. ప.)

(ఇందు లోకమోహనకరములగు కామినీమనోహరాంగ విలాసాదులు చోరపరికరములుగాఁ గల్పించి, కవి, తనకళానైపుణ్యమును వెల్లడించినాఁడు!)

సీ. తోరమై సారమై తొరఁగు చంద్రికలును
జలజలనై రాలు చంద్రికలును
వలిగాలి తెరలపై ప్రవాలు చంద్రికలును
సడలి తుంపర చిందు చంద్రికలును
వలలి మీఁగడ గట్టి వడియుచంద్రికలును
జాలిక తొట్టెడు చంద్రికలును
నురువులు గ్రమ్ముచుఁ బారలు చంద్రికలును
జడికట్టి ప్రవహించు చంద్రికలును

దిశల వెల్లివిరిసి దివిముట్టి కడు నిట్టి
ద్రోచి జగము ముంచి తొలఁకియాడె
మాధురీధురీణమదనగోపాలలో
చనదయాసుధారసంబువోలె. (97 ప.)

(ఈయాశ్వాసములో నీఘట్టమునఁ గల *చంద్రికా వికాసవిలాసములును, చకోరవినోదవిహారాదులును నత్యంత మనోహరములై, విచిత్రకల్పనావిలసితములై, యమృతరస తరంగితములై యపురూపములై, యచ్చున గుద్దినరీతిని మనో నయనములకు గోచరించునట్లు కవి ప్రదర్శించియున్నాఁడు. ఇవ్విషయము నీవిధముగాఁ బారము ముట్టున ట్లభివర్ణించిన కవికావ్యము వేఱొండు మృగ్యము.)

పంచమాశ్వాసము

సీ. పసిఁడిపావలమీఁద నొసపరి మువ్వంక
బాగున దివ్యరూపంబు దనర,
డాపలికర్ణకుండల మొకించుక వ్రాలి
యంసదేశంబున నత్తమిల్లఁ,
దిర్యక్కృతంబులై తీగవెన్నెలమించు
తళుకుఁజూపులు కెలంకుల నటింప,
లాలితోదంచితభ్రూలతాయుగళి నే
ర్పడినవళిత్రయీభాల మలర
రాధికాభుజనిహితదోర్దండుఁడై స
మంచితాంగుళిపల్లవ న్యాసములను
రంధ్రముఖముల సప్తస్వరములు గూర్చి
మురళి వాయించె నాజగన్మోహనుండు. (192 ప.)

---

* చతుర్థాశ్వాసము 95 వ పద్యము మొదలుకొని 102 వ వచనముకడవఱకుఁ జూడుఁడు!

(అమృతోపమానమైన యిమ్మనోహర పద్యరాజమున నీరాధామాధవకావ్యసర్వస్వమును మూర్తీభవించి, మధుర మోహనమురళీగానానందము భువనంబులనుంబోలెఁ బాఠక లోకసర్వాంతః కరణములను తన్మయీభవనములుగఁ జేసివైచు చున్నది !)

సీ. బ్రహ్మాదిసురముని ప్రకరంబులకుఁ బర
బ్రహ్మస్వరూప మన్ భావశుద్ధి
ఆరూఢయోగక్రియా శుద్ధిబుద్ధుల
కానందరసపూర మనెడు తెలివి
సహచరగోపాలజనులకు నిజసుహృ
ద్వరుఁ డనువత్సలత్వంబుకలిమి
రాధికాప్రముఖనీరజలోచనలకును
ప్రాణవల్లభుఁ డనుప్రణయభంగి
గలుగఁజేయుచుఁ గారుణ్యకలితలీల
దృష్టి భక్తుల కమృతంపువృష్టి గురియ
నలరుశృంగారి నటిమోహనమురారిఁ
దగిలి వర్తించు ధన్యులతలఁపు తలఁపు. (268 వ.)

(పరమభాగవతోత్తముఁ డైన యిక్కవిచూడామణి, తనకావ్యరచనోద్దేశసాఫల్యము నీపద్యరూపమునఁ బ్రదర్శించి, భక్తితత్త్వపరమావధిని లోకమునకుఁ బ్రబోధించి, ధన్యుఁడై నాఁడు.)

ఈదృశమనోహరపద్యరాజములే కాక,

"ఎడమపిరి; బొమ్మనెట్టుట; సందులఁ దూఱుట; గోరు చుట్టుపై రోఁకటిపోటు; ఒక్కకన్ను కన్నుగాదు, ఒక్కకొడుకు కొడుకు గాఁడు; ... ..."

ఇత్యాదిలోకోక్తులతోఁ గూడిన సమయోచితము లగు చక్కనిపద్యరత్నలును నికోశమున విరాజిల్లుచున్నవి.

మఱియు, భక్తి, శృంగారరసనిధానం బగు నేతత్కావ్యములోని యుపక్రమోపసంహారాదులు రాధామాధవలీలామయములై గ్రంథనామమును సార్థకపఱుచుచున్నవి.

మొత్తముమీఁదఁ గావ్యమంతయుఁ బ్రౌఢమై, ద్రాక్షాపాకలలితమై హృదయంగమమై యొప్పారుచున్నది.

మొన్నమొన్నటివఱకు లోకమున కజ్ఞాతములై పడి యున్న రాధామాధవకవికావ్యములలో నొక్కటి యగు నేతాదృశరమణీయప్రబంధము కాలవశమున విలుప్తమై పోకుండ సముద్ధరించి, బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారిచేతను, శ్రీపీఠికాపుర సంస్థానాస్థాన విద్వత్కవీశ్వరులును, శతావధానులు నగు బ్రహ్మశ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రిగారిచేతను బరిష్కరింపించి, ముద్రింపించి యాంధ్రభాషాయోషామణికి వినూత్నరత్నాలంకారముగాఁ బ్రకాశింపఁజేసి, కాలగర్భమున డాఁగియున్న యిక్కవిచంద్రుని యశశ్చంద్రికలను శాశ్వతముగ దిగంతములయందు వెలయించుటయే కాక, యిట్టికవిశేఖరుని కవితాసామర్థ్యమును మెచ్చుకొని, తదర్హబిరుదమును బ్రసా

దించి మించిన శ్రీకృష్ణదేవమహారాయల రసజ్ఞశేఖరత్వము గూడ నేతద్గ్రంథమూలముగ లోకమున విశదపడుట కవకాశ మును గలిగించిన దేశభాషాభిమానులును, కవితాప్రియులును, నుదారచరిత్రులును, సత్కార్యనిరతులును, విద్యావినయసౌశీ ల్యాదిసుగుణగణవిరాజితులును, పిఠాపురసంస్థానప్రభువులును చిరంజీవులును నగు మహారాజరాజశ్రీ శ్రీరాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారాయ నృపవరేణ్యుల యీపరమోపకారమునకై యాంధ్రులెల్లరును శ్రీయుతు లగువారికిఁ గృతజ్ఞతాభినందనముల నందింపవలసియున్నది. సర్వేశ్వరుండగు పరమేశ్వరుని పరిపూర్ణానుగ్రహమున, శ్రీ ప్రభువువారింకను నిట్లే, దేశభాషాపోషక ము లగు సత్కృతులను వెలయింపఁజేయుచు, దిగంతాక్రాంత యశస్వంతులై, యితోధికాయురారోగ్యైశ్వర్య సంపన్నులై వర్ధిల్లుదురు గావుత మని జగదీశ్వరునిఁ బ్రార్థించుచున్నాను.

పిఠాపురము, }
3—1—1936. }

ఇట్లు విబుధవిధేయుఁడు,
నడకుదుటి వీరరాజు.

శ్రీరస్తు.

# శ్రీ రాధామాధవము.

## ప్రథమాశ్వాసము.

శ్రీలావణ్యరసాధిదేవతలు నాఁ జెన్నొందు రాధాదిగో
పాలస్త్రీలఁ బదాఱువేల వివిధప్రాయంబులం గూడి బృం
దాలీలావనకేళి సల్పుతఱిఁ తత్త్వజ్ఞుఁ గందర్పగో
పాలస్వామి మదీయచిత్తవికచాబ్జస్థాయిఁ గావించెదన్.

చ. పసగల నీకుచద్వయము పాటిగఁ జేయ మదీయకుంభముల్
[1]మసలెడు నన్నుమాఁడ్కి మదమత్త[2]మధువ్రతఝంకృతిస్తుతుల్
పొసఁగఁగ డాసి మత్తకరిపోతము లభ్రనదీజలంబులం
బసిఁడిగలంతులం[3]దిడఁ గృపంగొని మెచ్చుసిరిం దలంచెదన్. 2

ఉ. కైకొని మేల్మిమై నగజకౌఁగిటఁ జేర్చినఁ దత్కుచద్వయీ
కోకయుగంబునన్ దనరు కుంకుమరాగము మేన నెల్లెడన్
సోఁకి నవోదయార్కరుచిసొంపున నొప్పెడి కల్పకంబులా
గై కనుపట్టు శంకరుఁ డనర్గళసంపద మాకు నీవుతన్. 3

---

1 ససలఁగ } అని మూలము.
2 సక్త }

3 గలంతులందు = గలంతులతో అందు=తో అనుటకు చూ. దశకుమారచరిత్ర, నన్నెచోడకుమారసంభవము. ౨ స్వాగతవృత్తము.

చ. పరిణయవేళయందు నిజభర్తృవిభూషణశేషఫూత్కృతి
స్ఫురణఁ దలంకి కన్మొగిచి చూడఁగ నోడి నమశ్శివాయయం
చరనుడి వాత సిగ్గువడి యానతకోమలమందహాససుం
దరవదనారవింద యగు తన్వి మహీధరకన్యఁ గొల్చెదన్. 4

చ. అమలశిరఃకిరీటనిచయంబులు శృంగములట్లు మీఱఁగాఁ
బ్రమదమనస్కుఁడై తెలివిభారతిఁ గౌఁగిటిలోననించి య
య్యమరనదీసమేతకనకాద్రియుఁ బోలె వెలుంగుచుండు బ్ర
హ్మ మహితకావ్యసంపదలుమాకొసఁగున్ గరుణాసమగ్రతన్. 5

సీ. చలనఖాంశువులఁ దంత్రులు జాజుచేసిన
పసిఁడితీఁగెలలీలఁ బ్రజ్వరిల్లఁ
గరవల్లికారత్నకంకణఝణఝణ
త్కారచాతురి తాళగతులు చూప
నొసపరి తలయూఁత నొరసి పైఁ జిల్కు మా
[illegible]ంకుసుధాబిందు లిం పొనర్ప
మృదునాదమూర్ఛనామీలితదృష్టిత్వ
మానందలహరి సొం పనువు దెల్ప

తే. చంద్రకాంత ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... పొగడంగఁ గిన్నెర మీఁటి పాడు
వాణి దయచేయు నాకు, వాగ్వైభవములు. 6

చ॥ అలికులఁ.........గండయుగంబు.........
.........................................
.........గ ముదంబున నుండుగజాననుండు నా
తలఁపునఁ జింతితార్థఫలదాయకుఁడై విహరించుఁగావుతన్. 7

క. శ్రీరామాయణచారి
త్రారామవసంతు సంతతాగమపదవీ
పారాయణు సాత్త్వికగుణ
నారాయణుఁ గొలుతు మనమున న్వాల్మీకిన్. 8

క. వేదాగమ బహుశాస్త్రక
ళాదులు నిర్మించి లోక మంతయు విజ్ఞా
నోదయ పదముగఁ జేసిన
వేద వ్యాసుని మహాకవిం దలఁతు మదిన్. 9

క. నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పినవిద్యా
చతురానను నీలాచల
పతిహితు జయదేవసుకవి పంచప్రదరున్. 10

సీ. వాణీవధూపాణి వీణాకలక్వాణ
కలితవచస్ఫూర్తిఁ గాళిదాసు
భారతీమంజుమంజీరఘులంఘుల
శబ్దవాఙ్మాధురి సార్వభౌము

శారదాహ స్తకంజాతకీరాంగనా
గంభీరవాక్ప్రౌఢిఁ గవి మయూరు
భాషాబలా[1]కటి పరిమిళత్కలకల
కాంచీనినాదో క్తి గరిమ మాఘు

తే. నమృతధారాళవాచాలవిమల వాక్య
గతుల నన్నయభట్టుఁ దిక్కనకవీంద్రు
సన్నుతింతు నశేషభాషావిశేష
కావ్యరచనాధురీణుల భవ్యమతుల. 11

క. నానావిధ [2]పటునటదీ
శానశిరస్సరిదభంగ సలిలోర్మిఘటా
నూనధ్వని మృదుమధురవ
చోనిధి శివదాసుఁ గొలుతు సుకవిశశాంకున్. 12

శా. సూనాస్త్రప్రమదామదస్ఫురితవక్షోజాతకాఠిన్యమున్
బూనంజాలువచోవిలాసముల నేర్పుల్ చూపి కర్ణాటక
క్ష్మానాథేంద్రుసభన్ గవిత్వవిజయోత్సాహంబుఁ గైకొన్నమా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్.

ఉ. ప్రౌఢలసత్కవిత్వముల పొందికలన్ మతిదూల నేదియుం
గూడదటంచు దుర్మతులు గొంచెపు భావరసార్థరీతులన్
జాడ లొనర్ప లేక తమజాడలు గామినిఁ దప్పులంచుఁ దా
రాడుచునుండ్రు మాఘులవు నౌనని మెచ్చుమహాప్రబంధముల్.

---

1 భాషాబలోపరిపరిమళికలకలత్. మూలము. 2 నటనటీ- మూ.

చ. సరవి నొనర్చు సత్కవుల చక్కని కావ్యకలాపమర్మముల్
నిరుపమకోవిదుల్ దెలియ నేర్తురు గాని యెఱుంగఁజాలరొం
డొరులు చకోరకప్రకర ముజ్జ్వలపూర్ణసుధాంశుచంద్రికో
త్కరము చవానునట్టులుగఁ దక్కిన పక్షికులం బెఱుంగునే.

చ. సరసులు! చిత్తగింపుఁడని చాటను మామకవాణి సన్మనో
హరయగునేని వారిహృదయంబులకింపొనరింపకున్నె? యె
వ్వరుపిలువంగవచ్చి యళివర్గములాత్మలఁ జొక్కదే నియల్
గురియుప్రసూనగుచ్ఛ[1]భరకుంచితమల్లి మతల్లికావనిన్. 16

వ. ఇట్లభీష్టదేవతాపదపంకజసంకీర్తనం బొనర్చి పురాణకవివ్రజ
పాణులం గొనియాడి మఱియును నద్యతనసుకవికందర్పుల
నేర్పు లేర్పరించి తదశేషప్రసాదలబ్ధమృదుమధురగంభీర
వాచావిశేషభావరసగర్భితవివిధపదబంధబంధురంబుగా నొ
క్కప్రబంధంబు రచియింపం గోరి వితర్కించుచున్న సమ
యంబున. 17

సీ. మంజీరనీలాలిమాలికాసంశోభి
తాంఘ్రిపంకేజద్వయంబుతోడఁ
కౌస్తుభమాణిక్యగగనమణిప్రభా
కలితవక్షోగ్రభాగంబుతోడ

1 పర-మూ.

శంఖఫలోపేతసమధికదీర్ఘభు
జాకల్పభూరుహశాఖతోడ
నాసికామౌక్తికనవసుధారసబిందు
భాసితాస్యేందుబింబంబుతోడ

తే. రత్నకాంచన పీతాంబరంబుతోడ
నంబురుహరాగమణికిరీటంబుతోడ
నగవుఁ గరుణయుఁ గలలోచనములతోడ
గంటి నామది నొక నీలకంధరంబు. 18

క. ఆనందకరము ముక్తిని
ధానం బభిరామ మతులితము దళుకొత్తెన్
శ్రీ నీలకంధరం బిదె
మానసమునఁ జిత్ర మనుచు మఱియుం జూడన్. 19

సీ. సహచరగోపాలసంఘంబు ముందట
మురళికాకలనాదములఁ గరంగఁ
చరమదేశంబున సురధేనుబృందంబు
లానందరసమున నఱ్ఱు లెత్తఁ
పార్శ్వదేశముల గోపస్త్రీలు కంకణ
రవముల మణిచామరములు వీవ
శంఖచక్రములు నైక్షవశరాసనపుష్ప
శరములు నాల్గుహస్తముల వెలుఁగఁ

గీ. గల్పకమునీడ రత్నాలకోగద్దెమీఁద
నంబుదచ్ఛాయ మువ్వన్నె కైయై ప్రసన్న
మదనగోపాలమూర్తి సకేమగ్రకరుణ
నంత రాధయుఁ దానుఁ బ్రత్యక్షమయ్యె. 20

వ. ఇట్లు డెందంబునకు వాక్కునకు నందరాని యమృతచిదా నందరసస్వరూపనిష్కళంకజ్యోతిర్మండలం బగు పుండరీకా క్షుండు చక్షుర్గ్రాహ్యం బగుప్రసన్నరూపంబునం బ్రత్య క్షంబై నాపైఁ గటాక్షకమలదళయంత్రంబులఁ గృపారస సుధాపూరంబు వెదచల్లి సజలజలధరధ్వానగంభీరమధురా లాపంబులఁ బ్రబోధించి సాధుశ్రోత్రపేయంబును స్వర్గాప వర్గసౌఖ్యసంధానకరణోపాయంబును మదీయలీలారూపకేళీ విహారణలక్షణక్షమంబును సరసహృదయంగమంబును నగు రాధామాధవం బన్మనోహరం బగుశృంగారకావ్యం బది మదంకితంబుగాఁ జెప్పుము. సుఖసంపదాస్పదం బైనమధుర పదంబిచ్చెద నని వరం బొసంగి కవితాకల్పవల్లియను ద్వాద శాక్షరకలితం బగుతనదివ్యమంత్రరాజం బుపదేశించిన సానం దంబును సవిస్మయంబును సకంటకసర్వాంగంబును సబాష్ప ధారలోచనంబును సభక్తిమానసంబును సకౌతుకంబును ససంభ్రమంబునుం గా నాదివ్యభవ్యమూర్తికి నేటి కోళ్ళు సమర్పించి ఫాలతలంబునఁ గేలుదోయిఁగీలించుకొని జయజ యేతిపురస్సరంబుగా నిట్లని స్తుతియించితి. 21

మ. విలసన్నీలపయోదమండలగళద్విద్యుల్లతారేఖయుఁ
బలె మాయాపటలంబు వెల్వడి భవద్భక్తాత్మదేశంబులన్
సులభస్ఫూర్తి నితాంతనిర్మలపరంజ్యోతిస్స్వరూపంబవై
నలినాక్షా! పొడచూపుచుండుదువు కృష్ణా! వల్లవీవల్లభా.

మ. స్థిరవిజ్ఞానవిశేషనిశ్చలితదృష్టిం దుష్టిఁ జూడంగ సా
గరకల్లోలఘటాపరంపరలలోఁ గన్పట్టునర్కాకృతిన్
బరమబ్రహ్మవిలోకనాత్ములకు శుంభద్దివ్యతేజస్స్థితిన్
శరణత్వంబును జూపుచుండుదువు కృష్ణా! వల్లవీవల్లభా. 23

శా. నీవే యజ్ఞములుం దదీయఫలముల్ నీవే కులాచారముల్
నీవే మంత్రము నీవె తజ్జపములున్నీవే మనోవాంఛయున్
నీవే మోక్షము నీవె చిద్విభవమున్నీవే వితర్కింప నా
నావర్ణాశ్రమధర్మమార్గులకుఁ గృష్ణా! వల్లవీవల్లభా. 24

వ. అని సంస్తుతించిన భక్తసులభుం డగునప్పరమపురుషుండును
భక్తిఁ గైకొని మన్మనఃకమలచంద్రశాలికం గెలిసలుపువాఁ
డయ్యెఁ దదాజ్ఞాప్రసాదంబున నేనును; 25

క. బోధించి యిష్టదేవము
రాధాసతిఁ గూడి సౌమ్యరమ్యాకృతి హృ
త్సౌధమునఁ దోఁచి కృష్ణుఁడు
రాధామాధవము చెప్పరా యని పలికెన్. 26

తే. ఇష్టదైవంబు పొడకట్టి హృదయవీథిఁ
దనకుఁ గృతిఁ జెప్పు మని ప్రసాదంబు సేసె
నింతకంటెను సౌభాగ్యమేమి చెప్ప
దైవకృప గల్గెనేని వింతలె శుభములు. 27

వ. అని సంతోషించి. 28

సీ. శ్రీవత్సలాంఛనశ్రీముఖాంబుజమున
శ్రీవత్సమునికులశేఖరుండు
ప్రభవించె నామహాభాగువంశాంబుధి
దివ్యరత్నంబులై తెలుఁగు మీఱఁ
బుట్టి రనేకులు పురుషార్థపరులైన
వారు వారలలోన వంశకర్త
వర్ణితసత్కీర్తివల్లభుఁ డొప్పారె
నతనికి శ్రీకృష్ణుఁ డవతరించె

ఆ. నతనియందుఁ గామనాయ్యుండు జన్మించె
నతని కేను లచ్చమాంబ యందు
జననమొతి నెల్లసత్కవిచంద్రుండ
సరసహితచకోరసఖ్య మలర. 29

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి నా
నాధాత్రీప్రతిమానసత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవనామ మందినజగత్ప్రఖ్యాతచారిత్రుఁడన్. 30

ఆ. నన్నుఁ గన్నఫలము ♦ నాతల్లిదండ్రుల
వంశమునకు మిగుల ♦ వన్నె గలుగ
సకలపితృగణంబు ♦ శాశ్వతబ్రహ్మలో
కైకసుఖము లందుకొనట్లుగాను. 31

క. [1]నాయకరత్నము లక్ష్మీ
నాయకు హరినిష్టదాత ♦ నాకృతికిఁ బతిం
జేయుదు భూముల కగుభూ
నాయకులను బరులఁ గైకొనక పటుబుద్ధిన్. 32

వ. ఇట్లు కృతనిశ్చయుండనై. 33

మ. మకుటోద్యన్నవరాజకందళముతో ♦ మందస్మితోదారర
మ్యకపోలస్థలదర్పణద్వయముతో ♦ మాణిక్యవీణాస్వర
ప్రకటోన్మీలితలోలపక్ష్మములతోఁ ♦ బ్రత్యక్షమై భారతీ!
సకృపా! తోడగుమమ్మ యియ్యెడల నస్మత్కావ్యబంధావళిన్.

వ. అని వాగ్దేవికిం బునఃప్రణామం బాచరించి. 35

క. శ్రీకాంతాజఘనమణి
వ్యాకీర్ణసువర్ణమేఖలాకర్షణకే
ళీకుశలకరాంబుజునకు
స్వీకృతరతిరాజరాజ్యచిహ్నాకృతికిన్. 36

---

క. 1నాయకరత్నము లధి
నాయకు హరినిష్టదాత నాకృతికిఁ బతి
జేయ......మలకగు
నాయక.........పరులగై......మూలము.

క. అంకురితరతికళాహ్లా
త్పంకజగోపీకపోలపాళీకేళీ
కుంకుమరేఖారచనా
హంకారనిశాతకరరుహాంకూరునకున్. 37

క. త్రిజగన్మోహనమూర్తికి
వ్రజరాజకుమారికాప్రవర్ధితనవచి
త్రజపారిజాతలతికా
వ్రజమూలాలవాలహృదయవనజాతునకున్. 38

క. ధ్యానారూఢమునీశ్వర
మానసవైకుంఠకేళిమందిరునకు వి
ద్యానిష్కళంకతేజ
శ్శ్రీనిధి కాభీరసుందరీదయితునకున్. 39

క. ముక్తివధూటీచూడా
సక్తసురద్రుమప్రసూనసౌరభకలనా
యుక్తాంఘ్రియుగళునకు స
ద్భక్తమనోభీష్టదానధౌరేయునకున్. 40

క. మందరధరునకుఁ గరుణా
కందళితకటాక్షమాలికాజాలునకున్
సందీప్తశంఖచక్రా
స్పందితభుజునకు భుజంగపతిశయనునకున్. 41

క. వాగ్వల్లీకందమునకు
దిగ్వరచూడాకిరీటదేశమణిశ్రీ
రుగ్విమలచరణునకు స
మ్యగ్వంశీబ్రహ్మగానమధురిమనిధికిన్. 42

క. రాధావృత్తోత్తుంగప
యోధరరంభోరుకాండయుగసుఖనిద్రా
మాధుర్యనిధికి మన్మథ
బోధరహస్యాగమప్రబుద్ధాత్మునకున్. 43

క. రాధామాధవునకు ధా
రాధరనిభవిగ్రహునకు రాజద్గోప
స్త్రీధైర్యదళనశాలికి
గోధనలోలునకు మదనగోపాలునకున్. 44

వ. త్రైలోక్య విజయంబుగా నా యొనర్పం బూనిన రాధా
మాధవం బను శృంగారప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి
దనిన. 45

సీ. ఏరాజు జన్మించి యిందువంశాంభోధిఁ
గౌస్తుభరత్నంబు కరణి మెఱసె
నేరాజుతాత దేవేంద్రుండు సకలసు
రాసురార్చితచరణారవిందుఁ

డేరాజుతండ్రితం డ్రెల్లలోకములందు
విజయుఁడై విలువిద్య వినుతి కెక్కె
నేరాజునకుఁ బుట్టె మహాపరసౌఖ్యప్ర
దాయకుఁడైన నారాయణుండు
తే. నిలిపె నేరాజు కీర్తులు నిఖిలదిశల
నా పరీక్షిన్నరేంద్రుండు హస్తినగరిఁ
గొలువు గూర్చుండె నొకనాఁడు గురుజనంబు
హరికథామృతరసవీచికలందుఁ దేల్ప. 46

వ. అయ్యవసరంబున. 47

చ. అరుణజటాకలాపము లహర్పతితేజము మీఱ మింట ని
ర్జరవరసిద్ధసాధ్యమునిచారణకోటులు మ్రొక్కుచుండ శ్రీ
హరియపరావతారము మహర్షివరేణ్యుఁడు కర్మసింధుమం
దరధరమాత్మతత్త్వగుణధాముఁడు వచ్చె శుకుండు చయ్యనన్.

క. కమలాప్తదర్శనంబునఁ
గమలంబును బోలె మోము గడుఁ జెలువారెన్
శమదమభూషితశుకసం
యమిచంద్రాలోకనమున నవనీశునకున్. 49

ఉ. భూవరుఁ డమ్మహర్షికులపుంగవు సాత్యవతేయపుత్రు వి
ద్యావిమలాత్ము వైష్ణవకథామణికాంచనవేదిఁ గ్రూరపా
పావళికాననానలు మహాత్మునెదుర్కొని తోడి తెచ్చి పూ
జావిధులాచరించి వరుస న్మణిపీఠము వెట్టె భక్తితోన్. 50

క. మునిలోకమహాళి యుచితా
ననమునఁ గూర్చుండి వినయసన్నమ్రకిరీ
టిని నభిమన్యుతనూజుని
ననఘునిఁ గూర్చుండ నప్పుడనుమతి సేసెన్. 51

వ. అమ్మహామునియానతి నా మానవపతియు నిజసింహాసనాసీనుం డై యుండె నప్పు డాశుకయోగీంద్రునిచేత సభామండపంబు భానుమండలంబుచేత నభోమండలంబునుం బోలెఁ బ్రసన్నం బై ప్రదీపాంకురంబుచేత నంతర్భవనంబునుం బోలెఁ దమోవరణవిరహితం బై సందర్శనీయం బయ్యె నయ్యవసరంబునఁ బరీక్షిన్నరేంద్రుండు కరంబులు మొగిడ్చి పరమభాగవతశ్రేష్ఠుం డై నయమ్మునిగరిష్ఠుం జూచి యిట్లనియె.

మ. ఫలియించెన్ మునినాథ! పూర్వజననప్రారబ్ధపుణ్యావళుల్
వెలిఁగెన్ మామకవంశరత్న మఖిలోర్వీపాలలోకంబులో
పల ధన్యాత్ముఁడ నైతి బోధకలికాప్రవ్యక్తి నర్ధిల్లె మీ
రల వైకుం[1]ఠునిఁబోలె వచ్చుటను దివ్యజ్ఞానచంద్రోదయా!

సీ. సమధికబ్రహ్మవిజ్ఞానసంపద నీకు
నఱచేతిమాణిక్యమనఘచరిత!
కమనీయలోకైకకైవల్యసిద్ధి స
త్కులవర్య! నీకు ముంగొంగుఁ బసిఁడి

1. వైణికయును- / వ్యాసుండును- } మూ

యుపనిషదర్థబోధోత్పత్తికళ నీకు
ధన్యాత్మ ! ముంజేతిదర్పణంబు
కాలత్రయజ్ఞానకలనావిశేషంబు
బయటికెత్తిన దివ్యప్రాజ్ఞ ! నీకు

తే. వ్యాసనారదపుండరీకాంబరీష
ముఖ్యహరిభక్తవరులలో మొదటిపేరు
నీదె నీవంటిసద్గుణనిధియుఁ గలఁడె
శుద్ధసాత్త్వికగుణసాంద్ర శుకమునీంద్ర. 54

వ. అని కొనియాడి సుప్రసన్నునిం జేసి శ్రీకృష్ణప్రసంగంబు దిగిచి మహాత్మ ! యవధరింపు మని వెండియు ని ట్లనియె. 55

తే. సత్యభామయు భద్రయు జాంబవతియు
రుక్మిణియు నాదియగువరారోహవతుల
లలితయౌవనలీలావిలాసవతుల
బెరయుఁ బదియాఱువేల గోపికల [1]నతఁడు. 56

క. వీరలకంటెను మిక్కిలి
యారాధాదేవియందు నబ్జాక్షునకున్
గూరిమి నిలిచినచందం
బేరీతియొ రాధహృదయమెట్లో హరిపై. 57

1 నట్లు—మూ.

వ. తజ్జననప్రకారంబును నాజగదేకసుందరిని ముకుందుండు వరించిన తెఱంగును దదన్యోన్యానురక్తిలక్షణంబును మొదలైన తత్తద్విశేషంబు లెఱింగింపవే యని పలికినఁ గర్ణభూషణాంబులును కైవల్యప్రాప్తికారణంబులును నగునప్పలుకులకు నుల్లంబున సంతసిల్లి మునివల్లభుండు మదనగోపాలవల్లభుదివ్యలీలలం దలంచి పులకించి పులకించి హర్షాశ్రుజలలవంబులు ఱెప్పలతుదల నప్పళించుచు నొక్కింతతడవు పరమానందలహరి నోలలాడి శిరఃకంపంబు సేయుచు నతనింజూచి యిట్లనియె. 58

క. [1]జ్ఞానశమితాఘముని సం
తానసుగోచరము విష్ణుకీతత్త్వకథాసం
ధానాకృతిత్వపుణ్యని
ధానము నీ తెలివి మిగుల కీ ధన్యత కెక్కెన్. 59

వ. అపూర్వకథాసంయోగవి[2]భవంబుఁ గలిగెఁ దత్క్రమంబు నవిస్తరంబు గాఁ జెప్పెద సావధానమతివై యాకర్ణింపుము.

---

క. 1జ్ఞాన నమిత ఘనపచసం
తానవగోచరము విష్ణు‚ తత్వకథాసం
గానాకృతి పుణ్యని
ధానము నీ తెలివి మిగుల ‚ ధన్యత కెక్కెన్-మూ.

2. భాగ- మూ.

మ. సిరికిం దండ్రి మురారిమామ జలదశ్రేణీప్రపాభూమి భూ
ధరసంఘంబులప్రాపు కల్పతరుజాతస్థాన మార్యావధూ
వరు వంటి ల్లమృతంబుకందువ సరిద్వాంఛాఫలావాస మం
బరలక్ష్మీమణిదర్పణంబు కలశీపాథోధి యొప్పుం గడున్.

ఉ. ఆకలశాంబురాశి గగనాంగణచుంబితతుంగభంగమా
లాకణపంక్తి దూలి మరలంబడు నెంతయుఁజూడనొప్పు ల
క్ష్మీకమలాయతాక్షులకు మింటి సమర్పణ సేయుదేవభా
మాకరపద్మకల్పకుసుమప్రకరం బన రాత్రివేళలన్. 62

క. నెలపొడుపున జలనిధితరఁ
గలపెంపున నాగకన్యకలకును వేల్పుం
బొలఁతులకు గగనవీథిం
గలుగుం దమతమవిశేషకథ లెఱిఁగింపన్. 63

వ. వెండియు వెన్నునకుం బాన్పై యున్నపన్నగేంద్రుని సము
న్నమద్వీపులఫణామండలంబులుం బోలె మహత్త్వయుక్తంబు
లై తెరలెత్తి వియత్తలంబున నత్తమిల్లు నుల్లోలకల్లోల
పరంపరాసందోహంబులక్రందునను, విలంబమానకాదంబినీ
జాలంబు ఘుళఘుళాయమానంబు గాఁ గ్రోలుపయఃపూరం
బున దొరలక మరలి తెరలి జల్లనం జెల్లాచెదరై క్రేళ్లుఱికి
పాఱుజలచరబృందంబులసందడియును, నట్టనడుమ నిట్ట ద్రో
చిన తేటనీటిలో నంతర్మగ్నవిద్రుమద్రుమలతావితానంబు

లుం బోలెఁ గానవచ్చునంబరకేళీసంచరద్విమానదివ్యమాని నీజనకూటంబులవ్యాపకత్వంబు నంతర్ద్వీపలీలావిహారసుఖ పరాయణు లగు లక్ష్మీనారాయణులం బూజింప సమకట్టి కట్టాయితం బై సురతరుకుసుమకోరకనికరంబులు కేలు దోయిం గీలించి వచ్చుక్రీడాప్సర స్త్రీనికదంబంబునుఁ బోలెఁ గిసలయపుటంబులలోన ముక్తాఫలంబులు నించి [1]మరు త్తరలితంబు లై పొల్చు లేమెఱుఁగుఁబగడంపుఁదీఁగెల బాగును వియద్గంగాతరంగిణీసలిలపానకేళీసమయంబునదాన ధారాళం బగునింద్రదంతావళంబు దిగిచి వైవఁ జెదరిపడు వికచపుండరీకషండంబులుం బోలె నాడకాడకుఁ గరాళబడ బానలశిఖాముఖంబుల నుడు కెత్తి పయఃపూరంబులు వ్రాం గిన క్రొన్నురువుందండంబులు వాతూలసముద్ధూతంబు లై యుడువీథికిం దూలిపడునోడికంబును బహుముఖంబుల నా నావాహినీనివహంబులు బహులతరళలహరికావ ర్తడిండీర ఖండమండితప్రవాహంబులతో మహారయంబున నొక్కు మ్మడిఁ బ్రతిఘటితతరంగ త్తరంగసంఘంబులు దిరుగుడువడఁ బాయంగొని ప్రవేశించు మహాసంభ్రమవిజృంభణంబునుం గలిగి దుర్వారగర్వారంభభీకరదర్వీకర కరి మకర [2]డుం డుభ ఘలీ కుళీర మత్స్య కచ్ఛప ముఖానేకవార్చరఘోర పరిభ్రమణ ధావన సముల్లంఘన సంకులాభీలకోలాహల

1 మరుత్తారభీతంబు లై — మూలము. 2 డిండీరథ

ద్విగుణితవిజృంభమాణగంభీరఘుమఘుమధ్వాన బధిరీకృతది
గంతరాళదంతావళకర్ణగోళం బై యొప్పు నప్పయోనిధాన
మధ్యంబునందు. 64

శా. ఖ్యాతం బై పదివేలయోజనములన్ గన్పట్టి బ్రహ్మామర
వ్రాతారాధిత మై శుభాభ్యుదయ మై రాజత్కళావంత మై
జ్యోతిర్జ్వాల సహస్రకోటిశశివిస్ఫూర్తిం బ్రకాశించుచున్
శ్వేతద్వీపము చెప్ప నొప్పెసఁగు లక్ష్మీశావాస మై.

సీ. సప్తపాతాళవిష్కంభంబు మోచిన,
పాథోనిధానంబు పరిఖ గాఁగఁ
గనకమాణిక్య సంఘటితంబు లై మీఱు,
కోటలు నేడునుఁ గొమరు మిగుల
సమధికమణికుంభసౌధగోపురరాజి,
యుడుమండలంబు సముల్లిఖింప
మరకత స్తంభసంభారంబు లై పది
యాఱువాకిళ్ళు సొంపారుచుండఁ

తే. జంద్రకాంతశిలాచంద్రశాలికలును
మహితమణికుట్టిమస్థలీ మండపములుఁ
గలిగి త్రైలోక్యమోహనాకార మై య
కుంఠలీలల నొప్పు వైకుంఠపురము. 66

క. అమృతాంబురాశి వీచీ
విమలపయోబిందువితతి వెలయ నిలుచు నం
దముగా నప్పారికోటల్
గమనీయాబద్ధమౌక్తికప్రకరముగన్. 67

క. చక్రి మొగసాల నంబర
చక్రంబునఁ బ్రజ్వరిలుచు సమ్యగ్జ్యోతి
శ్చక్రప్రకటీకృతది
క్చక్రం బై యొప్పుచుండుఁ జక్రం బెపుడున్. 68

చ. అవిరళదివ్యతేజముగ నాడఁగ నేటికి నప్పురంబు పై
రవిశశిమండలంబులు నిరంతరముం జరుచుండుఁ దత్ప్రభా
[1]ప్రవిహతదీప్తి మాఁగునడి వావిరి నద్దపుబిళ్ళలట్లయై
దివమున, ఱేపు మాపు నరదేవశిఖామణి చూడఁజిత్రమై.

సీ. బలభేదిపురములోపల నొక్కటియ యుండుఁ
గలవు లక్షలసంఖ్య కామగవులు
విబుధలోకాధిపువీట నైదే యుండుఁ
గల వనేకంబులు కల్పతరులు
పురుహూతపట్టణంబున నొక్కటియ యుండుఁ
గల వెన్నియైనను దలఁపుటాలు
హరిప్రోల నొకకుండి యమృత మింతియ యుండుఁ
గలవు సుధాకుండికాశతంబు

1 వవి—మూ.

తే. లెన్నఁ ద్రిదివంబులో నొక్క టింతె కాని
కలవు వెలియేనుఁగులు వేలకొలఁది నిందు
వజ్రి యొక్కఁడె కాని యావజ్రికంటెఁ
గలరు విభవాఢ్యులైన కింకరులు నిందు. 70

తే. మోక్షలక్ష్మీమనోహరమూర్తు లచటి
వార లెల్లను విను పాండవకులచంద్ర!
కనకకలధౌతమణిమయాంగంబు లచటి
కీటపక్షిసరీసృప క్రిమికులములు. 71

తే. లక్షకోటులు బ్రహ్మకల్పములు చనినఁ
దలఁక రచ్చోటిసద్భక్తదాసజనులు
సరవి వేవేలు దివ్యవర్షములు చన్న
గడియ తడవును జెల్ల దక్కడిజనులకు. 72

క. కోరుదురు హృదయముల జం
భారిముఖామరులు వేడ్క నచ్చో సుఖసం
చారక్రిమికులమునఁ బెం
పారఁగ జన్మింపఁ బడయుదమని నిరతంబున్. 73

సీ. ప్రతిభ యెఱుంగని బాలకులును బోలె
వర్తించు బ్రహ్మర్షివరగణంబు
మెఱుఁగుడుఁ[1]బ్రువు వోలె మిన్కుమిన్కు మటంచుఁ
గీడ్పడి తిరుగాడుఁ గృష్ణవర్త్మ

1 ప్రువు—పురువు—రూ.

పేదవాఁడును బోలెఁ బెంపేమియును లేక
చరియించు సురలోకచక్రవర్తి
కాంతి లేక దివేందుకరమాలికలు వోలె
విహరింతు రప్సరోవితతు లెపుడు
తే. నచ్యుతునిఁ గొల్వఁ గాఁ బోయి యచటితత్త్వ
మతులలో నుజ్జ్వలప్రభాన్వితులలోన
శాశ్వతైశ్వర్యనిధులలో సమదరూప
వతులలోఁ దమ తేజముల్ కుతిలపడిన. 74
క. హరిదాసులకును దక్కం
బరువడి గోచరము గాను బ్రహ్మాదులక
స్ఫురదవరము తేజ మననే
వరుస న్వర్ణింపవచ్చు వసుధాధీశా. 75
శా. లీలాకిన్నరు లప్పుడెన్ నికట మల్లీకుంజమధ్యంబులన్
గేళీశైలదరీగృహాంగణములన్ గృష్ణప్రబంధావళుల్
వేళాజాతు లెఱింగి వెన్నెలఁ దగన్ వీణాశ్రు[1]తుల్ సాగఁగా
నాలాపంబులు చేసి పాడ హరితల్పాహీంద్రమూఁచున్ దలల్.
సీ. తటరుహసంతానతరుఫలరసఝరీ
పూర్ణసరోవరాంబువులఁ జొఁగి
మధురసాలోలాళిమాలికాభవ్యవా
సంతీలతానికుంజములఁ దూలి

2 శ్రుతుల్ జారఁగా—మూ.

జలరాశివీచికాంతచలచలన్నాగవ
ధూదంతపఙ్క్తిసంగతులను జాతి
కమనీయకర్పూరకదళికాకాంతార
వీథితలంబులవిశ్రమించి

తే. మెల్ల మెల్లన పసిఁడికేళిమేడ లెక్కి
వలపు చిలుకుచు రతికేళిఁ గలసి యున్న
దంపతులకుఁ బునస్సురతప్రసక్తి
గలుగఁ బొలుపారుఁ జల్లనిగాడ్పు లందు. 77

వ. ఇవ్విధంబున నొప్పునవ్వైకుంఠపుటభేదనంబున కధినాయకుం డగునాదినారాయణదేవుండు సముద్దండమణిదండమండిత బాహాదండచండప్రచండప్రముఖప్రతీహారనాయక సహస్ర దుర్వారనయనవిన్యాసనిరుద్ధమహేంద్రముఖ్యదిక్పాలక గరుడగంధర్వసిద్ధవిద్యాధరకిన్నరకింపురుషలోక సంకులద్వార దేశంబును, కర్పూరహరిచందనాగురుగుగ్గులుమహిషాక్షిశక లక్షోదపాత్రప్రకల్పితధూపవాసనావాసితాభ్యంతరాళంబును, మరకతమహేంద్రనీలముక్తాఫలకురువింద వజ్రవైడూర్యపుష్యరాగాద్యశేషమాణిక్యపుంజమంజుపుంజకలితలలితపారిజాతప్రసవవందనమాలికాగంధవిహారమాణపుష్పంధయవితానవిచిత్రవితానరమ్యంబును, వివిధరూపపాంచాలికాశ్రేణీ జలయంత్రధారామార్గవలభీస్తంభవిటంకకపోతవాతాయన

పరంపరానూనవస్తువిస్తారమనోహరకనకమాణిక్య కేళీసాధస మావృతంబును, గల్పపాదపలతాకుంజక్రోడవిరచితపుష్పశయ్యాసూచితమీన కేతనక్రీడాగారవిభ్రమలీలారామ వాటికా ప్రాంతంబును, గనకచిత్రితమత్స్యకచ్ఛపక్రోడాదివైష్ణవదివ్యలీలావతారరూపవిభ్రాజితనిర్మలస్ఫటికకుడ్యభాగంబును, నారాయణమంత్రకళార్థతత్త్వచింతారహస్యవ్యాఖ్యానచతురవజ్రపంజరస్థశుకశారికానికరప్రబోధితమునిసహస్రగోష్ఠీమహితముక్తిమండపశతంబును, మదాలసవిలాసినీకరకమలలీలాముహుర్ముహురాందోళనసమావేల్లద్రుచిరధవళచామరచామీకరమణివలయఘులఘులాత్కారమనోహారంబును, నగణ్యాపుణ్యాకరంబును, నగుదివ్యభవనంబున సనకసనందనసనత్కుమారవామదేవాదిపరమయోగీంద్రబృందంబును, బ్రహ్మోదనారదపరాశరపుండరీకవ్యాసాంబరీషశుకశౌనకప్రముఖనిఖిలపరమభాగవతవర్గంబును, విష్వక్సేనవైనతేయాదులును, బుణ్యశీలసుశీలాదికింకరనికరంబులును, విధాత్రాదిదేవతలు నుచితప్రకారంబునఁ గొలువ లీలావిలాసంబున నొకనాఁడు.

సీ. బొడ్డుఁదామరలోనఁ బొదలుచు నలిఁ బోలె
నలువ శ్రుతిధ్వనుల్ పలుకు చుండఁ
బెన్నురంబున మించు పెద్దమానికమునఁ
బెనఁగొన్న ముత్యాల పేరు మెఱయ

నయన[1]సరత్కృపారసమయవీచు లన వజ్ర
కుండలద్యుతులు చెక్కుల నటింప
శార్ఙ్గగదాశంఖచక్రాయుధంబులు
మూర్తిమంతంబులై మ్రోల వెలుఁగ
తే. నడుగుఁ దమ్ములు భూదేవితొడల నిలిపి
లక్ష్మికుచముల మకరికాలాపలతలు
దగ లిఖించుచు వేయువిధముల నొప్పు
పాపపాన్పున సుఖలీలఁబవ్వళించి. 79
సీ. ఒకమాటు సకలలోకోపద్రవక్రియా
కరదైత్యవధకాలగతులు దలఁచు
నొకమాటు సాధుజీవకదంబపరిరక్ష
ణోపాయనిపుణతలుగ్గడించు
నొకమాటు మహనీయయోగీంద్రతత్త్వని
శ్చయతపశ్శక్తికిసంతసించు
నొకమాటు చిత్పద్మ మకరందరసపరం
పరలఁ జేతోమధు పాయిఁ దనుపు
తే. నాత్మమాయాప్రకల్పితమగుప్రపంచ
మంతయును నొక్కమాటు సమాకలించుఁ
ద్రిగుణమయుఁడు ప్రకీర్తితదివ్యతేజుఁ
డతులితానందకందళితాత్ముఁ డగుచు. 80

---

1 సరత్కృపారస—మూ.

క. నారదవీణానాద సు
ధారసమున సంతసిలుచుఁ ద్రైలోక్యకథా
పారాయణుఁ డగునా శ్రీ
నారాయణుఁ డున్నవేళ ననిచిన కూర్మిన్. 81

సీ. జడలలోఁ జదలేటి చల్లగాడుపు లాని
మెలమి భూషణఫణు లెదఁ గొనంగ
నవచకోరములకు నవతంసమండన
విధురేఖ వెన్నెల విందు వెట్ట
సాఁబాలు మేఁ గొన్న సతిమాపు మాటికిఁ
బెనఁచి ధైర్యస్థితుల్ వెల్లగింపఁ
బులితోలు జిలుఁగుదువ్వలువ సోఁకునఁ బాణి
జలజసారంగంబుఁ జలదరింపఁ

తే. గంఠకాళిమమును దేహకాంతి దిశల
నీలమౌక్తికమాలికాలీల నిగుడ
నంది తాండవగతులు మిన్నంది హృదయ
పద్మ మలరింపఁ బ్రమథులు బలసి కొలువ. 82

తే. వచ్చె శంభుండు పార్వతీవల్లభుండు
దైవదుందుభి జయజయధ్వనులు చెలఁగ
మైత్రి నచ్చోటి కప్పుడా మాధవుండు
కాంచి వికసించి మొదు రేగి కౌఁగిలించె. 83

వ. ఇట్లు సంభావించి యంభోరుహాక్షుండు విరూపాక్షు కేలు కే
లం గీలించి నర్మగర్భాలాపంబులం ద్రస్తర లాడుచుఁ దో
డ్కొని వచ్చి తమ కిద్దఱకు భేదంబు లే దని తెలుపుచు
నతండునుం దాను నొక్క దివ్యమణిసింహాసంబున నధివసిం
చె నాసమయంబున జగన్నాటకసూత్రధారులును లీలావి
భూతిమూర్తులును జిత్రమాయాసంచారులును నిరంతరధ్యే
యస్వరూపులును బరమపురుషులు నగునాహరిహరులం
జూచి విష్వక్సేననారదాదులు పరమానందంబునుం బొంది
బద్ధాంజలు లై యుండి రంత నయ్యుమావల్లభుండు రమా
వల్లభున కి ట్లనియె. 84

క. త్రిభువనపాలన కేళీ
విభవంబున హృదయ మలరఁ విహరింపుదువే
యభయప్రదానమహిమన్
సభయులరక్షింతువే ప్రసన్నతఁ గృష్ణా! 85

క. ప్రాపై మాయాలీలా
రూపంబులు దాల్చి సురవిరోధుల యేపుల్
మాపి జగంబులఁ గాచుట
లోపద్మదళాక్ష! నీకు సమత్సవకలనల్. 86

క. జగములు వెలి నిడి యొకమఱు
జగములు లో నించి సర్వజగదీశుఁడవై

జగములు నిలుపుట కాచుట
తెగఁ జూచుట నీకుఁ గ్రీడ దితిజధ్వంసీ. 87

వ. అని పలికి సమక్షంబున నున్నలక్ష్మిం జూపి నీవు లోకాభిరామం బగు శ్రీరామావతారంబు నూనిననాఁ డీరాకేందువదన నాకు రామచంద్రునిం జూడవలయుఁ జక్కనివాఁడట, యిటకుఁ దెమ్మని నన్నుం బ్రార్థించిన నొక్కబ్రాహ్మణవేషంబున శంభుభట్టారకనామధేయుండనై నిన్నుం గొనివచ్చినం జూచి మోహించి పట్టుకొనిన నేకపత్నీవ్రతవిఘ్నభయంబున సమయంబు గామిఁ దలంచి యెట్టకేలకుఁ బట్టువడక వచ్చుటం జేసి యింతకాలంబు నిష్ఫలోద్యోగంబున లతాంతశరశరాసారమథిత యయ్యు గంభీరనాయిక గావున నొక్కభంగిఁ దాలిమిఁ గీలించి యుండి నేఁడు నీవు దుష్టజననిగ్రహంబును శిష్టజనానుగ్రహంబు నొనర్పఁ గోటికందర్పలీలారూపవిభ్రమంబునఁ గృష్ణావతారంబున విహరింప నుద్యోగించుట యెఱింగి యీవ్రీడావతి నీతోడం గూడి కామోపభోగంబు లనుభవించుటకు భూతలంబున నవతరింపం గోరి నీకుం జెప్ప సిగ్గు వడి నన్నుం దలంచిన నే తదర్థంబు వచ్చితిం గావున సంగీకరింపుము వింతచెలువు కాంతలకుం బ్రియంబు కాదె యని పల్కి హరి నొడంబఱచి వీడ్కొని పయోధికన్యకకుం గార్యంబు సఫలం బయ్యె నని యల్లనఁ జెప్పి శివుండు తారాద్రికిం జనియె నప్పుడు.

క. దరహాసరుచులు నిగుడఁగ
సిరిఁ గౌఁగిటఁ జేర్చి ప్రేమఁ బిలుకుచు శృంగా
రరసాంభోనిధి కృష్ణుఁడు
సరసమధురఫణితిఁ బలికెఁ జాతురి మెఱయన్. 89

క. చంద్రికఁ బాయఁగఁ గలఁడే
చంద్రుం డెందైన నట్లు సంపూర్ణకళా
సాంద్రానురాగహృదయవు
చంద్రముఖీ! నిన్నుఁ బాసి చనుదునె నేనుఁ. 90

క. నీకోరికయును శంభుని
రాకయు నెఱుఁగుదును మున్నె రజనికరకళా
లోకన! జనియింపుము భూ
లోకంబున వల్లవీవిలోలేక్షణవై. 91

వ. మదనగోపాలవేషంబున ననేకవిధంబు లగుక్రీడలఁ బ్రవర్తిం
పవలయు నని తనయుద్యోగం బెఱింగించి సంతసింపం జేసి
యింద్రాదిదేవతలం బిలిచి మీరు మీయింతులును మర్త్య
వాసంబు వల్లవీవల్లవరూపంబులం బ్రభవింపుఁడు. శేషుండు
బలభద్రనామంబున మదగ్రజుండై యుదయించు నని యా
జ్ఞాపించి ప్రసాదం బొసంగి యంతర్ధానంబు సేసెఁ దత్పూర్వాసమ
యప్రారంభంబున. 92

సీ. కపటదానవకోటి కాలంబు దరి ద్రొక్క
దుష్టమార్గులకు దుందుడుకు పుట్టె
సంయములకుఁ దపస్సంపద గొనసాఁగె
సాధులమది సంతసంబు పొడమె
సుప్రసాదశ్రీలఁ జూపట్టె దిక్కులు
జగతి నెల్లెడల నుత్సవము లొదవె
పుష్పఫలాభిసంపూర్తి వృక్షము లేచె
సదమలసలిలలై నదులు దనరె
తే. నఖిలలోకైకనాయకుఁ డాదిపురుషుఁ
డచ్యుతుఁడు లోకసంరక్షణార్థలీల
నవని నుదయింప సమ్ముఖుండగుటఁ జేసి
యరయ నాతఁడు సర్వాత్ముఁ డౌను గాదె. 93

తే. శ్రీమహాలక్ష్మియును దాను శేషఫణియు
విబుధులును గోరుచుండి రుర్వీతలమున
మదనగోపాలమూర్తి నా మాధవుండు
లీల నవతారమును బొందువేళ మనిని. 94

వ. అంతఁ గొంతకాలంబునకు. 95

క. ఆ నెలవున నట్లంత
ర్ధానంబును బొంది హరి ముదంబున లోకం
బానందకందముగ ధర
ణీనాయక! దేవకీవనిత కుదయించెన్. 96

తే. హరికి నగ్రజుఁ డై శేషుఁ డటకు మున్న
రాముఁ డనుపేర లోకాభి రామమూర్తి
సంభవం బొందె రోహిణీ సాధ్వియందు
నుల్లమునఁ జాల వసుదేవుఁ డుల్లసిల్లె. 97

క. అం దంద మలయమారుత
కందళములు వొలయఁ బ్రాణిగణము వొదలె నా
నందరసామృతలహరీ
స్యందంబున రామకృష్ణ సంభవవేళన్. 98

వ. ఇట్లవతరించిన యప్పరమపురుషుం డగుకృష్ణునిరూపంబు నందు నిజాంశభేదంబులఁ జరణనఖరరాజి యై తారకానికరంబును, పదతలంబులఁ జక్రచాపకులిశధ్వజాతపత్రరేఖ లై నిధానాదిదేవతలును, సమున్నతకటీరమండలం బై యాధారశక్తియును, విశాలవక్షస్స్థలం బై ధరణీమండలంబును, చతుర్బాహుదండంబు లై ధర్మార్థకామమోక్షంబులును, ముఖమండలం బై త్రైలోక్యసామ్రాజ్యవిభవంబును, విలోచనంబు లై చంద్రసూర్యులును, కటాక్షమాలిక లై [1]కరుణాశాంతిరసాధిదైవతంబులును నధరం బై [2]సుధాసవంబును, దంతపంక్తియై కళలును, దరహాసం బై చంద్రికలును, జిహ్వయై భారతియును, మృదుమధురసత్యవచనంబు లై మలయపవనంబులును, శ్రవణరూపంబు లై రత్నాకరంబులు

---

1 కరుణా—మూ. 2 సుధాభవంబు.

ను, ఫాలఫలకం బై దిక్పటలంబును, గేశమంజరి యై యామవతియును, దేహచ్ఛాయ యై కాదంబినియును, లావణ్యపరిణతి యై కుసుమబాణుండును, యౌవనవిలాసం బై మోహనవిద్యయును, భజింప నతండు కపటనాటకసూత్రధారుండు గావున మాయామానుషరూపంబున కనురూపంబుగాఁ దల్లిదండ్రు లగుదేవకీవసుదేవులయనుమతి నందయశోదలకుం గూర్మినందనుం డనంబరఁగి బలభద్రసమేతుం డై గోపాలకుం డై జన్మించి సురలును సహచరు లై వర్తింప వ్రేపల్లెయం దమందక్రీడల విహరింపుచుండె. 99

తల్లికి ముద్దులు చూపును
వల్లవకులకామినులకు । వలపులు చూపుఁ
గొల్లలకుఁ గూర్మి చూపును
వల్లవుఁ డై బాహ్యనటన । వైఖరి మెఱయన్. 100

ఉఱవడిఁ బ్రాణవా।యువులతోఁ గూడఁగఁ
బట్టి పూతన చన్నుఁ।బాలు ద్రావె
సుడిగాలిరక్కసు।సొం పణఁగించె మ
ద్దులఁ గూల్చె వృషభదై।త్యునిఁ దెరల్చె
బకవత్సదానవ।భంజనం బొనరించె
ఆలవాసకు నెత్తె । వ్రేల నగము
ధేనుకాసురుని మ।ర్దించె నశ్వదనుజు
వధియించె దావపా।వకము మ్రింగె

తే. నుగ్రకాళియఫణమండలాగ్రరంగ
భూమిఁ దాండవం బాడె నపూర్వమహిమ
మఱియుఁ దక్కిన దుష్కృతమతుల నెల్ల
నుక్కడంగించె శౌరి బాల్యోత్సవమున. 101

వ. ఇవ్విధంబునఁ జిత్రవిహారంబుల శైశవక్రీడ లొనరింపుచు సితపక్షనక్షత్రవల్లభుండునుం బోలె నిరుపమకాంతికలాపంబులం బ్రబలి దినప్రవర్ధమానమనోహరావయవుం డై సర్వజగన్మోహనంబును సర్వలోకలోచనాహ్లాదకరంబును నగు నవయౌవనారంభంబు రతిరాజు విజయలీలాసంరంభంబునుం బోలె విజృంభణంబుఁ జూప నయ్యంభోరుహాక్షుండు సర్వలక్షణసంపన్నుం డై విభ్రమాతిశయంబున నిబ్బరపుఁగబ్బి జవ్వనంబున నుల్లసిల్లుగొల్లపూఁబోండ్లయుల్లంబులఁ గామకళాశంక యంకురింపం జేయుచుఁ గన్నులపండు వై యుండె.

సీ. ఇంద్రనీలములతో నెనయుదేహచ్ఛాయ
సరసఘనస్ఫూర్తిఁ బరిహసింప
రాకేందుమండలి జోక మీఱెడుప్రస
న్నాననం బంభోరుహంబు నొరయఁ
జంద్రికసరివచ్చు సరసమందస్మిత
కళ మౌక్తికాంశులఁ గ్రచ్చుఱింపఁ
గుందకోరకదీప్తిఁ గొనసాగుపదనఖ
పఙ్క్తి యుడుప్రజ ప్రభలఁ దెగడ

తే. దివ్యతేజోబలంబులు దేజరిల్ల
భూరిసౌందర్యసంపద పొదలుకొనఁగఁ
గలికితనమును వేడుక ల్గడలుకొనఁగఁ
జాల నొప్పారె గోపవేషమున శౌరి. 103

మ. చెలు వొప్పారఁ బసిండిచేల మణికాంచీదామధామావళీ
కలితోత్తుంగకటీరమండలమునన్ గై సేసి చంచచ్ఛిఖా
వళపింఛావృతమౌళిభాగుఁ డయి లావణ్యస్ఫురద్భూషణో
జ్జ్వలమూర్తిన్విహరించెనందజుఁడు ఘోషస్త్రీజనాహ్లాదుఁడై.

సీ. కమలాక్షి నొక్కతెఁ గడకంట నెలయించు
బింబోష్ఠి యొకతెనుఁ బ్రేమఁ జూపు
నొక్కపాటలగంధి నొయ్యారములఁ దేల్చు
లలితాంగి నొకతె లీలలకుఁ దార్చు
మత్తకాశిని నొర్తు మాటలఁ గరఁగించు
నొక్కసీమంతిని నొరసి నడచు
మందస్మితం బొక్క మానిని పైఁ జిల్కు
మోవితేనియనొక్క ముదిత నడుగు

తే. నొక్కగుబ్బెత చనుఁగవ యొఱపు మెచ్చు
నిందువదనకు నొకతెకు నెత్తుఁ గఱపు
వలపు నెరపుచు వ్రేపల్లెవాడలోని
వల్లవస్త్రీలలోన శ్రీవల్లభుండు. 105

క. మఱచిరి గృహకృత్యంబులు
మఱచిరి లజ్జాభయములు మఱచిరి మగలన్
మఱచిరి సర్వము గోపిక
లఱిముఱి శ్రీకృష్ణరాయఁ డాత్మఁ గరంపన్. 106

ఉ. శ్రీయుతమూర్తి గోపకులశేఖరు నందకుమారు రూపనా
రాయణుఁ జూచియున్ జనపరంపరచే వినియు న్మనంబులన్
బాయనివంత వేఁగిరి నృపాలక! సర్వజగంబులందుఁ బ
ద్మాయతనేత్ర లెల్ల మదనాశుగసంప్రభవానలార్చులన్.

తే. శారదయు గౌరియును దక్క సకలలోక
వామలోచన లెల్లను వలచి రాత్మ
మహితలావణ్యనిర్జితమన్మథునకు
మాధవున కయ్యశోదాకుమారునకును. 108

తే. రూపు లేనిమనోజాతు రూఢిఁ దలఁచి
హృదయములయందుఁ జాల మోహించుసతులు
మన్మథునితండ్రి యై రూపమహిమ మెఱయు
కృష్ణునకు వలచి రనఁ దర్కింప నేల? 109

శా. పాతాళంబున నాగకామినులు సర్పస్వామి వేడ్కన్ శిరో
వ్రాతంబు ల్గదలింప రాగరస పూర న్నామసామ్యంబునన్
జాతుర్యంబున [1]నొయ్యమెట్లలయయోజన్ గిన్నెరల్ మీటుచున్
బ్రీతిం బాడి రనంత! చక్రి! యనుచున్ శ్రీకృష్ణు నాశేషుఁ గాన్.

1 నొయ్యమిట్టిదయ—మూ.

సీ. నవనిధానము లిచ్చు । నలకూబరునిమీఁది
మంచితనంబు చా।లించె రంభ
సురలోకనాయక।సుతుని జయంతుని
నూర్వశి కవఁగూడ । నొల్ల దయ్యెఁ
బదియాఱుకళలఁ జూ।పట్టి కరంగించు
నమృతధాముని పొందు । హారిణి విడిచె
ననుపుకాఁడై కూర్మి । ననిచి ప్రవర్తించు
మదనుని [1]వర్జించె । మంజుఘోష
తే. తక్కుఁ గలదేవకాంతలు । [2]తమకుఁ దామ
తమకములఁ బొంది కుందిరి । తలఁపులందు
మదనగోపాలకృష్ణుని । మహితదివ్య
మోహనాకారలీలలు । ముంచి పాఱ. 111

తే. గరుడగంధర్వకిన్నరాం।గనలు కేళి
సైకతంబుల గిరులఁ గుం।జముల నాత్మ
వల్లభులఁ బాసి వల్లవీ।వల్లభునకు
వలచి తత్కీర్తి వాడిరి । వర్ణసరణి. 112

సీ. సకలదిగ్గేశరా।జన్యకన్యకలు పు
ష్పాస్త్రాస్త్రజర్జరి।తాంగు లగుచు
గుత్తపుఁ దమచన్ను । గుబ్బలఁ గస్తూరి
హరి వ్రాసి చెలిఁ జూడు । మనెడువారు

1 దర్కించె—మూ. 2 తమకతమక—మూ.

సఖులతో నోరు నొల్ల । శౌరినే గాని నా
ప్రతిన యిట్టిద యని । పలుకువారు
తల్లిదండ్రులు చక్రధరున కీకున్న నీ
దేహంబు లే లని । తెగడువారు
తే. సృష్టిలోపల వల్లవీస్త్రీల సుకృత
ఫలము భాగ్యంబు నెట్టిదో । పాయ రెపుడుఁ
దగిలి కృష్ణుని కని మదిఁ । దలఁచువారు
నగుచు నేగింపుచుండిరి । యహరహంబు. 113

వ. ఇవ్విధంబున మూఁడులోకంబులం గలకామినీమణులహృదయంబులు మదనగోపాలకృష్ణమయంబు లై యుండె. వెండియు, 114

క. బృందావనంబు క్రేవన్
నుందరయొకటి గలదు నిరుపమానం బై గో
బృందసహస్రంబులతో
నం దుండు సహస్రగోపుఁ । డనువాఁ డెలమిన్. 115

క. ఆవల్లవనాయకునకు
శ్రీవనితారత్న మవతరించి సమంచ
ల్లావణ్యరేఖ రాధిక
నా వెలసెన్ సర్వలక్షణశ్రీయుత యై. 116

వ. అక్కన్యారత్నంబు జగన్మోహనాకారంబునఁ దుషారకరరేఖయుం బోలెఁ గాంతియుఁ, బారిజాతలతికయుం బోలె నవ

కంబును, మాణిక్యశలాకయుం బోలె మెఱుఁగునుం గలిగి దినదినప్రవర్ధమాన యై మాననీయ యై యుండఁ జంద్రమండలంబునకుంగళాపూరణంబును, జలజంబునకువికాసంబును, సంభవించినచందంబునఁ జొక్కమైనచక్కఁదనంబునకు నలంకారం బై మవ్వంపుజవ్వనంబు సంప్రాప్తం బయ్యె మఱియును. 117

తే. సృష్టి నిలుపుచు మొదల రాఽజీవభవుఁడు
చెలువ మెల్లను నొకప్రోఁక ఽ చేసి డాఁచి
ముజ్జగంబును రాగాబ్ధి ఽ ముంప నేర్పు
మెఱసి యాచంచలాక్షి నిఽర్మింపఁ బోలు. 118

ఉ. ఆలలితాంగిమైసొబఁగు ఽ నాతరలాక్షికటాక్షలీల లా
బాలమనోజ్ఞమార్దవముఽభంగియు నాయలివేణికుంతలు
శ్రీల తెఱంగుఁ జెప్పి మఱిఽ[1] చెప్పఁగ నేటికి నొప్పు చున్న యా
నీలశిరీషపుష్ప, సితఽసిరజవల్లుల మాటిమాటికిన్. 119

ఆ. చక్రపాంచజన్య ఽ సమకటిగ్రీవయు
విమలశిఖికలాపఽవేణి యయ్యు
వింతచెల్వుతో నఽనంతమోహాస్పద
లీలఁ జాల నొప్పు ఽ నాలతాంగి. 120

1. చెప్పకుమిందఱు—మూ.

చ. కనకరజంబుఁ జిల్కుఁ దొలుకారుమెఱుంగుల బిత్తరించునా
వనితశరీరయష్టియును వాలికచూపులుఁ జంద్రికారుచిం
జెనకుఁ దమిస్రజాలములఁ జిక్కఁడునావిమలేందుమండలా
నన రసవంత మైనచిఱునవ్వుఁ గచప్రచయంబు నెంతయున్.

వ. ఇవ్విధంబున నొప్పునప్పల్లవాధర ముదంబున మదనగోపాల
లీలారూపలావణ్యతేజోగుణంబులు కర్ణభూషణంబులు గా
బోటికత్తియలవలన వినియె నట్టియెడ. 122

శా. ఆలోలాలిపరంపరాకృతధనుర్జ్యావల్లరీఝల్లరీ
హేలాఝంకృతులుల్లసిల్ల మదనుండెంతే విజృంభించి యా
బాలారత్నము తాల్మి దూల హృదయాబ్జం బేసె లీలన్ జగ
జ్జాలంబాక్షకటమూర్ఛముంపఁగలయాసమ్మోహనాస్త్రంబునన్.

క. హరిమీఁది మోహ మనుసా
గరమున మరుఁ డనెడునెసరుగాడ్పున ధైర్య
స్ఫురణ మనునోడ వగిలిన
గురుకుచమన సనెడువర్తకుఁడు వడి మునిఁగెన్. 124

తే. చపలలోచనహృదయంబుసపరివేష
భానుమండలలీలను బట్టుకొలుప
భావజుఁడు చిత్రమోహనపాశ మనయ
బెట్టిదము గాఁగఁ దిరిగి తాఁ జుట్టె నపుడు. 125

సీ. ధవళాంశుకిరణాలితావితానముల న
ల్లడల బెట్టుగువలల్గా నొనర్చి

రూపించి మలయమారుతసారమేయ[1]క
విసరంబుఁ దేఁటిగోలసులఁ బట్టి
విపులమోహాటవీవీథిఁ గ్రుమ్మరు చున్న
మెలఁతచిత్తం బనుమృగముఁ గదిసి
లీలమై మదనగోపాలకృష్ణుం డను
మందారభూజంబు మఱుఁగుఁ జొచ్చి

తే. సరసిరుహనిర్మితాక్షయశరధివలనఁ
జతురగతి వాఁడిపూనారసములఁ దిగిచి
చిత్తజుం డనుమృగయుండు చెఱకువింటఁ
దొడిగి యురవడి నెఱకులు దూఱ నేసె. 126

క. తరుణీమణిహృదయంబున
హరి యుండఁగఁ బూజలయ్యె నలరులతూపుల్
మరుఁ డేయు చుండ నతనికి
నరయఁగ జాజులుఁ బ్రసాదమయ్యెఁ దలంపన్. 127

సీ. రమణికి మోహాంకురము సముద్భవ మయ్యె
వెలఁదికి మమతలు వేళ్లు వాఱె
రాజీవనయనకు రాగంబు గొనసాగె
సీమంతినికిఁ గోర్కె చిగురు లొత్తె
లలనామణికి ముచ్చటలు జాలఁ బెనఁగొనెఁ
బడఁతికిఁ దమకంబు ప్రబ్బి కొనియె

1. జాలంబులఁ దేఁటిగోలసుల—మూ.

నలినీలవేణికి నాశలు బరువయ్యె
గురుకుచయుగళకుఁ గూర్మి ననిచె
తే. హృదయ మనుప్రమదావని నేచి కలికి
జవ్వనం బనునామని సమయమునను
గుసుమసాయకవనపాలకుండు వెనుప
లేమ కిఁక శౌరికరుణ ఫలించు ననఁగ. 128

వ. ఇవ్విధంబున నారాధ సంతతప్రవర్ధమానవిరహసంతాపభారంబున విగతబోధ యై యయ్యైవిధంబుల మనోనురాగంబు నిగూఢంబు గా నొక్కభంగిఁ గాలంబుఁ గడపు చుండె నంత నొక్కనాఁడు. 129

మ. నిరవద్యున్ హరిఁ జూడ నారదమహామునీవారముప్పొంపచుండరుదెంచెన్ శరదిందుబింబనిభదేహచ్ఛాయ లం దంద పుష్కరపీథిన్ ఘనసారఖండములు చిల్కన్ గేలుదమ్మిన్నిరంతరనారాయణశబ్దము ల్వెలుపువీణానాదండ మొప్పారఁగన్.

క. ఈవిధమునఁ జనుదెంచిన
యావాచంయమవరేణ్యు నర్ఘ్యాసనపూ
జావిధులఁ బ్రీతుఁ జేసిన
శ్రీవల్లభుఁ జూచి నుతులు సేయుచుఁ బలికెన్. 131

క. వనజాక్ష! నిన్నుఁ జూచుట
యనుప మగుబ్రహ్మపదము నందుట గాదే
నినుఁ గనుఁగొంటిని నాచే
సినపుణ్యఫలంబు లింకఁ జెప్పఁగ నేలా 132

శా. నీనామామృతవీచికల్ చెవులకు న్విందయ్యె నీరూపతే
జోనీరేజమునందు దృఙ్మధుపముల్ శోభిల్లె నీసత్కృపా
శ్రీనిండారినమానసంబు దనిసెన్ సేవింప నీవంటి ని
త్యానందోజ్జ్వలమూర్తియుం గలఁడె కృష్ణా! వల్లవీవల్లభా!

క. నందయశోదలు చేసిన
ముందటిపుట్టువులసుకృతములకొలఁది శతా
నందునకుఁ జెప్పవశమా
యందము గా నీవు సుతుఁడవై యుండ హరీ! 134

శా. బాలక్రీడలఁ గన్నతల్లికి మనఃప్రహ్లాదముం జేయుచున్
హేలామైత్రి ఘటించి గోపకులలో నేపారవర్తింపుచున్
గేలిం జారుఁడ వౌచు గోపికలకౌఁగిళ్ల న్వినోదిం[1]చుధీ
శాలిత్వంబులు నీకె యొప్పు నవుఁగృష్ణా! వల్లవీవల్లభా!

వ. అని ప్రస్తుతించి యొక్కవిశేషంబు వినుమని యిట్లనియె.

సీ. అరవిందనయన! సహస్రగోపకుఁడను
వాఁడు గలం డొక వల్లవుండు
వీరమహేశ్వరాచారపారీణుండు
బృందావనము క్రేవ మంద నుండు
నిన్ను దర్శింపను నే రాఁగ నేఁడాతఁ
డెదురుగాఁ జనుదెంచి ముద మెలర్ప

1. పుచున్ శాలి—మూ.

నింటికిఁ గొనిపోయి - యెన్నెనివిధములఁ
బూజలు చేసె నపూర్వనిష్ఠ

తే. నేను సంతస మంది యొక్కింత తడవు
దాఁక యాతనిభక్తి కంగీకరించి
యున్నయెడ హంసయాన మహోత్పలాక్షి
వచ్చెఁ దత్పుత్రి సౌవర్ణవర్ణగాత్రి. 137

ఆ. కలికిమెఱుఁగుఁదీఁగె - పోలఁతియై నిలిచెనో
యనఁగ నేమిచెప్ప - నంబుజాక్ష!
యరుదుకొలిపెఁ జూడ్కి - కాయింతి కెన సేయ
లలన లెందు లేరు - లక్ష్మిఁ బోలు. 138

వ. ఇట్లు వచ్చినముద్దుంగూఁతు నావ్రేతలపెద్ద పెద్దయుం గారవించి నిజాంకతలంబున నిడుకొని నాతో నిట్లనియె. 139

ఆ. ఇష్టదైవమైన - యీశ్వరు గుఱియించి
విపులనిష్ఠఁ బూని - తప మొనర్చి
యీకుమారిఁ గంటి - నీకన్య కిఁకఁ బెండ్లి
సేతుఁ దగినవరుని - జెప్పవయ్య. 140

వ. అనిన పలికిన నే నక్కుమారికారత్నంబుశుభలక్షణంబు లుపలక్షించి సర్వలక్షణసంపన్నం గా నెఱింగి యతనితోడ.

క. అనుపమగుణ నీపుత్రిక
విను నందసుతుండు దక్క - విశ్వంభర నీ
వనితకుఁ దగినవరుఁడు లేఁ
డనినం బొం గారెఁ గన్య - కంగము లెల్లన్. 142

క. ఇంతికి నప్పుడు వొడమిన
సంతోషం బేమి చెప్ప సన్నుపునగ వే
యంతర్గత మై కూరిమి
నెంతయు నీమీఁదఁ గలుగు టెఱిఁగించెఁ జుమీ. 143

శా. నీలావణ్యము నీవిహారకలనల్ నీమోహనాకారమున్
నీలీలావిభవంబు నీకరుణయున్ నీవిక్రమస్ఫూర్తి నీ
యాలాపంబుల నుగ్గడింప జను లత్యానందవారాశిక
ల్లోలశ్రేణులఁ దేల్పరే హృదయమాలోకింతు రేయస్యమున్

వ. ఇట్లు నీయం దనురాగంబు గలిగి యున్నక న్నెఱింగి యత నితోడ నిశ్చయంబుగాఁ గృష్ణుండు దక్కఁ దక్కినవాఁ డీతరుణి వరియింప నర్హుండు గాఁ డని చెప్పి యాతెఱంగు నీకెఱిం గింప వచ్చితి నప్పద్మలోచనయొప్పు చెప్పనరిది వినుము.

ఆ. వేయి[1]కనులదేవవిభుఁడును నాయింతి
సొబగు చొప్పుఁ గలయఁ జూడ లేఁడు
వేయునోళ్ల నాగవిభుఁడును నాపువ్వుఁ
బోఁడి సద్గుణములు వొగడ లేఁడు. 146

చ. మెఱుఁగు దనర్చు నున్నడరు మెత్తని క్రొత్తచిగుళ్లపై జిగు
ల్నెఱసినమొల్ల మొగ్గగమి నిల్చినయేని దదీయలీల చూ
పఱకుఁ బొసంగుఁ దన్నఖరపఙ్క్తివిభాసితకాంతిసంతతిం
దఱలక యొప్పు రాధపదతామరసంబుల[2]తోడ సాటియై.

1. కండ్ల—మూ. 2. తోటి—మూ.

క. రాజనపుఁ బొట్టకట్టుల
యోజం బూవిలుతుదొనల యొఱికంబున నా
రాజముఖి జంఘ లమరున్
భ్రాజన్మణికాహళీవిపాటనమహిమన్. 148

క. సిరిపట్టికిఁ గ్రీడార్థము
మురువగు నూయాలకంబములు గా రంభా
తరుయుగము నిలిపి రన నా
తరుణీమణి మెఱుఁగుఁదొడలు దగ విలసిల్లున్. 149

తే. రతిరసాలశరాసదంపతుల కెలమిఁ
జన్ను లను కేళిగిరు లెక్కఁ జక్కనిడిన
పసిఁడితళుకులసోపానపఙ్క్తి యనఁగ
నెంతయును జూడ నొప్పు నయ్యింతివళులు. 150

క. బంగారుకొండశిఖరము
లంగనకుచములుగ నలువ హత్తించెఁ జుమీ
యంగభవకేళిగతులకు
నంగుఁగఁ గాకున్నఁ జన్ను లంతలు గలవే. 151

క. సతిదోర్వల్లిమతల్లులు
రతిదర్పకు లొక్కమాఱు రయమున జగముల్
బ్రతినగొని గెలువ దర్పో
న్నతిఁ బట్టిన కుంతయుగము నాఁ జెలువారున్. 152

చ. అరయ జగత్త్రయంబునకు-నై దలరమ్ములు చాలవంచుఁ బం
కరుహభవుండు గన్గొని జ-గంబున కైదిటిలెక్కఁ గావలెన్
మరునకునంచుఁ బైగ దశ-మార్గణముల్ సృజియింపఁబోలు నాఁ
గరరుహముల్ దనర్చు సిత-కంజదళాక్షికిఁ దీక్ష్ణధారలన్.

క. వల్లవిగళమును బోలగఁ
జెల్లదు నీ కనుచుఁ గవులు-చెడనాడ వగన్
గ్రుళ్ళి తనలోనె గుళ్లై
పెల్లుగ శంఖంబు మొఱ్ఱుఁ-బొట్టుచు నుండున్. 154

క. నవక మయి మెఱుఁగు లొదవెడు
పవడంబున నమృతరసము-ప్రభవించిన నా
నవబింబాధర చక్కెర
చవిఁ బూనెడుమోవితోడ-సరి యనవచ్చున్. 155

క. పలువరుస పక్వదాడిమ
ఫలబీజావళుల వజ్ర-పంక్తుల ముక్తా
ఫలములఁ గురువిందంబుల
గెలి చరవిందాయతాక్షి-కిం గడు నొప్పెన్. 156

ఆ. తెలివనాసతోడఁ-దిలపుష్ప మైన యగుఁ
గాని చంపకంబు-గా దటంచుఁ
గవులు రోసి మానఁ-గాఁ జంపకము మానెఁ
గాక ముట్టకున్నె-కలికితేఁటి. 157

క. యౌవనవిభ్రమసంపద
ప్రోవులుగాఁ బోసి నలువ ౹ పొలివోకుండన్
భావించి శ్రీలముద్రలు
గావించె ననంగ నింతి ౹ కర్ణము లమరున్. 158

చ. కలువలుదమ్ములున్మెఱుఁగుఁ ౹ గారుమెఱుంగులుసంచలించుశు
క్తులుమునుఁగఁజకోరములు ౹ కుంటుచునుండునభంబునందువె
న్నెల వెలవెల్లఁ బాఱు హరి౹ణీతతి కానలఁ గ్రుమ్మరున్ బ్రసా
దలలితకాంతులం దనరు ౹ తన్వికనుంగవఁ బోల కెప్పుడున్.

మ. హరి[1]నీలాలకఫాలపట్టికకు నీ౹డైయుండు నే నంచు శం
కరునింగూర్చి తదీయజూటవని గం౹గాతీరదేశంబునం
దరుదారందపమాచరింపుచుఁ ద్రియా౹మాధీశుఁడున్నాఁడనన్
మఱి తత్తుల్యము లింక నెన్నఁ గలవే౹ క్ష్మామండలిన్ వస్తువుల్.

తే. పాంథపక్షికులముఁ ౹ బట్ట నమిలిపురి
గూఁడు నిలిపి యురులు ౹ గూడఁ దీర్చె
నలరువిలుతుఁ డనఁగ ౹ నెలవంకకురులతోఁ
గీరవాణి కొప్పుఁ ౹ గీలు కొప్పు. 161

సీ. తోరంపుఁ గ్రొత్తల౹త్తుకదూదిజేకుల
నెనయ ముత్తెపుఁ జేరు ౹ లిడ్డయట్లు
సైకతస్థలమున ౹ శరలక్ష్యముగఁ జేసి
వలరాజు పూఁదీఁగె ౹ నిలిపి నట్లు

---

1 నీలాలకి—మూ.

నెలకొని బిలములో నిద్రించి ఫణిరాజు
వడి మేల్కొని వెడలివచ్చి నట్లు
పరిపక్వబింబికాఫలము పై నందంద
తుహినబిందుశ్రేణి దొరఁగి నట్లు
తే. త్రిజగతీమోహనాకార రేఖ కలిమిఁ
జాల నొప్పారు నాపూర్ణచంద్రవదన
యడుగులుం గొళ్ళుఁ బిఱుఁదు నెన్నడుము నాభి
యూరుఁగెమ్మోవి లేనవ్వు నంద మొందు. 162

సీ. కందక తఱుఁగని కళలఁ గ్రుంకకయున్న
సవతు చేయఁగ వచ్చుఁ జందమామ
భ్రమణంబులేక యేర్పడి చాలుపై యున్నఁ
దులఁ దూఁపఁగా వచ్చుఁ దుమ్మెదలను
వ్రాలక పొత్తువిడ్వక కదలక యున్న
సాటి సేయఁగ వచ్చుఁ జక్రములను
గఱకుఁదనము మాని యురలిపడక యున్నఁ
బురుడు వెట్టఁగ వచ్చుఁ బులినతలము
తే. కాక యవి పోల్పవచ్చునే కవివరులకు
వర్తులత్వంబు మేచకత్వము సమత్వ
మును గురుత్వంబు గలమాత్రమునన యట్టి
సుదతివదనాలకస్తన శ్రోణులకును. 163

క. వాలికచూపులు గలయా
బాలిక కన్నులు దనర్చు - బలువడి బ్రింగం
జాలక పుక్కిటివెన్నెల
లాలితగతి నుమియు వెన్నె - లపులుఁగులగతిన్. 164

ఆ. పగలు చేయు జేయుఁ - బగలును గెడమాల
కునికిఁ గేలి గతులు - నొదవె నేని
కన్నెచన్నుఁగవకుఁ - గన్నుంగవకు నీకు
కోకయుగము నవచ - కోరయుగము. 165

క. ఆకిసలయారుణాధర
యాకైరవపత్త్రినేత్ర - యామదవతి యా
రాకేందుమండలానన
నీకుం దగు వేయు నేల - నీరజనయనా! 166

వ. అని తద్రూపలావణ్యగుణకందళంబులు రాగరసార్ద్రం బగు గోవిందుడెందంబున నాటుకొని దుష్టజననిగ్రహబుద్ధియు నమ్మహాత్మునిచిత్తంబునఁ గొనసాగునట్లుగా నిజాభిలాషం బుఁ బ్రకటించుచు నిట్లనియె. 167

క. తిరిగితి నూరకఫణిని
ర్జరగుహ్యకయక్షరాక్షసభువనముల నీ
సరి కెక్కడ జగడము లే
దరసితి నేత్రముల దప్పి - యారదు కృష్ణా! 168

ఉ. వారక పోరికిం గదియు వారలఁ జూచిన మేను వొంగు న
వ్వీరులు పోరిపోరి మొగవిచ్చిన జిచ్చువడున్ మనంబు క్రో
ధారభటుల్ చెలంగినఁ బ్రియం బగు **నా కుపవాసమున్న య**
ట్లారయఁ బోరు లేనిదినమంబుజనేత్ర! జగత్త్రయంబునన్.

చ. చలమున బెట్టు బాహుబలసంపద మీఱఁగ నస్త్రశస్త్రవి
ద్యలఁ జలియింప కాహవములందు మదేభభటాశ్వసంఘముల్
పొలియఁగ రౌద్రమూర్తులయి పోరుచునుండెడు వారుగల్గినన్
జలరుహనేత్ర! నాకుఁ గల సౌఖ్యము బ్రహ్మకునైనఁ గల్గునే.

క. ఇక్కన్నియకై యిచ్చం
బెక్కండ్రన్ వీరవరులఁ బెల్లుగ ననిలోఁ
ద్రెక్కొనఁగల వవ్వేళకు
నెక్కడ[1]నుండైన వత్తు నేఁ జూచుటకున్. 171

వ. అని కలహసంధానవిద్యావిశారదుం డగునారదుండు హరి
నామంత్రణంబు సేసి యెం దేనియుం జనియెఁ దదనంతరంబ.

శా. కాళిందీకుచమండలాగ్రనఖరాంకన్యాసనిష్ణాత! భ
ద్రాలోలాలకజాలకగ్రహణసారప్యజ్ఞ! రుక్మిణ్యాపాం
గాలోకాంబుజపూజనాకలిత దివ్యాకార! రాధారహః
కేలీవ్యత్యయనిక్వణద్వలయ లక్ష్మీప్రద్రవన్మానసా! 173

1. నుండినను అని పఠింపవచ్చును.

క. మురళీకలగానకళా
తరళీకృతసమదగోపకతరుణీచేత
స్సరసీరుహా! పుత్రాయిత
సరసీరుహగర్భ! లోకసంకులగర్భా! 174

మాలిని. చరణకమలసేవాసక్తదేవేంద్రముఖ్యా
మరగణమకుటోద్యన్మాల్యసమ్యఙ్మరంద
స్ఫురదళికులగానోద్యద్భాతరంగత్సుధాశీ
కరలలితమణి శ్రీకర్ణభూషాకపోలా! 175

గద్య. ఇది శ్రీమన్నదనగోపాలచరణకమలసేవ ధురీణ సత్కళా
పారీణ కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభు
సుపుత్ర సుకవివర్య రాధామాధవయెల్లనార్య
ప్రణీతం బైనరాధామాధవం బనుశృం
గారప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీ రాధామాధవము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీరాధాధరమధురసు
ధారసధారాప్రశాంతదారుణనిశిత
స్మారశరానల ధీరో
దార గుణావాల నవమదనగోపాలా. 1

తే. అవధరింపుము దేవ సంయమివరుండు
సకలవేదాంతవిద్యావిశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకత మఱియు
నింపుగా నాపరీక్షిన్నరేంద్రునకును... 2

వ. అట్లు నారదుండు చెప్పిన గుణంబులవలన నప్పొలంతుక
రూపంబు మనంబున సాక్షాత్కరించినట్లైన యశోదాసూ
నునకు నచ్చెరువును భ్రమయునుం బొడమె నప్పుడు. 3

ఉ. ఇక్షుశరాసనం బెలమి నెక్కిడి యెక్కటివీరుఁ డంగజుం
డక్షతమూర్తియై జగములన్నియు మాయలఁగప్పు పుండరీ
కాక్షుమనోబ్జ మెక్కియలరమ్మున నాటఁగనేసి కప్పెనే
కక్షణమాత్రరాధపయిఁ గ్రమ్మెడు మోహపుఁజిమ్మచీఁకటిన్

ఆ. అజునిగర్వ మణఁచె నగ్రజుం డనక స
ర్వజ్ఞుఁడనక శివుని ప్రజ్ఞ చెఱచెఁ
దండ్రియనక శౌరితాలిమి దూలించెఁ
జిత్తజునకు నొరులఁ జెప్పనేల? 5

ఉ. ఎన్నఁడు నేవికారము వహింపని యోగివరేణ్యుఁడైన యు
వ్వెన్నుఁడు రాధికారుచిరవిభ్రమలీలలఁజిక్కి మోహసం
పన్నతతో దురంతతరమన్మథచింత వహించె నింక ధై
ర్యోన్నతి మాయబారిఁ బడకుండెడువారును గల్గనేర్తురే.

క. ఎక్కడఁ జూచిన జగముల
నక్కడనే తోఁచునట్టి హరి కామదనుం
డెక్కడఁజూచిన నక్కడ
నక్కడనే తోఁచుచుండు నతనుండయ్యెన్. 7

సీ. కలికి యొయ్యారంపు గతుల వ్రేతలఁ గన్ను
లార్చి యిక్కువలకుఁ దార్పఁడయ్యె
సహచరగోపాలచయముతో నెప్పటి
యట్లు సంప్రీతి మాటాడఁడయ్యె
మణికుండలప్రభామండితగండస్థ
లుల హాసచంద్రికల్నిలుపఁడయ్యె
నారదవాక్సుధాపూరంబు కడునాని
చెవి కొంకుపలు కింపు సేయఁడయ్యె

తే. త్రిజగతీవిభ్రమశ్రీలఁ దేజరిల్లు
నాదిలక్ష్మికి జోడు నీడైన రాధ
మీఁదికూర్మి మనంబులో మిక్కుటముగ
మాధవుం డొక్క కేవలమర్త్యునట్లు. 8

సీ. విరహతాపంబున విహ్వలుండయ్యును
భక్తులతాపంబుఁ బరిహరించుఁ
గందర్పతమమును జెందియు సుజనుల
యజ్ఞానతమము పెల్లణఁపుచుండు
భామినీగుణపాశబద్ధుఁడయ్యును సాధు
జనులదుష్కర్మపాశంబులూడ్చు
మహనీయరాగాబ్ధి మగ్నుఁడయ్యును దపః
కలితులరాగాబ్ధిఁ గడపుచుండుఁ

తే. గామసుఖసక్తుఁడయ్యును ఖలులకెల్లఁ
గామసుఖసక్తతలఁ బాపుఁగమలనేత్రుఁ
డాత్మసంపూర్ణకాముఁడు నగుటఁజేసి
యఖిలలోకైకకర్తయు నగుటఁజేసి. 9

క. తెలిగన్నుఁ గొనలఁ గెంజా
యలు దేరఁ దదేకచింత హరి యుండ మదిన్
గలఁగును కృష్ణుఁడు దనపై
నలిగెనొకో యనుచు గోపికావళి భీతిన్. 10

వ. ఇట్లు దుర్వారశౌర్యరోషారుణితనేత్రాంతలతాంతశరనితాం
తనిశితబాణంబులచేత సమాందోళాయమానమానసారవిం
దుండై గోవిందుండు కాంక్షలపెల్లునఁ బెల్లగిల్లినధైర్యంబు
తో నందంద మనోరథంబులు గందళింప నిట్లనియె. 11

ఉ. అందెలు ఘల్లుఘల్లుమన హంసగతిం జెలువొప్పఁ జేరినా
డెందము ఝల్లనం గటితటీమణికాంచనకాంచిసూత్ర మం
దందఁ గరారవిందమున నానుచు సిగ్గులనిగ్గు చూపుతో
నిందునిభాస్యనన్ను వరియింపఁగ రాఁగనుగొంటయెన్నఁడో.

ఉ. బాలిక చెక్కుటద్దముల పైనునులజ్జఁ బెనంగునవ్వు గై
వ్రాలఁ బయోధరద్వయి నివారణ వేఁబులకల్ జనింపఁగా
వ్రాలనివాఁడిచూపు రతివాంఛ వచింపఁగ మోమువంచినం
గేలఁ దెమల్చి త్రిప్పి రతికేళి యొనర్పఁగఁ గల్గుటెన్నఁడో.

మ. మరుతాపం బధరామృతంబున హరింపం జేసి గాఢోపగూ
హరతిక్ మైగరు పాఱఁగా సురతసౌఖ్యశ్రీ వినోదించియా
హరిణీలోచన నూరుకాండముల నెయ్యంబారఁగా నించినే
ర్పరినై చన్నులఁ బత్త్రివల్లులు రచింపన్నాకుఁ జేకూరునే.

చ. తనియనికాంక్ష నత్తరికి విరోధంబున లేనగుమోముతో ఘన
స్తనమణిహారమర్మరితశబ్దములుం గరకంజకంకణ
ధ్వనులు నితంబకాంచిపద వారిజహంసకరావమున్మనో
జునినెలయింపఁగందునొకొ సుందరిచూపెడుపుంస్త్రియారతుల్.

చ. కనుఁగవఁ గెంపు దోఁప నలుకం గయిసేయక వింత చెన్నుతోఁ
జనుఁగవ వేఁడి యశ్రువులు జాఱఁగఁ దప్తసువర్ణహారయై
చననొక భంగి నున్న సతిఁ జయ్యన మ్రొక్కునఁ దేర్చి ప్రీతి న
క్కునఁ గదియించి తల్పమునకుం గొనిపోయి రమింపఁగల్గునో.

చ. పొలఁతుక బిత్తరించి మగపోఁడిమి సల్పుచు వేళఁ దద్దృగం
చలముల నవ్వఁ దగ్రుచిర చంచలకుండల గండపాళి ద
ద్వళిజఘనోరు కాండయుగ వర్తుల చారుకుచాంతరంబులన్
గలుగు నెనిర్నిమేషముగఁ గాంచి శిరంబుఁ గదల్చి మెచ్చఁగాన్.

సీ. కురులు చిక్కులు దీర్చి కుడివంక కొకయింత
వీఁగఁ గొప్పిడి కమ్మ విరులు ముడిచి
నిటలభాగంబున నెలవంక బాగుగాఁ
గస్తూరిచేఁ దిలకంబు దిద్ది
నిద్దంపు లేఁజెక్కుటద్దంపుదోయిఁ గుం
కుమమునఁ బత్త్రిభంగములు వ్రాసి
మహనీయగురుకుచ మంజరీద్వయమునఁ
గప్పురగంధపంకంబు మెత్తి

తే. కల్పములనీడ రత్నాలగద్దె మీఁద
మొలఁత కాంచీగుణంబున మేలిమైన
మానికంబులు గ్రుచ్చుచు మన్మథునకు
[1]నెసఁగ యెన్నఁడు నే బొమ్మ యిడుదునొక్కొ. 18

1. బిగిసి యెన్నఁడు నే బొమ్మ పెట్టు నొక్కొ. (మూలము)

సీ. వణఁకెడుచన్నులమీఁది పన్నీటఁ గాక మె
బ్బంగిఁ జల్లారు నీభావజాగ్ని
నెలఁత కెమ్మోవితేనియఁ గ్రోలుకొనక యీ
మన్మథదాహంబు మాను టెట్లు
పొలఁతుకయవయవంబుల మేను గదియింప
కీదర్పకాయాస మెట్లుమాను
భామినీమణికరస్పర్శలీలలఁ గాక
యీకంతుశరహతు లెట్లుమాయు
తే. నబ్జలోచననేత్రచంద్రాతపమునఁ
గాక విచ్చునె కామాంధకారపటలి
యబలమృదుభాషణములఁ గాకలవిలుతు
నించువిలుమ్రోఁత [1]చేడ్పాటు లెట్టు లుడుగు. 19

చ. పటుదహనార్చులట్లమృతభానుమరీచులు; పుష్పమాలికల్
చటులనిశాతబాణములచందమునన్; మలయాచలేంద్రది
క్తటమృదువాయుకందము లుదారదవాగ్నికణరాజియట్టులె
కుటిలవిచారుమన్మథునిఁ గూడి మనోవ్యథఁ జేసె నేమనన్.

ఉ. ఎప్పగిది న్వరింతు దరళేక్షణ; నేగతిఁ బెండ్లియాడుదున్
గప్పురగంధి; నేకరణిఁ గంజవిభాననఁ జెట్ట వట్టుదున్
నిప్పులువోని దర్పకుని నిష్ఠురశాతశిలీముఖావళుల్
గుప్పునఁ గూరవోచ్చెఁ గలగుండువడెన్మదియింక నెట్లొకో.

1. చేడ్పడు టేల? జడ్పడ కేల (మా)

వ. అని యిట్లు పుండరీకాక్షుకోదండధనుర్గుణటంకారఝంకారా నుకారిశుకపికానీకసముత్కంఠకలకలనినాదంబులకుఁ గలం గుచుఁ, దుషారకిరణకందళనికర సహచరమలయశిఖరిమరు దంకురపరంపరలకుఁ దొలంగుచు, నంతర్నిరంతరజాజ్వల్యమానవిరహజ్వలనజ్వాలావళీవిస్ఫులింగంబులకుమలంగుచుఁ, బ్రతిదినప్రవర్ధమానచింతాభారంబున నలంగుచు, నవీనమందారతరు సుమనోమాల్యమరందబిందునిష్యందంబుల ననవరతహిమవారిధారాభిషేకంబుల ఘనసారగంధసారపంకచర్చల సరసకుసుమవిసరవిరచితమృదులశయ్యాతలంబుల నాళీకనాళకాండఖండపరికల్పితాకల్పంబుల నెట్టకేలకుఁ గాలంబు జరుపుచు, దూతికాముఖంబునఁగాని యేతత్కార్యంబు సంఘటింప సమర్థంబుగాదని తలంచి సకలమనోవిజ్ఞానవతి భారతి దక్కఁ దక్కినవా రెఱుంగ రని నిశ్చయించి చక్రపాణి వాణిం దలంచె నప్పుడు. 22

క. హరి తనకు నవసరము లే
కరయఁగ ననుఁ దలఁచునొకొ యాయానాకుఁ
హరిచరణదర్శనము పని
వెరవున సమకూడె ననుచు వికసితముఖి యై. 23

సీ. హరినీలమాణిక్య సురుచిర రుచు లీను
కబరిపై నమృతాంశుకళ వెలుంగ

మృదుగండతలముల మెత్తనిసిందూర
కర్దమచ్ఛాయయుఁ గ్రమ్ముకొనఁగ
దక్షిణేతరహస్తతలకీరరమణికి
వలకేల బింబికాఫల మొసఁగుచు
వలిచన్నుఁగవ వీణె యలవరింపుచుఁ బాణి
జలజద్వయమున నంజలి ఘటింపఁగ
**తే.** దేహకాంతి శశిప్రభల దీటుకొనఁగ
వేదవేదాంతశాస్త్రాది విద్యలెల్ల
నొడలఁ దొడవులచందాన నడర వచ్చి
నిలిచెఁ గృష్ణునిమ్రోల నొప్పులకుఁ బడఁతి. 24

**వ.** ఇట్లు నిలిచి యప్పరమకల్యాణి నందకపాణికిఁ బ్రదక్షిణంబు వచ్చి మకరందంబులు చిలుకు మందారదామంబులఁ దచ్చరణారవిందంబు లర్చించి యమ్ముకుందు ముందటనిల్చి పరమానందంబున నిట్లని స్తుతించె. 25

**మ.** విలసద్గోపవధూచకోరములకున్ విందై ముఖేందుద్యుతుల్
దిలకింప న్యమునాసరిత్పులినధాత్రీమండలి న్దీపికా
వళి శ్రీనిండఁ ద్రిభంగివై మురళిరావశ్రీల గోరాజి ని
చ్చలు మోదాంబుధిఁ దేల్చునిన్గొలుతుఁ గృష్ణా! వల్లవీవల్లభా.
**సీ.** భూకాంత వెలిపట్టుపుట్టంబుపైఁ దమ్మి
పువ్వింటిపొలఁతి తో నెవ్వఁడుండుఁ
జలికొండరాచూలిసవతి కెవ్వనిపదాం
భోజాంగుళిస్థలి పుట్టినిల్లు

కడుపులో బంగారు గల భాగ్యవంతుని
గారాన నెవ్వఁడు గన్నతండ్రి
నెలపువ్వు ముడుచు వన్నెలకాని పతక మె
న్వని తేజిముందట వన్నెమాయుఁ
తే. బర్హ్వనల్లము ఖుల్లఁ బోలల్పంగఁజాలి
దిక్కులందెల్ల నెవ్వని దేహకాంతి;
కరుణ యెవ్వనికన్నులఁ గందళించు
నట్టినీకు నమస్కార మబ్జనేత్ర! 27
సీ. శ్రుతివధూటీరత్నచూళికా పుష్పగం
ధాన్వితం బెవ్వని యంఘ్రియుగము
మహనీయముక్తిసీమంతవతీ కేళి
పల్లవ లెవ్వని భక్తవరులు
పరమయోగీంద్ర హృద్భవనమధ్యములకు
మణిదీప మెవ్వని మహితమూర్తి
బ్రహ్మాదు లెవ్వని పట్టపుదేవి కృ
పాకటాక్షమున సంపన్నులైరి
తే. భువనపద్మంబు మొణిగింపఁ బొదలఁజేయఁ
గలిగి మిన్నఁదు నెవ్వనికన్నుదోయి
మూఁడుమూర్తుల కెవ్వఁడు మూలకంద[1]
[2]మట్టినీకు నమస్కార మబ్జనేత్ర! 28

1. దుంప. 2. యు. (మూ)

సీ. జలజగదాసుదర్శనపాంచజన్యముల్
వెలుఁగు నెవ్వనిహస్త । జలరుహముల
గగనమండలిఁ బ్రభా । కరుభంగి నెవ్వని
యురమునఁ గౌస్తుభ । మొప్పుచుండుఁ
బన్నగగ్రామణి । పటుఫణామండలి
దనరు నెవ్వనికి వి । తానలీలఁ
బదియాఱువన్నెల । పసిఁడికెంబట్టు గై
సేయు నెవ్వఁడు కటి । సీమ నెఱయ

తే. మూఁడుజగముల రాగాబ్ధి । ముంపఁ గోరి
ముదమెలర్పఁగ నెవ్వని । ముద్దుఁగ్రోవుకు
సర్వజీవుల నెమ్మది[1] । సంభవించు
నట్టినీకు నమస్కార । మబ్జనేత్ర! 29

మధురగతి రగడ.

1. జయజయ లక్ష్మీ వక్షోరుహాకల
శద్వయ కుంకుమపంకస్థానక
సందర్భకళాకేళిపరాయణ
చారునిశితధారానఖరాంకుర

---

1. స్త్రీల నెవ్వఁడు...(మూ)

జయజయ శతమఖముఖనిఖిలామర
సందోహాకిరీటతటమణిప్ర
స్ఫార మయూఖ శిఖావిమలపయ
స్సంకాశితచరణాంభోజద్వయ

2. జయజయ పదపద్మద్వయసేవా
సక్త ప్రహ్లాదపరాశరశుక
శౌనకసనకసనందన ముఖవై
ష్ణవ నికరసమాకీర్ణ గృహాంగణ
జయజయ దుగ్ధపయోనిధివీచీ
జాలకలీలాడోలాందోళన
సంరింఖత్ఫణినాయకభోగా
స్తరకేళీనిద్రారసతత్పర

3. జయజయ పన్నగనాయక దీర్ఘభు
జాలోహార్గళ దివ్యసుదర్శన
చంచద్ధారా ఖండితవిక్రమ
శాలిమదాభీలాసురమస్తక
జయజయ కోటిసుధాకర మండల
సంకాశ మహాశంఖ ఘుమఘుమ
స్వానవిఘూర్ణిత సద్బ్రహ్మాండా
సంబాధక శాత్రవహృన్మండల

నీనాభీకమల పరాగములో
ని సహస్రాంశంబున జన్మించిన
నీరజగర్భునిఁ ద్రిభువనఘటనా
నిపుణకులగ్రామణిఁగాఁ జేసితి
నీనయనోజ్జ్వల దృగ్జాలంబుల
నిశ్చలభక్తి పరాయణసన్ముని
నికరంబులకును ముక్తివధూటీ
నిరుపమసౌఖ్య పరంపరలొసఁగితి

5. నీవిక్రమ తేజఃకీర్తికళా
నిర్గతదీప్తి శతాంశంబులు గను
నెగడి దివాకరహిమకరమూర్తుల
నింగి వెలుఁగుచునున్నవి సతతము
నీవదన సుధాకరబింబంబున
నిర్మలకరుణా జ్యోత్స్నలహరీ
నిష్యందంబుల సురలు చకోరా
నీకముక్రియఁ జవిగొని విహరింతురు

6. నీపదరాజీవమున జనించిన
నిర్జర గంగామృతపూరంబులు
నెలకొని ముల్లోకంబులఁ గల జన
నిచయంబుల పంకము గరఁగించును

నీపటుశౌర్యము నిష్ఠురదనుజా
నీకవధూటీ మంగళసూత్ర వి
నిర్భరసౌభాగ్య కళాలక్షణ
నిర్మూలన కారణమై వెలయును

7. నీగర్భదరీక్రోడంబున స
న్నిక్షిప్తములై సకలచరాచర
నీరంధ్రములగు నీలోకంబులు
నెటినొప్పఁ దొంతుల చందంబుః

నీగుణముక్తాఫలసంతానము
నిఖిలోరగగరజనీచరకిన్నర
నిర్జరగంధర్వ మహామునివర
నీరజగర్భులు నెన్నఁగఁజాలరు.

8. నీనామామృత రసపానంబున
నిత్యత్వంబును గొనియాకల్పము
నిశ్చయమతితో భవమరణాదులు
నిరసనమొనరింతురు ధీమంతులు

నీనవమోహనసల్లీలలు వ
ర్ణింపఁగ నోపినపటువాచాలురు
నిక్వణ దస్మత్కరమణివీణా
నినద లలితకవితల రచియింతురు

9\. నీ సంస్మరణము సేయుమనీషా
నిధులకు నితిహాసపురాణకథా
నిగమాగమతత్త్వకళార్థంబులు
నిజకరమాణిక్యములై యుండును
నీసౌందర్య కళాకందంబులు
నెమ్మనమునఁ గనుఁగొనఁ గలవారలు
నీరజనయనామోహనమంత్రా
న్వితులై కంతునిరూపము మింతురు

10\. నీవే చిన్మయ మూర్తివి తలఁపఁగ
నిన్నుం గొలువ శుభము సేకూరును
నీచేతఁ దమోవరణము విరియును
నీకై నుతివాఙ్మణు లొడఁగూర్చుట
నీవలనఁ గృతార్థత్వము నొందుట
నీకుఁ సరిగా రేవేలుపులును
నీయందుఁ దలంపులు నిలుపందగు
నీరేజాక్షా! రక్ష నమస్తే. 30

క. అని యిట్లు సన్నుతించిన
వనరుహాసంభవునిరాణి ॥ వాణీదేవిన్
గనుఁగొని శ్రీకృష్ణుఁడు గనుఁ
గొనలం గారుణ్యరసముఁ ॥ గురియుచుఁ బలికెన్. 31

చ. కలఁడు సహస్రగోపుఁ డనఁగా నొకవల్లవనాథుఁ డాతఁడ
త్యలఘుతపంబొనర్చి తుహినాంశుకిరీటువరఁబుపేర్మి సొం
పలవడ నొక్కకూఁతుఁ గనె నాసరసీరుహనేత్ర రాధ నా
వెలయుఁ దదీయరూపనవవిభ్రమలీలలు నామనంబునన్.

ఆ. నాటు కొలిపిపోయె నారదమునివరుం
డదియ మొదలుగా లతాంతశరుఁడు
నాటుకొలిపెఁ బుష్పనారాచసంహతి
నేమిచెప్పువాఁడ నిందువదన. 33

తే. వేఁడిపిడుగుల గమికైన బాడబాగ్ని
హేతులకు నైనఁ జెదర కొక్కింత యోర్వ
వచ్చుఁ గాని యపారదుర్వారదర్ప
కోగ్రనారాచవృష్టికి నోర్వరాదు. 34

క. సుందరి మఱుఁగునఁ గాకీ
కందర్పుఁడు నన్ను నేఁచఁగలఁడే నే నా
సుందరిఁ జేకొనఁ దానే
సందులు దూఱెడునో యిట్టి చలమరి పిదపన్. 35

క. పాయదు నామది సుమన-
స్సాయకశరతాప మొందు చందంబులఁ బ
ద్మాయతలోచన రాధిక
నేయుపమల నైనఁ గూడ కిది నిజము సుమీ. 36

సీ. ప్రతిబింబితంబైనపగిది లిఖించిన
గతి వజ్రలేపసంఘటితమైన
కైవడి నంతర్నిఖాతమైనవిధాన
లీనమైనట్లు కీలించినట్లు
పొందునఁ గలయంగఁ బోఁతవోసిన రీతిఁ
బ్రత్యుప్తమైనట్టి భంగిఁ బుష్ప
కాండశిలీముఖ కలితచింతాదీర్ఘ
సూత్రసంహతులసంస్యూతమైన

తే. చందమును జెంది యయ్యరవిందగంధి
నూతనప్రాయకలనామనోజ్ఞమైన
రూప మనురూపమై మేలురూపు రూపు
సేయుచున్నది మన్మనస్తోమజమున... 37

వ. కావున నీవు సందేశహారిణివై యగ్గోపాలిపాలికిం జని పెక్కు చందంబుల నందంబుగా నారూపలావణ్యమాహాత్మ్యంబులు ప్రకటించి మనంబుఁ గరంబు గీలించి యన్యంబు మఱపించి యంగీకారంబు పుట్టించి తదీయహృదయప్రకారంబు నా కెఱింగింపవలయు నది యస్మన్మనోరథంబైనకార్యం బవశ్య కర్తవ్యంబు. 38

ఉ. నావుడు సంతసిల్లి నలినప్రభవాంగన యిట్లనుఁ ద్రిలో
కావనశీల! మన్మథసహస్రవిలాస! మనోజ్ఞమంత్రవి

ద్యావిభవాత్మ! నీకు నొకఁడైన నసాధ్యము గల్గునే ననుం
బ్రోవఁదలంచికాక పని పూనెద నీకృప తోడునీడగన్. 39

క. నను బోఁటి వారితరమా
యొనరింపఁగఁ గృష్ణ! నీప్రయోజన మైనం
జని నాచతురత వెలయఁగ
వనితామణి నీకుఁ గూర్మివలఁతిం జేతున్. 40

ఆ. అని పునఃప్రణామ మాచరించిన దేవి
వీడుకొలిపి గోపవిభుఁడు దన్ము
ఖమునఁ దలఁపు నిలిపి కార్య మానని యుండె
నలరి యచటు వాసి యజునిసతియు. 41

వ. తనమనంబున. 42

తే. అమ్మహాదేవి వివరింప నాదిలక్ష్మి
యాదినారాయణుం డితం డరసి చూడఁ
బరమకళ్యాణహేతువౌ పనియొనర్పఁ
గలిగె భాగ్యంబు నా కింతకంటెఁ గలదె. 43

వ. అని పరమహర్షోత్కర్షంబునఁ జనుతలంపున. 44

క. తలఁచె నిజస్యందన మ
ప్పలుకులపూఁబోణి యభ్రపథమున నదియున్
గలహంసీరథ్యంబులు
గలిగి నిజప్రభలు నిగుడఁగాఁ జనుదెంచెన్. 45

వ. ఇట్లు వచ్చిన. 46

క. జలజాతముపై నిలిచిన
కలహంసయుఁ బోలె రత్నకలితరథముపై
నలువసతి వొల్చె నిర్జర
లలిత జయధ్వనులు దిక్కులం గడుఁ జెలఁగన్. 47

మహాస్రగ్ధర.

తనదీప్తుల్ చంద్రకాంతిం దడఁబఱుప సురస్తోత్రసముల్ మ్రోయు చుండన్.
వినువీథిం దేరిమీఁదన్ వికసితముఖయై వేడుకల్ తొంగలింపన్
దనచేతోవీథి దామోదరుని నిలిపి తత్కార్యమూహించుకొంచున్
జనుదెంచె న్వాణి లీలాసరభసగతి ఘోషంబు డాయన్ గడంకన్.

వ. ఇట్లు వచ్చి సహస్రగోపునిమూఁద కనతిదూరంబున నంత రిక్షంబునఁ దనదివ్యయానం బదృశ్యంబై యుండ నియమించి భూమండలంబునకు డిగ్గి నిజస్వరూపంబు జనుల కదర్శనీయంబని సుదర్శనీయం బగు నొక్క మానుషీ రూపంబు వూని మధురవాణి యని పేరు నిర్దేశించుకొని నిలిచి పొలుచుటకు సంతసించి సురకాంతలు పుష్పవర్షంబులు గురిసి రనంతరంబ. 49

సీ. గండద్వయంబునఁ గలికి లేనగవులు
రాజిల్లి వెన్నెలరసముఁ గురియ
వెడఁదలై తెలుపారు కడకంటిచూపుల
వెలిదమ్మిరేకులు వెల్లివిరియఁ

బద్మరాగంబుల పసమించు మృదుపద
  చ్ఛాయ సంధ్యారాగశంకఁ గొలుపఁ
జెవిదోయిఁ జెరివిన చెంగల్వవిరులకు
  ఝుమ్మ ఝుమ్మని తేంట్లు గ్రమ్ముకొనఁగఁ
తే. గ్రొత్తముత్యాలకెంబట్టు కుచ్చు లమరు
పసిఁడివీణె కరంబునఁ బట్టి యందె
లోలి మ్రోయంగఁ బారకురా లనంగ
మంద కొయ్యన వచ్చె నమ్మధురవాణి. 50

క. బెడఁగుం జనుఁగవ వ్రేఁగున
నడు మసియాడంగ నంచనడ నొయ్యారం
బడర నడుపీథిఁ జనియెన్
బడిబడి నిలుఁ వెడలి గొల్లపడుచులు చూడన్. 51

వ. ఇట్లు నిజవిభ్రమవిలాసంబుల ఘోషంబులు విభూషింపుచు మందయానంబునం జని యమందానందంబు డెందంబునఁ గందళింప న య్యరవిందలోచన యుచితప్రకారంబున సహాస్రగోపునిమందిరద్వారంబు దఱియం జొచ్చి తదంతరాళంబున నొక్కయేకాంతగృహంబునఁ బద్మరాగవేదికామధ్యంబునఁ గనకలతాకీలితరత్నడోలికాసనంబునఁ బద్మదళోపధానంబున నొత్తగిలి చిత్తజాయత్తంబై యుత్తలపడుచిత్తంబున నిరంతరచింతాతంతుసంతానంబు చిక్కువడఁ గ్రొక్కారుమెఱుంగునుం బోలె నాభీలమదనకరవాలధారకు జలద

రింపుచు జాగరణోద్భూతరాగంబునఁ గోకనదదళోదరకాం
తి నపనయింపం జాలువెడఁదకనుదోయి నెడతెగక విభిన్న
సూత్రముక్తాఫలంబులం బోలెఁ దొరఁగు నశ్రుధారాలవం
బులఁ గుచకుంభంబు లలంకరింపుచు నిశాంతరజనీకాంత
బింబంబుపగిదిం గానవచ్చు పరిపాండురగండమండలంబునం
బాణిపంకజంబు హత్తించి వదనపద్మగంధంబునకుం గ్రందు
కొనునలిబృందంబులకు డగ్గఱ రాక మొగ్గరంబైనక్రొవ్వేఁ
డినిట్టూర్పులచేతఁ బరిమ్లానసహకారకిసలయంబు చందం
బునఁ గంది బిఱుసువారినవాతెఱయును ననంగజ్వరదాహ
భారంబునఁ దప్తకాంచనశలాకాకృతి ముట్టరాక వేఁడియై
కృశంబైనమేనుఁదీఁగెయు నింద్రనీలమాణిక్యతేజఃపుంజంబు
లు విడంబింప వెడవెడజాఱి వెన్నునం దూలువేనలియును
నవస్థాంతరంబులు దెలుప, దూరీకృతాంగుళీయకహారకేయూ
రముఖనిఖిలపరిష్కారయు వివర్జితమృగమదకాశ్మీరఘనసార
గంధసారపంకచర్చయు విరహితసరసకుసుమమాలికానేప
థ్యరచనయు సఖీజనపరివృతయు నిరాలాపయుఁ గృష్ణలా
వణ్యగుణమణిగణనాతత్పరయు నైయున్నరాధాకన్యకం గ
నుంగొని తదాయల్లకోల్లాసంబుగా నెఱింగి మందస్మితా
పాంగరుక్చంద్రికలు కెలంకుల నలంకరింప నరవిరియొయ్యా
రంపుబాగున డాయంబోయి నట్టియెడ... 52

క. రతిదేవియొ కాక సర
స్వతియో గా కిట్టిరూపసంపద గలదే
క్షితి సతుల కనుచుఁ బరమా
ద్భుతమతులై సఖులు వేడ్కఁ బొదలుచుఁ జూడన్. 53

శా. ఆరాధాసతి యంతఁ గొంత మది ధైర్యంబూఁది తెల్వొంది గం
భీరప్రక్రియఁ గొంత మన్ననయు సంప్రీతి న్వివేకంబు బెం
పారం బీరము చూపఁ జేరువఁ దదధ్యాసీనయై వేడ్క న
న్నీరేజాక్షివిలాసముల్ మధురవాణీకాంత చూచి ట్లనెన్.

ఉ. ఈతరళాయతాక్షి రచియించెడిచాతురి యెట్లుగల్గెనో
ధాతకు ధాతచేత రచితం బగునే యిటువంటిరూపు నేఁ
జూతునకా దె యక్షసురసుందరులన్ సృజియించువేళలం
దే తదనూన విభ్రమము లెక్కడి వాచిగురాకుబోండ్లకున్.

శా. సాక్షాత్పూర్ణసుధాంశుబింబమె ముఖాబ్జంబై నదీయింతికి
చక్షుల్ గావు చకోరదంపతులు జ్యోత్స్నాపూరముల్ గ్రోలనై
యక్షీణోత్సవలీల డాసినవి లేదా యీప్రసన్నత్వమున్
వీక్షారోచులునొప్పునే సతులకున్నెమ్మోమున గన్నులన్.

చ. అలికులవేణి మధ్యలతయాకసమంబుతరంగము ల్వళుల్
మలయసమీర మూర్పులు సమగ్రనితంబభరంబు సైకత
స్థలము దృగంచలప్రభలు చంద్రమరీచులు గాఁగఁ బంచత
త్త్వలసితమన్మథాంబుజభవప్రతిసృష్టియుఁబోలెనొప్పెడున్.

సీ. అబల వేనలిలోని యర్ధభాగము గాదె
పరఁగఁ జూచినఁ గృష్ణ పక్షతమము
హరిమధ్యగతిలోని యష్టభాగము గాదె
తక్కినయైరావతంపునడక
సుదతి ఫాలములోని షోడశాంశము గాదె
హరుమౌళిశశిఖండ మరసిచూడ
లోలాక్షిచూపులలోని వేయవపాలు
గాదె శంకింపంగఁ గమలదళము

తే. కోకములు పాటలాధర గురుకుచములు
వియ్యములు గావె వెడవిల్తువింటినారి
కామినీమణినూగారుఁ గవలు గావె
యెట్లు వర్ణింపవచ్చు నీయిందుముఖిని. 58

సీ. కలికిసౌదామనీఖండముల్ పసిఁడినీ
ర్వోసి మెత్తఁగ నూఱి ప్రోవుచేసి
పరిపక్వబింబికాఫలరసంబులలోన
నవ్యవిద్యుల్లతల్ నానవైచి
దాడిమీఫలబీజతతులలో నవ్యపం
కజరాగరత్నముల్ గలయఁగ్రుచ్చి
కనకరంభాగర్భకాంతికలాపముల్
హస్తిహస్తమ్ములయందు నిలిపి

తే. యొడలు నధరంబు దంతంబు | లూరుయుగము
నజుఁడు నిర్మింపఁబోలు నీ | యబ్జముఖికిఁ
గానినాఁ డిట్టిజిగియు రా | గంబు వరుస
నున్నఁదనమును గల్గునే | యెన్ని చూడ. 59

తే. లలనగళమును గటిమండ | లంబుఁ జేయ
నజుఁడు మదిఁ గోరి యన్యము | లంపిచూచి
యొండ్లుగా వని హరియాజ్ఞ | నుత్సహించి
నేర్పుతో శంఖచక్రముల్ | నిలుపఁ బోలు. 60

సీ. ముఖచంద్రబింబంబు | ముక్తాతపత్రంబు
చారుదృగ్జాలముల్ | చామరములు
కటిమండలముగన | కమయోరుపీఠంబు
మేనిమెఱుంగులు | మేలుకట్లు[1]
పాదోష్ఠకరములు | పంచపల్లవములు
పాలిండ్లు పూర్ణకుంభద్వయంబు
మృదులోరుకాండముల్ | కదళికాస్తంభముల్
కంఠంబు విజయశంఖంబుఁ జేసి

తే. లలితసౌందర్యసామ్రాజ్యలక్ష్మి మెఱయ
సకలలోకైకవిజయదీ | -క్షాధురీణ
గరిమ రతిరాజుఁ బట్టంబుఁ | గట్ట నజుఁడు
నేర్పుతో నింతిరూపున | నిలుపఁ బోలు. 61

1. గుఁలమరినట్లు (మూ.)

వ. అని ప్రస్తుతించి యాశ్చర్యకౌతూహలాయత్తచిత్తయై శిరః కంపంబుచేసి యాజగన్మోహనుం డగుపుండరీకాక్షునకు నివ్విలాసవతి ప్రతి యౌ నని తలంచి తదభిమాన యౌటయు నిశ్చయించి తనవచ్చినకార్యంబునకు నిదియ యవసరం బని పద్మాసనబంధంబునఁ జక్కనై వీణెయందలిపట్టుగవుసెన వాయం దట్టి చేలాంచలంబులఁ గాయలు దుడిచి దేవీ! యాకర్ణింపు మని పలికి యప్పుడు. 62

చ. కొలఁదిగ రాగభేదములకున్ దగుసారెలు సారెకొత్తి తంత్రులుకొనగోళ్ల మీటుచుఁ జక్కనుంగవ దండెయమర్చికృష్ణలీలలు ప్రకటించి పంచమకలశ్రుతిమ్రోఁకు లిగుర్పరాధకున్ వలపులు చిల్కఁగ[1]న్మధురవాణిప్రవీణతఁ బాడె వీణతోన్.

క. సరసమృదుగానకళలం
గరఁగిన తచ్చంద్ర శాలికా స్తంభసము
త్కరమణిపుత్రిక లమరెన్
బురుషుల కౌఁగిళ్లలోని పొలఁతులవోలెన్. 64

చ. వికసితపంచమశ్రుతి నవీనరసస్థితిఁ బాడఁ దద్వపం
చిక చిగురొత్తఁగా దనరెఁ జిత్తజుఁ డుత్తలపాటుతోడిరా
ధిక నదరంట నేయఁగ రతిప్రమదామణియందియిచ్చు సా
యకనికరంబు నాఁగ నయనాభిరతిం గొనియాడఁ జిత్రమై.

1. చిల్కుచు (మూ.)

వ. ఇట్లు నిజప్రాణవల్లభాంకితంబు లగుగీతంబులు శ్రుతిభూషణం
బులుగాఁ బాడిన యచ్చేడియకు నపూర్వమనోహరరత్న
భూషణాంబరంబులు గట్టనిచ్చి గారవించి ప్రియవచనంబుల
రాధ యిట్లనియె. 66

ఉ. ఎక్కడనుండి రాక తరళేక్షణ! యెయ్యెడ నున్కి లీలమై
నెక్కడ కేఁగఁగాఁదలఁచి యిక్కడకుం జనుదెంచితొంటిమై
నిక్కము నేత్రపర్వమయి నీదు విలాసము మాకు నెంతయున్
మక్కువ గొల్పెఁ గైరవవనంబున కైందవబింబముంబలెన్.

వ. అని యడిగిన మధురవాణి యాకీరవాణి కిట్లనియె. 68

ఉ. ఎక్కడఁజెప్పఁదానఁజరియింపు నాల్గుముఖంబులందు నేఁ
ద్రొక్కనిచోటు లేదొకటి తోయజలోచన! యెల్లవారలున్
జక్కనిదాన వంచు నినుసన్నుతి సేయఁగఁ జూడవచ్చితిన్
దక్కకయుండుదున్ దలఁచు నందతనూజునిముందలోఁ బలన్.

సీ. అప్పటప్పటికి వీణాభ్యాస మొనరింప
నను గూడి వాయించు నారదుండు
పంకజాక్షుఁడు నన్ను భారతీదేవిఁగా
మన్నించు నాపేరు మధురవాణి
యే నెఱుంగని విద్య లెవ్వరు నెఱుఁగరు
పలుకుల మెప్పింతు బ్రహ్మనైన
నింగితాకారంబు లివి యని చెప్పుదుఁ
బరులచిత్తము నాకు బట్టబయలు

తే. పురుషులును గామినులు నాకుఁ బొందుగాని
వారు లే రెవ్వరును విను వనజనేత్ర
మైన మిక్కిలి నామాట కాత్మ మెచ్చి
యెందుఁ బోనీరు నందజు మంద సతులు. 70

శా. బృందారణ్యకదంబవీథి సుమనోహృద్యంబుగా గోపగో
బృందంబుల్ దనచుట్టునుం దిరిగిరాఁ బెల్లుబ్బి శ్రీకృష్ణుఁడిం
పొందన్ వేణువుఁ బట్టునప్పుడు కృతప్రోత్సాహలై గోపికల్
మందన్ వెల్వడి రాఁగఁజూడవలదా మా[1] పందులీలాగతిన్.

క. అటువంటివేళఁ జేతః
పుటముల నానందరసము పొంగఁగ లీలా
నటమోహనమూర్తిఁ గృపా
కటాక్షు హరిఁ జూడలక్ష కన్నులు వలదే. 72

శా. శ్రీకృష్ణుం డొకవేళ వల్లవకులస్త్రీరాజిపై లీలమై
నాకర్ణాంతదృగంతవీక్ష లలవో కల్లార్ప నొప్పుం జుమీ
రాకాచంద్రమరీచులై యమృతధారాశ్రేణియై శ్వేతనా
ళీకానీకములై సురద్రుమనవవల్లీజాలమై బాలికా! 73

సీ. వారిజనేత్రు తేజోరాశిలో నణు
మాత్రంబు భానుమన్మండలంబు
నందకపాణిదృగ్జ్ఞలినాంతరంగత్కృ
పాసుధారసవీచిపాలకడలి

1. మాప్రొద్దు (మూ.)

మదనగోపాలుని మధురమందస్మిత
బిందువు పున్నమచందురుండు
నందనందను పాదనఖవిభ్రమంబు లో
పలి పదాఱవపాలు భావసూతి

తే. యతులితైశ్వర్య శుభలక్షణాన్వితుండు
మానినీతత్త్వవిద్యాని ధానమూర్తి
ఘోషకాంతాపయోధర భూషణంబు
తరమె బ్రహ్మకు నైన మా ధవునిఁ బొగడ. 74

సీ. జలజాయతాక్షువక్షస్స్థలిఁ జేర్పని
కుచములు కుచములే కోమలాంగి
నందజుసౌందర్యకందళుల్ చూడని
కన్నులు కన్నులే కలువకంటి
పద్మనాభుని పాదపద్మముల్ సోఁకని
కరములు కరములే కంబుకంఠి
దేవకీసుతుని వా తెఱచవిచూడని
నాలుక నాలుకే నాగయాన

తే. యచ్యుతున కెప్పుడునుగొల్ల లాడనీని
జవ్వనము జవ్వనమె పూర్ణ చంద్రవదన!
గోపకులసార్వభౌముని గోష్ఠిఁ గనని
పడఁతి జన్మంబు జన్మమే పల్లవోష్ఠి. 75

ఉ. భావజమంత్రశాస్త్రపదభంగు లెఱుంగఁగఁ జెప్పి సత్కళా
భావరసస్థితుల్ దెలిపి పైఁగొనుసిగ్గు నెడల్చి గోపక
న్యావళిఁ బెక్కుచందముల నందముగాఁగయిసేసి తెచ్చి [1]యా
దేవకిపట్టిఁ గూర్తు మదిఁ దియ్యము నెయ్యముఁ దొంగలింపఁగన్.

క. ఉల్లములయందు నిబిడా
యల్లకభారములు వెలుఁగునప్పుడు నేనా
వల్లవకాంతల వల్లవ
వల్లభునిం గూర్తు నేర్పువైఖరి మెఱయన్. 77

క. ఏతలఁపైనను దాఁపక
నాతోడం జెప్పు మన్న నంగృష్ణుఁడు దా
రేతలఁపైనను దాఁపక
నాతోఁ జెప్పుదురు ప్రియము నను గోపసతుల్. 78

గీ. నన్నుఁ బ్రాణంబుగాఁ జూచు నందజుండు
గోపికలు నట్లచూతురు కువలయాక్షి
వారికే యేల నినుబోఁటివారి కెల్ల
నేను వశ్యను జువ్వె మన్నించిరేని. 79

వ. ఒక్కనాఁడు ప్రేపల్లెలోనం గథానుకథనంబున యశోదా
నందులముందఱ నీప్రసంగంబు వడినసమయంబున మున్ను
నిన్నుంజూచిన బంధుజను లక్కుమారి సర్వలక్షణసంపన్న
యని సన్నుతింపఁ గర్ణానందంబుగా విని వారు మనకృష్ణు

1. తాల్చి (మూ.) తార్చి?

నకుఁ బెండ్లిసేయుదుమా యని పలికినమాటలకుఁ దదా
సక్తచిత్తలైన గోపాంగనలు గలంగంబాఱి లేటమొగంబు
లెరి. అట్లు నిజమైన నేమగువారలో కాని నినుబోఁటి
బోటిగదా మాకృష్ణునకుం బ్రాణేశ్వరి యయ్యెనేని యేమి
చెప్ప. రతిమన్మథులచందంబునఁ బ్రీతివసంతులకై వడి శచీ
దేవీంద్రులలక్షణంబున రోహిణీచంద్రులపగిదిఁ బారతీపర
మేశ్వరులరూపున మనోహరదాంపత్య సౌభాగ్యంబున విల
సిల్లెద రటువంటిప్రయోజనంబులు దైవికంబునఁ గాక యేల
సిద్ధింపనేర్చు, మీయుద్దేశము నొద్దిక యయ్యెనేని బ్రహ్మ
దేవుని శిల్పప్రయాసంబు సఫలంబు గాదె; తగినకన్యకుఁ
దగినవరుండు గల్గినఁ బసిండికిఁ బరిమళంబు వచ్చినయట్ల
కాదె! యిప్పుని సంఘటింపవచ్చు. నీహృదయంబుకొలంది
వింతవార మెఱుంగ మెవ్వరితలంపు లెవ్వరి కెఱుంగవచ్చుఁ
బ్రసంగవశంబున నిట్లాడంబడెఁ గాక యీతలంపులకు మా
కుఁ గారణంబేమి? యది యట్లుండెఁ ద్రైలోక్యసుందరీ
రత్నంబ వగునిన్నుఁ గన్నులపండువుగాఁగఁ జూడంగలిగె
నింతియచాలు; నీవంటి యువతి నెందునుం జూడము. నిన్నుం
బాసి చనుటకు మనం బొప్పకున్నయది- నీవు చేసినప్రియం
బును నీచెలువంబును మాగోపికలముందట ముందుముందు
వినం జెప్పుకొనం గలిగె. జరాసంధశిశుపాలాదిరాజుల యా
స్థానంబులకుంబోయి మరలివచ్చుచున్నదాన ననేకదినంబు

లాయెఁ గృష్ణావలోకనంబు లేదు. శీఘ్రంబుగం బోవలయు
నని సరసనిపుణభావంబునం బలికిన— 80

చ. అమృతరసోపమానమధుఽరాక్షరతద్విశదోక్తుల స్మదిఁ
ప్రమదరసప్రపూరములుఽపైపయిఁ బొంగఁగ నింగిముట్టియ
య్యమృతమరీచిచంద్రికలఽ నంబుధివీచియుఁ బోలె రాధికా
రమణి దనర్చె నప్డు రతిఽరాజుధనుష్కళ వన్నె కెక్కఁగన్.

వ. ఇట్లు హర్షోల్లాసంబున నుల్లంబు మల్లడిగొన వల్లవి మధుర
వాణి కిట్లనియె. 82

గీ. ఎవ్వరోయని యిందాఁక ఽ నెఱుఁగనైతి
ని న్ననాదరభంగి నోఽ నీరజాక్షి
వింతదానవె నాకు సఽద్వినయమూర్తి
చాలఁ గూర్చిన నాప్రాణఽసఖివి గాక. 83

సీ. సద్వివేకనిరూఢ ఽ సౌజన్యశీలవు
సుస్నేహసౌహార్ద ఽ సులభమతివి
శ్రవ్యశక్త్యుక్తికౌఽశలకథాసరణివి
నిన్ను వర్ణింపంగ ఽ నేర్తు మెట్లు
నీమంచితనమును ఽ నీప్రియంబును వీప్ర
వీణత్వసరణియే ఽ వెలఁదికైనఁ
గలుగునె మఱి నీకె ఽ కాక లోకంబున
మానసీయవు నీవె ఽ మధురవాణి

ఆ. యతివ మధురవాణి యనుపేరు సార్థంబు
నీకు నిన్నుఁ బోల నీవె నేర్తు
గాక యొరుల సాటి గాఁ జెప్పవచ్చునే
చెప్పనెడల వాణిఁ జెప్పవలయు. 84

క. దీపితభంగాతనుసం
తాపౌర్వానలభరమునఁ దఱలెడు మోహా
కూపార మీఁద నిపుడు
నాపాలికి నోడ వైతి నలినదళాక్షీ. 85

వ. అది యెట్లంటేని మన్మనోభిప్రాయం బెఱింగించెద నాకర్ణింపుము. 86

ఉ. సందడిఁ బర్వు కోరికలు సారెకు సారెకు నబ్ధివీచికా
బృందము లట్లు డెందమునఁ బెల్లయి యుబ్బఁగ బాల్యవృత్తిమై
నందనిమ్రానిపంచలకు నట్టులు సాపఁగఁ బోవుభంగి నో
యిందునిభాస్య! శౌరి వరియించుతలంపున నున్నదాననేన్.

క. సులభముగాని ప్రయోజన
మలవడునే నీకుఁ జేయ నంటివయేనిన్
గలకంఠి! యతఁడు సేవా
సులభుండవుఁ గాఁడొ! యరసి చూడుము మదిలోన్.

ఆ. అనిన మధురవాణి హర్షించి యా యింతి
తలఁపు నిశ్చయంబుఁ గొలుపఁ బూని

సందియంబు గలుగ ♦ సరసోక్తి నైపుణి
నెఱిఁగి యెఱుఁగ నట్లు ♦ యిట్టులనియె. 89

ఉ. వాక్యములిట్లు నీహృదయవాసనయెట్లొకొ కాని, శౌరితో
నైక్యము గల్గె నేని వినవమ్మ సువర్ణకలాపయుక్తమా
ణిక్యశలాకవోలె రమణీయతఁ దాల్చవె నీవు నవ్యచం
ద్రక్యధిరాజ బ్వగ్గనమతాభరణక్షమ కేశమంజరీ. 90

వ. అని సంశయంబుగాఁ బలికిన, 91

క. ఏటికి ననుమానించెదు
జోటీ యామేటి గవయఁ ♦ జూడక యొరునిం
గీటసమానుని మదిలోఁ
బాటింతునె? హరిణి వృకముపైఁ బడఁజనునే. 92

వ. అని యుల్లాసంబున, 93

శా. దోరాందోళనలోలకంకణమణి ♦ స్తోమాభిరామ ప్రభా
గారంబై తమరస్స్థలంబు మెఱయన్ గాఁ గంఠదేశంబునన్
గారామారఁగఁ బువ్వుదండ లిడి లోకంబెల్ల వీక్షింప నే
సారోదారమతి న్వరింతు హరి సాక్షాదైక్షవాస్త్రాసనున్.

గీ. తల్లియును దండ్రియును నీదు ♦ తలఁపుకొలఁదిఁ
జాగనిత్తురె యంటివా ♦ జలజనేత్ర
కృష్ణవర్ణాభిముఖతఁ దరిక్కించిరేనిఁ
గృష్ణవర్త్మాభిముఖతఁ దరిక్కింపఁగలరె. 95

వ. కావున నింకఁ గాలక్షేపంబు సేయక చని యస్మత్ప్రియంబుగాఁ గాంతునితో నేకాంతగోష్ఠి నిష్టవాక్యసరణి నానావిధంబుల మద్విధం బెఱింగించి తుది నిట్లనుము. 96

సీ. చంద్రమరీచిసం ♦ చయబాడబానల
జ్వాలాముఖములకు ♦ వచ్చుననుము
బాలరసాలద్రు ♦ పల్లవతీక్ష్ణకౌ
క్షేయాగ్రధారకు ♦ డాయుననుము
రాజీవమకరందరస ఘోరవిషపూర
పానంబు సేయంగఁ ♦ బూనుననుము
కలకంఠకంఠహుం ♦ కారనిర్ఘాతపా
తములకు నెదురెక్కఁ ♦ దలఁచుననుము.

తే. మండలీభూతకోదండ ♦ చండబాహు
దండకందర్పకాండ ప్ర ♦ కాండవృష్టి
మునుఁగు ననుము కృపాదృష్టి ♦ మనుప వేని
నీకుఁ బ్రాణంబు లర్పించు ♦ నిక్కమనుము. 97

వ. అని యిట్లు మన్మథోద్రేకంబున విగతలజ్జాభిమానయై యనుమానింపక తెంపుకలిమిఁ బ్రౌఢవచనంబులు పలికిన విని యప్పల్లవాధర రాధ కిట్లనియె. 98

గీ. నిక్కముగఁ దెల్పితివి నాకు ♦ నీతలంపు
దాఁచ కెంతయు; నిఁక నాకు ♦ దాఁచరాదు.

ప్రాణసఖులకు దాఁచెదు ♦ పనులు గలవె
వెలఁది! చెప్పెద వినవమ్మ ♦ నీను లలర. 99

చ. త్రిభువననేత్రపర్వభవ ♦ దీయమనోహరరూపసత్కళా
విభవము లెల్ల నారదుఁడు ♦ వేయివిధంబుల మున్నె చెప్పినాఁ
డభినవలీలఁ గృష్ణునకు ♦ నంబుజలోచన దాన నా జగ
త్ప్రభుఁడునునీకునై మదన ♦ బాణపరాజితుఁ డయ్యె నేమనన్.

క. జలజాక్షుని విరహాగ్నికిఁ
గొలఁదేమని చెప్పవచ్చుఁ ♦ గోమలశయ్యా
కలితనవకుసుమములు ని
ప్పులు వోలెన్ రాఁజుచుఁడుఁ ♦ బూర్ణేందుముఖీ. 101

క. కంతుశరానలకీలా
సంతప్తస్వాంతుఁ డగుచుఁ ♦ జల్లని నీదో
రంతరముఁ జేర్పుమని య
త్యంతము హరి నన్ను నభయ ♦ హస్తము వేఁడెన్. 102

వ. ఇవ్విధంబున భవద్వియోగభారంబునఁ గొందలపడుచుండం బున ముకుందుండు మన్నించి నన్ను నీపాలికిఁ బుత్తెర వచ్చి నీహృదయాభిప్రాయం బెఱింగితిఁ; దలంపు తలంపునం గలిసె. నీవు చేసినపురాకృతపుణ్యంబులు ఫలించె; నింక నొండు తలంపకుము; మీయిద్దఱయుద్యోగంబు శీఘ్రంబుగ సఫలం బయ్యెడు మని పలికి తగు తెఱంగున నక్కుమారి వీడుకొని మందవెడలి యథాస్థానంబున నిజరూపంబు దాల్చి విమా

నం బెక్కి గగనమార్గంబున మరలి వచ్చి తద్వృత్తాంతం
బంతయు సవిస్తరంబుగాఁ గృష్ణునకు విన్నవించి వెండియు
నిట్లనియె. 103

సీ. ప్రాణముల్ గనుపట్టు । మాణిక్యపుత్రియో
నడయాడ నేర్చిన । నవ్యలతయొ
లావణ్యరసము బా । లాకూపమొందెనో
మాటాడనేర్చిన । మరునిశరమొ
సిరిపట్టి విజయల । క్ష్మీకళాగర్వమో
యజుసృష్టివిద్యార । హస్యగతియొ
భావజుమంత్రాధి । దేవతయో జగ
ద్విదితసంమోహన । విద్యపెంపొ

తే. కల్కిరాయంచయో చంప । కప్రసూన
మాలికయొ యంచుఁ దలఁచి నా । మనములోన
నరుదువడి కంటిఁ దద్రూప । మంబుజాక్ష
రాధసరి లేదు సతి జగ । త్త్రియము నందు. 104

వ. అదియునుంగాక నిన్ను వినుకలిం దగిలినయది మొదలు,

మ. మరులావణ్యకళామహత్త్వములు యు । ష్మద్విభ్రమశ్రీలలోఁ
బరమాణ్వంశము నీపదాబ్జనఖశో । భం బోలఁడా చంద్రుఁడం
చరవిందానన నీవిలాసములు చి । త్తాంభోజమం దెప్డు సం
స్మరియించున్ గవగూడు వేడుకలఁ గృ । ష్ణా! వల్లవీవల్లభా!

శా. పువ్వుం బోణి యశోదవా రసుతు భావోన్మాదమే యేమనన్ నవ్వుం బోవ్వగఁ గప్పురంబిడుచుఁ బ్రేమందీసి గంధద్రవం బవ్వారిన్ మెయినిండ మెత్తియును జల్లార్పంగ లేఁడన్న చో నవ్వామాక్షికిఁ దాప మేమనఁగఁ గృష్ణా! వల్లవీవల్లభా!

వ. అని తదవస్థావిశేషంబు విన్నవించి తత్ప్రసాదంబు వడసి భారతీదేవి బ్రహ్మలోకంబునకుం జనియెఁ గృష్ణుండును దద్వచనంబులఁ గొంత యూఱడిల్లి సమయంబు వేచి యుండె నంత. 108

గీ. ప్రాణవల్లభ సత్కథాకర్ణనము నందుఁ
దెఱవ హృదయాంబుజాతంబు దేలి తేలి
నిగుడు వాంఛాతరంగముల్ నింగి ముట్ట
మోహరసపూరములలోన మునిఁగె నపుడు. 109

ఉ. అక్షయబాణతూణధరుఁడై విజయుండయి సవ్యసాచియై యక్షవధన్వి రాధహృదయం బదరంటఁగ నేయఁజొచ్చెఁ బ్రత్యక్షముగాఁగ డాకొని మరుద్దాలి గుణధ్వని సోడుముట్టఁగా నక్షుభితోగ్రకోకిలభటోరభటుల్ చెలఁగ న్మహోద్ధతిన్.

ఉ. నవ్వులు మాలె విచ్చె వదనంబు వికాసము గన్నుఁగోనల న్నవ్వపుఁజూపుగుంటువడెఁ మానెఁదనుద్యుతి వేఁడియూరుపుల్ నివ్వటిలెం గపోలయుగళిం దెలుపెక్కెఁ గృశించె నంగముల్ పువ్వులవిల్తు బారిఁబడి పొక్కెడు నమ్మదకీరవాణికిన్.

క. తరుణికిఁ గళ దినమయ్యెన్
బరికింప దినంబు నొక్కపక్షం బయ్యెన్
మఱి పక్షం బేఁడయ్యెను
గర మరుదుగ నేఁడు బ్రహ్మకల్పం బయ్యెన్. 112

శా. నాఁడు న్నాఁటి కవస్థ లెక్కుమదిలోనం గోర్కు లంతంతకున్
గూడం ద్రోయుచు నివ్వెఱం దగిలి దృగ్గోళంబుల న్వాఁడిసీ
రోడన్ వాడినమోముతో డహృదయంబూటాడ వేధించుపూ
బోఁడిన్ రాధికఁ జూచి నెచ్చెలులు నేర్పుల్మీఱ బోధింపఁగన్.

క. తలఁచి తమలోన నిట్లని
రలివేణిన్ ముగ్ధ దీనినారామములో
పలికి నెలయించి క్రీడల
మలయుచు నీచింతఁ గొంత మాన్పద మనుచున్. 114

క. పల్లవసుమనః ఫలసం
పల్లలితము నన్యపుష్టమధురకీర
ప్రోల్లాసమునై మన దృ
గ్వల్లుల కింపొసఁగుఁ బ్రమదవనము మృగాక్షీ! 115

వ. అని యెలయించుకొని పోయి యుద్యానంబుఁ బ్రవేశించి
రప్పుడు. 116

సీ. రాజీవభవుఁ డహోరాత్రంబు నొక్కంత
సేసి తూఁపఁగ నిడ్డ త్రాసనంగ

విరహిణీవిరహుల వ్రీడాభిమానము
దొలఁగించి కవగూర్చు చెలియనంగఁ
గోకిలశుకచంచరీకబృందములకు
లబ్ధమైన తపఃఫలమ్మనంగఁ
త్రిజగతీవిజయసిద్ధికి సమ్ముఖుండైన
కంతుయాత్రాలగ్న కాలమనఁగ

తే. మిహిరశశిమండలములకు మెఱుఁగు లిడుచు
సకల దిఙ్మండలములఁ బ్రసాదలక్ష్మి
నెలవు కొలుపుచు సర్వజీవులును వేడ్క-
నుల్లసిల్లంగ వచ్చె మధూత్సవంబు. 117

గీ. యోగబలమునఁ గర్మంబు లూడ్చి పొల్చు
పరమయోగీంద్రవరులకుఁ బాటియగుచుఁ
గ్రమముతోడఁ బురాణపత్త్రములు రాల
నవనిజంబులు వొల్చె వనాంతరమున. 118

క. హరి దూఱనేసి రక్తము
దొరఁగెడు నస్త్రముల మన్మథుఁడు రాధిక రా
కరయుచు నీరార్చెడుగతిఁ
గరవాఁడి చిగుళ్ళు మెఱసెఁ గాననవీథిన్. 119

క. కుసుమజ్యోతిర్జాలక
కిసలయరాగప్రభావి కీర్ణాంబరమై

పొసఁగె వనపఙ్క్తి ద్విజరా
జసమాశ్రిత యగుచుఁ జరమసంధ్యయుఁ బోలెన్. 120

చ. ఉరుకుచహేమకుంభముల నూఁదికృశోదరిగాఁగిలించినన్
గురవకధారుణీరుహము కోరకకంటకపంక్తులన్ మరం
దరసపరంపరాశ్రుజలధారలఁదేలెఁ గృతాపరాధియై
చిరసమయంబు వాసి కవచేరినవేడుకకాని కైవడిన్. 121

క. నారీమణులు గటాక్ష సు
ధారసము వసంతకేళిఁ దనపైఁ జిమ్మన్
వారిపయిఁ దిరుగఁ బ్రియుగతిఁ
గోరి తిలకతరువు గురిసెఁ గుసుమరసంబుల్. 122

క. రాకేందువదన పదము ల
శోకవికాసప్రసాద సుముఖములు క్రియా
నీకముల కగుట యరుదె య
శోకము వికసించె నడుగు సోఁకినమాత్రన్. 123

క. వలరాచవానికేళిన్
గులికెడు మణితముల వెట్టిగొనరే దయితుల్
కలవాణుల వెడవెడ పలు
కులసైతము తత్క్షణంబ గోఁగులు పూచెన్. 124

క. ననిచె నవసిందువారము
వనితలు నిశ్వాసగంధవాయువు లొసఁగన్

మొనసి యళు లూర్పుఁ దావులు
గొనుచుం బూదావిఁ గొనుచుఁ గ్రొవ్వులఁదేలన్. 125

క. నవకనకచందనద్రుమ
మువిదలు కరవాఁడిగోళ్ళ నొత్తినఁ బూచెన్
బువ్వువిలుతుఁ డేయుతూఁపులు
తవిలి విరహిజొమ్ము దాఁకి తల వెడలుగతిన్. 126

క. సుందరి ముట్టిన నవమా
కందము సుమనస్తబక విగళితమరంద
స్యందమునఁ దోఁగెఁ బురుషులు
కందర్పాతురులు కళలఁ గరఁగుట లరుదే. 127

క. కేళిన్ గురుకుచపాళిక
లాలతు లొనరింప సంకేతాళియు రసధా
రాళలసత్కుసుమస్తబ
కాళపరాగాళియును బ్రియాళువు దనరెన్. 128

గీ. అధరమధురసుధాపూర మహరహంబుఁ
గ్రోలువారివికాసంబు లేల చెప్ప
భామ గండూషహేలమైఁ బడ్డమాత్రఁ
బొగడఁ జిత్రంబుగాఁ బూచెఁ బొగడమ్రాను. 129

గీ. ననిచి వికసించి పొదలెఁ బున్నాగతరువు
బింబికాధర దను ముద్దుపెట్టుకొన్న

నదియు విరహాగ్ని శోషించి నట్టిప్రియునిఁ
దెప్పిటిలఁ జేయునమృతంపు లప్పగాదె. 130

సీ. సిద్ధయోగీంద్రుని చెలువున నొకచోటఁ
జాలఁబుప్పొడిభూతి చల్లిచల్లి
మద్యపానాసక్తు మాడ్కి నొకచోటఁ
గుసుమరసంబులు గ్రోలి గ్రోలి
పాటచ్చరునిభంగి బరిమాటి యొకచోటఁ
జులుకనఁ బొదరిండ్లఁ జొచ్చి చొచ్చి
సూత్రధారివిధాన సొంపార నొకచోటఁ
గలికితీఁగెలకాట గఱపి కఱపి

తే. పాంథుకైవడి డస్సి భూపాలుకరణి
దిశలఁ గైకొని తలవరి తెఱఁగుమీఱ
నన్నిచోటుల నరసి పుష్పాస్త్రుపగిదిఁ
దనువు దోఁపక వనమారుతంబు వొలసె. 131

సీ. సూర్యేందురశ్ములఁ జొరనీక జొంపము
లీనిటి కెంపారెడు లేఁ జిగుళ్ళఁ
జిగుళులు గబళించి పొగరుగుత్తుకలతోఁ
గొమ్మల నెలిఁగించు కోకిలములఁ
గోకిలమ్ములఁ గ్రమ్మ కొనితేనెలానఁబూ
గుత్తులపైనాడు కొదమతేంట్లఁ -

దేఁటిమొత్తములకుఁ - దెఱపీక పరిపక్వ
ఫలరసంబులఁగ్రోలు - చిలుకమూఁకఁ

తే. జిలుకఱెక్కలఁ బుప్పొడుల్ - చిలికిపువ్వు
గుత్తు లెగవైచి చిగురుటా-కులు విదిర్చి
కలయఁ దిక్కులఁ దావులు - గ్రమ్మకొలుపు
తెమ్మెరల నొప్పెఁ జూతపో-తమ్ము లెల్ల. 132

ఉ. మీఱినకీరపోతములు - మేలిమిపండుల వాఁడిచంచులం
జీరిన జాఱి తద్రసము - శీకరపఙ్క్తులు దూలి నల్గడన్
జోరున గుర్వఁ దొల్కరని - చూచి మదోత్కటనీలకంఠముల్
గేరుచుఁ దాండవించి తిల-కించు రసాలసమీపభూములన్.

ఉ. కోరికమల్లికాకుసుమ-కోరకహారయు భృంగవేణికా
భారయు మంజరీస్తనయుఁ - బల్లవపాణియునై విలాస మే
పార వనాధిదేవత ఝు-షాంకునకీయ ధరించినట్టి వె
య్యారతులో యనంగఁ జను - హాటకచంపకకోరకావళుల్.

క. ఘనఫలభారంబున జ
క్కని నవఫలపూరలతిక - గనుపడె నునుగా
డ్పునఁ దూఁగాడుచుఁ గుంభ
స్తనభరమున విఱ్ఱవీఁగు - జవ్వనివోలెన్. 135

గీ. అగ్రసంస్థితమధుకరం - బగుచు నేత్ర
మోహనస్థితి నగిసెపూ - మొగ్గయొప్పె

నీలమాణిక్యమునఁ గుప్పె నిలిపినట్టి
కంతు వెండోఱ వంకిణి కత్తివోలె. 136

గీ. చంచుపుటమునఁ గోయిల సగము గఱచి
పట్టనొప్పారె సహకార పల్లవంబు
పూని మధురుక్మకారుండు సానఁబట్ట
యంత్రమున నిడ్డ మదనుని యలుఁగువోలె. 137

వ. మఱియు నచ్చటచ్చటఁ గన్నిచ్చవచ్చినపచ్చిక విచ్చలవిడిఁ మేసి నిర్మలంబులైన యాలవాలపయఃపూరంబులం గ్రోలి క్రొవ్వి యథేచ్ఛంబుగా నిధువనక్రీడ లాచరించి పారవశ్యంబునుం బొంది సుస్నేహానుబంధంబునం బాయక యొండొంటికి నఱ్ఱునం జేర్చియున్న మృగీమృగంబులచేత నొప్పుచు నీరంధ్రంబులైనపూఁ బొదరిండ్లను బువ్వుఁ దేనెలం దేలి తూలి చంచరీకజాలంబు పుష్కరపదం బాచ్ఛాదించినం జూచి కారుకాలంబని చెలంగి యంగభవసామంతబిరుద చిత్రాతపత్త్రంబులు గ్రందుకొనె ననుటకుఁ దావలంబైన సముద్ధృతకలాపజాలంబు సొంపారఁ గేరుచుఁ దాండవంబులు చూపుమదశిఖండిపోతంబుల కేకాస్వనంబులును దరుకోటరక్రోడంబులు నీడంబులు సేసికొని నలుదిక్కులం బక్వంబులైనఫలంబులు తినివచ్చి మదించి స్వరాళంబునఁ గరాళింపుచు మరుసాహిణంబు లివియని తెలుపుకలికి చిలుకమూఁకలును గలహంససారసక్రౌంచాదిశకుంత సంత

తులు బిసకిసలయచ్ఛేదామోదకషాయకంఠంబుల నుత్కం
ఠం జెలంగుచుఁ జేయుమదకలకేంక్రియారవంబులుం గలిగి
వికచకమలకహ్లారషండమండితంబులై యగాధపాథఃపూరం
బులైన కాసారంబులను సముత్తుంగ విలసితకాదంబినీజాలం
బు లగుమణిమయ కేళీశైలంబులను నలరి వైకుంఠనగరం
బునుం బోలె హరిప్రియాస్పదంబును, బ్రహ్మపదంబునుం
బోలెఁ బున్నాగవర్ణితంబును, శంకరు వామభాగంబునుంబో
లె హైమవతీమనోజ్ఞంబును, స్వర్గలోకంబునుంబోలె నైరా
వతశోభితంబు, నప్సరోభువనంబునుంబోలె రంభావిలసితం
బును, శబ్దశాస్త్రంబునుంబోలెఁ ద్రిలింగసంగతంబును, వార
వనితాకుచమండలంబునుంబోలెఁ గరజలేఖాలంకృతంబును
నై విడంబించు నయ్యారామంబున నవ్వధూమణులు రాధా
కన్యహృదయంబున కింపు పుట్టింపఁ బుష్పాపచయక్రీడకీ
లొనర్పం దొడంగిరి. 138

క. కొందఱు పొన్నలుఁ గొందఱు
కుందకములు చంపకములుఁ గొందఱు మల్లెల్
కొందఱు కోసిరి పైమక
రందస్యందంబునుం బరాగముఁ దొరుఁగన్. 193

గీ. తొయ్య లొక్కతె తనచన్నుఁ దోయిఁ గప్పు
కొన్నపుష్పాళ్లు పూఁదేనె గ్రొచ్చిపాఱఁ
గొమ్మ చేపట్టి పొన్నలు గోయ నొప్పె
నించువిలుకాని కేలి మత్తేభ మనఁగ. 140

ఉ. నెయ్యపుఁబోటికత్తియలు నేర్పునఁ గన్గొఱఁ గొక్కపూఁబొదన్
బయ్యెద జాఱ వేగమునఁ బైదలి యోర్తు ప్రసూనసంహతిన్
గొయ్యఁగ దానిచన్నులొక కోమలి దాఁబుపుగుత్తులంచునో
యొయ్యన వచ్చి పట్టెనది యుల్కిపడన్ దన రెండుచేతులన్.

గీ. పైఁటమెడలి యురోజముల్ బయలువడఁగఁ
గోలన నొకకొమ్మ తామరల్ గోయుచుండఁ
గలికి తరఁగల నీఁదు జక్కవలు వోదివెఁ
దమకొలము వింత లని వచ్చి తత్కుచములు. 142

క. బాలామణు లొక్కొకయెడ
నాలోలైలాలతాగతాళులు నలి నే
చ్ఛాలీలల వ్రాలఁగఁ గే
ల్దోలు చలాచలత దాఁపుదురు పయ్యెదలన్. 143

గీ. క్రొత్తగురివెందపూసల గుబ్బసరము
రాధకుచములఁ గూర్చె గారాన నొకతె
యది దనర్చె సువర్ణశృంగాంతరమునఁ
జాల నొప్పారు ధాతునిర్ఝరము వోలె. 144

గీ. ఆరఁ బండిన దొండపం డనుచుఁ బ్రేమఁ
జిలుక గఱచె నొకర్తు కెంజిగురు మోవి
దానిఁ జోపఁగ లేమావితలిరు లనుచు
కొలుకఁ గరములఁ బఱతెంచెఁ గోకిలములు. 145

సీ. కొలఁకులక్రేవ నంచల దూరమునఁ జూచి
చెలు లని యొకయింతి చేయివీచెఁ
గాంత యొక్కతె బోటికత్తె చీఱినఁ గల
కంఠకూజిత మని కదలదయ్యె
బాలిక యొకతె తమాలగుచ్ఛంబు పై
నలిపంక్తి సఖురు లనుచు నవ్వె
నలరు లేఁదీఁగె వయస్య యనుచు నొక్క
చెలువ యొయ్యొయ్యనఁ జేరఁబోయె

తే. ముదిత యొక్కతె మోదుగుమొగ్గఁ గాంచి
యెలమిఁ జిలుకని దొండపం డిడఁగఁ జనియె
గమనవాగ్వక్రతావిభ్రమములు ముఖము
నీడుపడఁ దోఁటలోఁ గ్రీడ లాడునెడల. 146

సీ. గురివెందపూవుఁ బంధురుల దట్టనిచల్ల
నీడల నలపాఱి నిలిచి నిలిచి
పొదరిండ్ల కెలఁకులఁ బొంచి మయూరపో
తంబులఁ బట్టంగఁ దారి తారి
మృగశాబములఁ బట్టి తగిలి యన్యోన్యదృ
గ్విలసనస్ఫురణల వెదకి వెదకి
కర్పూరకదళులఁ గర్పూరఖండముల్
పొడిసేసి మైనిండఁ బూసిపూసి

తే. చిలుకలకు ముద్దు పలుకులు జెప్పిచెప్పి
యింపువలిగాడ్పులకు నెదు రెక్కి యెక్కి
పికములకు మావిచిగురాకు వెట్టి పెట్టి
ప్రమదవనకేళి సలిపిరి పద్మముఖులు. 147

వ. మఱియు నవ్వాలుఁగంటు లంటువాయక బోటికత్తె మెత్త
మెత్తన నేలాటలకు నూలుకొలిపి యంచెలంచలై కలికిరా
యంచలక్రించు తెలుంగుమ్రోఁతలకు నూఁతలై వలుఁదపి
ఱుందుల ప్రేఁగునఁ దూఁగక జడనుపడునడల నల్లనల్లన
మ్రోయురవళియందియల మొరపంబులు మాఱుమాటి కొ
య్యారంపు నయ్యాటలవలన జాఱుకట్టుకొంగు చెఱంగుల
రారాపునం జేసి చెలంగు కట్టనిమాసికంబుల మొలకట్టుచ
ప్పుళ్ల కుప్పరం బెగసి సిరిపట్టి బింకపుఁ జన్నులుగలమగటి
మిచాటి చెప్పచొప్పునఁ గ్రొవ్విరిదండలకు దండలై గ్రాలు
వాలికనిడుదజడపాల్లెంబులు సరపూలయెత్తునం బెనంగొని
చిలుకవారువంబులవానికిం బలువన్నె కుచ్చులచ్చుకట్టి
కట్టాయితంబు సేసి కానుకవెట్టిన నల్లపట్టు కీలుసమ్మెట
లనులాగున బాగుమీఱు వాలికమీనుపిల్లల నుల్లసం
బాడు. నిడువాలుఁ జూపులు కాటుకకనుచాయలం బెసర
నలువంకల వలరాచవానిగెల్పుఁ దెల్పుటకై కలువఱేకులు
గలయఁగ్రుచ్చి కట్టిన వెలిదమ్మిఱేకుల కలువడంబుల పగిది
నిగుడుచుండఁ బసిండికుండలచందంబున నందంబులైనమె

ఱుంగుఁ జన్నులు క్రొత్తముత్యాలపేరులం గూడి వలపేని చేతిప్రోదులం బెరిఁగి క్రొన్నవ్వల నివ్వటిల్లుచుఁ గవ వాయక పాయనిమచ్చికల విచ్చలవిడి నింపుసొంపులఁ గలసి యలసి దప్పిదెప్పరంబుగ వలసినట్టవెలిదమ్మిదూండ్లప్పళించు కలికి నలజక్కవలకూపున నేపుఁజూప నేలఁ దొలంకు తొడవులై మేనిమెఱుంగులు తుఱంగలిగొని బంగరుతళుకులు వెదచల్లి, బెల్లుబ్బి గబ్బిజవ్వనంబున నదటెక్కి యెక్కడఁ జూచినఁ దారయై నిలువుటద్దంబులు వేర్చినట్లు నిండుచందురుల నచ్చొత్తిన తెఱంగున నెయ్యోడలం దెలిమొగంబులు వెలుంగుచుం డఁ దీఁగమెఱుంగులకైవడి లేళ్లపిండుచందంబున నమిలికొదమలపగిది రాయంచలమురిపెంబున మగకంపు లేక తమ యింపున నీరంబుల డాఁగుచుఁ దీఁగ యుయ్యాలలనూఁగుచుఁ బూఁదేనె లాని చొక్కుచు లేమావికొమ్మ లెక్కుచుఁ బువ్వుగుత్తుల నొండొరుల వ్రేయుచు మొఱంగి డాఁగినచెలులరోయుచుఁ జెంగలువబావులఁ దేలుచు నిసుకతిప్పల నుప్పరంబులందూలుచు వింతవింతవాలకంబుల చెన్నులాని యాడుచు యశోద (తనయు) మదిం బాయుచుఁ బెక్కుజాడలం దగిలినలాగున మెలంగుచుండిరి. తదనంతరంబ

ఉ. పాటలగంధు లిట్లు బహుభంగుల న వ్వనవాటిలోనమే
లాటలకెల్లఁ దార్చిన వరియస్య మనఃపరితాపభార మె
ప్పాట నడంగఁ బోవక యపథ్యము సోఁకిన రోగము న్బలెన్
గాటము చూపఁ జిత్రరసకంపితలై భయ మందిరందఱున్.

వ. ఇట్లగ్గలం బగు వేఁడిమి బెగ్గలపడిన చెలులం జూచి. 150

క. వారలలో నొకప్రౌఢచ
కోరాయతనేత్ర వలికె గురుకుచ మదినిం
దారినవగకున్ మారుఁడు
గారణ మటుగాన వలయుఁ గంతుని నోమన్. 151

చ. కలువల బావి కేవ వలిగాడ్పులు చల్లనితుంపురుల్ పయిన్
జిలుకఁగ నేపునం బెరిఁగి చెన్నెస లారెడు లేఁతమామిడిం
గలయఁబెనంగఁ బ్రబ్బుకొని కమ్మని తేనెలుచిల్లుతీఁగెయి
ల్లలరులతోఁ పులొనిజలయాత్రగృహంబునుబోలెనొప్పెడిన్.

చ. ఇది కనుఁగొంటిరమ్మ! మనమిందఱ మిందువసించి ప్రీతి న
మ్మదవతి బుజ్జగింపుచును మన్మథపూజకు నైనవాని నే
ర్పొదవఁగఁగూడఁబెట్టి వ్రతమొప్పఁగఁజేయుచు వేఁడుకొందమా
మ్మదనునిఁ బ్రార్థితుం డెచటమన్న నసేయకమాననేర్చునే.

వ. అనినఁ జెలిపలుకులు చెవులకుఁ జవులు చిలికిన నుల్లంబున
సంతసిల్లి సకలహృదయధైర్యకంచుకంబులు చించి చెండాడి
మరలి వచ్చి పచ్చవిలుకానితూణీరంబు చొచ్చు నమోఘా
స్త్రజాలంబునుం బోలె లీలావతు లా లతాగృహంబుఁ
బ్రవేశించి. 154

ఉ. సజ్జకమైనవాసనలు చల్లెడుజాడలఁ దేంట్లు వాఱ న
వ్వజ్జనయేఁగియయ్యళులఁ బాయగఁజోపుచుఁ బువ్వుదొప్పలన్
గొజ్జఁగనీరు దెచ్చె నొకకోమలి సీధురసంబుఁగొంచుఁ దా
వెజ్జయి రాధహృజ్జ్వరముఁ విప్పఁగ వచ్చిన దానికై వడిన్.

చ. నలినమృణాలజాలములు నాతి గొలంకునఁ గొంచువచ్చులా
గలవడెఁ బద్మవాసిని ప్రయత్నముతోడ నిజాంశభేదమై
యిలఁ జరియించు రాధ మదినెనినచిత్తజవహ్నిఁ ద్రోయున
వ్వలినునుగాడ్పుఁ గ్రోలఁగొని వచ్చు ఫణీశ్వరబాలలోయనన్.

చ. మఘువయొకర్తు దెచ్చెఁ జెలి మర్మము నొవ్వఁగఁ జూచుచుండఁగా
నగునె యటంచుఁ గోపమున నంగజపూవిలునారిఁ ద్రెంచి యొ
ప్పుగఁ గొనివచ్చెనో యనెడి పోల్కి సఖీజననేత్రపర్వమై
తగ నొకనల్లగల్వపువుదండ యమర్చె ససంభ్రమంబుగన్.

ఉ. నారి యొకర్తు కప్రపుటనంటులు చొచ్చి తదీయగర్భక
ర్పూరరజఃప్రకాండములు ప్రోవులుగాఁ గొని తెచ్చి పోసె న
న్నీరజవల్లభుం డనఁగ నెచ్చెలి[1] యొండొకనోము నోచునో
ధీరత నంచుఁ బట్టుకొని దెచ్చిన వెన్నెలముక్కలోయనన్.

ఉ. గాదిలిబోటి యోర్తు నవకంబగు పుప్పొడిఁ గొంచువచ్చె న
య్యాదిమలక్ష్మి రాధఁ గుసుమాయుధభూతము సోఁకియున్నదం
చాపటు సిద్ధయోగిని ప్రయత్నముతో వరమంత్రభూతి సం
పాదనఁ జేసి తెచ్చె నను భావము దోఁపుచుచుండఁ జయ్యనన్. 160

వ. మఱియుం దగినపదార్థంబు లొడఁగూర్చుకొని.

క. విరివియు నందము నగు న
వ్విరియలు కస్తూరి నల్కి విరులలికి ప్రాఁకెం
బొరి నయ్యెడ నెడఁ గర్పూ
రరజంబు విదిర్చె నొక్క రామామణి దాన్. 161

---

1. "నొండొక గ్రాము నొంచు నో" అనిన సరిపడును

శా. గంభీరద్విపయాన యోర్తు విలసత్కర్పూరరంభాతరు
స్తంభంబు ల్నలుదిక్కులన్నిలిపెఁబుష్పస్రగ్వితానంబు సం
రంభం బొప్పఁగఁగట్టె నొక్కచెలి సారంగాక్షి యొక్కర్తె హే
మాంభోజంబులఁబూర్ణకుంభములడాయం బెట్టెనొండొంటికిన్.

ఉ. ఇందునిభాస్య యొక్కతె నవేందుశిలామణివేదికాగ్ర సీ
మం దననేర్పునన్ మెఱసి మచ్చిక నెచ్చెలులెల్లఁజూచి యు
ర్థిం దగునంచు మెచ్చ వెయిరేకుల తామరపువ్వు కుంకుమన్
బొందుగ వ్రాసియన్నడుమఁ బువ్వులగద్దియఁబెట్టె సొంపుగాన్

సీ. ఆపుష్పపీఠమధ్యప్రదేశమున నం
దంపుఁ బసిండి కెందమ్మిఱేకు
పఱచి యాఱేకుపైఁ బరమకళ్యాణదం
పతులైన రతిమనోభవుల వ్రాసి
వారికి మకుటమంజీరాది మణిభూష
ణములుగాఁ దగినవర్ణములు నించి
పుష్పధనుర్బాణములు దత్కరంబుల
విలిఖించి యయ్యిరుగెలఁకులందుఁ

తే. బ్రీతి మధుపుల నిల్పి సంప్రీతితోడ
హస్తకౌశలవిభవ మేపార నొక్క
ప్రోడముద్దియ చూపె నప్పొలఁతిగమికి
నఖిలనయనాభిరామలీలాకరముగ. 164

చ. ఎలపువుఁబోణి యొక్కరిత యొఱ్ఱనితామరమొగ్గ గుబ్బగా
నలవడ నించి చూతలతికాంకురదండ మమర్చి తెచ్చె నే
ర్పలవడ నొక్కపువ్వుఁబోఁడుక గమ్మ్యోడఁగుఁదకకోరకావళుల్
నెలకొని మూర్తికాంశువులనింపునవెన్నెలవెల్లిముంపఁగాఁ.

సీ. విశదంబు లగుగుఁడికెవెంద వింజామరల్
దాల్చి రిద్దఱు సుధాధామముఖులు
తరుణరంభాగర్భదళతాళవృంతంబు
ధరియించె నొకతటి తరళనేత్ర
వింతచందంబున విరచించి చెంగల్వ
పూఁబావఁజో డొక్కపొలఁతి వెట్టెఁ
గాశ్మీరమృగమద ఘనసారచందన
కలితపాత్రిక యొక్కకాంత పూనెఁ

ఆ. బువ్వఁదేనె జున్నుఁ బూరించి బంగారు
కోర లోలి నిల్పెఁ గొమ్మ యొకతె
శర్కరేందుమిళిత చారు ఫలము లొక్క
రమణి వెండిపళ్లెరములనించె. 166

గీ. వీనులకుఁ జల్లఁగా నొక్క వెలఁది పాడెఁ
గాంతయొక్కతె కరతాళగతులు చూపె
నంగవిన్యాసలీలల హస్తగతుల
మించి నటియించె నొక మించు మెఱుఁగులాఁడి. 167

వ. ఇట్లుందఱు నన్నివిధంబుల సేవింప నంను ముకుందిని యను
ప్రియసఖి షోడశోపచారంబుల భక్తితాత్పర్య సంపన్నంబు
గాఁ గామదేవు నర్చించి కోకిలశుకచంచరీకభూతంబులకు
బలి చల్లి యంజలిపుటంబునఁ బుష్పంబు లిడుకొని, 168

క. మదిరాక్షీ[1] మంత్రకళా
సదనాయ మనోభవాయ సంసారసుఖా
భ్యుదయనిదానాయ నమో
మదనాయ యటంచుఁ జెలి సమర్పించె విరుల్. 169

చ. అరుణపయోజమధ్యమున నంగరుచుల్ నవకుంకుమప్రభాం
కురముల నీనఁ బుష్పమయకుండలహారకిరీటకర్ణప
త్త్రిరుచిరమూర్తిఁ దోడరతిరాముకుఁ బ్రేమలుచూపుచుండుభా
సురతరపుష్పచాపశరశోభితహస్తునిఁ గొల్తు మన్మథున్.

వ. అనితదేకధ్యానంబుననమస్కరించియయ్యబలచేమ్రొక్కించి.

గీ. తరుణి రక్షింపుమనిపల్కి తత్ప్రసాద
మెలమి రాధికశిరమున నిలిపి యింకఁ
జంచలింపకు మరుఁడు ప్రసన్నుఁడయ్యె
ననుచు బోధింపుచున్న యయ్యవసరమున. 172

క. ఆ పువ్వుటింటిమాటునఁ
బాపపుఁ బికమొకటి చిగురుఁబండెఁడు దిని క్రొ

(1) సమంత్రి ...(మూ)

వ్వేపారఁ బ్రియముఁ జలముం
జూపుచు నెలిఁగించెఁ గర్ణశూలము గాఁగన్. 173

క. వీను లను స్రుక్స్రవంబుల
నా నినదం బాజ్యధారయై పడ రాధా
మానసవేదీమధ్య
స్థానంబున నెగసె నసమశరదహనార్చుల్. 174

వ. నిర్ఘాతపాతంబునుం బోని యకూజితంబున గోరుచుట్టు
మీఁది రోఁకటిపోటుచందంబునఁ గొందలపడు డెందంబు
ననున్న సంభ్రమంబునం దోడ్కొని యమ్మా! కలంగం
బాఱకుమీ యని పలుకుచు నక్కునం జేర్చుకొని తెచ్చి
యొయ్యనఁ బల్లవశయ్య నొందించి మందలింపుచున్న ము
కుందిని యిట్లనియె. 175

మ. కలపుంస్కోకిల గర్వదుర్వహకుహూకారానుకారి స్మరా
స్ఖలితప్రాభవదోర్విశంకట ధనుష్టంకారఝుంకారముల్
గలఁచెం గోమలిఁ గర్ణశూలములపైఁ గందాఁక [1]యీశబ్దకో
కిల మాధాహ్వయమైనఁగాక విరహుల్ లీఢ్వాటునుం బాతురే.

క. ప్రతితరువున నవకిసలయ
తతుల న్వ్రాలిఖాపుఁ డేఁగి తరుణులు రాను
క్షితిపతిఁ దొల్లిటి శాపో
ద్గతిఁ దలఁచి పోకాలిపోవుఁ గాని పికంబుల్. 177

---

(1) నిశబ్దకో... మాధాం హ్వా (మూ)

క. నలువంకల సంపెంగల
కలువడములు కాంతలార! కట్టుఁడు దానన్
బొలుపఱ తుమ్మెదమూఁకలు
తలపీడులఁ బాఱుఁ గాని తల్లడపడుచున్ 178

ఉ. ఏమిటి నోములమ్మ! మనసెంత పెనంగిన శాంతిఁబొందునే
కామునిఁజూచి బూచియని కంపమునొందఁగ నింతపుట్టెనిం
కేమనవచ్చుఁ గ్రూరజనుఁ డెవ్వనికైనను మేలొనర్చునే
భూమిఁ గృతఘ్నుతం గుటిలబుద్ధులు కీడెయొనర్తురిగాకిలన్.

వ. అని మన్మథు నుద్దేశించి, 180

చ. కటకట యించుకేని నుపకార మెఱుఁగవు దీనుఁదింటి వీ
విటువలె నింతి నేఁచఁ దగునే తరళాక్షికటాక్షవీక్షలు
త్కటనిశితాశుగావళులుగాఁ గొని లోకములెల్లఁ బూనిగె
ల్చుట విదితంబుగుట్టుచెడుఁజూమఱునాఁడికనీకుమన్మథా.

ఉ. ఏల రతీశ ! చాలు శమియింపుముపౌరుష మాఁడువారిపై
మేలగునయ్య! లోకమునమెత్తనిచోటికిఁ [2]గుంచెగాక కు
ద్దాలము వాడనొప్పునె మనంబునఁ బేర్చినరౌద్రిమక్రియా
శాలివి ఫాలలోచనుని సన్నిధి నేమయితో యెఱుంగవే.

మ. సిరిపుత్రుండని తేజమిచ్చి జగతిన్ శృంగార సంపత్కళా
కరరూపంబున నిల్పి స్త్రీపురుష సౌఖ్యప్రాప్తికి న్మూలమై

(2) చోటిక్కి... ఒడి గాక కుద్దాలము వేడికోర్చునె (మూ)

పరఁగంజేసి యయోయనాథవనితా ప్రాణాపహారక్రియా
పరుఁగావించెనెనిన్నుదైవముమది భావింపనాత్మోద్భవా!

సీ. నీవికారముగాదె నిర్జరాధిపుఁ గోడి
గాఁ జేసహల్యను గల్లువఱచె
నీ దుర్మదముగాదె నీరజాప్తుని ధృతి
గలఁచి మానిపెఁ గుంతికన్నెతనము
నీకోడిగముగాదె నిటలలోచను దిగం
బరుఁజేసి హాని దాంపత్య మెడపె
నీచేఁతగాదె వెన్నెలరాజు మదిఁగందఁ
జేసి తారాదేవి సిగ్గుమాల్చె

తే. నెందఱెందఱు మగవారలెందఱెంద
ఱాఁడువారలు నీచేతఁ బోఁడి చెడరు?
యౌవనోన్మాద [1]పూర్ణగర్వాంధు లెందు
బుణ్యపాపంబు [2]లెఱఁతురే పుష్పబాణ. 184

క. బహుగతుల నీ వనాథల
నహహా! కారించి రూపఱమణఁచెద వఘముల్
మహిలోఁ బాపం షాపే
న హన్యతే యనెడు లక్షణంబున మదనా. 185

---

(1) చౌర్య (మూ)

(2) అరతురే? చేయునకు చేతురే అనినట్లు అరయునకు అరతురే అని కవిప్రయోగించి యుండును. చేతున్ అని ప్రయోగించుట యీకవికివాడుక.

వ. అని నిందించి. 186

గీ. అనిలవశమునఁ జేసి యాగ్నేయాగ్నిశిఖల
నుప్పర మెగసివచ్చిన నిప్పువోలెఁ
బొడుపుగుబ్బలిఁ బొడతెంచు పూర్ణచంద్ర
మండలమునకు బెగ్గిలు మగువఁ జూచి 187

ఉ. రూపము లేకయుండిన మరుండఁట చక్కెర విల్లుచేసి పూఁ
దూఁపులు తేఁటినారిఁ దొడితొక్కని చోటులు ద్రొక్కుమానసం
బేపఱ నేసెనంచుఁ జలియించెడు ముద్దులబాల యక్కటా
రూపముతోడి వేఁడిశశిరోచుల సోఁకున కోర్వఁగల్గునే. 188

ఉ. అచ్చపువెన్నెల న్నిగిడి యంగనయంగము లగ్నికీలలై
క్రచ్చఱ వెల్గఁగా ననరుగాచి కృతాంతదిగంతవాయువున్
వచ్చి సహాయ మయ్యె నిదె వర్ధిలెఁ దాపభరంబు మిక్కిలిం
జిచ్చును గాలిగూడెనఁట చెల్లరె! యేరికి నార్పవచ్చునే.

వ. అని నభోమండలంబున నదరులు గ్రక్కు చుక్కలరాజుం
గనుంగొని. 190

చ. సరవి సుధామయంబు లగు చంద్రిక లెల్లెడ నెల్లవారిపైఁ
దొరఁగఁగ శీతలప్రకృతిఁ దోఁచెడు నీవు చకోరనేత్ర పై
గరళమయాంశువు ల్నెరపి కాఁగినలోహపుముద్దరూపమై
పరఁగితిచంద్ర! నీదుమురిపంబు దయించినమోముదాఁచునే?[1]

(1) మురిపంబులు దాఁచిన మోము దాఁచునే?...(మూ)

క. నిరుపమభవదంశుపరం
పర లనునిప్పుకల వేఁగు ♦ బాంధజనుల యు
స్సురు దాఁకి కాదె మలినత
పొరసెఁ నీవిశదబింబకమున హరిణాంకా! 192

క. నిప్పులవలె నున్నాఁడవు
చెప్పం జిత్రంబు నిన్ను ♦ శివుఁ డొదల నే
చొప్పునఁ దాల్చెనొ గరళం
బొప్పుగఁ జవి గొనియె నతఁడు ♦ నుగ్రుఁడు గాఁడే 193

వ. అని యాడి యచ్చేడియ పరిమృదితమృణాలలతికయుంబోలె వాడియున్నకన్నెం జూచి సఖీజనంబులకుఁ దద్దురవస్థ యెఱింగించి యచ్చెరువందుచు నిట్లనియె. 194

గీ. పొరలుచున్నది యారాట ♦ మునఁ దపించి
కిసలయాధర వేఁపుడుకగింజ వోలెఁ
జెలువ మైపొక్కి మనచేయు ♦ చలువ లెల్ల
దహనుముఖమున నిడు నాజ్య ♦ ధార లయ్యె. 195

సీ. ఉడుగని వేఁడి నిట్టూర్పులు వడగాలిఁ
గదిసి కయ్యమునకుఁ ♦ గాలుద్రవ్వ
నడరు కంపంబున ♦ నంగవల్లిక మేఘ
సమయ తటిల్లతఁ ♦ జొకళింపఁ
జేకొన్న పాండిమఁ ♦ జెక్కుటద్దంబులు
శారదశశిలక్ష్మి ♦ జాఱఁ ద్రొక్కఁ

ఙుంఖానుపుంఖమై పొడమెడు గరుపాటు
మించి హేమంతర్తు మేలుకొలుప

తే. మలయుచెమ్మట నెమ్మోము మాచువడ్డ
తమ్మి నెలయింప దృగ్గాగ తరళదీప్తి
పల్లవంబులు మధువేళఁ బరిహసింపఁ
జూడరే యింతివెడగూపు చూపె నేఁడు. 196

వ. అని యిట్లు తనయభిప్రాయం బెఱుంగక యనుచితోపచారం
బులఁ బ్రవర్తిల్లు ముకుందినీప్రముఖచంద్రముఖులంజూచి
యా చపలలోచన యిట్లనియె. 167

క. ఈచలువల నీ మోముల
నీ చంద్రానంగ నింద నీవెడ ప్రోదిఁ
నాచిత్తభావ మాఱునె?
యా చక్రాయుధునికరుణ నందక తరుణీ. 198

సీ. కుచకుంభములమీఁద గురికొని నాఁటిన
వెడవిల్తునమ్ములు వెడలునమ్మ
తలఁపునఁ గలయంగ దరికొన్న కామజ్వరా
నలశిఖలు చల్లారునమ్మ
సూనాస్త్రభూతంబు సోఁకున నడరు కం
పమును నివ్వెఱపాటు వాయునమ్మ
కన్నుల ముసుఁగిడ్డ కంతునిమాయాంధ
తమసపటల్రకాంతి దరలునమ్మ

తే. తెలిసి నారి గోళ్లనొత్తి రాఁ । దిగువఁ డేని
శౌరి కరుణామృతము మీఁదఁ । జల్లఁ డేని
యచ్యుతుఁడు నిండుకౌఁగిట । [1]నదుమఁ డేని
గోపచంద్రుండు తనరూపుఁ । జూపఁ డేని. 199

చ. తుదపద మైనకోరికలు । తోరపుసిగ్గుల సూత్రబాధముల్
వదలుపఁగంతుడండఁగొని । వాలికచూపులఁబూవుదండ సొం
పొదవఁగ వైచి నందతన । యు న్వరియించెదు భాగ్యసంపదన్
బొదలఁగ నోఁచనైతిమది । బూనితదీయపదాంబుజంబులన్.

వ. అట్లు సిద్ధించె నేని. 201

ఉ. నీలపుమేనిక్రొమ్మెఱుఁగు । నింపులు నల్లమొయిళ్ల తండమై
వ్రాల దయాసుధారసము । వర్షముగా మురళీనినాదగ
ర్జాలలితధ్వను ల్నిగుడ । సారసనేత్రుఁడు కారుకాల మై
గ్రాలఁగ నేను జాతకము । కైవడిఁ గోర్కుల నింగి ముట్టనో.

వ. అదియునుం గాక, 203

సీ. వనమాలికయు నేను । వనమాలి వక్షస్స్థలం
బపూర్వముగా న । లంకరించి
వంశంబుతో గోప । వంశవల్లభు మోవి
జొబ్బిలు నమృతంబు । చూఱలాడి
శ్రీవత్సమట్లునే । శ్రీవత్సలాంఛను
శ్రీయంగమున నొక్క । చిహ్నానిలిపి

(1) నలువఁ డేని (మూ)

పీతాంబరము లీల ॥ పీతాంబరుని హేమ
రుచిరాంగవల్లి కాంతులఁ గప్పి
తే. వల్లవస్త్రీలు చూడఁగా ॥ వల్లవేంద్రు
నగుచు వెడయల్క వన్ని యా ॥ సతునిఁ జేసి
నామహత్త్వముఁ జూపిన ॥ నాఁడు గాక
వెఱచి పోవునె యీపువు ॥ వింటివాఁడు. 204
వ. అని యిట్లు కోరికలతోన దీనవదన యై తెప్పలతుదల నశ్రు
కణంబు లప్పళించుచు. 205
శా. అంతర్బాష్పవిలోచనాగ్రములపై ॥ నత్రాసుదైన్యంబుహ
చ్చింతాతంతువుఁ జిక్కువెట్టవగల ॥ జ్జైవంతయుం దూలిదు
ద్దాంతానంగభుజంగవక్త్రమునకుం ॥ దప్పింప రాకున్న న
న్నింతీకృష్ణుఁడు గాపఁడేకరుణ నీ ॥ పిచందము ల్చెప్పినన్. 206
వ. అని సంభ్రమోత్సాహవ్యళీకసమాకులం బగుచిత్తంబున
నుత్తలపడి యయ్యేణీలోచన ప్రాణేశ్వరుం బేర్కొని పలికి
వెక్కసంబుగా లోనం బిక్కటిల నాటి దూఁటి వెలి కుఱి
కినకలికి వలరాచవాని పువ్వుములుకుల ననుకరించి మించు
గుబ్బలకెలంకుల పులకాంకురంబులు వెల్లివిరియ సమ్మో
హాసంభ్రాంతయై శతసహస్రకందర్పసౌందర్యకందం బగు
నానందనందనుండు ముందటఁ దోఁచినట్లైనఁ బట్టనుంకించి
భయలజ్జాభిమానంబులు ముప్పిరిగొన నప్పూనికకు నంకించి
కించిదాకుంచితవదనపద్మయై మదనోన్మాదంబున నెట్టకేల

కు దిట్టతనంబు దెచ్చుకొని పట్టెదంగాక యని బిట్టు బట్టు
బయలు కౌఁగిటంజేర్చి విఫలమనోరథ యై హ స్తప్రా ప్తం
బగు ధనంబు గోలుపోయినపేదయుంబోలెఁ జీకాకువడి
శోకపావకదందహ్యమానమానస యై చేయునది లేక
యూవలావలె నాసామార్గనిర్గతనిశ్వాసధూమమాలికావ్యా
కులితదిగ్వలయంబుగాఁ బొగులుచుఁ బొరలి చండమార్తాం
డమండలంబు పిడంబించు నంబరాంచలంబు ప్రాఁకురాకేం
దుబింబంబువలనం దొరఁగు సాంద్రచంద్రికాపూరంబు తో
రంబై కుసుమశరనవయశస్సుధాలహరీపరంపరయునుం బో
లెఁ దదీయలతాగృహంబు ముంచి మించి కుసుమకిసలయ
మంజరీపుంజంబుల సంకులరంధ్రంబుల నిస్తంద్రంబులై జాతి
తప్తరాజతరసబిందుబృందంబులచందంబునఁ జుట్టనం బై
పయింబడిన మిట్టిపడి యిట్టట్టై గుట్టుచెడి యుమ్మలించి
యించుకేని నిలుపోపక మూర్ఛిల్లిన, 207

క. ఆరమణిఁ జూచి హాహా
కారము లెసఁగంగ బోట్లు కళవళపడుచున్
వారికి వారికి సంభ్రమ
మూరఁగ వడిఁ బొదివి భయ సకమాకులమతితోన్. 208

సీ. కోమలియొక్కతె గొజ్జంగపూనీరు
సంభ్రమంబునఁ దెచ్చి జలకమార్చె

జలకమాఱక యున్న సతి యోర్తు సకలాంగ
కంబుల గంధపంకంబు మెత్తె
గంధ మింకకయుండఁ గర్పూరరజ మొక్క-
కమలాయతేక్షణ కలయఁజల్లెఁ
గ్రపంబుపై నొక్కకన్నె పూజంత్రానఁ
బన్నీటితుంపరఁ బరఁగఁ జేసెఁ

తే. గాంతయొక్కతె బిసకాండఖండమండ
నంబు లలదించెఁ గదళీదళంబు వీచె
మగువ యొక్కతె చెంగావిమడుఁగు గట్టె
రామ యొక్కతె వల్లవీరత్నమునకు. 209

క. అంతయు నంత విషంబై
యింతికిఁ గ్రొవ్వేఁడి మిగుల నినుమడియయ్యెన్
శాంతిం బొందునె రోగము
చింతించి తగినచికిత్స సేయకయొందన్. 210

వ. మఱియుం బెక్కుతెఱంగుల నుచితకృత్యంబు లొనర్చి యొ
కవిధంబున నవ్వధూమణులు రాధాకన్యఁ గొంతసేదదేర్చి
యతిప్రయత్నంబునఁ దత్కేళీమందిరంబుఁ జేర్చి వలయును
పచారంబులు నడపుచుఁ దత్ప్రకారంబు సహస్రగోపున కె
ఱింగించిరి. తదనంతరంబ. 112

శా. కందర్పానల యత్త్రిభంగయుత శృంఽగారోజ్జ్వలాకార! గో
బృందాభీరవిలాసినీజనమనోఽభీష్టప్రదా! విస్ఫుర
న్మందారద్రుమమూలసారణితశుంఽభద్వేణునాదామృత
స్యందాందోళితకుండలస్తబకభాఽస్వద్గండపాళిద్వయా! 212

క. కాళియఫణాభృగ్గురుతర
చూర్ణీపాఙ్గీత్రిలోక ఽ శుభనటనకళా
కేళీ విలోలకృతగో
పాలీసాహస్రవివిధఽభావజతంత్రా! 213

మాలిని. సితజలరుహమాలా ఽ స్నిగ్ధదృగ్జాలలక్ష్మీ
కృతమదభరగోపఽప్రేయసీమానసాబ్జా
తతమరకతరత్నోఽద్యత్ప్రభాబాహుమధ్యా
న్వితతులసిదళస్రఽగ్విస్ఫురత్కౌస్తుభాబ్జా. 214

గద్య. ఇది శ్రీమన్మదనగోపాలచరణకమలసేవాధురీణ సత్కళా
పారీణ కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభు
సుపుత్ర సుకవివర్య రాధామాధవయెల్లనార్య
ప్రణీతం బైన రాధామాధవం బనుశృం
గారప్రబంధంబు నందు
ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీ రాధామాధవము.

## తృతీయాశ్వాసము.

శ్రీకరరాధావదనసు
ధాకరబింబప్రసన్నదరహాసరుచి
వ్యాకోచదృగుత్పల! వి
ద్యాకేవలమూల! నవమదనగోపాలా! 1

గీ. అవధరింపుము దేవ! సంయమివరుండు
సకలవేదాంతవిద్యావిశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకత మఱియు
నింపుగా నాపరీక్షిన్నరేంద్రునకును. 2

క. విని యాసహస్రగోపుఁడు
దనమది నారదునిమాటఁ దలపోసి రయం
బునఁ గూఁతు నిత్తుఁ గృష్ణున
కెనసినదాంపత్య మనుచుఁ గృతనిశ్చయుఁడై. 3

వ. సుహృజ్జనంబులఁ జుట్టంబులఁ బిలిపించి భద్రకుం డనుతన కుమారుని రావించి సముచితసంభావనాపురస్సరంబుగాఁ దగుతెఱంగుల సుఖాసీనులం జేసి యర్చించి యంత నందఱ నాలోకించి యిట్లనియె. నే నొక్కనాఁడు బదరికాశ్రమంబు

నకుఁ బోయి మాఱటనారాయణుం డగు పారాశర్యమునీ
శ్వరు నర్చించి కృతాంజలినై యిట్లంటి. 4

సీ. కలవు నామందలోఁ గామధేనువుతోడ
వెలవచ్చుగోవులు వేలసంఖ్య
కల్పవృక్షము నాకుఁ గైవడి నున్నది
వర్ధిల్లు నాయింటి వంగడంబు
గొల్లవాఁడని చూడ కెల్లరాజులు నన్నుఁ
దమలోన నొకనిగాఁ దలఁచుచుండ్రు
నల్లదెల్లలు లేక నాసరివారిలో
మంచివాఁ డనఁగ వర్తించినాఁడ

తే. వెలితిగల దింక నొకఁడది విన్నవింతు
నొక్కకొడుకును గొడుకుగా డొక్కకన్ను
కన్నుగాదండ్రు నాకు నొక్కరుఁడె కొడుకు
వరద ! యిఁక నొక్కపుత్త్రుండు వలయు నాకు. 5

మ. అని నే విన్నప మాచరించిన మదీయాస్యంబు వీక్షించి యం
తన కన్మూసి ముహూర్తమాత్ర మచలధ్యానక్రియారూఢుఁడై
దినసుప్తోత్పలపూర్ణపల్వలము భాతిం దోఁచి యమ్మౌని స
య్యనరప్పించి ప్రసన్నవాక్యములడాయంబిల్చి నాకిట్లనెన్. 6

క. ఫలియించు న్వేగమ నీ
తలఁ పొకసన్మంత్ర మిత్తుఁ దన్మంత్రసమా
కలనమున వరదుఁడై శివుఁ
డెలమిన్ సాక్షాత్కరించి యిచ్చున్ గూఁతున్. 7

ఆ. ఈశ్వరుండు మెచ్చి యీకూఁతు నిచ్చుటా
యనుచు మనసు చివురు మనియె నాకు
నాతలం పెఱింగి నవ్వుచు నప్పరా
శరసుతుండు వలికెఁ గరుణతోడ. 8

క. కూఁతుఁరని చూడవలవదు
నీతలఁపున నక్కుమారి నీవంశము ప్ర
ఖ్యాతికి నెక్కఁగఁ జేయున్
బ్రీతిం బొందెదవు శుభసమృద్ధియుఁ గలుగున్. 9

వ. అని యానతిచ్చి మంత్రోపదేశంబు సేసి కృతార్థుండవైతి
పొమ్మని వీడుకొలిపినఁ దత్పాదప్రణామం బొనర్చి మరలి
యట్ల యమ్మహామంత్రరాజంబుపెంపునఁ బరమేశ్వరుని కృ
పాకటాక్షంబువలన రాధాకన్యకం గంటి నిక్కుమారి జన్మిం
చిన యది మొదలు మునివచనప్రమాణంబున నంతకంతకు
మదీయసౌభాగ్యంబును దినదినప్రవర్ధమానమై కొనసాగు
చున్నయవి. ఇక్కన్నెయుఁ బ్రాయవతియయ్యె నింక వివా
హంబు సేయవలయు నొకపిన్నపాపని విచారింపుఁడు. 10

క. అనిపలికిన వారందఱు
విని సంతోషమునఁ బొదలి వినుతింపుచు ని
ట్లని రాసహస్రగోపుని
ననఘ ! కృతార్థుండ వీవ యామ్యలకంటెన్. 11

సీ. ఎవ్వారితరము మౌనీంద్రుల మెప్పించి
తడయక దివ్యమంత్రములు వడయ
నెవ్వారి కలవి యర్ధేందుకళామౌళిఁ
దలపోసి కాంచి సంతాన మడుగ
నెవ్వారికోడఁగూడదు నీమహోద్యోగని
శ్చలతపస్సంపద సవదరింప
నెవ్వాఁడు గలఁడు మాహేశ్వరాచారశు
ద్ధాత్ముఁడు భూమి నీయంతవాఁడు

ఆ. నీకు నీవె సాటి నీసాటివాఁడెందు
నెఱయ లేఁడు భాగ్యనిధివి నీవె
చన్నమన్నవంశజాతుల సత్కీర్తి
కలశజలధి కమృతకరుఁడవైతి. 12

చ. అమృతపయోధినాయకున కాదిమలక్ష్మి జనించినట్లు లా
హిమగిరిసార్వభౌమునకు నీశ్వరి సంభవమొందినట్లు పు
ణ్యమతికి నీకు రాధ యుదయంబయి కీర్తిలతాలవాలమై
యమరె భవత్పురాకృతమహాఫలసంపద చెప్ప నొప్పదే.

క. తలఁచితివి మంచితలఁపే
తలఁపునకున్ సమయ మిదియ తగినవరుఁడు గా
వలయుఁ గుమారికిఁ జక్కని
యెలదీఁగెకు మావిమోక యెనసినభంగిన్. 14

వ. శీఘ్రంబున శోభనంబుఁ గావలయు నుచితవరుండు మనకులం
బున నెవ్వండు గలఁడొకో యని యొండొరుల మొగంబులు
సూచుచు వాఁడు వీఁడని లెక్కవెట్టి గుట్టుసేయక యుత్సా
హంబున నాసహస్రగోపకుం డిట్లనియె. 15

చ. వినుఁ డిఁక దాఁపనేల కడు వేడుకతో మదభీష్టదైవభా
వన లనుకూలరూపముల వర్తిలుచున్నవి కూడి నందనం
దనునకుఁ గూఁతునిత్తునని నామదిఁజూడఁగ నక్కుమారి నె
మ్మన మటమున్నె యాదనుజమర్దనుపై నెలకొన్న దెంతయున్.

వ. అని తేటతెల్లంబుగాఁ బలికిన నయ్యిష్టబంధుజనంబు. 17

క. ఆహా! కర్ణామృతమై
వ్యాహారం బింత యొప్పె నాసురమౌని
వ్యాహార మభిమతము విను
మా హరియ వరుండు గాక యన్యుండగునే. 18

సీ. నిండార విరిసిన నెత్తమ్మివిరియందు
నెలకొని రాయంచ నిలిచినట్లు
మధురసాపూర్ణమందారఫలముపై
నొప్పార రాచిల్క యున్నయట్లు
క్రొందేనె నానిన గొజ్జంగపువ్వున
లీలమై నెలదేఁటి వ్రాలినట్లు
నవసహకారపల్లవగుళుచ్ఛంబున
నెలమిఁ గోయిల వసియించినట్లు

తే. కాదె నందజుసౌందర్యకందళమునఁ
దన్వి చిత్తంబు గాంక్షమైఁ దగిలియుంట
రాధ దగు మాధవునకు నమ్మాధవుండు
రాధ కెనవచ్చు నిది మహారంభసరణి. 19

వ. అని నిశ్చయించి,- 20

శా. పాపం గృష్ణున కిచ్చుటొప్పు నవుగోపాలాన్వయశ్రేణిలోఁ
జూపం జెప్పఁగఁ బోఁడు నందుఁడు జగత్స్తోత్రైకపాత్రుండనన్
గోపాటోపవిలాసమత్తుఁడయి చక్షుల్ జేవృతింపంగ గ
ర్వాపూర్ణోక్తుల భద్రకుండు వెడహాస్యంబొప్పఁగా నిట్లనున్.

గీ. మేలుమే లయ్యలార! చుట్టాలు మంచి
వారు గలిగితి రిటువంటివారితోడఁ
గూడ మనబాంధవుల కేమికొఱఁత గలదు
తలఁప నీయయ్యకును మీకుఁ దగును దగును. 22

శా. బంధుశ్రేష్ఠులు గూడినారె నిపుణుల్ భావించియీసంబంధం
బెల్లను గూడె నాకు నిది చెప్పన్ రాదె కృష్ణుండు గ
ర్వాంధత్వంబున జారచోరగతుల న్వ్యాపించుట ల్విందుమీ
సంధానంబు లొనర్పమీమతులకున్ జాతుర్యమెట్లబ్బెనో.

క. తనవారిఁ బూతనాదుల
వనజాక్షుఁడు దుర్మదమున వధియించినవాఁ
డని కాలాహీంద్రము గతిఁ
గనలుచునువ్వాఁడు వినరె కంసుఁడు మదిలోన్. 24

గీ. ఈవిచారంబు మదిఁ గొంత । యొఱఁగనేని
చేటు ప్రాపించుఁ గంసుని । చేత మాకుఁ
[1]జాటువాండ్రకు మీకేమి । సంఘటించు
నది వృశో! యంచు జాఱుదు । రవలమీఱు. 25

వ. చాలుఁ జాలు నీప్రసంగంబు మఱచి తప్పియు వలదు. విడువుం డని వారించి తగుఁ దగదనక మఱియుం బరుషవచనంబులఁ బెద్దలని చూడక, బంధుజనంబుల దూఱనాడు కొడుకుం జూచి కోపించి సహస్రగోపకుం డి ట్లనియె. 26

చ. కటకట ప్రాణబంధువులఁ । గాదని యీక్రియధిక్కరించి ప
ల్కుట దగునయ్య! వీరు మన । కుంగలకర్తలు వీరు చెప్పిరే
యిట మనపాపఁ గృష్ణునకు । నిచ్చినఁ దప్పని నిన్నుఁ బట్టనే
మిటిపని కంసభూపతికి; । మిన్నక నీమది వైర మేటికిన్.27

క. భూజనులు దామెఱుఁగక
రాజులు పెండ్లిండ్లు సేయ । రాదన్నా రే
యోజచెడి మ్రుచ్చిలించుట
[2]యో, జారత్వమునఁ దిరుగు । టో పెండ్లియనన్. 28

ఉ. కంసునివారి కూరక య । కారణవైరము పూని శౌరి దా
హింస యొనర్చెనే యతని । కెగ్గొనరించిన నూరకుండునే
కంసుఁడు దాని కల్గి యవుఁ । గాదన నోపెనె విక్రమక్రియా
మాంసలదోర్విలాసరిపు । మానవిమర్దను నా జనార్దనున్.29

---

1. జాండ్ర కాండ్రకు...(మూ.)
2. యోజననత్వమునఁ దిరుగు టొప్పు పెండ్లి. మూ.

వ. అదియుఁ గాక. 30

క. ము న్నే నాఖ్యుల చేతఁ
విన్నాఁడఁ ద్రిలోకకర్త విష్ణుఁడు గుణసం
పన్నిధికి నందునకు నా
పన్నుల రక్షింప భూమిఁ బ్రభవించె ననఁ. 31

ఉ. నందునితోడ బాంధవముఁ నాకొనగూడినఁ బుణ్యసంపదల్
చెందుటగాదె నాతనయఁ జేకొని శౌరి వరించెనేని పెం
పొందదె నాకులంబు వనజోదరు దివ్యగుణంబు లాశతా
నందునకైన వర్ణనము నర్వఁగ శక్యమె వేయునేటికిఁ. 32

వ. అదియునుఁగాక నాకలోకమునిలోకచూడామణి యగు నార
దమహామునీంద్రుం డొకనాఁడు మనగృహంబునకుఁ గరుణా
రసతరంగితాంతరంగుండై మదీయపురాకృతసుకృతఫలంబు
నుంబోలె విజయంబు సేసిన నమ్మహానుభావు నెదుర్కొని
తెచ్చి తగుతెఱంగుల నారాధించి పిన్నపాప రావించి
చూపి మోడ్పుంగేలుదోయితో నిట్లంటి. 33

మ. పరమోత్సాహముభక్తి శక్తియునుదాత్పర్యంబునుం జెల్లుసు
స్థిరభంగిఁ నిజహృత్సరోరుహమునఁ దేవాదిదేవుఁ శివుఁ
బరమబ్రహ్మమయుఁ గుఱించితపము న్బ్పాఁ జేసి తత్పుణ్యని
ర్భరకారుణ్యము పెంపుఁ గంటి వినుఁ డీ రాధాకుమారీమణిఁ.

క. తాపసకులశేఖర ! యీ
పాపకుఁ దగువరుని నొకని భాగ్యాన్వితునిఁ

రూపించి యానతిండన
నాపుణ్యనిధాన మతి దళయారసమతితోడన్. 35

వ. బాలహస్తతలరేఖ లుపలక్షించి శిరఃకంపంబు చేసి. 36

క. కన్య శుభలక్షణాన్విత
కన్యకుఁ దగినట్టివరుఁడు కందర్పకళా
ధన్యుఁడు శ్రీకృష్ణుఁడు గా
కన్యుఁడు గాఁడనుచుఁ జెప్పెయరిగె నిజేచ్ఛన్. 37

వ. కావున సత్యసంధులగు నమ్మహానుభావులవచనంబు లమోఘంబు లట్లయగుంగాక తప్పనేర్చునే! సర్వజనసమ్మతంబైన కళ్యాణంబు కాదనుట యనుచితంబు. వెడంగుబుద్ధులు మానుము. నీకుఁ జక్రియెడఁ గ్రౌర్యంబు వలదు. సుముఖుండ వగుమని పలికిన నవ్వి తద్వచనంబులు నిరాకరించి యకారణమాత్సర్యంబున భద్రకుండు తండ్రి కిట్లనియె. 38

మ. మధురానాయకుఁడైనకంసునకుసామర్థ్యంబు నందాత్మజున్
వధియింప న్మతి లేకపోయెనె కటా! నాఁడింద్రుఁ డల్లాడఁగా
మధువైరి న్బలుమాఱునెన్నఁడిట నస్మద్బాహులోహార్గళో
గ్రధనుర్ముక్తశరానలార్చులకె యాహర్వంజాలునేయాజిలోన్.

ఉ. మాయలమానుఁ లాడు వెడమాటల నందునిపట్టి యాదినా
రాయణుఁ డంచునాడెదుమహావినయోక్తులగొల్లఁడాదినా
రాయణుఁ డౌనయేని నిఁక నాదిశివుండనె కానె యేటికిన్
బాయక వెట్టివైబయలుప్రాఁకెద వజ్జులఁగూడి మూఢతన్.

గీ. మొదల జగడాలమారి నాఁగరుఁడు తల్లి
బిడ్డలకు నైన జగడాలు ◊ వెనుపుచుండు
సతనిమాటలు నమ్మిరే ◊ యచ్యుతునకు
నెలమితోఁ గూఁతు నిచ్చుట ◊ కియ్యకొంటి. 41

గీ. వృద్ధు లెఱుఁగరుగాక నీ ◊ వెఱుఁగవైతె
యనుచు జగ మెల్ల ననుఁ గల్లలాడుచుండు
హాసిలాభము నాకుఁ గాకరయ నింను
గారణంబేమి యిఁకఁ జాలు ◊ నూరకుండు. 42

గీ. ఆదివిష్ణునితాతగారైన శౌరి
పుత్రి నీవిక బలిమిఁ గొంపోవఁ గలఁడె ?
మాటలొండేల ! నాకు సర్వమ్మతముగాని
వానికే యిత్తు నన నీకు ◊ వచ్చు నెట్లు ? 43

క. వల్లవలోకమునకు నే
వల్లభుఁడను గంసునంతవాఁడను హరి నా
చెల్లెలికిఁ దగునె ధరణీ
వల్లభసూనుఁడును రూపవంతుఁడు దక్కన్ 44

సీ. వెల్లిఁబోయినమాట ◊ లెల్లను బచరించి
తేనెలు పుట్టించు ◊ తెటఁగుగఱచి
మోరత్రోపుదనానముఱియుచుఁ దనయిచ్చ
మెఱవడిమై గోళ్ళు ◊ మీటుకొనుచు

నేర్పరియై యుబ్బి । నింగిముట్టుచుఁ బెంపు
దీపింప మెఱసి ప్రతిజ్ఞలాడి
రాచఱ్కమునఁ గొంత । ఱవ్వయై మార్లేక
బలిమియు వెడమాయఁ । గలికితనముఁ

తే. జూపి భ్రమయించు కృష్ణునిఁ । జూచి వెఱ్ఱి
మురులఁ జిక్కంగ నంగుని । మందవారు
లేరు విను మిందు వేయేల । లేశమంత
సంశయము లేదు చెల్లెలిఁ । జక్రి కీను. 45

వ. అని యివ్విధంబున మాధవుని పెంపుఁ దలంపక కంసహితంబగు గార్యంబు ప్రతిష్ఠించి చనవుకలిమిఁ గులములో నెఱవాదిబిరుదై తనపరాక్రమంబు ప్రకటించుకొని తండ్రి హృదయంబు పంచబంగాళంబుగాఁ జెదరనాడి క్రోధంబున మొగంబు రాఁజ దిగ్గున లేచిపోయినఁ జుట్టంబులు కంసు భయంబున నిట్టట్టనక యిదియ యుత్తమకార్యం బని మాఱుత్తరం బీక తమకుఁదారె వీడ్కొని నిజగృహంబులకుఁ బోయి రప్పుడు. 46

గీ. కొడుకుమాటకు మార్మాట । నొడువలేక
శోకపావకతప్తుఁడై । స్రుక్కి దీన
భావమునఁ బొంది సిగ్గఱి । చేవయుడిగి
వేఁడినిట్టూర్పు నిగిడించి । విహ్వలించి. 47

సీ. తలవంపు లాయె బాంధవులలోపల మాట
తేకువ మెల్లను దీఱిపోయె
నగవుపట్టితిని జిన్నతనంబు ప్రాపించెఁ
బెద్దతనము గట్టిపెట్టవలసె
సంసారసౌఖ్యంబు చాలదె యిఁక నిట్టి
కొడుకు తండ్రికి నాకుఁ గొఱఁతగలదె
తండ్రికి మాఱొడ్డు తనయుండు సకలదుః
ఖములకు హేతువు గాఁడె తలఁపఁ
తే. బిన్నపాపను శౌరికిఁ బెండ్లిసేసి
చూచుభాగ్యంబు పడయంగ నోఁచనైతి.
నెడమపిరి వెట్టె నీమూఢుఁ డెఱుకమాలి
యేమిసేయుదు? దీనికి నేదిత్రోవ. 48

క. ఏటికి నీసంసారం
బేటికి నీకొడుకు బంధులెల్లరు నగఁగా
మాటచెడి ముదిసి ముప్పున
మోటరినై బ్రదుకఁదగునె మోహాతురతన్. 49

వ. అని యాందోళించి. 50

క. ఏలా! యీశోకానల
కీలం బడి [illegible] నమృతకిరణకిరీటున్
శూలి భజింపుచు మోక్ష
శ్రీలకుఁ జేయొగ్గ కింకఁ జెనఁటిబ్రదుకునన్. 51

వ. అదియు మేలని శివస్మరణంబు చేసి చిత్తంబున విరక్తి నిలిపి ముక్తివిషయబద్ధుండై యనవద్యతపస్సమాధికిం దలఁపుఁ జేర్చి మదీయ పురాకృతపుణ్యఫలంబు లనుకూలంబు లయ్యె నేని నాకుమారిఁ జక్రపాణి పాణిగ్రహణంబు సేయుఁగాత మని పల్కి యమ్మహావీరశైవుండు కృతనిశ్చయుండు ను దాంతుండు ను నై బృందావనంబునకుం బోయి యందు. 52

చ. కనియె సహస్రగోపకుఁ డశేఖండతరంగపరంపరాహత
స్తనితమరాళసారసలసన్మణికల్పితమేఖలాంచితన్
వనజమరందబిందుపరిశోభితలోలదళింద్రమాలికా
కనదభిరామధృగ్గలితఁ గైరవవైరిసుతన్ బ్రియంబునన్.

సీ. పంకజాసనమాత్రబంధుఁడై సంసార
బాధసూత్రంబులు పాయఁ ద్రోసి
యంతర్విలోకనం బాచరింపుచు బహి
ర్వ్యాప్తసుఖత్వంబు వీఁగఁద్రొక్కి
తలఁపున ముక్తికాంతావాంఛ నెలకొల్పి
వెడఁగుఁ గోరికలెల్ల వెడలఁద్రోచి
హరిపదధ్యాన సుఖాస్వాదమునఁ జొక్కి
యున్న తక్కిన చవు లేలోకరించి

తే. వ్యాసనంయమిదత్త మంత్రాక్షరంబు
లుచ్చరింపుచు నిశ్చలయోగదృష్టిఁ
దప మొనర్చెఁ బురాతనతాపసేంద్ర
బృందముల కద్భుతముగ నిశ్చిన్ననిష్ఠ. 54

క. ఈకరణి మూఁడు దివసము
లేకాగ్రసమగ్రనిష్ఠహృదయమున శివు౯
లోకేశుఁగూర్చి తపము ని
రాకులతం జేయ నర్ధరాత్రమునందు౯. 55

సీ. [1]లలితజటాజూటకలితికావితానంబు
లుదయరాగశ్రీల యొఱపుగాఁగఁ
కంఠహాలాహలకజ్జలచ్ఛవిరేఖ
సంక్రాంతనీలలాంఛనము గాఁగ
నంబకాంబుజయుగళానర్గళాను కం
పారసం బమృతవర్షంబుగాఁ గ
మహనీయదివ్యవిగ్రహమనోభవభూతి
నిండారు వెన్నెలనిగ్గు గాఁగ
తే. నంది యుదయావనీధరేంద్రంబు గాఁగ
సంతతాజ్ఞానసంతమసంబు విరియఁ
బ్రమథగణభక్తచరచకోరములు చెలఁగ
నమృతకరులీల శివుఁడు ప్రత్యక్షమయ్యె. 55

వ. ఇట్లు సాక్షాత్కరించి విరూపాక్షుండు కల్పవృక్షంబునుం
బోలెఁ గామఫలప్రదుండై వాత్సల్యంబున రావణా!
లెమ్ము లెమ్ము. వరంబు వేఁడు మని యమృతోపమానం
బు లగుప్రసాదవాక్యంబులు పలికిన విని జలధరధ్వానం

1. లాలితజటీ. మూ.

బాలించినశిఖావళంబునుంబోలె నుత్సహించి కన్నులువిచ్చి
చూచి తద్దివ్యరూపంబు దృష్టికి వెక్కసంబై తోఁచినఁ
దన మనంబున. 57

సీ. శాఖలో కావివి శాఖ, లత్యున్నత
సమధికబాహుదండములు కాని
చిగుళులో కావివి చిగుళులు, గెంపుల
చాయల మెఱయు క్రొంజడలుగాని
కళికయో కాదిది కలిక, వతంసకా
ల్పితకర్ణతటచంద్రరేఖ గాని
తేఁటియో కాదిది తేఁటి, కంఠప్రాప్త
గరళకంఠకళంకకాంతి గాని

తే. ఫలరసంబొకొ కాదిది ఫలరసంబు
ద్రవదపాంగకృపాసుధాధార గాని
కల్పతరువొక్కొ కాదిది కల్పతరువు
వరదుఁడై నన్నుఁ బ్రోచునీశ్వరుఁడుగాని. 58

సీ. ఈకట్టినదిసుమీ యిభరాజచర్మంబు
కోకగా శివుఁడు గైకొన్నదన్న
దీరూపవతిసుమీ మెలయించి శంభుదే
హార్ధంబు గొనెనన్న యద్రితనయ
యీశేషఫణిసుమీ యేప్రొద్దు వేడ్కతో
ధూర్జటి తొడవుగాఁ దొడుగుకొనిన

దీనుదుటిడినుమీ యీశ్వరప్రేరితం
బై కంతుఁ బొలియించె ననిన నేత్ర
తే. మీ శుభాకారమేసుమీ ఋషివరేణ్యు
లఖిలవేదాంతసిద్ధాంత మనెడు తత్త్వ
మఖిలలోకైకకర్త నీ యాదిదేవు
నభవు, బొడగంటిఁ గోర్కిమి న్నందికొంటి. 59

వ. అని వితర్కింపుచు భక్తితాత్పర్యంబులు ముప్పిరిగొన నప్ప
రమేశ్వరుని వలగొని దండప్రణామంబు లాచరించి యా
నందాశ్రుజలలవవ్యాకులితనేత్రుండు ను ముహుర్ముహుఃపుం
ఖీభూతకంటకాంకురగాత్రుండు ను నలికతలకలితకరకమల
యుగళుండు ను నై యిట్లని స్తుతించె. 60

సీ. జయజయ యోషధీశ్వరకిశోరకిరీట
సురకిరీటాంశుభాసురపదాబ్జ
జయజయ సంసారసాగరౌర్వానల
పాపానలచ్ఛటాప్రళయవర్ష
జయజయ జగదేకశరణ దీపాంకుర
కల్పకాంకుర శివంకరకటాక్ష
జయజయ సర్వాత్మజనమానసాలయ
నలినాలయామనోనాథమిత్ర
తే. జయ నగేంద్రాత్మజానేత్రజలజసూర్య
బాలసూర్యాంశునిభజటాభారలలిత

జయ చిదానంద కేళీప్రసన్న వదన
పంచవదనచతుర్ముఖప్రముఖ వినుత. 61

చ. బలువగునారిపై శరము బాణముపై సరదంబు, తేరిపై
విలు, విశిఖాసనంబుపయి వీరభటాళియు నొప్పచిత్రభం
గులనిజజూటదేశమునఁ గుమ్మరుకూటపురాసురేంద్రులన్
గెలిచినయోధవర్య ! నినుఁ గీర్తన సేయుదు నంబికాధవా !

ఉ. నాలుగుత్రోవ లైన పదునాల్గువెలుంగులపువ్వుఁదోఁటలోఁ
నోలిఁ ద్రిశాఖలుం గలిగి యుద్భవమందినవేల్పుచెట్టునన్
మేలిఫలంబవై పొడమి మించురుచిన్ శుకముఖ్యసద్ద్విజేం
ద్రాళులఁ బ్రోచు నిన్ను మది నర్చనసేయుదు నంబికాధవా!

ఉ. కట్టినవన్నె దుప్పటినిఁ గంపము నొందెడి తేజి, యాదలన్
జుట్టిన పాగ చెల్వనక సూయ(1)యొనర్చెడియాలు మేలిమైఁ
బెట్టినసొమ్ము క్రొందళుకు పెంపునఁ గుందెడుపువ్వుగల్గి చూ
పట్టెడు వన్నెకాని నినుఁ బ్రస్తుతి సేయుదు నంబికాధవా. 64

ఉ. ఓ శశలాంఛనాభరణ! యో(2)శితికంఠ! తనూధృతాంగనా
యో శరధీకృతాంబునిధి ! యో శరధీంద్రమహాసనాలయా!
యో శమితేంద్రియప్రకర! యో శమనాంతక ! యో దయానిధీ!
యో శతకారణప్రథిత! యో శివ! నన్నుఁ గృతార్థుఁ జేయవే.65

---

(1) యొనర్చు పటారు (మూ)

(2) శశికంధర నూర్ఝనాంగన (మూ)

క. అని తన్ను బహువిధంబుల
వినుతింపుచు నున్న గోపవిభుఁ గరుణాదృ
ష్టి నిరీక్షింపుచు జలధర
ఘనగంభీరోక్తి నీలకంఠుం డనియెన్. 66

క. మెచ్చితి నీభక్తికి వర
మిచ్చెదఁ బ్రార్థింపు మెద్దియేనియుఁ దగనీ
యిచ్చకు వచ్చినయది నీ
వచ్చుపడఁగ ననుడుఁ బొదలి యాతఁడు వేడ్కన్. 67

ఉ. గెంటని యోగవర్తన నకిల్బిషమానసు లైనమౌను లే
వెంటను గానలేని శ్రుతివేద్యము లైనభవత్పదాబ్జముల్
గంటి వరంబు లేటికి నిఁక న్నిను గోరఁగ నాకు నన్ను నీ
బంటులబంటుగాఁ దలఁపు భక్తమహాసుకవజ్రపంజరా! 68

చ. వరములు వేఁడి భోగములవాంఛలమున్గుచు మర్త్యరాటవిన్
దిరుగఁగ నోప నన్నమృతదృష్టులఁ బ్రోవఁ దలంచి తేని ని
ర్భరసుఖదాయకంబు నిరపాయపదంబును నై తవర్చనీ
చరణయుగంబు క్రేవ ననిశంబు వసింప ననుగ్రహింపవే. 69

వ. అని తక్కినవేమియుం గోరక నిజచరణసేవాపరత్వం బపే
క్షించి పలికిన. 70

మ. అతిసంప్రీతమనస్కుఁ డై శివుఁడు నేత్రాపాంగరంగత్కృపా
మృతపూరంబులు జాలువాఱ ననియెన్ మిత్త్రేందునుంబోలె నీ
హిత మే నిచ్చితి మీఁదిజన్మమున నింకేమేనియు న్వేఁడు మ
ద్వ్రతనం బైనమనోరథంబు గలదే నాభీరవంశాగ్రణీ! 71

క. అని శివుఁ డానతి యిచ్చిన
మనమున నుప్పొంగి దేవ ! మత్పుత్రికి నం
దనితనయుఁడే వరుఁడుగ
ననుగ్రహం బొసఁగు మనుఁడు ! హరుఁ డిట్లనియెన్. 72

గీ. లోక సంరక్షణార్థలీలాకుతూహ
లాత్ముఁడై భూమి నాదినారాయణుండు
నందగోపుని పుత్రుఁ డనంగఁ బరఁగె
మదనగోపాలమూర్తి సంభవము నొంది. 73

వ. శ్రీమహాలక్ష్మియుఁ బుణ్యాతపోనిధివియగు నీయందు రాధా నామధేయమై యుదయించె న ప్పరమకళ్యాణదంపతులకు దాంపత్యసిద్ధి యెటుగవలయునే? అయిన నీవు మత్ప్రసాదంబున నీయమునాతీరంబునందు గోమతి యనుపేర నొక్కనగరంబు నిశావసానంబున నావిర్భవింపఁ గలయది యప్పురంబున కధీశ్వరుండవై రాధాస్వయంవరంబు లోకంబునఁ జాటింపుము. తన్మహోత్సవసమయంబున జగదానందంబుగా నందనందనుండు భవన్నందనం బరిగ్రహించు. మనోరథంబు సఫలంబయ్యెడు మని రాజత్వంబుఁ గరుణించి సర్వేశ్వరుం డంతర్హితుండైన నతండును బరమహార్షోత్కర్షంబున గృహంబునకు మరలి వచ్చె నంత వేగుటయు.

సీ. ప్రాకారగోపురప్రాసాదతోరణ
మణిధగద్ధగితదిఙ్మండలంబు

వివిధదేవాలయవిశిఖాఘనద్వార
వాటోద్ధృతధ్వజాస్ఫోటనంబు
సామజహయ ఘటాస్యందనాశ్రమ చతు
రర్వర్ణ సంపత్కళావర్ణితంబు
పరిఖాసరోవరప్రమదవనావళీ
ప్రాంతకేళీశైలబంధురంబు

తే. పటహభేరీమృదంగ శంఖధ్వని నాద
ముఖరితము సర్వవైభవమోహనంబు
నగుచు శాంభవమహిమ నయ్యమునక్రేవ
విస్మయంబుగ నగర మావిర్భవించె. 75

క. ఆపురము కోట కొమ్మలఁ
దాపించిన పద్మరాగతతు లెల్లెడలన్
జూపట్టు నభ్రవాహిని
లోపలి కెందమ్మి పూవులో యనుశంకన్. 76

సీ. అంబుపానసమాగతాంతర్వినిర్మగ్న
భద్రసింధురశైలబంధురంబు
క్రీడాచరత్పన్నగీ [1]శిరోమణిరోచి
రౌర్వాగ్నిదీప్త శిఖాన్వితంబు
జలకేళిలోల చంచలలోచనాతను
విమలవిద్రుమలతావిభ్రమంబు

1. చరత్పన్నగిరి (మూ)

పంకజామోదలుబ్ధ భ్రమన్మధుకర
పటలకాదంబినీపరివృతంబు

తే. నీలనీరేరుహావళీనిర్నిరోధ
నీలవర్ణాంగ సత్ప్రభాలాలితంబు
నగుచు వారాశి దొరసి యన్నగరమున న
గాధమైన యగడ్త పొగడ్త కెక్కు. 77

క. అభినవ వప్రస్ఫటిక
ప్రభాలతలు బిసము లనుచుఁ బయిపయివానిన్
రభసమునఁ గఱచు [1]నప్పా
గభీరపరిఖోర్మిమాలిఁ గల కాదంబుల్. 78

ఉ. ఉన్నతసౌధకీలిత విధూపలంబుల్ సితపక్షరాత్రులన్
వెన్నెలలన్ గరంగి పురవీథుల నెల్లెడఁ బాఱ మోహసం
పన్నవధూమణుల్ ప్రియుల పాలికిఁ బోవఁగ రాక మన్మథా
పన్నతఁ గుందుచున్ బహుళపక్షనిశల్ గణియింతు రాత్మలన్.

మ. జలజాక్షుల్ పురిరత్నసౌధముల నిచ్చల్ కేశపాశంబు లి
మ్ముల వాసించు సుగంధధూపపటలంబుల్ నింగి నిండారినన్
జలదభ్రాంతి సమీపపుష్కరధునీసంచార కేళీబలా
కలు పైపయిఁ జెరలాడుఁ దక్షణభవద్గర్భోదయాపేక్షతోన్.

ఉ. అంబరచుంబితంబు లగునప్పురిమేడలమీఁద నాడు ము
గ్ధాంబుజహాయతాక్షులనయంబును డాఁగుడుమూఁతలాడుచో

1. మెరుచు (మూ)

టం బరికింపనేరక తడఁబడి నెచ్చెలిమో మఱచు రేల్
పంబినవేడ్క మాయుమురుపార్వణపూర్ణసుధాంశుబింబమున్.

క. ఫణికన్యామణి చూడా
మణి చకచక లొదవ నిరులు మలయమిని, విను
స్మణిరుచు లని రేలును బ
ట్టణము పరిఖఁ జక్రములు విడంబించు రతిన్. 82

క. కడుఁ దొలఁకాడెను సురనది
కడ ల్లొకో యనంగఁ బవనకందళములచే
నుడుపథమునఁ గ్రాలుచు వెలి
పడగలు [1]దగుఁపట్టణంబు ప్రాసాదములన్. 83

గీ. కరము పొగడొంద ధర్మార్థకామమోక్ష
మార్గములు వోలె సకల సంపత్సమృద్ధి
వసుధ నొప్పారు నప్పురవరము మేటి
కోటవాకిళ్లు నాలుగు గొమరుమిగిలి. 84

చ. నిరతము నప్పురంబు ధరణీసురవర్యుల యిండ్లయందు ని
ర్జరపతి తాను వేలుపులు సత్రిపుఁగూళ్లు భుజింపుచుండఁగాఁ
జిరవిరహాగ్ని నశ్రుజలసిక్తవిలోచనపంకజాతయై
సురపురిమేడపై నెదురు చూచు శచీసతి వజ్రిరాకకున్.

1. గనుపట్టణంబు (మూ)

చ. విజయరమాకరగ్రహణవిశ్రుతపాణిపయోజయుక్తదా
నజలపయోధిసంభవకనద్గుణమౌక్తికహారవల్లికా
వ్రజములు దిగ్వధూటులకు వన్నెలుగాఁగని సూర్యసోమవం
శజు లగురాజనందనులు సన్నుతలీలఁ జరింతు రప్పురిన్.

క. కోటినిధులకును నొకడిటుఁ
గోటికి పడగ లొకయింట గుఱుతై యుండన్
పీట వణి క్తతి సరిగాఁ
బాటియె నవనిధులధనదుఁ బ్రస్తుతిసేయన్. 87

క. దున్నకయ యెల్లసస్యము
లన్నగరిపొలానఁ బాడ హాలికు లతిసం
పన్నులయి కాఁపు లనియెడు
చిన్నెల కింటింటఁ బూజ సేతురు హలముల్. 88

చ. పిరిగొని రేలు శీతకరుబింబము వ్రయ్యలు సేయుచుం బగ
ళ్లఱిముఱి భానుబింబ మపరాద్రికిఁ జిమ్ముచు నప్రతీపమై
నెఱి[1]గరిడీక్రియం దిరుగ నేర్చినొకో యన నెల్లవంకలన్
మెఱయుచునుండునప్పురిసమృద్ధమదోద్ధతదంతియూథముల్.

సీ. సంభృతధాటిగా సన్నాహనైపుణి
నుదధికరళ్ల పెంపొఱపుఁగఱపి
చటులధావనమహాసంవేగవర్తనఁ
దోఁక చుక్కలతోడఁ దోడుచూపి

1. గరుసీ...(మూ)

పటుచిత్రతరపరి భ్రమణవిభ్రమభంగి
నావర్తపాండిత్య మవఘళించి
చతురవర్తనకలా సంభ్రమవ్యగ్రతఁ
దోలకరిమెఱపుల చెలువుఁదెగడి
తే. కేలిభర (తా) త్మజులు హయ గ్రీవలీల
లోలి బహురూపములు చూపు చున్నవారొ
యనఁగఁ గన్నులపండువై యప్పురమునఁ
జాల నొప్పారు నుత్తమ సైంధవములు. 90

సీ. అభినవబడబాన లాంగారఖండముల్
నలువ మానవులఁ గా నిలిపె నొక్కొ
యత్యుగ్రవీరర సాధిదైవతముఁ బ్రో
ద్ధతిఁ బెక్కురూపము ల్దాల్చెనొక్కొ
యాకస్మికక్రీడ నవతార మొందిన
మృత్యుదేవత పలు మేనులొక్కొ
కౌశికప్రతిసృష్టి గతి సంభవించిన
కాలకింకరచమూ గణము లొక్కొ
తే. యనఁగ బరసైనికానివా ర్యప్రశస్తిఁ
గలిగి కన్నులు మిఱుమిట్లు గొలుపు మెఱుఁగుఁ
గైదువులు దేజరిల్లంగ గర్వరేఖ
విఱ్ఱవీఁగుదు రప్పురి వీరభటులు. 91

సీ. తాంబూలరాగసుందరమధురాధర
ప్రభలు తేఁజిగురుజొంపములుగాఁగ
నొండొంటితోఁ రాయుచుండుసమున్నత
స్తనములు పుష్పమంజరులుగాఁగ
దరహాసచంద్రికాధవళిమస్ఫురణంబు
ప్రకటవికాసవైభవముగాఁగ
నీలంపుఁ జాయ పెన్నెరుల క్రొమ్మెఱుఁగుల
మొత్తంబు లలతేఁటిమూఁకగాఁగ
తే. జగతి జంగమలీల నుత్సవమొనర్త్రు
పంచశరలీల లతికలపగిదిఁ బతుల
వాంఛ లొసఁగుచు నిండుజవ్వనపుటెలమి
మలసి వర్తింతు (రప్పురి)మానవతులు. 92

సీ. కప్పారు నునుఁగొరకొప్పులమెఱుఁగులు
నీలంపుఁదునుకల నెలవుకొలుపఁ
గళుకులై యొప్పారు కడకంటిచూపులు
ముక్తాఫలంబుల ముంచిచల్లఁ
దళతళమెఱయు గుత్తపుదొంతకాంతులు
వజ్రంపుఁ బలుకల వఱలుకొలుపఁ
గమ్మతేనియ లొల్కు కెమ్మోవిచాయలఁ
బవడంపుఁదీఁగె లుద్భవమునొందఁ

తే. గదిసి [1]కొప్పులనున్న చెంగలువరుచులు
మించి కెలఁకుల బంగారు మిసిమి దొలఁకఁ
జూచి విటులమనంబులఁ జూఱఁగొనుచు
వలపు నెఱపుదు రప్పురి వారసతులు. 93

సీ. రతిరాజ నలకూబరజయంత చంద్రులఁ
దెగడురూపంబునఁ బొగడువడసి
పాంచాల దత్తక భద్రక కూచిమా
రుల మీఱు రతివిద్య రూఢికెక్కి
మంత్రతంత్రక్రియా మాయాబలౌషధ
కళల నాదిమసిద్ధగణముదొరసి
ఆలైనఁ గఱగింపఁ జాలు మాధుర్యధు
రీణగరోద్భట్టుల రాణమించి

తే. సేస కొప్పుల నవపుష్పవాసనాప్ర
వాహములు మేనిపూఁతల వలపు దిశలఁ
గ్రమ్మఁ గస్తూరిమృగముల కరణి విటకు
మారసాహస్రములు పురి మలయు నెపుడు. 94

సీ. చారువైడూర్య తేజఃపుంజ మొకచోట
నాతపవిభ్రాంతి ననువుపఱుపఁ
బద్మరాగప్రభాపటలంబు లొకచోట
నెఱసంజకెంజాయ నిరవుకొలుప

(1) కొప్పు రికలన (మూ)

నీలరత్నద్యుతికిజాలంబు లోకచోటఁ
గప్పారు చీఁకట్లు కి గ్రమ్మఁజేయ
లాలితముక్తాఫలచ్ఛాయ లోకచోట
నిండువెన్నెలడాలు కి నిగుడఁజేయ

తే. దివసరాత్రి విలాసులుఁ కి దివ్యటఁగోరి
యతులదాంపత్య సంసిద్ధి కి నసఁగి పెనఁగి
తగిలి క్రీడించుచున్న చ కిదంబు దెలుపు
నాపురంబున ననిశంబు కి నాపణములు. 95

సీ. మకరందధారలు కి మధురాధరవినిర్గ
తాలాపమధురిమ కి నసఁగిపెనఁగఁ
బ్రచురసౌరభపరంకిపరలును మోమునె
త్తావులు మిత్త్రవకి ర్తన మొనర్పఁ
జంచరీకంబులుఁ కి జారులీలాపాంగ
దర్శనవ్యాప్తులుఁ కి దడఁబడంగఁ
దలిరులసొబగుఁ గేకిల్దమ్ములనును గెంపు
పెంపు నొండొంటితో కి బిత్తరింప

తే. నురు మనోరథలక్ష్ములై కి యుల్లసిల్లి
నిండుజవ్వనగరువంబు కి నివ్వటిల్లఁ
జిఱుతనగవులు వెలలెక్కఁ కి జేయఁబువ్వు
లమ్ముదురు పుష్పలావిక కి లప్పురమున. 96

ఉ. కోరికఁ జేరి కామినుల కుంతలము ల్లబ్బించి మించి పై
చీరచెఱం గెడల్చి కుచశైలములయందు సుగంధఘర్మవాః
పూరముదీర్చిమర్మపదముల్ దగనంటుచుసంవృతాత్ముఁడై
కూరిమి సల్పునట్లు దిరుగు న్మలయానిలుఁ డప్పురంబునన్.

చ. అనుపమగుచ్ఛకస్తనభరాలసభావము సర్వనేత్రశో
భనవికచత్వవిభ్రమముఁ బక్వఫలోజ్జ్వలయౌవనంబు భృం
గనికరదృగ్విలోలతయుఁ గల్గి ప్రియాస్పదరేఖ నుండు జ
వ్వనులును బోలె నొప్పు వనవాటికలప్పుటభేదనంబునన్.

మ. నవపద్మోత్పలవాసనాభరమరందస్యందకాదంబచ
క్రవిరావస్ఫురణాచ్ఛశీతలపయఃకల్లోలవల్లీచయ
ప్లవమానేందుముఖీవిలాసములఁ బైపైఁ బొంద[1]ఁ బంచేంద్రియో
త్సవలీలన్ నెలకొల్పు నప్పురముకాసారంబు లెల్లప్పుడున్.

చ. అలికులగానలీలఁ గుసుమాంజలి యిచ్చి సమంజరీకలో
లలతలు వన్నెకుంచియలలాగునఁ గ్రాలఁ బరాగపుంజమం
జులపటచాలనం బడర సోలుచుఁ దూలుమరందఘర్మబిం
దులునిగుడన్ జెలంగుఁ బురితోఁటలవాయువు నర్తకాకృతిన్.

వ. మఱియు, నానావిధదేవార్చనాసమయసమాహతగంభీరభేరీ
మృదంగశంఖకాహళపటహడిండిమాద్యవార్యతూర్యనాద
మేదురంబై లక్ష్మీలీలాభిరామంబును సముజ్జ్వలబాడ
బతేజోవిరాజితంబును ననేక భూభృత్కదంబసమాకీర్ణం

1. బొందవచ్చెంద్రియోత్సవ (మూ)

బు ను నిరర్గళవాహినీవ్యగ్రతాసమగ్రంబు ను మహాసత్త్వసంపన్నంబు ను నపరిమితజీవనసమృద్ధంబు నగుచు మాఱట పారావారంబనుటకుఁ దావలంబై యవ్విధంబునంగాక యక్కడక్కడ నెడపడక ప్రవహించు సెలయేఱులదండలఁ జల్లదనంబులఁ బొదలిన లేమావిమోకలఁ గలయం బెనంగొని నను పారు సంఫుల్లమల్లికామండపంబులలోనఁ దపనకిరణవిరహితంబు లగు శీతలచ్ఛాయాతలంబుల నలరుశయ్యల నెయ్యంబలరఁ దియ్యవిలుకానిచెయ్వులు మనంబులకింపగు పాళంబుల నొనర్చి ప్రియగాఢాలింగనబాధంబులు సడలపోలు విటవిటీజనసముదయంబుల మేనులఁబొడమిన మృగమదవాసనాకలితంబు లగు ఘర్మకణకలాపంబులఁ దొలంగించి వ్రేగువడి యల్లనల్లనమెలంగు మందమారుతపోతంబులచేతఁ దూలు పువ్వుగుత్తులతో సరసవిలోలంబై మొగయు రోలంబనికురుంబంబుల కలమధురఝుంకారరావంబుల ననుసరించి సమున్నతనితంబదేశంబుల శ్రుతికుతూహలంబుగా మంద్రమధ్యమతార స్వరోదారమానంబులం బాడు క్రీడాకిన్నరదంపతుల సంగీతరసంబునం గరంగి దొరుఁగు[1] ప్రత్నరత్ననికరంబులఁ గరంబు సొంపారు కనకకేళీశైలంబులచేత గండశైలసమాక్రాంతం బగు సుమేరు[2] ప్రస్థంబు నుం బోలెఁ బ్రకటింపుచు, శృంగారవనంబులలోనఁ జెంగల్వబావుల

1. రత్న నిత్న నికర (మూ) 2. ప్రాంత (మూ)

క్రేవల మహావిటపిచ్ఛాయల నాలోలకనకశృంఖలాబంధ నంబులై నమదాంధసింధురంబులు విశాలకపోలఫలకస్థల విగళదవిరళదానధారాపూరంబులు ప్రవహింపఁ గ్రీడాశై లంబు లని క్రీడావిహారిణు లగుముగ్ధబాలికలు సమధిరోహ ణలీలాకాంక్షితంబున డాయంజని తదీయపుష్కరఫూత్కార సముత్థజలశీకరంబులు చింది పయింబడిన దంతావళంబు లని యులికిపడి నల్లమొయిళ్ల చెంగట మెలంగు మెఱుఁగుఁదీఁగెల కైవడి ఝల్లునం జెదరి మరలి క్రీడామందహాసరసలవంబు లు మోముఁదమ్ముల కలంకారంబులుగా సంచెలంచెలై పరస్పరనిగృహీతకరకమల లగుచు నలువంకల మాదవేగం బునఁ బఱచుసురిపెంబుల మొఱయుచరణకనకనూపురఝు లంఝులారావంబులకుఁ బ్రతిస్వనంబు లిచ్చురాజమరాళంబు ల సముదాత్తనాదంబులు మర్మభేదంబులై నిగుడ మానం బులపట్టు గట్టిపెట్టి యన్యోన్యపరిరంభణసంభ్రమంబు లో నర్చువిరహిణీవిరహులు ను నానామార్గంబుల నాగరకుమా రవర్గంబులు విడివడి కెరలి తిరుగుమదనమదనాగసహస్రం బులయలవున మలయుచెలువునకుఁ జెలంగి తొలంగక జా లకంబులవెంటం జూచు చంద్రశాలికాసౌధంబులమీఁది యిందీవరాక్షుల కటివంకబొమల మురిపెంబులఁ జెలువారు మెఱుంగుఁ జూపులు తిర్యఙ్మండల ప్రచారభంగీతరంగితంబు లై కలయఁ బొలయుచు దిశావకాశంబు లలంకరింప నిత్యో

త్సవంబులకుఁ గట్టినవివిధవిరచితకహ్లారసుందరవందన మా
లిక లనునాఁగ యోసరిలక వియన్మండలంబున దండలు దం
డలై మెండుకొని తిరుగు మిండతుమ్మెదకొదమల మొరపం
బులు గలిగి, ఫలితోద్యానంబునుంబోలె ద్విజరాజవిరాజి
తంబు ను ద్విజరాజమండలంబునుం బోలె సుధానిలయంబు
ను సుధాసముద్రంబునుంబోలెఁ బురుషోత్తమాధిష్ఠితంబు ను
బురుషోత్తమశయనస్థలంబునుం బోలె ననంతనాగరమ్యంబు
ను ననంతనాగలోకంబునుంబోలెభోగవతీభాసితంబు ను నగు
చు వజ్రప్రభాపూర్ణంబయ్యును భూభృత్కదంబసౌభాగ్యం
బును గేతుసమాక్రాంతంబయ్యును గళాధరవిలసితంబును
బుణ్యజనవాసంబయ్యును సుపర్వబహుళంబును దార్క్ష్యవి
హారణస్థలంబయ్యును భుజంగకేళీసంపన్నంబును నై చాం
చల్యరాగ వికారంబులు ఖండితాంగనాపాంగంబులయంద,
సంతాపార్తివిహ్వలభావంబులు విరహిజనహృదయంబుల
యంద, తామసమదాంధత్వంబులు మదావళములయంద,
నిర్దయగాఢనిబద్ధనిరోధంబులు మిథునమిథఃపరిరంభసంరం
భంబులయంద కాని తనయందు లే వని పొగడ్త వడసి య
భ్యుదయకలకంఠంబులకు నారామంబును నైశ్వర్యమూలం
బులకు నంబుజాకరంబును నానందసుధారసంబునకు సర్వ
పాత్రంబును నభినవోత్సవపారిజాతలతికలకు నాలవాలంబు
నగుచు నొప్పునప్పుటభేదనంబున కధీశ్వరుండై యాసహ
స్రగోపాలమహీపాలుండు.

చ. హరవచనప్రసాదమహిమాధికుఁడై మహనీయరాజ్యవి
స్ఫురణము దీప్తతేజము ప్రభుత్వవిశేషము గల్గి గోమతీ
పురవర మేలె నిట్లు పటుభూతి యెలర్పఁగ నెందు నేమహీ
వరులకు లేనికీర్తి విభవంబులు గాంచి జగత్ప్రసిద్ధిగన్.

క. అతని తపస్సామర్థ్యము
శితికంఠుని కరుణపెంపుఁ జెవులార గతా
గతజనులవలన విని య
ద్భుతహర్షము లంది రఖిలభూనాయకులున్. 103

వ. ఇట్లు తేజోనుభావంబులు వడసి పరమోత్సాహసంపన్న మానసుండగు నాగొల్లపుడమిఱేఁ డొక్కనాఁడు కృష్ణ వియోగభారానలంబునఁ గ్రాఁగుచున్న పుత్త్రిం జూచి యీ ముగ్ధమనోరథంబు సమకూడదేని నాకు నీ రాజ్యానుభవంబును నిరర్థకంబ యని యాందోళింపుచు నేఁ డెవ్విధంబుననేని కుమారుని బోధించి శోభనంబు నడపవలయు నని నిశ్చయించి పుత్త్రపురోహితామాత్యబంధువర్గంబులతోడఁ గూడి యుచితకాంతాసహితుండై పసిఁడిసౌధంబునఁ గొలువు గూర్చుండి ప్రియసల్లాపంబు లొనర్చి ప్రసంగంబు దిగిచి నిజతపఃప్రకారంబును మహేశ్వరప్రసాదభంగియు నెఱింగించి కొడుకుతో మన్నన దోఁప ని ట్లనియె. 104

గీ. నాదువచనంబు మదిఁ గొంత కే యాదరించి
బంధుజనములు మిత్త్రులుఁ గే బ్రస్తుతింప

ననఘ నీముద్దుచెల్లెలి నారికిఁ బెండ్లి
సేసి మాకిందఱకుఁ బ్రీతి సేయవయ్య. 105

గీ. ఇదియ యస్మన్మనోరథం బింక నొండు
దలఁప కిది యయ్యకొనుటయ తగవువినుము
నీకు సామ్రాజ్యసంపద నెమ్మిఁగలుగ
రాధికకు నైన ప్రియపతి ప్రాప్తి వలదె. 106

వ. తదనురక్త గావునఁ బిన్నపాప నమ్మహాత్మున కిచ్చి యతని నాశ్రయించుట సర్వలోకహితంబును బరమసౌఖ్యోపాయంబును నని నయపూర్వకంబుగాఁ బలికిన విని దుర్మానంబున నియ్యకొనంజాలకయున్న భద్రకుండు కొండొకచింతించి స్వయంవరవ్యాజంబున నానారాజసమాజంబు రప్పించెద నప్పు డమ్మహావీరలోకంబుముందట వెన్నుండు కన్నెం బరిగ్రహింపఁ జూచెనేని మహామానమాత్సర్యశౌర్యాదిగుణప్రేరితం బగుమనంబునఁ గనలుగదిరి గోపాలమాత్రునకు రాజకుమారిం దక్కనిచ్చుట సిగ్గుగాదె యని తలంచి తత్సంరంభంబు కుంఠితంబు సేసి యెవ్వఁడే నొక్కబలిమిగలరాజు కన్నె నాక్రమించుకొను నట్టియెడ ననుకూలుండ నైకయ్యంబు గలిగినఁ దోడుపడి వానికిఁ బరిణయమహోత్సవంబుసలిపి మాధవు సిగ్గువఱచి మాట నిలుపుకొనియెదఁ గాక వీరితో నిప్పుడు వాగ్వాదం బేలయని యిట్లు కపటకృత్యం బూహించి యమ్మాధుండు వెడవెడయంగీకారంబుతో నిట్లనియె.

సీ. పలుమాఱు నీవు చెప్పఁగ భవదభిమత
మేటికిఁ గాదన ƒ నిష్టమైన
లాగునఁ జేయు ముల్లఘునకుఁ దోఁచిన
యాగామి పరికింపు ƒ మంటేఁగాక
యది యట్టులుండె నందాత్మజునకె యిత్తు
ననుచుఁ బేర్గిచ్చి నీకాడ నేల ?
దైవ మాతనికి నీతరలాక్షి సృజియించె
నేని నన్యులకది ƒ యేలదక్కు
తే. నట్ల యయ్యెడుఁ గాక నాకైనహాని
యేమి ? శోభన మేరికి ƒ నింపుగాదె
యైన విను మింక నొక్కటి ƒ యవధరించి
యఖిలజనులకు సమ్మతమైన మాట. 108
మ. జననాథత్వముఁ బ్రాభవంబును మహైశ్వర్యంబునుం గల్గియుం
జనునే పెండిలి డాఁగిసేయ నఖిలక్ష్మాపాలలోకంబు శో
భనసౌభాగ్యము చూడరావలదె సంభావించి యుష్మత్తపో
ధనసామర్థ్యములుగ్గడింపుచు మహోత్సాహంబు దీపింపఁగన్.
క. ప్రియబంధుజనుల యనుమతి
రయమున జగమెల్లఁ బొగడఁ ƒ బ్రాభవభాగ్యో
దయము తెలర్పఁగ రాధా
స్వయంవరము నఖిలదిశలఁ ƒ జాటింపు తగన్. 110
వ. అప్పుడు. 111

క. కరితురగస్యందనభట
పరంపరలు గొల్వ వచ్చి ౯ పార్థివతనయుల్
పరికించిచూడఁ గన్యకఁ
బరిగ్రహింపంగరాదె ౯ పద్మాక్షునకున్. 112

వ. అని పలికిన నచ్చటివార లందఱు నట్లయగా నని సంతసించిరి. సహస్రగోపాలభూపాలురును శూలిదివ్యవచనంబు లిట్లయగుటకు హర్షించి నందనందను నభినందించి యొక్క శుభలగ్నంబు నిర్ణయించి రాధాస్వయంవరం బని పురజనులకుఁ జెవులపండువుగా హజారంబునఁ గనకఘంట ల్వేయించి యట్ల నానాదేశంబులఁ జతురజనులం బంచి చాటించిన.

క. ఆ విధ మంతయు రాధ స
ఖీవర్గమువలనఁ దెలిసి ౯ కేవలబుద్ధిన్
భావించి విభునికడకున్
దా వెరవున బోటిఁ బంపఁ ౯ దలఁచి కడంకన్. 114

వ. ముకుందునిం బిల్చి తత్కారం బవలంబించి గారవించి యిట్లనియె. 115

చ. కనినదిగాక మజ్జనని ౯ గారవమొప్ప ననేకభంగులన్
బెనిచితి నన్ను నీక్రియలఁ ౯ బిన్నట నుండియు నిప్పుడింత నే
నినుఁ గొనియాడ నేమిటికి ౯ నీకిదివింతయెమ్మత్ప్రియాంతికం
బున కతిసత్వరంబునన ౯ బోఁదగు నీకు సఖీశిరోమణీ! 116

వ. ఎట్లంటేని. 117

సీ. అస్మత్ప్రకారంబు నన్న యాగ్రహమును
జనకునితపమును శంకరప్ర
సాదభంగియుఁబుర సౌభాగ్యమును[1] జెప్పి
మఖిలంబు నెఱుఁగ స్వయంవరంబుఁ
చాటఁబంచిరి[2] యింక సకలభూకాంతులు
వత్తురు బలసముద్వృత్తులగుచు
నప్పుడు గార్య మెట్లానో భద్రకుమాట
యిది నిశ్చయం బని యెఱుఁగరాదు.

తే. చింతవంతల నుల్లంబు సేదఁదక్కి
యున్న యది యొందువిధమున నుత్పలాక్షి!
లేశమంతయు మదిఁ గొంకు లేనుసు వ్వె
ప్రియునకై నాదుజీవము ర్పింతుఁ గాని. 118

గీ. ఇంత చింతింపఁగా నేల యేను గలుగ
ననియెదో యేమొ యెఱుఁగుదు నదియు నేను
నీను బోధామృతంబున నిలిచెఁ గాని
యొడలఁ బ్రాణంబు లిన్ని నాళ్లునుప వశమె? 110

వ. అదియునుం గాక, 120

చ. కమలజముఖ్యసన్మునులు గాఢవివేకులు సైతము న్మనః
కమలతలాభిగమ్యములు గావని చెప్పుదు రేని యంఘ్రిప
ద్మములటువంటివనందునికు మారునిపాదముఁ ద్రొక్కఁజూచెదన్
బ్రమద! మదీయసాహసము భంగియొఱింగితె! చిత్రమయ్యెడిన్.

---

(1) జగమ (మూ) (2) యిండ్ల (మూ)

వ. అని సంశయాపన్నమానసయై బెగ్గిలి పలుకు నమ్ముద్దియకు మధురవాణీసందేశోపవచనంబుల మాధవుమనోనురాగంబు నీయందుఁగలుగుటయెఱుఁగవే యని తెలిపి శంకావైకల్యం బుడిపి నిన్ను నీప్రాణేశ్వరుం గూర్చి మీయుద్దఱచేత మెప్పు వడసెదం జూడుమీ యని తదాలింగనముఖసంభావనంబులు గైకొని ముకుందిని నందకపాణిపాలికిం జనియె, రాధయుఁ బువ్వుపాన్పున మేను చేర్చి తనలో ని ట్లనియె. 122

సీ. శీఘ్రయానంబున ♦ చెలిపోయి మోహనా
కారుఁ గృష్ణునిఁ బొడఁ ♦ గాంచు నొక్కొ
కాంచి రాధికచెలికత్తెఁ దానని యెఱిం
గించిన నతఁ డాదరించునొక్కొ
యది మదీయక్రమం ♦ బంతయు వినిపింపఁ
దనమది నిజమని ♦ తలఁచునొక్కొ
తలఁచిన యట్టుల ♦ దయసేసి సఖిఁ గూడి
యేతెంచు నొక్కొ నా ♦ యింటికెలమి

తే. వచ్చి పైకొని కౌఁగిట ♦ గ్రుచ్చి తేర్చి
దైన్య మెడలించి చిత్తసంతాప మణఁచి
రతుల నోలార్చి రతిరాజరాజ్యలక్ష్మి
నన్ను నేలించు నొక్కొ యానందలీల. 123

ఉ. చిన్నటనుండియు న్నిగుల క్కెర్చిన ప్రేమునిఁ జిత్తవృత్తిఁ గై
కొన్నయనుంగు గొల్లతలకుఁ దమగండయియున్నయట్టియ
వ్వెన్నుఁడు నాదుపై మనసువేయుట నిక్కమనంగవచ్చునే
వన్నెలమాటల న్మధుర వాణిననున్ భ్రమియించెఁగాకొగిన్.

ఉ. నారదుఁ డేటికిన్నుడువు నావిధ మొక్క ప్రయోజనంబుగా
నూరకపోయి యప్పలుకు లుల్లమునంగొని లేనియాదటన్
గూరఁగ నేలయవ్విభునకున్ననుబోఁటులు లేరె బేలఁడే
వారక యిట్టివారి కయివారపుమాటలు నమ్మవచ్చునే.

వ. అని బహుప్రకారంబుల నుగ్గడింపుచుఁ బ్రావృట్సమయకా
దంబినీజలధారలకు సారంగియుం బోలె నక్కురంగలోచన
సఖీసందేశమధురవచనంబులు గోరి యెదురుసూచుచునుండె
నట ప్రేవపల్లెలోన. 126

క. ఏచందంబునఁ బంకజ
లోచన సిద్ధించుఁ దదవలోకనకలనా
శ్రీచంద్రికలే నెన్నఁడొ
కో చెలఁగుచుఁ గ్రోలుదును జకోరకము క్రియన్. 127

క. అనికోరుచు మదనవ్యథ
మన సెరియఁగ వేఁగుచున్న మాధవు బృందా
వనమునకుఁ దెలిసి యొయ్యనఁ
గొని చని గోపకులు తమ్మికొలఁకుల దండన్. 128

గీ. లలితకిసలయ కుసుమఫలప్రతతుల
విట్టువీఁగుచు మకరందవృష్టిధార

లోలిఁ గురియుచుఁ బరపయి యొప్పు కల్ప
కావనీజంబు నొక్కటి నాక్రమించి. 129

సీ. కొదమ కెందమ్మి పూగోపురమ్ములతోడ
గొజ్జంగపువ్వుల కోటవెట్టి
యాలోనఁ జిగురుల జాలకంబులు దీర్చి
మేలుచెంగల్వల మేడఁగట్టి
యామేడలోన సొం పలర నున్నతముగాఁ
జేమంతిపువ్వుల సెజ్జ వన్ని
దానిపైఁ బన్నీటి ధారలఁ దోఁగిన
తమ్మినూల్చీర యందముగఁ బఱచి

తే. యందు గోవిందు నునిచి యర్ఘ్యవిధముల
నోలిఁ జెంగల్వ తలగడ లొత్తుచేర్చి
చందనోదుమరంద బిసవ్రజములఁ
జేయఁగల వల్వ లెల్లను జేయఁ జేయ. 130

వ. అట్టియెడ. 131

గీ. అట్లు చని యమ్ముకుందిని యబ్జనాభు
తెఱఁగు తత్పరి జనులచేఁ దెలిసి సంత
సం బెలర్పఁగ బృందావనంబు చొచ్చి
పుష్పమయగోపురద్వారభూమి నిలిచె. 132

వ. నిలిచి యొక్కగోపాలునిం బిలిచి రాధాకన్యక చెలికత్తె
ముకుందిని యను సుందరి దేవరపాదపద్మంబులు దర్శింప

వచ్చియున్నదని విన్నవింపుమని పంపినఁ జని వాఁడును నట్ల యమ్మహాత్మునకు విన్నవించి తదాజ్ఞాప్రకారంబున వచ్చి దానిం దోడ్కొనిపోయిన నదియును నెడనెడఁ జూర్ణీకృత కర్పూరఖండనికరంబులును బరిష్కారీకృతమృణాలంబులును [1]వలయీకృతబిసతంతుసంతానంబులును రాశీకృతప్రవాళ మంజరీపుంజంబులును నానాముఖప్రకల్పితధారాయంత్ర విముక్తహిమవారిధారాప్రవాహంబులును మొదలైన తదీ యశిశిరోపచారద్రవ్యసముచ్చయంబు లవలోకింపుచుఁ జని యభ్యంతరంబు ప్రవేశించి ముందట, 133

సీ. నెత్తమ్మిఱేకుల ♦ నెఱిమించు వెడఁదక
న్గోనల నమృతంబు ♦ గురియు వానిఁ
జిన్నికుంతలములు ♦ చెరలాడ నొసలఁ
జుట్టిన పింఛరింఛోళివానిఁ
గర్పూరగంధ పంకంబును బూరయు పె
న్నురమునఁ గౌస్తుభ ♦ మొప్పువాని
లలితముక్తాఫలాంచలముల బంగారు
వలువ కటిస్థలి ♦ నలరువాని

తే. మేలినీలాలరంగుల ♦ మేనివానిఁ
గలికివలరాచ సిరులీను ♦ చెలువువాని
నాశ్రితానందకందళం ♦ బైనవాని
మదనగోపాలకృష్ణుని ♦ మగువ గాంచె. 134

---

1. ప్రకృతజనసంతు (మూ)

గీ. కాంచి కాంచనపద్మ సంకలితకందు
కంబు గానుక యిడి మ్రొక్కి కరపుటంబు
ఫాలతలమునఁ గీలించి మ్రోల నిలిచి
బహువిధంబులఁ బొగడి యప్పద్మగంధి. 135

ఉ. దేవ ! కృపానిధేయ ! పటుదీప్తసురేంద్రకకిరీటకాంతి సం
భావితపాదపద్మ ! హితపద్మచకోరకపూర్ణచంద్ర ! తే
జోవిజితార్కమండల! ప్రసూనశరోజ్జ్వలరూప! కృష్ణ ! నీ
సేవయొనర్పఁగంటి దయసేయుమునన్ను డిగంపుదానిఁగాన్.

వ. అని కొనియాడుప్రాణేశ్వరీప్రియవయస్యారత్నంబు డాయం బిల్చి పాన్పడగ్గఱ నడుగులదండఁ గూర్చుండ ననుగ్రహించిన నది యట్లసేసి తద్దివ్యచరణారవిందంబులు నిజపాణిపల్లవంబుల [1]మెత్తమెత్తన యొత్తుచుఁ బరమానందంబునుం బొందె.

క. రాధాకన్యకుఁ జెలినై
మాధవ ! నే ధన్య నైతి మానీంద్ర సమా
రాధనయోగ్యపదము లివి
సాధించితిఁ గొలువ భక్తసంకల్పనిధీ ! 138

ఉ. నీమహనీయరూపరమణీయత వేడ్క వహించి రాధ య
క్కామునిపువ్వుసాయకనికాయములన్ గుదిగొంటయున్ బ్రియం
బైమదిఁదోఁచె నాకు నెటులంటివయేని తదీయమాత్యసే
వామతిఁగాదె యిట్టులభవద్బహుమానముఁగంటినచ్యుతా !

1. మెత్తు మెత్తన (మూ)

వ. అని పలుకుచు నుచితసమయం బగుటకు సంతసించి యష్ట్రా-
ఘసంచారికాతిలకంబుతదీయవదనచంద్రమండలవిస్ఫురసౌం
దర్యచంద్రికాంకురఖండంబులం దనలోచనచకోరంబులకు
మేఁతవెట్టుచు దేవా ! యవధరింపుమని యిట్లనియె.

క. కందర్పకోటిలీలా
సౌందర్యనిధాన ! గోపఁచంద్ర ! యశోదా
నందన ! మాధవ ! రాధా
సుందరి మది నీగుణములుఁ చూఱలు వట్టెన్. 141

చ. అది మది సంను సేసికొనిఁయంగజుఁ డైక్షవచాపటంక్రియా
ప్రదళితకర్ణరంధ్రుఁడ యిఁపైకొని పువ్వులనారసంబులన్
హృదయముముంచిసిగ్గుఁగుదిఁయించివిమోహముపెంచిమానసం
పద యదలించి నెవ్వగలఁ పాలుగఁ జేసెఁ గురంగలోచనన్.

సీ. కడువడి మొల్లమొగ్గలవింటికోలల
హృదయంబు వగులంగఁ నేసియేసి
క్రొమ్మావి లేఁదీఁగెఁకొనయత్తలంబున
మెఱుఁగుఁ జన్గవ గ్రుచ్చిఁ మెఱిమి మెఱిమి
చిక్కనిక్రొవ్వాఁడిఁ చిగురాకుచురకత్తి
చేత మర్మంబులుఁ సించి చించి
చేకొని మొగలి పూఁతేకుఱంపంబున
గుట్టు ప్రయ్యలు వాయఁఁ గోసి కోసి

తే. వీరలక్ష్మీవిలాసంబు విస్తరించి
నిఖిలశస్త్రాస్త్రవిద్యల నిపుణుఁ డగుచు
బాలఁ గాఱింపుచున్నాఁడు ప్రసవధన్వి
యేమిచెప్పను దురవస్థఁ గృష్ణ! నీకు. 143

వ. ఇట్లు గాఱించుచున్న మకరకేతనుబారింబడి ధైర్యలజ్జ లుజ్జగించి కామతరంగమాలికావర్తంబుల సుడివడుచు భవల్లీలాస్మరణతరణిం దేలుచు. 144

మ. ఘనపీనస్తనకుంభమండలము పైఁ గస్తూరి నొప్పారఁగాఁ
గొనగోరన్నను వ్రాసియీవిధమునం గూర్పుంచు వేయంచుఝు
ల్లన రోమాంచమునించియశ్రువులు జాలై పాఱఁబద్మాక్షి వె
చ్చని నిట్టూర్పు నిగుడ్చు నీధృతికిఁ గృష్ణా! వల్లవీవల్లభా!

చ. సలలితచంద్రకాంతమయసౌధమున న్మణిజాలకంబులన్
నలినదళాయతాక్షి యమునాతటినీసలిలోర్మిపఙ్క్తులన్
మలయుచుఁ దేలుహంసమిథునంబులఁ గన్గొనియాంబుకేళియా
చెలువున నేనొనర్తునొకొ చెల్వునితో నని కోరు నెమ్మదిన్.

చ. అఱిముఱిఁ గేళిదీర్ఘికఁ బ్రియంబునఁ గోకము తమ్మితూఁడువే
కఱచి నెమర్చి తద్రసము కామినివాతెఱఁ గుమ్మరించి త
త్తఱపడి కేళికిం గవయుతద్విధమంతయుఁ బ్రేమఁ జూచి య
త్తెఱవ మనంబులోన విధిఁ దిట్టు నినుం గవ గూర్పలేమికిన్.

వ. మఱియు వేదనాభరంబున. 148

చ. పొరిఁబొరి మేన నుప్పతిలు పుష్పశరాసనవహ్నికీలలన్
దరికొని రాఁజఁ బుష్పమయతల్పమునన్ బయిచీరెఱుంగ కం
బురుహదళాక్షి వ్రాలి వగఁ బ్రుంగుచు మందెడు కొల్కి యందు బం
గరుపుశలాకయుం బలెను గ్రాఁగఁగఁ బొక్కెడు నో జనార్దనా!

గీ. కామపావకశిఖలచేఁ గాఁకవట్టి
యున్న యప్పద్మగంధి పయోధరముల
మీఁదఁ బన్నీటగంధంబు మెత్త మెత్తఁ
దోన పొడిపొడి యై రాలుఁ దోయజాక్ష! 150

చ. తలిరులపాన్పున న్మదనతాపమునం గృశయై మనంబునం
దలరఁగ వజ్రపంజరపదస్థితపోషితరాజకీర మ
న్నెలఁతుక బుజ్జగించు నిదె నీవిభునిం గొనివత్తు నేటికిన్
గలఁగెదవమ్మ! యంచుఁ జెలికత్తెలమాటలు నేర్చి యుండటన్.

వ. ఇత్తెఱంగున భవద్వియోగభారంబున నపారఘోరకాంతార మధ్యంబునఁ బరిభ్రమించు చందంబునఁ జేరుగడ లేక యార్తిం బొంది ప్రవర్తిల్లుచున్న చిత్తంబునఁ జీఁకటిఁ ద్రవ్వుచున్న ముద్దు కన్నె దురవస్థాక్రమంబు తండ్రి యెఱింగి నీకు నీ సమకట్టి కొడుకు సమ్మతి లేమికి వగచి విషాదవేదనానిర్భరం బగు మనంబున నెంతయుం దెలివి లేకయుండి యమ్మహానుభావుండు వీరశైవాచారపారాయణప్రవరుండు గావున యమునా తరంగిణీమధ్యంబునఁ జిత్రతపోనిష్ఠాగరిష్ఠత నీశ్వరసమారాధనం బొనర్చి తదీయదివ్యవరప్రసాదమాహాత్మ్యంబున సక

లై శ్వర్యసంపల్లలితం బగు పురంబున రాజత్వంబు వడసి యత్యంత తేజోవిలాసవంతుండై యుండియుఁ బుత్రీపుత్రవాత్సల్యగౌరవంబున నెప్పటియట్ల కుమారిం గృష్ణున కిచ్చుట మేలని భద్రకుం బ్రబోధించిన నతండేమి తలంచెనో స్వయం వరమహోత్సవంబున నిత్తమని యద్దుపెట్టిన నాసహస్రగోపాలమహీపాలుండును దేవరప్రభావంబుకొలఁది యెఱింగినవాఁడై యట్లకాక యని నానాదేశంబుల స్వయంవరంబు చాటింపఁ బంచినఁ దత్ప్రకారంబంతయు నూహించితలంపుకొలఁదిరామికి నత్తలోదరి బెగ్గిలి మధురవాణిచేత నిజప్రకారంబు నీకు విన్నవించిపంచినదయ్యె, నేఁడు నీమన్ననకొలంది యెఱుంగవేఁడి భవత్సన్నిధికి నన్నుం బంపె నప్పడు నాతో నిటనియె. 152

చ. వనజదళాక్షి ! నీవు మదర్థవసతెఱం గెఱిఁగింప నాదరిం
చునో యటుగాక కూరుములు చూపుచు సంగడివాయకింపులర్
దనిపెడు పువ్వుఁబోండ్లకు ముదంబొదవన్ బరిహాసకంబు సే
యునో బహుకామినీరతుని యుల్లమొకళ్ల పయిన్వసించునే !

వ. అని.

శా. అంతర్వ్యాప్త విలోచనాగ్రములపై నా దౌడు దైన్యంబుహ్రా
చ్చింతా[1]తంతువులెల్లఁ జిక్కువఱపన్ జే వంతయుందూలిదు
ర్దాంతానంగభుజంగవక్త్రమునకున్ దప్పింపరాకున్న న
న్నింతీ కృష్ణుఁడు గావఁడే కరుణ నీకేపిచందము లెన్నిసినన్.

1. తంతువు చిక్కులెల్ల వరలన్ (మూ)

గీ. విభుఁడు నవ్వులు చేసి నీకవిన్నపంబుఁ
జిత్తగింపఁడ యేని దాఁసీత్వమునకుఁ
జొత్తు నట్లును మన్ననఁ జూపఁడేని
యిత్తుఁ బ్రాణంబు లతనికి నిందువదన ! 155

ఆ. [1]యనుచుఁ దెల్పు మనియె నంగజుకగపడి
నిశితపుష్పబాణనిహతిఁ గనియె
నార్తజనశరణ్య ! యచ్యుత ! నీదివ్య
చిత్త మబలమీఁదఁ జేర్పు కరుణ. 156

వ. అని సకలంబును దేటపడఁ జాతుర్యంబునఁ బలికిన ప్రియ కార్యధుర్యంబు లగు నయ్యింతిమధురాలాపంబులకు నలరి మాధవుండు శిశిరోపచారంబులవలన నాత్మప్రవర్తనంబును దృష్టంబగుట యెఱింగించి ముకుందినీ! నీతలంపుతోననవచ్చి నీకు మెచ్చు పుట్టునట్టుగా మీభద్రకుండును మధురాధ రాశాపాశబద్ధులై వచ్చిన యారాజకుమారులు నాలోకింప నాచకోరలోచనఁ బరిగ్రహించి మరల్చినవారికి వేఁడిమిఁ జూపి తెరల్చి వినోదంబునం గొనివచ్చి యన్యోన్యప్రేమా వలోకనమధురవచనోపలాలనప్రముఖహితవిధానంబులఁజిర కాలవియోగతాపోపశాంతి యొనర్తు. నీవు ముందటఁబద. నీతోడనే కూడి వచ్చెద నని సురభిగంధమాల్యాంబరాభ రణంబు లొసంగి కరుణించి నిజనామాక్షరకలితం బగుపద్మ

1. అనియెదెవు కల్పితి (మూ)

రాగపదకంబు రాధికకుం గానుక యిమ్మని పీడుకొలిపి మేను వొంగ గమనోన్ముఖుండైన నదియు నిజపురంబున కరుగుదెంచి తదనుగ్రహాలబ్ధకనకభూషణమాల్యానులేపనంబులు ప్రసాదచిహ్నంబులఁ జూపింపఁ దనరాక కెదురుచూచుచున్న సఖీజనంబులకుఁ గన్నులపండు వగు తెలిమొగంబుతో రాధావధూటికిం బొడసూపి యడుగుల కెరఁగి మధుర సుధాపిచ్ఛిలంబుగా నిట్లనియె. 157

గీ. వచ్చెఁ గృష్ణుఁడునీప్రాణవల్లభుండు
మెచ్చె నీమాటలకుఁ జనవిచ్చె నెలమి
నేలుకొమ్మింక నా జగదేకవరుని
బాలికాలోకచూళికాభరణమూర్తి. 158

క. ఆరూపం బా తేజం
బా రాజస మా విలాసమా యౌదార్యం
బోరమణి! వేల్పులకు లే
దారసి చూడంగ వినవె యతనికిఁ దక్కన్. 159

సీ. రామ! త్రైలోక్య సామ్రాజ్యసంపద లీలఁ
బాలించు నాతని ప్రాభవంబు
తన్వి! దేవేంద్రశతంబు సౌభాగ్యంబు
సమకొల్పు నతని యైశ్వర్యరేఖ
సకియ! భాస్కరసహస్రంబు విడంబించుఁ
జూచిన నతని తేజోవిశేష

మలినీలకుంతల ! యసమాస్త్రజయలక్ష్మి
నెలయించు నతని లేఁ గలికితనము

ఆ. వె. హంసయాన ! నీకు నట్టి మోహనమూర్తి
భర్త యయ్యె నింకఁ బ్రమద మెసఁగ
నిఖిలగోపకామినీబృందములు గొల్వ
నతులభోగమహిమ లనుభవింపు. 160

క. ఓవనిత ! మధుర మగునీ
యావనఫలరసముఁ గ్రోలు హరికీరము శ
య్యావజ్రపంజరంబున
భావజశాస్త్రములఁ జెవులపండు వొసఁగుమన్. 161

వ. అని తదర్పితదివ్యపదకంబు చేతికిచ్చి నీమగండు నీకు సూడి దయిచ్చినాఁ డని మచ్చికం దెలిపి తన పోయివచ్చినకార్యసరణి యెఱింగించిన నప్పొంగి యవ్విభూషణంబు శిరంబున మోపి మేను గరుపాఱఁ గుచమండలమధ్యంబున నలంకరించి చెప్పినమాట తిరిగి యడుగుచుఁ బ్రమోదాంబుధిఁ దేలుచుండెఁ దదనంతరంబ. 162

చ. కరధృతశంఖ ! శంఖనిభకంధర ! కంధరనీల ! నీలకం
ధరవినుతాత్మ ! యాత్మభవనవ్యమనోహరరూప ! రూపక
ల్పరుచిరకీర్తికందళ ! దళన్నవనీరజపత్త్రనేత్ర ! నే
త్రరుచివికాసితాబ్జకుముదా! కుముదావహబాహుమండలా!

క. రంగత్కరుణాసాంద్రా
పాంగసుధావృష్టి వర్ధితాశ్రితజనసా
రంగాంతరంగ ధాతా
[1]పాంగకలాపా వృతోత్తమాంగ ! శుభాంగా ! 164

మంజరీవృత్తము.

మదనతత్త్వవేదీ ! మంత్రతంత్రానవద్యా !
విదితవేదవిద్యావీథి సంచారమోదీ !
సదలిపక్షనీలా ! సర్వకళ్యాణలీలా !
సదయనేత్రకోణా ! శార్ఙ్గచక్రప్రవీణా ! 165

గద్య. ఇది శ్రీమన్మదనగోపాలచరణకమలసేవాధురీణ సత్కళా
పారీణ కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభు
సుపుత్ర సుకవివర్య రాధామాధవమెల్లనార్య
ప్రణీతం బైన రాధామాధవం బనుశృం
గారప్రబంధంబు నందు
తృతీయాశ్వాసము.

---

1. పాంగ కలావృతో (మూ)

శ్రీరస్తు.

# శ్రీ రాధామాధవము.

## చతుర్థాశ్వాసము.

శ్రీరాధామదవద్వ
క్షోరుహమకరికలాపశోభనముద్రా
ప్రారంభ జృంభసునిశిత
ధారానఖజాల నవమదన గోపాలా. 1

గీ. అవధరింపుము దేవ సంయమివరుండు
సకలవేదాంతవిద్యావిశారదుండు
శుకమహాయోగి వలికె నుత్సుకత మెఱయ
నింపుగా నాపరీక్షిన్నరేంద్రునకును. 2

గీ. అవ్విధంబున రాధాస్వయంవరంబు
చాటినది యాదిగాఁగ రాజన్యవరులు
ఘోటహేషాభటార్భటీకుంజరేంద్ర
బృంహితధ్వానములు మిన్ను పిక్కటిల్ల. 3

క. అరుదేరఁ దొడఁగి రంబర
పరిలేఖన చతురచిత్రపట్టీధ్వజవి
స్ఫురదుజ్జ్వలమణిరథముల
సురుచిరభూషాసువేషశోభితులగుచున్. 4

సీ. ప్రవిమలముక్తాతపత్రంబు క్రీనీడ
వచ్చెఁ బాండ్యక్షమావల్లభుండు
గజఘటాఘంటికాఘణఘణాత్కారముల్
పొంగార వచ్చెఁ గళింగరాజు
పటుతురంగమనాట్యపాండిత్యవిభవంబుఁ
జిత్తగింపుచు వచ్చెసింధువిభుఁడు
లలితగాంధర్వకళారసలోలాంత
రంగుఁడై వచ్చెఁ గర్ణాటభర్త

తే. మలయ మాళవపాంచాలమగధమత్స్య
కురువిదర్భాదిదేశభూవరులు వచ్చి
రతులమాణిక్యమకుటాంశులతిక లర్క
మండలద్యుతితతులతో మాఱుమలయ. 5

ఉ. కొందఱుమన్మథాతురతఁగొందఱువిభ్రమరేఖఁ జూపఁగాఁ
గొందఱు వైభవంబునకుఁగొందఱుబల్మిసతిన్ హరింపఁగాఁ
గొందఱు పెండ్లిఁజూచుటకుఁగొందఱునెచ్చెలికార మొప్పఁగాఁ
గొందఱు పోరుగల్గునని కోరుచు వచ్చిరి సంభ్రమంబునన్.

సీ. గంధదంతావళగండస్థలక్షర
న్మదపూరలోలాలిమధురరవము
బహువందిమాగధపఠితనానారాజ
జయబిరుదావళీస్తవరవంబు

వైణికనఖరణద్వీణాకలితతంత్రీ
చారుకలస్వరోదారరవము
చామరమంజరీచయసమాందోళన
చలితకాంతాకరవలయరవము
తే. వారవనితాంఘ్రి కనక మంజీరరవము
లలితసంగీతరవము సల్లాపరవముఁ
జెలఁగి చెవులకుఁ బండువు సేసె గోమ
తీపురమునకు రాజు లేతెంచు వేళ. 7

వ. ఇవ్విధంబునఁ జతురంగబలసహస్రంబులతో నానాముఖం
బులఁ గ్రందుకొని వచ్చు రాజబృందంబుల నానాసహస్రగో
పాలమహీపాలుండు పుత్రపురోహితామాత్యబంధుముఖ్యు
లఁ దగినతెఱంగుల నెదుర్కొని తోడ్తెరంబంచి వచ్చినవా
రికి మనోహరస్థలంబులు విడిపట్లు వెట్టించుచు నుచితసంభా
వనలఁ బ్రీతులం జేయుచుండెనంత. 8

క. వనజోదరుండు పరిణయ
జనితోత్సాహమునఁ బొదలి సర్వముబలభ
ద్రున కెఱుఁగఁ జెప్పి యుద్ధుఁ
జననుద్యోగంబు సేసి సమ్మదలీలన్. 9

వ. సహచరగోపాలసుతులకు నెఱింగించి రప్పుడు తత్ప్రారంభ
సంభ్రమంబు దెలిసి వ్రజరాజకుమారికలు మరువేదనం

బొంది యొండొరులఁ బిలుచుచు గృహకృత్యంబులు మఱచి
మూఁకలు మూఁకలై ముచ్చటలకుఁ జొచ్చి తమలోన. 10

చ. సరసిజనేత్రలార! మన సారసనేత్రుఁడు రాధికాస్వయం
వరవిభవంబుఁ జూడఁ జను వాఁడయి నాఁడఁట వింటిరమ్మ భా
సురతరమూర్తి నవ్విభునిఁ జూచినయప్డు విరాళి పుట్టి య
త్తరుణి వరించు నెల్లవసుధావరకోటిఁ దృణీకరింపుచున్. 11

వ. అదియుండుంగాక. 12

క. ఇరువుర మనసున నించుక
మెరమెరగలదనఁగ మనము మెయిమెయివినమే
యరయము గా కిన్నాళ్లున్
వరుఁడును దదయోగవృత్తి వర్తించునటే. 13

ఉ. ఎక్కడిరాధ గల్గె నిది యేటికిఁ జాటిరి మిన్నుముట్ట న
ల్దిక్కులనున్ స్వయంవరము దీకొని యిద్దఱయాత్మఁ గూర్మి పెం
పెక్కఁగఁ జేసి తార్చె నది యెవ్వతొ యాతఁడు పెండ్లియాడినన్
దక్కక యత్తలోదరికి దాస్యము సేయఁగఁ జేసె దైవమున్.

ఆ. ఇంతనాటనుండి యేము, పగలమాని
నీకు వలచి తిరుగ నీరజాక్ష
నీవు వేఱయొక్క నెలఁతకు వలచి పో
నగునె యనుచు మనకు నాడరాదె. 15

క. మనమదనకామధేను‌వు
వనజాక్షుని నవ్విలాసవతి చేకొనె నే
మనువార మింక నక్కట
మనసిజబాణానలమున మ్రందఁగవలసెన్. 16

వ. అని మదనపరవశత్వంబున నెద్దియుఁ దోఁపక యున్మ్మలించి,

సీ. మేనుప్రాన్వ డనొక్క మెలఁత యూరకయుండె
ఘర్మాంబువులఁదోఁగెఁ గాంతయొకతె
యశ్రులు దొరఁగించె నలివేణియొక్కతె
[1]వైవర్ణ్యమునుబొందె వనిత యొకతె
చెలియొకర్తు తత్కథ నెలుఁగురాల్పడఁబల్కె
జలజాక్షియొక్కతె చంచలించెఁ
గలయికల్ దలచి యొకర్తుకపులకించె
మూర్ఛాలసత నొక్క ముదిత వ్రాలెఁ

తే. ప్రాణదయితుండు మదనగోపాలవరుఁడు
తమ్ము వంచించి రాధపైఁ దలఁపుఁజేర్చి
పెండ్లియాడంగఁ బోయెడు పెంపుసొంపు
మదనతాపము మనములఁ బొదలఁజేయ. 18

వ. ఇట్లు వగలనొగులు నమ్మగువలఁ దగవులమాటల సంచారి
కాముఖంబున నూరార్చి తనమోహనాకారంబునకుం దగు
నాకల్పసంకల్పంబున, 19

1 కర్తవ్య. మూ

సీ. అబ్జరాగకిరీట మహాదలధరియించి
శ్రుతులఁగుండల మంజరుల వహించి
కాదంబసుమములఁ గర్ణపూరములిడి
హస్తాబ్జముల వలయములుదొడిగి
వక్షస్స్థలంబున వనజమాల్యములతోఁ
గౌస్తుభగ్రైవేయకం బమర్చి
కనకాంబరచ్ఛన్నకటిఁ గాంచితలగూర్చి
యంఘ్రిపల్లవముల నందెలొసఁగి

తే. నూత్నమృగమద తిలకంబు నుదుటఁదీర్చి
మేలికుంకుమగంధంబు మేననలఁది
శంఖచక్రేక్షుచాపకంజములుదాల్చె
బాహుశాఖల మదనగోపాలవరుఁడు. 20

క. తనరారెం గుంకుమచం
దనపంకద్రవము చక్రధరు నురమున నా
తనిలోని రాధపైఁగల
యనురాగరసంబు వెలికి నడరెడుభంగిన్. 21

క. శ్రీకృష్ణుఁడు శంఖరథాం
గాకీర్ణప్రభలుకలయ నలమఁగనొప్పెన్
రాకాసంధ్యాసమయ సు
ధాకరసువిభాసితాంబుదపథంబు క్రియన్. 22

చ. లలితశిఖీంద్రచంద్రకకలాపసురేంద్రధనుర్లతాసము
జ్జ్వలతయుఁ గాంచనాంశుకలసద్ద్యుతివిద్యుదుదారరేఖయుఁ
గలిగి వినీలకంధరముకైవడి మాధవుఁడొప్పెఁ జాతకా
వళులవిధంబున న్గెలన వల్లవబాలకులుల్లసిల్లఁగన్. 23

గీ. కామసాహస్రనవ్యశృంగారరేఖ
నెరపి దినరాజశతకోటినిబిడకాంతి
వఱలుకొల్పి వెలింగె శ్రీవల్లభుండు
గురుతరైశ్వర్యములు సమకొల్పినట్లు. 24

వ. ఇట్లలంకారభూషితుండై వాసుదేవుండు చెలువారె నట్లు బలదేవుండును గైచేసెఁ దదనురూపంబున వల్లవకుమారులును,

సీ. పసిఁడికమ్ములపచ్చపట్టు[1]దట్టులు వేసి
శిరముల బర్హమంజరులు చుట్టి
క్రొన్నెలవంకబాగున నామములు దీర్చి
యక్కున వనమాల లలవరించి
కుండలాదికహేమమండనంబులు దాల్చి
నారాచపూర్ణతూణములు పూని
శంఖచక్రాంకితచారుభుజాదండ-
ముల సజ్యకోదండములు వెలుంగఁ

తే. గనకలతికలవేణువుల్ కటితలములఁ
గట్టికట్టాయితంబయి కడిమిమిగుల

1 దట్టీలు. మూ

నరుగు దెంచి సరోజపత్త్రాక్షునకును
దండము ల్వెట్టి నిల్చి రుద్దండలీల. 26

వ. ఇవ్విధంబునం బొడచూపిన సహచరగోపాలతనయసహస్రం బులం గని మధురమందస్మితచంద్రికలు నిగుడం గృపామృత పయోరాశితరంగంబుల నోలలార్చి పరమహర్షంబునం జను వాండై యుచితవాహనంబులు వలయునని యాలోకించి యాలోకేశ్వరుండు విశ్వకర్మం దలంచినం దద్దివ్యచిత్తంబె ఱింగి యతండు తాళగరుడధ్వజశోభితంబులు ను దివ్యాయు ధకలితంబులు ను సూతరథ్యసహితంబులునుసురభి కుసు మమాల్యాలంకృతంబులు ను సూర్యసంకాశంబులు నగు కాంచనరథంబులు రెం డంతరిక్షంబున రత్నప్రభాజాలంబులు పర్వం గొనివచ్చి ముందటం బెట్టి తత్ప్రసాదంబు వడసి కృత కృత్యుండై చనియె నప్పుడు. 27

క. హాలముసలదండమండిత
లలితభుజాదండుండై ప్రలంబారిసము
జ్జ్వలతాళాంకస్యందన
మలఘుజవంబొప్ప నెక్కె నతిహర్షమునన్ 28

ఆ. రాధ నెల్లి గూడి రతిరాజ్యసామ్రాజ్య
యోగసీర మిట్లు యుల్లసిల్లి
యెక్కువాడనంగ నెక్కె నిజస్యంద
నంబు లీల నందనందనుండు. 29

క. వరరత్నశోభితంబగు
నరదంబున నుదయశిఖరి నర్కుఁడువోలెన్
సురుచిరతేజోమహిమా
కరుఁడై హరినిల్చి పొల్చెఁ గౌతూహలియై. 30

వ. ఇట్లు రథారూఢుండై. 31

శా. పూరించెన్ హరిపాంచజన్యముజగత్పూర్ణప్రభాధన్యమున్
ధీరధ్వానకుతారలూనదనుజస్త్రీస్మారముద్వన్యమున్
దూరీభూత సురేంద్రముఖ్య సురచేతోజాత దుర్దైన్యమున్
దారాధీశసహస్రమండలమహోద్యత్కాంతిసన్మాన్యమున్.

గీ. శంఖనిస్వన మాలించి సకలజీవి
సముదయంబును నానందజలధిఁదేలె
మనములుప్పొంగఁ దద్ధ్వని ననుసరించి
పిల్లఁగ్రోలులువట్టి రాభీరసుతులు. 33

మ. కురిసెన్పువ్వులవాన మేఘములు దిక్కుల్నిండ విస్ఫూర్తిని
ర్జరభేరుల్మ్రోసెన్ సురాంగనలు లాస్యంబాడి రింద్రాదిది
గ్వరసంకీర్తన లుల్లసిల్లెఁ బొలసెన్ గంధోల్లసత్తద్వనీ
సరసీసారసవర్తమానపృషదశ్వంబాత్మకింపారఁగన్. 34

క. అనుకూలశుభముహూర్తం
బని సూతులు వారియాజ్ఞ నశ్వంబులఁ జ
య్యనఁ జననిచ్చిరి బలరా
మునియరదం బగ్రభాగమున నొప్పారన్. 35

వ. ఇట్లు మనోహరగమనంబుల మనోరథంబులంబోనిరథంబులు శ్రవణాభిరామంబులై యవక్రధారాసంచారచక్రనేమినిస్వనంబులు చెలంగ నభోంగణరంగధ్వజపటాంచలజాత మారుత విరళీకృతవిబుధకామినీవిమానవితానంబులై చనుచుండ ముందటఁ బిఱుంద నెలవంక వలవంకల నలంకారవంతులై గోపకుమారులు నిరర్గళోత్సాహంబున మూఁపులు వెరుఁగ సింగంపుఁగోదమలకదుపులట్లు కేళిధావన సముల్లంఘన మండలప్రచారతిర్యగ్వర్తనభంగీప్రముఖవిహారణంబుల జవలాఘవకౌశలవిలాసంబులు చూపుచు మార్గారూఢచూతమాతులుంగలవంగనారంగవకుళకురవకలికుచజంబూజంబీరకదంబ ఖర్జూరనారికేళకేతకీపున్నాగప్రముఖ మనోహర తరుఫలకుసుమకిసలయమంజరీపుంజంబులు తమకు దర్శనంబులు వెట్టుచుఁ బైరయింగఁ జోఁపుచుఁ దేనెలానుచుఁ బువుగుత్తులెగవైచుచుఁ బుప్పొడులు వెదచల్లుచు వనమయూరంబులం బట్టుచు రాజమృగంబులఁ దోలుచు నాడుచుఁ బాడుచు వివిధప్రకారంబులఁ జూడ్కులకు నింపుసొంపారఁ గ్రీడింప రామకృష్ణులు చనిచని కొండొకదూరంబున మహాజ్యోతిర్మయం బగు గోమతీపురంబుఁ గని సంతసించిరి. కృష్ణుండు రామున కా దిక్కుచూపి యిట్లనియె. 36

ఉ. అల్లదెగోమతీనగరకేమంబరచుంబితసౌధపఙ్క్తి శో
భిల్లెడు నుల్లసిల్లు పుటభేదనలక్ష్మియమర్త్యకోటి మా

వల్లవరాజకన్యక వివాహముచూడఁగరమ్మటంచుఁ గే
లల్లనవీచునట్లు పడగాడెనుఁ జూచితె గోపురంబుపైన్.

క. ఈపురియధ్వరశాలల
కేపునఁ జనుదెంచు వజ్రిహితముగ దివికిన్
దాపగము లిడ్డకై వడి
గోపురవలభీచయంబు గొమరారెఁ గదా! 38

గీ. మడఁకవెట్టి సముజ్జ్వలమణులచేత
వేయుశిరములు వెలుఁగంగ విశ్రమించి
యున్న శేషాహియునుబోలె నొప్పెఁ జూడఁ
గోటకొమ్మలపైఁ బైఁడి కుండబోలి. 39

వ. అని యతండును దాను నిచ్చమెచ్చుచుఁ బురంబు చేరం
బోయి రవ్వార్త విని హర్షించి సహస్రగోపమహీపాలుండు
హితపురోహితామాత్యబంధుజనులం బిలిపించి. 40

క. శ్రీకృష్ణుఁడు రామాన్వితుఁ
డై కృపఁజనుదెంచెనఁట రయంబున నా సు
శ్లోకు నెదుర్కొనఁగాఁ దగు
వే కదలుఁడు పోద మతులవిభవం బెసఁగన్. 41

వ. అని వారివారికిం దగినవాహనంబు లొసంగి వలయు కాను
కలు సమకట్టి తా నొక్క పసిఁడియరదం బెక్కె. 42

సీ. గంధేభమణిమయగ్రైవేయ ఘంటికా
నినదంబు దిక్కులనిండఁ బర్వ

నటదశ్వనర్తన చటులరావంబులు
పటహనిర్హ్రాదంబుఁ బరిహసింప
మహనీయబహువిధ మంగళతూర్యముల్
భూనభోంతరముల బోరుకలఁగ
వంధిమాగధులకై వారంబులుప్పొంగ
భూరిజయస్తోత్రములు చెలంగఁ

తే. బుణ్యపుణ్యాంగనలు హర్షమున విశేష
వస్తుహస్తాబ్జలై రాఁగ వన్నెమీఱి
వేలకొలఁది రథంబులు వెంటరాఁగఁ
బురము వెడలె మహోత్సాహసరభసమ్ముగ. 43

వ. అయ్యవసరంబునఁ దన్మిత్త్రసామంతనికురంబంబు నానా
సైన్యసమేతంబై కూడుకొనియె నట్లు మహావైభవంబునం
జని యనతిదూరంబున, 44

ఉ. కాంచె సహస్రగోపకుఁడఖండపరాక్రమదోర్విలాసులన్
గాంచనపద్మరాగమణికల్పితదివ్యకిరీటభాసులన్
బ్రాంచదనర్ఘనీలకనకాంబరసమ్యగలంకరిష్ణులన్
వంచనదూరసత్పురుషవర్గచరిష్ణుల రామకృష్ణులన్.

వ. అట్లుగాంచి తగుకానుకలు సమర్పించి ప్రాంజలియైన నతని
ననుగ్రహించి త్రిభువనవంద్యులగు నా ముకుందబలదేవు
లభివందనంబు లాచరించిరి. తదనంతరంబ మాధవురథంబు
నడుమ నిడుకొని యిరుగెలంకులఁ జంద్రముఖీసహస్రంబులు

ధవళచ్ఛత్రచామరకర్పూరతాళవృంతంబులుధరించినడవ శంఖవేణువీణామృదంగఢక్కాడమరుడిండిమాది మంగళతూర్యంబులు చెలంగ వారనితంబినీనికురంబంబులు డగ్గఱి సరసాలాపహాసవిన్యాసంబులఁ దత్కుమారోత్సాహభంగు లుగ్గడింప వినుచు వీడ్కొని వచ్చెనప్పుడు.

సీ. చారుపీతాంబరచ్ఛాయలు తొలకరి
  మెఱుఁగుదీఁగెలగతిఁ దఱచుఁగలింపఁ
కమనీయదివ్యవిగ్రహసుషమాంశులు
  నెరసినీలప్రభల నిగలునిగుడఁ
జూళికామండనశుభగబర్హాంశువు
  లింద్రధనుష్కోటి నీనుచుండఁ
గారుణ్యరసపూర్ణకలితనేత్రప్రభా
  వితతి చూపఱసుధావృష్టిఁ దోఁప

తే. సకలనక్షత్రమధ్యదేశమునఁ జంద
మామయునుబోలె లోకదృఙ్మధురలీల
రాజగణములలో దివ్యతేజమునను
జక్రధరుఁడు పురప్రవేశంబు సేసె. 47

వ. ఇట్లు పురప్రవేశంబుచేసి రాజమార్గంబునఁ జనుదేర. 48

ఉ. మూఁకలుమూఁకలై జనులు మోదరసప్లవమానచిత్తులై
తూకొనియొండొరుందొలఁగఁద్రోయుచు వేచనుదెంచిచూచిరా
లోకనుతాత్ముఁ బంకరుహలోచనునోలిఁ జకోరజాతి పే
రాఁకటఁజంద్రబింబముఁబ్రియంబునఁగన్గొనుచంద మొందఁగన్.

ఉ. బాలికయోర్తు చన్నుఁగవఁ బయ్యెదకొంగెడవాయ నుద్ధతిన్
మేలితనుద్యుతుల్ దిశల మించులువాఱ విలాసమూర్తి గో
పాలకచక్రవర్తిఁ గనఁ బాఱుటయొప్పె మనోజకార్ముక
జ్యాలతికావిముక్తనిశితాశుగకాండము కాండమో యనన్.

శా. కేళాకూళిమగండుఁ దానుసలిలక్రీడారతిం దేలుచున్
ఆల వెల్వడి యోర్తు కుంకుమరసోద్యన్మూర్తియై గోడనె
క్కాలావణ్యపయోధిఁ జూచె మరుపాంథాళితనూరక్తధా
రాలిప్తంబగు నొట్టుఁగోసిన కఠారంబో యనన్ జల్ప్యమై.

ఉ. స్విన్నకపోలపాలికలఁ జిట్లిన కుంకుమపత్త్రివల్లులున్
గ్రొన్నెలవంక నెన్నుదుటఁ గుంతలపంక్తులచిక్కుపాటులున్
గన్నులకింపొనర్ప నొకకాంత విలాస మొనర్చు రేఖతో
విన్ననువొప్పవచ్చి యరవిందదళాక్షునిఁ జూచె వేడుకన్.

క. ఎన్నఁడు నొరుఁ జూడని రా
కన్నెలు మణిసౌధజాలకంబుల మ్రోలన్
వెన్నునిఁ జూచిరి కాంక్షను
గన్నులపండువుగఁ దానకంబులు గరఁగన్. 53

గీ. అబలయొక్కతె ప్రోదిరాయంచకాత్మ
గమనలీలావిలాసంబు గఱపికఱపి
యదియు వెనువెంట నరుదేర నరిగి వాసు
దేవు దర్శించె భారతీదేవివోలె. 54

గీ. అర్ధచంద్రనఖాం(కంబులే)మఱునొక్క-
చను బయల్పడ నొకయింతి శౌరిఁజూడ
నప్పయోధరకుంకుమ మమరెఁ జిలుక
పచువు గఱచిన దానిమ్మపండువోలె. 55

చ. చెలువునిఁ గూడివచ్చి యొకచెల్వహరింగనితద్విలాసమ
ములికిమనంబునాటఁగనుమోడ్చుచుఁబయ్యెదజాఱఁజన్నుఁగ్రే
వలుగఱుపాఱ మ్రానువడి వ్రాలెనిజేశ్వరుమీఁదలీలమై
నలువుగఁ గీలెడల్పఁబడినం బడు జంత్రపుబొమ్మకైవడిన్.

క. [1] జలజాక్షుచక్కదన మను
వలఁ బురవనవీథి నొంది వనిత లను మృగీ
కులములతోఁ [2]బఱచుచు నపు
డలరులవిలుకాఁడు వేఁటలాడె నిజేచ్ఛన్. 57

గీ. మాధవుని దివ్యవిగ్రహమహితనీల
కాంతిపూరంబు దిక్కులఁ గడలుకొనఁగ
మేఘమతి నిచ్చమేడలమీఁదఁ బురులు
విచ్చి ప్రోదినమిళ్లాడెఁబిచ్చలింప. 58

సీ. సాంద్రచంద్రాతపచ్ఛాయాకలాపము
ల్మించి యంబర మాక్రమించినట్లు
లలితరోలంబ మాలాపరంపర మద
కలితభద్రేభంబుఁ గప్పినట్లు

---

1. జలజాకుచదనమును. మూ. 2 బరచు కయ్యపు దలపుల. మూ.

సౌదామనీలతాజాలంబు తొలకరి
కొదమపయోదంబుఁ బొదివినట్లు
నిండారవిరిసిన పుండరీకశ్రేణి
యమునాప్రవాహంబు నలమినట్లు
తే. సకలకాంతాదృగంత వీక్షాసురుచులు
నిజతనూవిభ్రమంబున నిండిపర్వఁ
జాలనొప్పారె మదనగోపాలమూర్తి
సర్వలావణ్యవల్లీకచక్రవర్తి. 59

వ. ఇట్లు సంభ్రమంబునఁ జనుదెంచి రాగరసాయత్తచిత్తలై
మత్తకాశినులు మాధవుంజూచి తమలోన, 60

సీ. వీఁడటే చిటికెనవ్రేలిపై నాలకుఁ
గొండయెత్తిన సముద్దండభుజుఁడు
వీఁడటే వ్రేపల్లెవెన్నదొంగిలి తిన
మరగివర్తించెను మాయలాఁడు
వీఁడటే కాళీయవిపులఫణామండ
లముననాడినకేళిలాసకుండు
వీఁడటే ఱెక్కలు విఱిచి బకాసుర
విగతాసుఁ జేసినవీరమూర్తి
తే. వీఁడటే కన్నతల్లికి వెలయజగము
లాననంబునఁ జూపిన యనఘుండు
వీఁడటే చౌర్యరతిలీల ప్రేమగువుల
వాంఛలొడఁ గూర్పనేర్చిన వన్నెలాఁడు.

సీ. ఆమ్నాయమాణిక్యహర్మ్యాగ్రమునఁ గ్రీడ
సలుపుమత్తమయూరచక్రవర్తి
బ్రహ్మతేజోవజ్రపంజరంబున వేడ్కఁ
బాయకుండెడుకీరనాయకుండు
సనకాదిమునిమనోవనవాటికల లీల
వర్తించు కోకిలవల్లభుండు
లక్ష్మీమనోజ్ఞలీలాసరోవరమున
నోలాడురాజమరాళవిభుఁడు

తే. పరమచిత్పదమకరందపానకేళిఁ
బ్రీతిఁ బొందెడు మధుకరాగ్రేసరుండు
వీఁడుకోఁ గాంక్షదీఱంగ నేఁడు మనకుఁ
జూడఁ గలిగెఁ బురాకృతసుకృతమహిమ. 62

సీ. వెన్నతోఁ బెట్టిన విద్యగా జారతం
త్రంబులే కఱచెఁ బిన్నంటనుండి
వరవేణునాదంబు వశ్యమంత్రంబుగా
నెల్లలోకములు మోహింపఁజేసె
మునులు విందులువెట్టమనినఁ దత్కులవధూ
టికలచేఁ బ్రేమఁ బెట్టించుకొనియె
వలువలకై వల్లవస్త్రీల సర్వాంగ
సుషమావిలాసముల్ చూఱలాడె

తే. నెన్నిమాయలు నేర్చెనే యీవిలాసి
కౌమరుఁ బ్రాయంబునందునె రమణులార !
యిట్టివలపులవెల్లి నీయెమ్మెలానిఁ
దగులఁ జేసిన మవరాధఁ బొగడవలదె. 63

గీ. రాధికాహేమరుచిరపయోధరాగ్ర
మండలంబున నీకల్కి మాధవుండు
చారుమరకతమణివిభూషణము కరణి
నుండుఁ బో యిఁకఁ గన్నుల పండువగుచు. 64

గీ. వీని కౌఁగిలి మరగిన మానవతులు
మగలగిగలను దలఁతురే మానసమునఁ
జారుసహకారఫలరసాస్వాదమొందు
చిలుకగమి వేఁపపండు లాసింపఁజనునె. 65

వ. అని కొనియాడుచు సందడిఁ ద్రోపుత్రోపాడుచుఁ జంద్రోదయోత్సవంబున శశికాంతశిలారత్నపుత్రికలునుంబోలె మదనరసపూరంబులం దోఁగుచుఁ బయ్యెదలు జాఱి కుచకుంభంబులు బయలువడ నొడల్లుమఱచి చూచుచుండి రయ్యావసరంబునఁ బసిండిమేడలనుండి పుణ్యపురంధ్రీరత్నంబులు ప్రియప్రయత్నంబునఁ గనకమణిపాత్రికలఁ గర్పూరఖండసురభికుసుమముక్తాఫలకనకాక్షత లక్షయంబుగా మధురమందస్మితచంద్రికాపాంగరోచులఁ దొలంచి మణికంకణఝుణఝుణత్కారంబులొలయ బాహుమూలంబుల మెఱుం

గులు గిరికొనఁ గేలుఁదమ్ములు సారించి పారిజాతలతికలకై
వడి మాధవుపైఁ జల్లిరాలోన. 66

గీ. కొదమసంపెంగపువ్వుల గుత్తి పుష్ప
లావి యొక్కతె శ్రీవత్సలాంఛనునకు
దరిసెనంబిచ్చె మత్తమోహధరములింత
లేసి కలవని తెలిపెడు లీల దోఁప. 67

సీ. పృథునితంబభరంబు పేర్మిఁ దొట్రిలునడ
కలనందియలు ఘల్లు ఘల్లనంగ
నంశుకాంచలముహు రాకర్షణంబులఁ
గాంచికామణిఘంటికలు చెలంగఁ
దనుమధ్యలతలు లేఁదళుకులు నెదచల్లు
చన్నుల వ్రేఁగున జలదరింపఁ
గొమరుఁబ్రాయంబుల రమణీయతాశ్రీలు
మణిభూషణాంశుల మాఁగువఱప

తే. నరిగి సిగ్గులు చిట్టుముట్టాడునోర
చూపుఁగొనలను మనుతలఁ జొక్కుదేఱ
బ్రాహ్మణస్త్రీలు రత్ననీరాజనంబు
లాచరించిరి పుండరీకాక్షునకును. 68

వ. ఇట్లు త్రైలోక్యపూజ్యమూర్తి యగునగ్గోపాలచక్రవర్తియ
య్యైవిధంబులఁబురజనంబులు సమర్పించుపూజలఁ గైకొను
చు నంతరిక్షంబుననుండి సహస్రాక్షప్రముఖమరుద్గణంబులు

పరమహర్షంబున దుందుభినిస్వనపూర్వకంబుగా జయజయ స్తోత్రనాదంబులు చెలంగింపఁ ద్రిభువననేత్రపర్వంబగు దివ్య తేజోవిలాసంబున విజయంచేసి రాజమందిరంబు చేరంజనున వసరంబునఁ దత్సమీపంబున నన్నియు నాయితంబు సేయిం చినవాఁడై సహస్రగోపాలుండు సంభ్రమోత్సాహతాత్ప ర్యంబులు ముప్పిరిగొన నమాత్యసుహృజ్జనసమేతుండై కనక వేత్రదండంబులఁ గ్రందుకొను ప్రజలసందడివాయజడియుచుఁ దోడ్కొనిపోయి నయనాభిరామంబగు నొక్క కేలినగరుఁ జూప నమ్మొగసాలవాకిటఁ దేరుడిగ్గి పీతాంబరుండు నీలాం బరసహితుండై యొక గోపకుమారుకై దండఁగొని కలికిమొ య్యారంబున రాజసంబు చెలువార శంఖచక్రచాపకులిశకల శాంకుశశుభలక్షణలక్షితంబులును మోక్షలక్ష్మీసీమంతకుం కుమరజఃపింజరంబులును ఘోషయోషిన్మృదూరుకాండమం డనంబులును వేదాంతపల్లవసమభ్యర్చితంబులును సర్వకల్యా ణకారణంబులు నగునడుగుఁదమ్ములఁ భూమండలంబు పరమ పవిత్రంబు గావించుచు మాణిక్యకుట్టిమమార్గంబుల నెరపిన చెంగల్వరేకులు మెట్టుచు నభ్యంతరంబుఁబ్రవేశించి కతిపయ కక్ష్యాంతరంబులనతిక్రమించి వివిధమణిమయంబులగు వింత వింతపసిండికలువడంబుల యిండ్లు సొత్తెంచి తన్మధ్యప్రదేశం బునఁ జతుష్షష్టివిద్రుమలతాస్తంభసంభృతంబును జిత్రకుసు మవితానశోభితంబును ధారాయంత్ర పూరితనీహారపయః

పూరపిచ్ఛిలంబును జతురశీతిబంధబంధురరచితచిత్రయంత్ర పుత్రీహృదయంగమంబును మణికలాపలలితహాటకకవాటదేహళీధళధళాయమానమానితద్వారదేశహృద్యంబును బుష్పశయ్యాభిరామంబును నగు నొక్క సౌధంబుఁ బ్రవేశించి. 69

ఉ. అమ్మహనీయసౌధమున నగ్రజగోపకుమారయుక్తుఁడై
యిమ్ముల విశ్రమించి వివిధేష్టకథాసరసప్రసంగవా
క్యమ్ముల నృత్తగీతకలగానములం బ్రియమందుచు న్వినో
దమ్మున నుండె మాధవుఁడు తత్పురవాసుల నేత్రపర్వమై.

క. మక్కువఁ జెలికత్తెలు హరి
చక్కఁదనము చూచి వచ్చి సన్నుతిసేయన్
జొక్కమగు రాధహృదయము
చక్కిలిగిలిగింతఁ గొనియె శంబరరిపుచేన్. 61

క. అంతిపురినుండి రాధా
కాంతార్పితసరసకుసుమగంధవిభూషా
సంతతిఁ గానుకఁ దెచ్చిరి
సంతసమునఁ గలికిబోట్లు జలజాక్షునకున్. 72

వ. ఆసమయంబున సమ్మహానగరంబున నానామార్గంబుల శార్ఙ్గధరు నెదుర్కొని సంతోషరసంబున జొత్తిల్లుచి త్తంబుల మరలి నిజనివాసంబులకుఁబోవు విలాసినీమండలంబుల మణిమయమండనంబు లొండొంటి నొరసి బెరసి మొరయు రవళి

యు లోకలోచనోత్సవంబుగా శృంగాటకప్రదేశంబుల యౌవనవిలాససుందరులగు రాజనందను లభ్యాసకౌశలంబునశిక్షితన ర్తనకళాభినయంబులగు నుత్తమహాయంబులఁ జర్చరీ[1] చంచుపుటాదితాళమానంబుల మ్రోయు పటహమర్దళకాంస్యనిస్వనంబుల ననుసరించి యాడింపఁ జెలంగు తదీయప్రేంఖత్ప్రేంఖకాపుటఘట్టనచటులరావంబులును గండమండలంబులఁ బైపయిఁ దొరఁగు నవిరళమదక్షీరపూరంబులం గ్రోలఁ బాదువుమదాళిజాలంబుల నప్పటప్పటికి మదోద్రేకఫూత్కారసముత్థవారిశీకరనికరంబులు విదిర్చి పదరుచు నన్యోన్యదర్శనసముద్భూతరోషభవనంబులు సముద్ధృతశుండాదండంబులు నై నడగొండల విడంబించు మదవేదండంబులు యంతృశిక్షాకుశలంబులుగాక భీకరఘీంకారవిరావంబులు ను గ్రైవేయఘంటానాదంబులు ను గర్ణరంధ్రంబులు వ్రక్కలింప నంకుశఘాతంబులకు శిరోవిధూతులొనర్చుచుఁ బరిభ్రమించు నుగ్రతఁజూచి పాసి తొలఁగుండు తొలఁగుండనుచు నొండొరులఁ ద్రోయుచు బెదరిపఱచు ప్రజాపరంపరల సమ్మర్దఘోషంబు ను మేరుకైలాసశృంగంబులభంగి వెలుంగు కనకరజితకదంబలంబులు పరస్పరప్రతిఘటితంబులై యొరసిపోవు నెడల నడవ నెడలేక త్రోవలందొట్టియిట్టటుఁ బడు భటసహస్రంబుల కోలాహలంబులు నుప్పొంగి

1. త్రిపుట-మూ.

నింగిముట్టిమంథానమహీధరమథనఘూర్ణమానపయోనిధా
న ధ్యానంబుఁ దలంపించెఁ దదనంతరంబ. 73

ఉ. అంబరమాతులుంగలతికాగ్రఫలంబురుకాలకీరరా
జంబువడంగఁ ద్రోచె ననుచందమునన్ జరమావనీధరా
గ్రంబున భానుమండలముగ్రాలె రథాంగవిటీవిటాంతరం
గంబుల మన్మథానలశిఖానివహంబులు ప్రజ్వరిల్లఁగన్.

గీ. లీలఁ గైసేసికొని ప్రతీచీలతాంగి
దర్శనార్థంబు పాణిపద్మమున నిడ్డ
పంకరుహరాగరత్నదర్పణము జాఱి
పడ్డవిధమున నర్కబింబంబు గ్రుంకె. 75

శా. ఆరాజీవకులాప్తునిం బనిచి సంధ్యావేశ్య రాగార్హ్యసం
ధ్యారాగాంబర మొప్పఁ గట్టివిలసన్నక్షత్రహారావళుల్
గారామారఁగఁదాల్చి నూతనతమఃకస్తూరికాపత్త్రివ
ల్లీరమ్యాకృతిఁజంద్రురాకరయఁబోలెంజొచ్చెఁబ్రత్యగ్దిశన్.

క. కలువపువుసిరినగళ్లకు
వెలయఁ గలిమిరాచవారు విజయము సేయన్
జలరుహసౌధకవాటం
బులువడెఁ దేంట్లిరులు లోన ముప్పిరిగొనఁగన్. 77

సీ. మల్లికాధమ్మిల్లమండలంబులు సన
క్షత్రవియల్లీలఁ గచ్చరింప

మెఱుఁగుఁ జెక్కుళ్లపై మెత్తినసిందూర
    శాదంబు సంజకెంజాయ నొరయ
మించిగుబ్బలమీఁది మృగమదపత్త్రిభం
    గశ్రీలు చిన్నిచీఁకట్లు దొరయ
మదలోలదృష్టిసంపదలు నీలోత్పల
    దళవిభ్రమంబుల పొలుపుఁ దెలుప
తే. నాత్మమూర్తులయందు దినావసాన
సమయలక్ష్మీవిలాసంబు సంఘటిల్ల
వారవనితలు నిజగృహద్వారభూమి
నిలిచి రనురూపనైపథ్యవిలసనముల. 78

గీ. కూఁతు లనుదినము మెకములఁ గుదురుకొలిపి
చేటికావాగురికలొడ్డి షిడ్గహరిణ
కులము కేళీగృహాపుఁబొలములకు లంజ
తల్లులను వేఁటకత్తెలు దార్చిరపుడు. 79

ఉ. రమ్మనిపిల్చు చేటికల రవ్వపుమాటలుఁ దక్కఁజెప్పినన్
గ్రమ్మఱు దీనపల్లవుల కాఁకలమాటలు వేఁడినట్ల యి
మ్మిమ్మను నర్థవక్త్రపుతతి యెమ్మెలమాటలు నన్నుమిండలన్
సమ్మతి వెట్టుమాటలు నెసంగెఁగడున్ దదగారభూములన్.

సీ. వేదవేదుల రతి వేదాంతికులఁ జేసి
    పట్టాభిషిక్తుల బంట్లఁ జేసి
విశ్రుతజ్ఞానుల వెడఁగులుగాఁ జేసి
    బహుమానపురుషులఁ బలుచఁ జేసి

లజ్జాభిరతుల నిర్లజ్జులఁగాఁ జేసి
సారధీయుతులఁ జంచలులఁ జేసి
విజితేంద్రియాత్ముల విషయభోగులఁ జేసి
పరమశాంతులఁ గ్రోధపరులఁ జేసి

తే. కలికితనముల మధురవాక్యముల సుప్ర
సాదసదపాంగకలనలఁ జవ్వులు మరపి
మీఁటి మానధనంబులు చూఱకొనిరి
వాలిబిత్తరి మిండతల్ కేళిమించి. 81

ఉ. దిక్కుల నన్నిటం బ్రబలిదృష్టికి వెక్కసమై క్రమంబునన్
బెక్కువ నీలి దూదివెద పెట్టినకైవడిఁ దొట్టిదట్టనై
యిక్కలు వస్తుభేదములు నేర్పడనీక తమంబు లోపలన్
బిక్కటిలెన్ లయావసరభీకరభైరవమూర్తిఁ బేర్చుచున్.

గీ. ఖాదిరాంగారఖండంబు గలిసియున్న
యగ్ని యాఱిన నల్లబొగ్గినయట్ల
యరుణరుచి విచ్చిపోయిన నంధకార
మలినమై కానఁబడె జగన్మండలమును. 83

గీ. సౌరభాంచితవిచికిలచయమనోజ్ఞ
మైన జవ్వాదిబరణియ ట్లలరెఁ జూడఁ
దారకాకీర్ణనిబిడాంధకారరాశి
మండితం బయి జగదండమండలంబు. 84

వ. అమ్మహాంధకారంబున. 85

మ. పనివెంబళ్ల నొకొర్లొకరు చెలులన్ భావోక్తులన్ దార్చుచోఁ
జని సంకేతనికేతనస్థలములన్ జారాళితోఁ బాంసులా
జనవర్గంబు లనర్గళోత్సవమనోజక్రీడలన్ దేలె సూ
చినభేద్యాంజనపుంజమంజుల తమశ్శ్రీ నెమ్మదిన్ మెచ్చుచుఁ.

సీ. అత్తమామలు లేని యలినీలవేణులు
నుత్సవంబులఁజూడ నోఁ నోఁలుసతులు
వృద్ధనాయకలైన విధుమండలాస్యలుఁ
బుట్టిండ్ల మరగిన పువ్వుబోండ్లు
వరుసలే కెడమైన వనజాయతాక్షులు
మగడూర లేనిచో మలయుబోట్లు
తామె యిల్డీర్చుడి తనుమధ్యలతికలుఁ
జెఱఁగుమాసిన సరసీజముఖులుఁ

తే. బొరుగునఁ దఱచు ముచ్చటఁ బ్రొద్దుజరపు
జవ్వనులుఁ జౌర్యరతతంత్ర చతురసతులు
జారునెలయించి కేళికాసారతీర
శైలవనవాటికలఁ గ్రీడ సల్పిరలమి. 87

క. చెలువులయిండ్లకుఁ జనియెడు
లలనల మంజీరకలఝుళంఝుళరవముల్
చెలఁగె నలుగడల విరహులు
చలియింపఁగ మరుని నారిజళుకులుబోలెఁ. 88

సీ. నెలఁత వేనలిపిండు నీలిదట్టినచీర
సుదతి లేనగవులు చొక్కమందు
ముదితక్రొన్నెలవంక నుదురుకన్నుపుకత్తి
మెలఁతకన్దోయి తుమ్మెదలక్రోవి
[1]కలకంఠకంఠికీ ల్గంటుతాళపుఁ గొంకి
పడఁతుకగోరు బకెల్పంపుమునుక
జలజాక్షిమణితముల్ శకునంపుఁ బలుకులు
మగువనితంబంబు మఱుఁగుతావు
తే. చేసికొని పాంథహృత్కుడ్యసీమలఁగలఁ
ద్రవ్వి నిద్దంపు సన్మానధనము దిగిచెఁ
గిక్కుమసకుండ నేరికిఁ జిక్కవడక
సూనశరుఁడను జగదేకచోరగురుఁడు. 89

వ. వెండియుఁ దక్కిన దిక్కుల జనంబులయం దుచితవ్యాపారంబులు చెలంగుచుండెఁ దదవసరంబున, 90

చ. మొనసి [2]మహీరసాభయగుమూర్తిఁబొరింబొరిజ్యోతిరింగణో
గ్రనయనవిస్ఫులింగనికరంబులురాలఁ దమోనిశాచరాం
గనయుదయించువేళఁగసుగందుసుతున్ శశిసోకకుండఁబ్రా
గ్వనితవిభూతిచల్లెఁదల వ్రాకిటనాఁదెలుపెక్కుఁ దూర్పునన్.

చ. జగములు గెల్వవచ్చురతిజానిధనుర్లత కెంపుఁగుచ్చు, ప్రా
గ్దిగబల కొప్పుపైనిడిన కెందొగపూ వుదయాచలంబునన్

1. కలకంఠి జడయల్లికసరు- మూ. 2 మహీధరా.

జిగులుదొలంకు వట్రువపుజేగుఱుటాయనరాగమంజరుల్
నిగిడెడుమూర్తిఁ బూర్ణరజనీకరబింబము దోఁచెనంతటన్.

సీ. ప్రాచీవధూటియంబరలక్ష్మి కర్పించు
 సురుచిరధవళచామరమనంగ
హాటకీఁ బాన్పైన శేషాహియూర్పునఁదూలు
 కలశాబ్ధిడిండీరఖండమనఁగ
లీలమై శచిదేవికేలిదీర్ఘికనుండి
 చదలేటికరుగు హంసంబనంగ
వలరాయఁ డలిగి పాంథులమీఁదఁ బఱపిన
 బొండుమల్లియపెట్లు గుండ్లనంగ

తే. మలసి మిన్నంది నక్తంసమయదశాస్య
భుజసముద్ధృతకైలాసభూధరమనఁ
జంద్రబింబంబు వెలిఁగె నాశావికీర్ణ
సాంద్రచంద్రాతపశ్రీలు చౌకళింప. 93

ఆ. రాధ పెండ్లియాడ మాధవునకు ఱేపు
గట్నమిత్తుననుచు గగనలక్ష్మి
రజతపాత్ర నీలరత్న భూషణమిడ్డ
కరణి నింపునందుఁ గందుదనరె. 94

క. జలరుహగర్భుని వాహన
కలహంసము వచ్చిగగన[1]గంగాబిసతం

1. గంగాబిసవల్లులు; గరచి. మూ.

తులు గఱచి[1]వై వనయ్యాది
చెలఁగెదిశల ననఁగనెగడె సితకరకరముల్. 95

చ. అమృతపయోధిఁ గ్రొన్నురువులై పరసీతతిఁ గైరవంబులై
సమద చకోరచంచుపుటసంధులఁగందళులై సుధాంశుకాం
తములస్రవత్పయఃకణవితానములై మహనీయసౌధభా
గముల నవీనవజ్రఫలకంబులునై నిగిడెన్ శశిప్రభల్.

సీ. తోరమై సారమై తొరఁగు చంద్రికలును
జలజలనై రాలు చంద్రికలును
వలిగాలి తెరలపై వ్రాలుచంద్రికలును
సడలితుంపరచిందు చంద్రికలును
వఱలిమీఁగడగట్టి వడియుచంద్రికలును
జాఱకతొట్టెడు చంద్రికలును
నురువులుగ్రమ్ముచుఁ బొరలు చంద్రికలును
జడవట్టి ప్రవహించు చంద్రికలును

ఆ.వె. దిశలవెల్లివిరిసి దివిముట్టి కడు నిట్టఁ
ద్రోచిజగము ముంచి తొలఁకియాడె
మాధురీధురీణ మదనగోపాలలో
చనదయాసుధారసంబువోలె. 97

సీ. పాంథులమది మనోభవవహ్ని యెగఁద్రోచి
విధుకాంతములనీరు వెడలఁజేసి

---

1. వైచుచున్నవో. మూ.

కాముకులకు సిగ్గు లేమి వాటిలఁజేసి
కుముదంబులకు సిరి కుదురుకొలిపి
జారవర్గముల యాశలు వట్టికుదియించి
ఛాకోరములకోర్కి చాగవిడిచి
వనజంబులకుఁ దలవంపులుగావించి
యామవతీలక్ష్మి నాదరించి

తే. కోకమిథునంబులను గలగుండు చేసి
వఱలు నోషధులకు నుత్సవంబు వెనిచి
రాజతేజంబు జగతిఁ బరాక్రమించి
చంద్రికాకీర్తివల్లికల్ జగమునించె. 98

వ. అప్పుడు. 99

ఉ. ఈఁకలఁ ద్రోచియేది ప్రియమొక్కఁగ ఱెక్కవిచెర్చి తీర్చువె
న్నాఁకలు గట్టితొట్టి మునుముట్టి కరంబుదరంబు లేర్చువె
ల్లాఁకటిచిచ్చు పెచ్చువడి నార్చుచుఁ బేర్చుచుఁ గ్రొత్తెఁజంద్రికల్
జోకఁ జకోరవారములు చుబ్బనచూఱల నన్నివంకలన్.

చ. జలజలఱెక్కలం దొరఁగి జాఱకసంధులజిక్కియున్న వె
న్నెలతళుకుల్ నిజేశుపయి నెమ్మివిదిర్చెఁ జకోరియోర్తుతే
పెలమి వివాహకాలమున సక్రియ రాధికనందసూనుపైఁ
బొలుపుగమౌక్తికాక్షతలువోయుజుమీయని తెల్పుకైవడిన్

సీ. మొలకవెన్నెలచాలు గలపినెచ్చెలులకు
సూడిదగానిచ్చి యాడునొకటి

గుజ్జువెన్నెలఁ గ్రొచ్చు గొని తెచ్చి చుట్టాలఁ
బిలిచి విందులు వెట్టె మలయు నొకటి
తీఁగవెన్నెలతీఁగె దిగిచి వేతునుకలు
సేసి వల్లభ కిచ్చి చెలఁగు నొకటి
చిగురువెన్నెలఁ ద్రుంచి మగనికుత్తుకఁ బ్రేమఁ
గూర్కొని కూర్కొని కనియు నొకటి

తే. లప్పవెన్నెలకుప్ప బాలలకుఁ జూపి
మేఁత వెట్టించి కెలఁకుల మెలఁగు నొకటి
కేలిఁ జంద్రోదయోత్సవ శ్రీలఁ బొదవెఁ
గోరికలు మిన్నుముట్టఁ జకోరకములు. 102

వ. వెండియుఁ దండోపతండములై గుంపుగూడి నానాదిక్కులఁ బెనుపండువుగాఁ గనకకలధౌత చంద్రశాలికా సౌధాగ్ర ప్రదేశంబుల సముజ్జ్వల వజ్రమాణిక్యమరీచిమాలికాకలాప దేదీప్యమానగోపానసీవిటంక సంఘంబుల సందుల నానా స్థలంబులం దొరిఁగి జాలకపేరియున్న మీఁగడవెన్నెల లెస రుమసరు గవిసి కన్ను దనియందిని యన్నుకొనిసోలి వ్రాలున వియును, సముత్తుంగంబులైన గిరిశృంగంబులనుండి యుండం గొనక యత్తెత్తి చూచిపూఁచి తెక్క స్రుక్కించి[1] పాయవ డక వ్రేఁగునం బెనఁచుకొని పుడమింబడునవియును, నయ నాభిరామంబులుగ మనంబు లలర విస్తీర్ణంబులగు తరు

1. చివాయివదలక. మూ.

పర్ణాగ్రంబుల నొరఁగి ప్రాలేయకిరణకాంతశిలామయతలంబు
లఁ బ్రవహించు నేటివెల్లువలఁ గల్లోలచ్ఛటాసముచ్ఛలితస్వ
చ్ఛందబిందు సందోహంబులఁ దొప్పఁదోఁగుచు లీలందేలి
యాడునవియు, నాతతంబులగు నదీసైకతంబులఁ గుఱిసి
సురసురంబొరలి పాఱనేరక తొట్టి కరుడుకట్టితిట్టలు వడి
యున్న వెన్నెలయొడ్ల కొడ్డగిలి నిశితత్రోటి కుద్దాలధార
లం ద్రవ్వి మువ్వంబులగు కరుఁడులు దిగిచి మెదిచికుదిల్చి
కట్టూర్పులు గొన మెసంగి విసిగి తనిసి మెడగలుగవిశ్రమిం
చునవియును, సంఫుల్లమల్లికామండపంబులలోనఁ గుసుమ
మంజరీపుంజంబులయెడల జలరాశిఁ బ్రోవులై యున్న
వెన్నెల తళుకులు గులకరించుకొని బొక్కలకొలదిఁ జక్కఁ
గా నమలి మ్రింగి చెలంగునవియును, నిండుగొలంకు లలంక
రించుకొను చంచరీకమిథునంబులకు లీలామధుపానపాత్రంబు
లైన క్రొవ్విరిచెందొగలలోనం గుఱిసి నిండినింపులు వాఱు
చున్న వెన్నెలతేటఁ గ్రోలుచుఁ దదుపరిభాగంబునజవలాఘవంబు
నం బోయి చెరలాడునవియును, సందడికిం గాక మూఁకగెంటి
యొంటిరువై చెలులనెలయించుకొని పొట్టలునిండించుకొనుచు
విహరించునవియును, గదుపుకదుపులై నెట్టనంబుగ నొం
డొంటిఁ బిట్టురెట్టింపుచుఁ గ్రొవ్వులు నివ్వటిల్లఁ గడము
ట్టం బాఱి పెనుఁబల్లంబులఁ బిదపిదనై చిక్కనిపదను
గొనియున్న వెన్నెలజొంపిం బడి వెడలనేరక భయ

సంభ్రమాకులంబులై యెట్టకేలకు దిట్టతనంబు తెచ్చుకొని పైఁ గొనసాగివచ్చు తీఁగెవెన్నెలయూడలు గఱచి యూఁతఁ గొని మెగసి కెలంకులకుం బాఱి నిలిచి యలపార్చుకొను నవియును, దెరలు తెరలై పయింబడు వెన్నెలతేకులముసుం గుపడి భ్రమసి తెక్కార్పరాక చీకాకై కఱకుఁదనంబున నెఱవాఁడియైన ముక్కులనొక్కి చించి చెండాడి తెఱపిగొని తుట్టునందూఱి క్రేళ్లుఱికి పాఱునవియును, జోడుజోడై మించు మించు వెన్నెల తీఁగెపొదరులకుంగదిసి నములుచుఁ దమకంబుతత్తఱంబున రెండొక్కొక్కతీఁగె తెగందిగిచి కొని తుదమొదళ్లు గఱచి కాలువదలక యొకటొకటి మచ్చరంబునఁ బెచ్చుపెరుఁగుచు [1]దేవులాడ నెడసొచ్చి నడుములు గండ్రింపుచు గుండ్రింతలు వెట్టునవియును, రసమయంబులై మదురుకొనియున్న ముదురువెన్నెలదుంపలు వ్రక్కవ్రక్కలుచేసి చరణయుగళంబుల నిఱికించుకొని విరళీకృతపక్షచ్ఛదంబులై ముదంబునఁ బదనుకొననాన్చి కుఱుచం గొరుచు మాఱుమలయువాని గగురుపొడిచి తగిలిపొడుచుచుఁ బగఁ జూపునవియు, నేకాంతప్రదేశంబులఁ బ్రియకాంతలంగూడి వలరాచకేళిఁదేలి యలసి చలసినట్టునెట్టుకొని సముత్కంఠఁ గంఠపూర్ణంబుగాఁ బండువెన్నెలరసంబుఁద్రావి నసరేఁగి పునస్సురతక్రీడకు నూలుకొని తమిఁగొనుచు మలయునవి

1. వేవులాడ. మూ.

యును, ప్రణయకలహంబునం బోసిమాసి మేత చాలించి యించువిలుకాని వాఁడితూపుల వేఁడిమిఁ గ్రాఁగి లోఁగి యున్న ప్రాణేశ్వరీరత్నంబులఁ బ్రయత్నంబున డాయంబోయి బుజ్జగించి పుక్కిటంబూరించియున్న వెన్నెలనురుగు సంప్రీతి వాతెఱఁగుమ్మరించి తెలచి వేడుకంగూడికొని క్రీడించునవియు, నై చకోరంబులు పెక్కుచందంబుల నింపుసొంపుసంపాదించె నాసమయంబున, 103

చ. అలరుచు గోమతీపురముననందు మణిప్రభల న్వెలుంగునాల్
నిలువుల మేడలెక్కి రజనీకరబింబముఖీకదంబముల్
చెలులును దారువల్లభులుఁ జెంగట సంగడిఁగూడిమాక్కికో
జ్జ్వలమగుపండువెన్నెలప్రసన్నతసన్నుతిసేయుచుండఁగన్.

సీ. కలధౌతమాణిక్యకనకపాత్రికలందు
వాసితమధురపుష్పాసవంబు
వోసి కర్పూరంపుఁబోడి మీఁద వెదచల్లి
తగ నుపదంశసంతతులు గూర్చి
భుగభుగనై కమ్మ పొగపుఁదావులు గమ్మ
నాస్వాదవంతంబులైనమాంస
ఖండముల్ రాసులుగాఁ బోసి గ్రుక్కిళ్లు
మ్రింగుచు నగవులు దొంగలింప

తే. మండలాకృతిఁ గూర్చుండి మంచిదనుచు
గ్రుక్కగ్రుక్కకుఁ దలలూఁచుకొనుచు నొకరి

కొకరి కందిచ్చి చూపుచు నొకనుబ్బియుబ్బి
త్రావఁదొడఁగిరి యుల్లాసరసముతోడ. 105

క. పొంగులు దీర్చక యొక్కకు
రంగేక్షణ తాళమధువు త్రావఁగ సఖి లీ
లం గదియవచ్చియూఁదెం
జంగున నదిదానివక్త్రజలజముగప్పెన్. 106

ఉ. వెన్నెల రాతిగిన్నె నొకవెంగలికాంత సురారసంబుఁదాఁ
జెన్నలరారఁ బోసి చవిచే నుపదంశము దెచ్చునంతలో
వెన్నెల సోఁకి గిన్నియు స్రవించిన నచ్చటి కల్లుసూచి నా
గిన్నియసంబు గూర్చి తొలఁగించితి రేయనిదూఱెనింతులన్.

క. తరుణీకరమధుపాత్రాం
తరబింబితచంద్రబింబతతు లలరారెన్
సిరిదొలఁకు నిండుకొలఁకున
విరిసినకుముదప్రసూనవితతులు వోలెన్. 108

క. మదిరాక్షి యొకతె మైక్షవ
మదిరారస మాని యాని మదనాతుర యై
కదిసి నిజేశ్వరుకమ్మని
పెదవమృతముఁ గ్రోలి రెట్టిఁ బేర్కొని పొగడెన్. 109

క. చెలిమద్యము వోసిన నొక
యలికుంతల త్రావఁ బోయి యధరారుణదీ
ప్తుల నెఱ్ఱనైన శోణిత
జలమని మౌర్ఖ్యమునఁ బాఱఁ జల్లెఁ గినియుచున్. 110

ఆ. బాలయొకతె నారికేళ మద్యరసంబు
సగముద్రావి కొర దిగువఁ బెట్టి
చేతులెత్తి మ్రొక్కి శిరమూఁచి కొనియాడి
చిట్టమిడిచి పలికెఁ జెలులఁ జూచి. 111

ఉ. ఏల పయఃపయోధి మథియించిరి వెంగలులై శ్రమంబునన్
వేలుపులందు నేమి ప్రభవించె సుధారసమంచు వారుణిం
బోలునె దీనితావి మెయిఁబొల్చునయే నమృతంబు మాని లీ
లాలహరీపరంపరఁ జెలంగుచు మద్యమె త్రావుచుండరే.

క. అని పలికి యున్నగమురఁగఁ
గనుమోడ్చుచు నున్న నొక్కకామిని యల్ల
ల్లనఁ జేరవచ్చి యాసురఁ
గొనిత్రావి తొలంగెఁ బ్రియసఖుల్ కనుగీఁటన్. 113

సీ. లాహిరియెక్కంగ దేహముల్ పడఁబాఱఁ
బరఁగ నర్థోక్తులు పలుకువారు
నాననామృతగంధ మాగుబ్బువలవంగ
నలిరేఁగి పకపక నవ్వువారు
ధవులకుఁ గర్ణామృతంబుగా వెడయుల్క
నరుదందఁ జిఱుబూతులాడువారు
పారావతాబలభంగి సిగ్గెఱుఁగక
కొసరుతెలుంగులఁ గులుకువారు

తే. పెల్లదరి పాడువారు కుప్పించువారు
కోరికను మూసి గంతాడువారు నెలమిఁ
దివిరి మొలకోకలూడంగఁ దిగుచువారు
నగుచు మధుపానరతిఁ దేలి రబ్జముఖులు.

ఉ. గుబ్బలు మ్రోయఁ జప్పటులు గొట్టఁగఁ బయ్యెద కొంగు జాఱి చ
న్గుబ్బల నిబ్బరంపు మెఱుఁగుల్ దయివారఁ దలంబుఁ దక్క వ
ల్చుబ్బన చూఱలాడి కడుఁ జొక్కుచు సోలుచుఁ బిత్తరింపుచున్
గుబ్బెత యోర్తు కచ్చెలులఁ గుంబిరియమారఁగ నాడె వేడుకన్.

క. లుకలుకని పదనుగొని యొక
సకియ సఖీజనులు నవ్వ జాఱుచు ద్రొక్కెన్
వికసించి రణితమణి హం
సకవిదళితకామికర్ణసంపుట యగుచున్. 116

చ. వలపలి కేల నామిషము వామకరంబున మద్యపాత్రమున్
వెలుఁగఁగ రక్తనేత్రయయి వేనలి దూలభయంకరాకృతిన్
గిలకిల నవ్వుచున్ నటనకేళి యొనర్చె మృగాక్షి యోర్తు పాం
థులఁ బొరిగొమ్మటంచు మదనుం డహరించిన భూతమో యనన్.

ఆ. తలముదప్ప మధువు ద్రావి మ్రాఁగన్నిడి
చిన్ని చెక్కుదోయిఁ జెమట దొరఁగ
మ్రొగ్గియుండె నొక్క ముదిత మదోత్కృష్ట
కామపట్టభద్రగజము పోలె.

చ. కొలఁదిమెఱుంగనేర కొక కోమలిమద్యరసంబుఁ గ్రోలి సా
మ్మలుఁగొని పడ్డఁ దజ్జఘనమండలి కొంగెడవాసి రత్నమే
ఖల గవగూడి యొప్పె గతకంచుకమై నవపుష్పమాలికా
వలయితమై తనర్చు రతివల్లభు కాంచనపీఠమో యనన్.

ఉ. వెండియుఁ గొందఱందు నరవిందదళాక్షులు నేత్రపర్వమై
నిండినయౌవనామృతము నింపులు వాఱఁగఁ బువ్వుఁబొన్నలన్
మండనదీప్తిఁ జంద్రికలు మల్లడిగొల్పఁ బసిండివీణియల్
కొండొకమీటుచున్ శ్రుతులు గూడక పాడిరినందసూనునిన్.

మ. సరిగుండక్రియ విస్తరించెఁగరఁగన్ సౌధాగ్రరత్నావళుల్
తరుణీరత్నమొకర్తుకొక్కతె వసంతశ్రీపచారించి భా
స్వరగేహాంగణదారుతోరణలతాస్తంభంబులం బల్లవో
త్కరసంశోభులఁ జేసె నుల్లసిలి రాగజ్ఞుల్ ప్రశంసింపఁగన్

క. కలవాణి యొకతె చెవి కిం
పలరింపుచు మేఘరంజి యని జలదశ్రీ
నెలకొలిపి సౌధవీథుల
[1]నలిఁ దానాడించెఁ బ్రోచి నెమిలి కొదమలన్. 122

క. సిరులఁ దొలఁకు పురవీథుల
మరులుగొనుచుఁ జూచుయువసమాజము గోర్కుల్
పరువెక్కఁ గొమరుజవ్వన
గరువంబునఁ జెలఁగె బాలికలగము [2]లచటన్. 123

1. నవిరెంగాడించు. మూ. 2. లగుచున్. మూ.

క. బుజబుజఱేకులు వాడెను
గజగమనలు డాయు వాయుగతుల లవడె నం
గజరససాగరలహరీ
వ్రజయాతాయాతలీల వఱలు కొలుపుచున్. 124

సీ. క్రీడాచలంబులఁ గ్రీడించు గంధర్వ
కిన్నరసతుల సంగీతకళలు
హార్మ్యాగ్రతలముల నాసవామృత కేళిఁ
బరఁగు పూఁబోండ్ల సంభాషణములఁ
బెండ్లికివచ్చిన పృథివీశ్వరులయిండ్లఁ
జెలఁగు గర్వాలాపకలకలములఁ
బ్రాతరుత్సవవస్తుజాతగతాగత
జనముల సంఘాతిసంభ్రమముల

తే. లాసకోత్తమచంద్రశాలల నటించు
నర్తకుల పాదకింకిణీనాదగతులఁ
జైత్యసంవిష్టనాగరసరసవాగ్వి
రచనములనొప్పె నప్పుడా రాజధాని. 125

వ. ఇట్లు చంద్రోత్సవసమయంబునం బాలకడలికరళులుం బోలె నానందరసమున నుప్పొంగి చెలంగు నుల్లంబుల నెల్లవారు బహువిధోచితవర్తనంబులఁ బ్రవర్తించుచుండిరప్పుడు.

క. సురుచిరచంద్రజ్యోత్స్నా
పరిపాకస్విద్యదమృతభానుశిలార

త్నరచితవేది వయస్యా
పరిజనములు గొలువరాధ ప్రమప్రీతిన్. 127

వ. ప్రియవల్లభుని రాకకు నుల్లసిల్లుచుఁ దద్గుణంబు లుగ్గడింపు చు బోటికతెలంజూచి రేయి దడయుటకుఁ బరివేదనంబొంది యి ట్లనియె. 128

సీ. ఎప్పుడు వేగునో యీరాత్రి రాత్రియ
యహమించి యహము నేపణఁచఁబోలు!
వేగుఁ బోకాయెనాన్ విందుమే యీస్వయం
వరమహోత్సవకేళి జరుగు నొక్కొ?
సౌందర్యనిధియైన చక్రి మీరలు చూపఁ
గన్నులు వికసింపఁ గందు నట్టె?
యేవిఘ్నమును లేక దైవంబు కృపకల్గి
నావిభు వరియింప నబ్బునొక్కొ?

తే. యెట్టకేలకు నిన్ని నాళ్లేఁగెఁ గాక
నికటమునఁ దెచ్చి ప్రియునుంచి నేఁడు నన్నుఁ
గటకటా! యిట్లు గూర్పఁడే కమలగర్భుఁ
డెట్టికట్టిఁడి చెప్పరే యింతులార! 129

వ. అని వితర్కించి 130

క. సరగున రే యరుగమిఁ, బ్రియ
పరిణయకుతుకమున రాధ భావముచింతా

పరిమోదంబులఁ బెనఁగొని
యరవిరినెత్తమ్మిబోఁటికైదై చెలువారెన్. 131

వ. ఇట్లు ప్రియకథాలాపసంస్మరణంబునం బ్రవర్తిల్లుచుఁ దదా
యత్తచిత్తంబునఁ బారవశ్యంబు నొంది కన్నుమోడ్చునంత.

ఉ. రాజకళావిశేషముఁ దెరల్చి విభావరినంటుమాన్చి పా
థోజనికిం బ్రియంబొసఁగుకతొందరవచ్చెనినుండు వచ్చె మీ
ర్వే జరగుండు విచ్చియని వేగరివేగరికాఁడు తారకా
రాజికిఁ జెప్పవచ్చెననఁ గక్కునఁ జుక్కవెలింగెఁదూర్పునన్.

సీ. ప్రాఁబువ్వరాల్చి కోరకరాజి విరియించి
గొజ్జంగవలపులఁ గూడి కూడి
దళము లల్లార్చి నెత్తావులు వొలయించి
తమ్మిపూఁదేనెలు ద్రావిత్రావి
యాంబుబిందులు చిందియంచలతో సరి
దూన్మల నుయ్యాల లూఁగి యూఁగి
సురతఖేదము మాన్చి చొక్కులఁ దేల్చియం
గనలకు సుఖనిద్రఁ గఱపి కఱపి

తే. చక్రవాకమనోజాతజాతజాత
వేదుఁ బొదలించి తను వెంచి వేగుఁ బోకఁ
బోఁకమోకల[1]పూఁబాళ పుక్కిలించి
కలయఁ బొలుపారె నప్పుడి గంధవహుఁడు.

---

1. పూజాలు. మూ.

సీ. హరికరగ్రహణ కేళీలాలోలరాధికా
లలితమనోరాగకలక్ష్మితోన
చక్రివియోగ సంజనితరాధాసము
జ్జ్వలగండపాండిమచ్ఛాయతోన
జలజాక్షుదర్శనసంభ్రమకలిత రా
ధాసముల్లసితనేత్రములతోన
యచ్యుతాలింగనవ్యగ్రతావిస్ఫుర
ద్రాధాపయోధరద్వయముతోన

తే. యరుణరుచి మించె మించెఁ జంద్రాతపంబు
జలరుహంబులు వికసించెఁ జక్రవాక
దంపతులెలర్చె మన్మథోత్సవము కలిమిఁ
బ్రాతరారంభసమయసంప్రాప్తియందు. 135

క. వనజాతకర్ణికాకాం
చనపీఠాగ్రమున మధుపజయజయశుభని
స్వనములెసఁగఁ గొలువుండెన్
వనజాలయసరసులెల్ల వన్నియ కెక్కన్. 136

వ. మఱియు నామోదమేదురమధూళీపూరకుక్షింభరబంభరప
రంపరాసంభ్రమణవేగవ్యగ్రనఖముఖవిధూతసముద్ధూతసార
సకేసరవిసరధూసరితసారకాసారసముల్లోలకల్లోలవల్లీమతల్లీ
మాలికాడోలికాఖేలనవిలోలంబులై మరాళమిథునంబులు

కోమలమృణాళజాలంబులు ఖండఖండంబులుచేసి మేలిగంద్ర లప్పళించుచుఁ జిప్పిలు సుధారసంబుఁ గ్రోలి యానందలహరిం దేలి మదకలక్రేంక్రియారావంబులు చెలంగఁ దొంగలించి నెయ్యపుం గూటములకు మఱియు [1]చరలాటలును, మనోహరమాధవీయాధికాముఖనిఖిలలతావితానసమాకీర్ణ శాఖాపూర్ణ రసాలపలాశాకారకుటీరక్రోడనీడసుస్థాపితవిష్కిరనికరవితతకూజితకలకలాకులలలితోద్యానవీథీవిహరమాణసమీరణకిశోరసంచారంబులవలనఁదొడిమికలవలన సడలి పడిప్రోవులు గట్టియున్న పువ్వుందెట్టెలు వనలక్ష్మీమాధవపర్యంకశంకాకరంబులై కరంబు సొంపారుటలును, సురతబంధబంధురచిత్రపుత్రికాపరభాగభిత్తిభాగరమ్యహర్మ్యస్థలప్రకల్పితసుమనస్తల్పఖురళీమండలంబుల నకల్పకందర్పకలహాకళావైదగ్ధ్యంబునం గదిసి నిశాతనఖరాయుధముఖవిదారితతనువైక్రొన్నెత్తురులు జొత్తిల్లుముష్టాముష్టింగచాకచింబెనంగి యడఁకువఱిమల్లసంగ్రామంబునం గ్రాలికాలువెనఁచికొని వడి నన్యోన్యదృఢనిగృహీతవేణికాబంధహస్తప్రశస్తత నలసి యొడళ్లు మఱచియున్న హూంతకారులగు విటవిటుల తర్జనంబుల నుపలాలనసేయుచు హస్తస్పర్శనంబుల నల్లనల్లనఁ బ్రబోధాచరణంబు లొనర్చు చెలులహితోపచారంబులుం గలిగి చెలువారుచుఁ బ్రభాతకాలంబు పరిస్ఫుటంబయ్యె నయ్యెడ. 137

---

1. చలంగాములును. మూ.

క. తేజోనిధానుఁ డగుగ్రహ
రాజు ప్రతాపమునకోడి రాజరిగె; యథా
రాజాతథాప్రజాయను
నోజను నుడువర్గమెల్ల నూడనిఁ బాడెన్. 138

చ. నలినహితుండు పద్మిని మనంబలరంగఁ గరంబు సాఁచి మే
లోలయఁగ మొగ్గపోఁకముడి యూడ్చినమించితదీయ మేఖలో
జ్జ్వలతను మధ్యనీలమణి స్రుచిరేఖలు పర్వనోయనన్
లలితగతిన్మధువ్రతకులంబులు దూలెఁ దదంతరంబునన్.

సీ. పాథోధిపై లీలఁ బవళించియున్న వి
ష్ణుని యురస్థ్సలము కౌస్తుభమనంగ
బలదానవారాతి పట్టపేనుఁగు మెడఁ
గట్టిన బంగారుగంటయనఁగఁ
గుంకుమద్రవమునఁ గుమురుగాఁ దీర్చిన
దినలక్ష్మిముఖపద్మతిలకమనఁగ
సలిలకేళికిఁ బూను శచిదేవి కెంగేలి
కాంచనకర్దమకబళమనఁగ

తే. మండలము తేజరిల్లఁ గన్పండువగుచు
సహజమై తనలోకలోచనత నెగడఁ
ద్రిభువనాగారమాణిక్యదీపమనఁగఁ
బద్మబాంధవుఁ డుదయాద్రిపై వెలింగె. 140

వ. ఇట్లు సూర్యోదయంబయ్యె నంతకమున్న బలరామకృష్ణులు వందిమాగధబృందంబుల మధురగానస్తోత్రాలాపంబులఁ బ్రబోధితులై తత్కాల్యకరణీయంబులు నిర్వర్తించి స్వయంవరసమయంబుఁ గోరుచుండి రట్లయ్యెల్లవారును మేల్కని యుచితకృత్యంబులు నడపి రా సమయంబున. 141

క. కలవీణావేణుస్వన
ములు మర్దలపటహనాదకములు ఘంటాకా
హళరవములు జయశంఖం
బుల ఘోషలు రాజగేహకమునఁ గడుఁజెలఁగెన్. 142

వ. అప్పుడు సహస్రగోపమండలేశ్వరుండు మిత్త్రసామంతపురోహితామాత్యకుమారసహితుండై పెద్దమొగసాలఁ గొలువుసేసి పురంబునంగల చిత్రకారులం బిలిపించి రాజమందిరపూర్వకంబుగా రాజధానిం గైసేయుండని నియోగించినఁ దదనుజ్ఞాతులై వారు, 143

క. పురము విలోకింపఁగ సురు
చిరమణిమార్గంబు గనకకచిత్రితఘనగో
పురసాలరత్నసౌధో
త్కరరమ్యము దీని నేల కైసేయంగన్. 144

వ. అని తదీయసౌభాగ్యంబుఁ గొనియాడుచు నానామార్గంబుల,

సీ. కస్తూరినలికిముక్తాఫలంబుల రంగ
వల్లికల్ పంకజకస్వస్తికాది

రూపంబులను ననురూపంబుగాఁ దీర్చి
ప్రవికాసిసురభి పుష్పములు నెరపి
బహువిచిత్రితనేత్రపట్టమాంజిష్ఠాది
పటముల మేల్కట్లు పన్ని యెడల
ఫలరత్నగుచ్ఛపుష్పస్రక్పరంపరల్
గట్టివాకిళ్ళ బంగారుమెట్లు
తే. నిక్షుకాండంబులును జేర్చి యిగురుఁ బువ్వు
గొడుగులొనరించి రావిచిగుళ్ళరత్న
దర్పణంబులఁ దోరణస్తంభరాజు
లెత్తి కేతనములు నిల్పి రెల్లదిశల. 146

క. కలధౌతకనకమణిమయ
ములు బుష్పమయములు నగుచు భూవరయోగ్యం
బులుగాఁ బన్నిరి తమకము
లలవడ నారాజమందిరాంగణభూమిన్. 147

సీ. ఆదినారాయణుఁ డమృతాబ్ధిమథియించి
యబ్జవాసినిఁ బెండ్లియైనకథలు
చంద్రశేఖరుఁడు పుష్పశరాసు గెల్చి హి
మాచలతనయఁ బెండ్లైనకథలు
శ్రీరామచంద్రుండు శివధనుర్భంజన
మడరించి సీతఁ బెండ్లైనకథలు

నలచక్రవర్తి వేల్పులు సిగ్గుపడఁగ భీ
మాధిపకన్యఁ బెండ్లైనకథలు
తే. చిత్తభవకేళిబంధవిచిత్రగతులు
హంసకలరవకీరరథాంగగతులు
వ్రాసి రలవడఁ దత్స్వయంవరమహీస్థ
లాంతికస్వర్ణసౌధకుడ్యములనెల్ల. 148

వ. ఇట్లలంకారభాసితంబై యాగోమతీనగరంబు బహుళగంధ
బంధురగంధవాహవిహారణమనోహరంబును వివిధవర్ణవిరాజ
మానతేజోమండలాభిరామరత్నసమాకీర్ణంబును వాసనా
వశంవదమదాలిమాలికావ్యాకులితసుమనోమాల్యమరంద
బిందునిష్యందసుందరంబును నై మలయాచలరత్నాకర చై
త్రరథంబుల నపహసించి త్రిలోకలోచనపర్వంబై మదనమ
ల్లలీలాఖురళీమండలం బనఁదగి యొప్పె వెండియు, 149

గీ. లలితమైన కెందామర కొలను మేలు
కొన్నవిధమునఁ బ్రోలు కన్గొనఁగనొప్పె
నెల్లవారును దమతమ యింటఁ బెండ్లి
యైనచందాన నానందమందిరపుడు. 150

సీ. నీలాలప్రోవులో నీలకంఠకలాప
వల్లరులోనాఁగ వన్నెకెక్కి
తమ్మిపూగుంపులో దర్పణబింబక
దంబంబులోనాఁగఁ దలఁపుకెక్కి

కవగూడియున్న చ - క్రంబులో హాటక
కలశంబులోయనఁ - గొలువు కెక్కి
మరుమల్లఁ దీఁగెలో - మంజుసౌదామనీ
ఖండంబులోయనఁ - గాన్పు కెక్కి

తే. కబరికాభారముఖకుచాం - గములు మేని
తొడవులకుఁ దొడవై సిరి - తొంగలింపఁ
గరిణులనఁదగి మదభర - స్ఫురితగతులఁ
బ్రీతివచ్చిరిపురిఁగల్గు - పేరఁటాండ్రు. 151

సీ. తాటంకమౌక్తిక - ధాళధళ్యంబులఁ
దరళకటాక్షసం - తతులునవ్వఁ
గర్ణభూషీకృత - కల్హారదీప్తుల
లలితకుంతలకాంతి - లంచమడుగఁ
గుచకుంభయూషిత - కుంకుమచ్ఛాయలు
కలితాధరశ్రీలఁ - గౌఁగిలింపఁ
బసిఁడిబ్రాఁతల పచ్చ - పట్టుచీరల నిగ
న్నిగలు మైమెఱుఁగుల - నీడఁజూడ

తే. హస్తలీలారవిందలో - లాళితతుల
మ్రోఁత మొలనూళ్ల చప్పుళ్ల - ముదలకింప
మన్మథుని వేఁటప్రోదిన - మళ్లనంగ
సానికూఁతులువచ్చి రు - త్సాహలీల. 152

వ. వెండియు సకలజనంబులు నలంకృతులై నానావిధోపాయ
నంబు లాయితముచేసికొని రాజమందిరంబునకుఁ జనుదేరఁ
దొడంగి రంత నంతిపురంబున, 153

ఆ. కమలరాగజాలకంబుల పచ్చల
మేడదండఁ బొన్న సీడ వికచ
మాధవీలతాసమాకీర్ణమై యొప్పు
చంద్రకాంతమణుల చవికెలోన. 154

క. మంగళతూర్యధ్వనులు చె
లంగన్ రాధికకు మంగళస్నానముసే
యం గనకపీఠ మిడిరి పు
రాంగనలు మణీమరీచు లావర్తింపన్. 155

వ. ఇట్లాయితంబుచేసి యమ్మజ్జనశాలకు నమ్మహాదేవిం గై
దండలిచ్చి తెచ్చి తత్పీఠాగ్రంబునఁ గూర్చుండనియమించి,

సీ. లలితదూర్వాంకురాక్షతాకలితమైన
గంధతైలంబుఁ గొనివచ్చి కాంతయొకతె
వేణికాబంధ మెడలించి వింతవింత
గతుల నభ్యంగమొనరించెఁ గలికిగోళ్ళ. 157

క. వెరవునఁ బ్రత్యంగంబును
బరిపాటిఁ జిగులు నిగుడఁ బరిపరిగతులన్
బరిమర్దింపుచు సీకా
యరసంబున జిడ్డుఁ దిగిచె నతివిమలముగాన్. 158

క. మలయజము కుంకుమద్రవ
కలితంబుగఁ జేసి యంగకంబుల నెల్లన్
గలయఁగఁ బన్ని రెడనెడఁ
జిలుకుచు నలుఁగిడియె నొక్కచెలి నెయ్యమునన్. 159

క. హిమవారిపూరమిళితము
కమలజముఖపుష్పగంధకలితమునై హే
మమణికలశపూర్ణంబగు
యమునాతీర్థమున జలకమార్చిరి కణఁకన్. 160

క. జలకం బాడిన తుది న
న్నెలఁతుకతనులతికజిగులు నిగనిగనిగుడన్.
జెలువారెన్ బులుఁగడిగిన
వలరాయని కలికి మెఱుఁగువాలుం బోలెన్. 161

ఉ. సన్నుత నీలరత్నరుచిసంపదసొంపు హరింపఁజాలు న
క్కన్నియ వేణికాభరముఖంబునఁ జిందు పయఃకణావళుల్
కన్నుల కింపొనర్చె నవకంధరఖండమునుండి తొల్కరిన్
గ్రన్ననరాలు నచ్ఛకరకానికరంబులఁ గ్రేణిసేయుచున్.

వ. తదనంతరంబ తడివల్వ యూడ్చి ధౌతమృదులాంబరంబుల
మెత్తమెత్తన మేనితళ్లొత్తి కనకచిత్రితముక్తాఫలాంచలంబుల
పచ్చపట్టుపుట్టంబుఁ గట్టనిచ్చి హరిచందనగోరోచనాగరుప్ర
కల్పిత సురభిధూపంబునఁ బెన్నెఱులార్చి. 163

క. ఆమీఁద మేమరములగు
చామంతులు చెంగలువలు జాజులును దగన్
సీమంతమలర నొకతె స
తీమణికిం గొప్పు ముడిచె దృఢబంధముగాన్. 164

గీ. సజ్జకంబైన కమ్మని జాజిదండ
సుదతి కొప్పునఁ జుట్టినఁ జూడనొప్పెఁ
గామశబరుండు విరహిమృగములఁదార్చి
పట్టఁ జీఁకటిఁ [1]గొనఁబోఁగు వాఱినట్లు. 165

గీ. తరళలోచన యొకతె గేర్దంగిజేకు
రాధికాదేవికబరిభారమునదోఁపె
నది ప్రమోదాబ్ధిఁదేల్చె నేత్రాంబుజముల
జలదఖండంబున హిమాంశుకళికవోలె. 166

క. దళదరవిఁదదళద్యుతి
గల రాధికనిడుదవాలుఁ గన్నులు నవక
జ్జలరేఖలుదీర్చినఁ గల
కల నవ్వొందొడఁగె నల్లగలువలచెలువున్. 167

క. జలజాక్షియొకతె కరకౌ
శలమొప్పఁగ మణిశలాకఁ జక్కఁగ నునుఁగ్రొం
దళుకొదవఁదోఁమి రాధా
లలన చరణనఖరశిఖల లత్తుకఁదీర్చెన్. 168

1. చీఁకటిదనబొంగు వారినట్లు. మూ.

ఉ. ఈధవళాక్షిఁగూడి యెపుడేని వృథాకలహంబుతోడ న
మ్మాధవుఁడుండ నప్పతని మానమునున్నిరసింపమ్రొక్కినన్
బోధ మొనర్పఁ గేల్పఱపఁ బూనియునున్న విరాగ్రహస్యముల్
రాధికకాళ్లఁ గోళ్లఁ నగఁ రాజిలె యావకరాగశుభ్రతల్.

ఉ. సంకుమదంబుఁగుంకుమముఁ జందనముల్ హిమవారిధారలన్
బంకముచేసి వజ్రమణిపాత్రికలం దగనించి తెచ్చి యే
కొంకును లేక రాధకుచకుంభకపోలలలాటసీమలన్
బంకజనేత్ర యొక్కరితె పత్త్రలతల్ విలిఖించె నేర్పునన్.

క. స్మరనగరరాజమార్గముఁ
బరిహాసముసేయు చిన్నిపాపటసిందూ
రరజంబుఁ దీర్చెనొకహిమ
కరమండలవదన రాధికకు బొట్లలరన్. 171

వ. తదవసరంబునఁ బ్రియవయస్యలు పసిండిభ్రాఁతల దంతపుం బెట్టెలుదెచ్చి ముద్రలుదిగిచిత్రతాళంబులూడ్చి పైమూఁకుళ్లు వాయందట్టి ధగద్ధగితశుద్ధసువర్ణమణిమయంబులును వివిధవిచిత్రవిరచితంబులు నగు మనోహరమండనంబులు మెఱుఁగుతండంబునుంబోలెఁ గన్నులు మిఱుమిట్లుగొన నద్దేవిముందటం బెట్టి యలంకరింపందలంచి, 172

చ. పడఁతుకలప్పురా ధనవభాసురయావన విభ్రమంబు లే
ర్పడ ననిమేషదృష్టులఁ దిరంబుగఁ జూచిశిరంబులూఁపుచున్

దొడవుల కెల్లనుందొడవు కెత్తొయ్యలిరూపము దీని కెల్లమై
నిడ నివివట్టిభారమని కెనింద దలంచిరి వానివానికిన్, 173

వ. ఇట్లు కొండొకవితర్కించి సంతసించి శుభకరంబుగాఁ దొడు
గుట యుచితకృత్యంబని మేలేర్చి క్రమంబున విభూషింపఁ
దొడంగి రప్పుడు. 174

క. సల్లలితకనకకటకము
వల్లవిపాదమునఁ దొడిగె కెవనితయొకతె రా
జిల్లెనది కామకల్పక
వల్లికిడినయాలవాల కెవలయము వోలెన్. 175

క. నవమణికాంచీసూత్రము
యువతినితంబాగ్రసీమ కె నొప్పారె మనో
భవుసిరియింటికిఁ గట్టిన
నవకళ్యాణార్ద్ర తోరణంబును బోలెన్. 176

ఆ. కంబుకంఠికంబు కెకంఠసంవేల్లిత
భర్మసూత్రరత్న కెపదకమొప్పె
రతిలతాంతశరుల కె రమ్యలీలాయోగ్య
మయిన తూఁగుటుయ్యె కెలయును బోలె. 177

చ. ప్రసవశరున్ జగద్విజయ కెపట్టముగట్టి నవీనమల్లికా
ప్రసవకృతస్రగావృతవి కెభాసురకాంచనరత్నకుంభముల్
పొసఁగఁగనిల్పిరన్నక్రియఁ కె బొల్తుకచన్నులు హారవల్లికా
విసరవిభూషితంబులయి కెవింతయు వేడ్కయొఁగొల్పెఁజూడ్కికిన్.

క. కోమలిధమ్మిల్లము చూ
డామణిఘృణికలితమై విరోడంబించెరమా
రామావల్లభకౌస్తుభ
దామోజ్జ్వలబాహుమధ్యరోతల సదృశంబై. 179

వ. వెండియుఁ గోమలపల్లవాగ్రంబుల మెఱయుతుహినకరకిరణ కందళులచందంబునఁ జరణాంగుళిపఙ్క్తుల వజ్రఖండకాంతి తరళితంబులగు పసిండిమట్టియలును, మకరకేతనకరిదంతకాండంబులఁ దొడిగిన కంకణంబులకరణిఁ జారుజంఘాగ్రంబులఁ బుష్యరాగరచితంబులగు పసిఁడిపెండెంబులును; సంఫుల్లహల్లకప్రసూనంబులఁ గ్రందుకొన్న రోలంబకదంబంబుల పగిది మృదులహస్తాబ్జంబుల నింద్రనీలమాణిక్యకలితంబులగు సువర్ణవలయాంగుళీయకంబులును గనకచంపకప్రసవోపరిభాగంబునఁ దొరఁగుప్రాలేయతోయకణంబుమురిపెంబున నాసాగ్రప్రదేశంబున నాణిముంగరముత్తెంబును గనకసూత్రబంధంబులై వ్రేలు రతీమన్మథుల కేళీచంద్రవలయంబుల పోలుపునఁ గర్ణపాశంబులఁ బద్మరాగసంకలితంబులగు హాటకతాటంకచక్రంబులును, రతికామజాయాపతుల క్రీడాసౌధశిఖరంబుల నెత్తిన హేమకలశంబులరూపున శ్రవణోపరితలంబుల మణిమయంబులగు బంగారుకుంటెనకుచ్చులును, ప్రేక్షణీయంబులయ్యె. 180

గీ. లలనకర్ణావతంసోత్పలములఁ దగిలి
చూడనొప్పారెఁ దేంట్లు ప్రసూనధన్వి
యలిగి విరహులపైఁ బన్నినట్టి వెట్టు
క్రొవ్వులందిడ్డ నీలంపుగుండ్లనంగ. 181

గీ. రాధికాదేవి నవరత్నరచితమైన
నిలువుటద్దము పెట్టిననీడఁ జూచెఁ
దనకుఁ దనరూపు సరిచూపుఁ డనుచుఁ దెలుపు
పగిది నిజమూర్తి ముకురబింబమున వెలుఁగ. 182

వ. ఇట్లు సర్వాభరణభూషితయై వసంతసమయ కుసుమసమా
కీర్ణ సుకుమారపారిజాతలతికయుంబోలెఁ జక్షురుత్సవంబైన
యమ్మచ్చెకంటిం జూచి నెచ్చెలులు పిచ్చలించి రప్పుడు
కర్పూరనీరాజనంబులు సమర్పించి పుష్పగుచ్ఛంబులు ఫలం
బులు దర్శనంబిచ్చి పుణ్యపురంధ్రీజనులు గృహదేవతానమ
స్కారసమయంబని యత్తెఱవ కెఱింగించిన. 183

గీ. వనజరాగాలగొడుగుపావాలగిలుకు
చెలఁగి మరువింటిజళుకులఁ జేయుచీవ
ఘననితంబపయోధరకలశభార
భరము గంభీరగమన సంపదలఁ బ్రోవ. 184

వ. అరుదెంచి తనకు మాధవుండు మగఁడుగా ననుగ్రహింపుఁ
డీయని యిలువేల్పులకుఁ బ్రాంజలియై తదీయప్రసాదదివ్య

కుసుమమాల్యంబులు ధరియించి జననికి ముత్తైదువలకుఁ బ్రణమిల్లి తత్కారార్పితశుభాశీర్వాదకలితంబులగు ముత్తై పుసేసఁబ్రాలుశిరంబునం దాల్చి యొక్కచంద్రకాంతవేదికఁ గనకపీఠంబునఁ గూర్చుండి ప్రియవయస్యాసహస్రనేత్రసహస్రపత్త్రిదళారాధనవిరాజమానలావణ్యలక్ష్మీవిభవాభిరామ యగు నక్కోమలి వల్లభాలోకనంబుఁ గోరుచుండె నవ్వేళ సహస్రగోపనృపవల్లభుండు హాజారంబున స్వయంవరసంజ్ఞా భేరి వ్రేయించిన, 185

గీ. శ్రావ్యమగు తత్స్వయంవరసమయ పిశున
చారుమధురగభీరభేరీరవంబు
చెవులుసోఁకిననుత్ఫుల్లచిత్తులగుచు
రాఁ దొడంగిరి నిఖిలభూరమణసుతులు. 186

సీ. పూర్ణేందుమండలస్ఫూర్తివిడంబించు
ధవళాతపత్రసంతతులు వెలుఁగఁ
జారుమరాళపక్షచ్ఛవిఁ దళుకొత్తు
ప్రవిమలచామరప్రతతులడర
నవతటిల్లతికల నవఘళించెడు మేని
తళుకులమదవతుల్ బలసికొలువఁ
బుష్పితవాసంతభూరుహంబులుపోలెఁ
బసిఁడితొడవుల మూపములు మెఱయఁ

తే. గలితమృగమదకాశ్మీర కల్పితాంగ
రాగగంధప్రవాహముల్ గ్రమ్ముకొనఁగఁ
జెంగలించి స్వయంవర రంగమునకు
రాజు లేతేర నొప్పె నా రాజవీథి. 187

చ. పొరిఁబొరిరాలు రాజకుల భూషణ హేమరజోవితానమున్
గరిగమనాసహస్రముల గండతలంబులయందుఁ జిందు చెం
దిరమును దోరణప్రసవ నిస్సృతచారుమరందధారలన్
గరఁగి పదప్రఘట్టనలఁ గర్దమమయ్యెఁ బురంబు వీథులన్.

వ. ఇట్లు నానావిధవైభవంబులం జనుదెంచి తత్స్వయంవర రంగమహీమండలంబునఁ గట్టాయితంబులైన పసిండితమాగంబులెక్కి. 169

సీ. కురుకులేశ్వరు కెలంకున మాళవేంద్రుండు
మాళవేంద్రుని దండ మగధవిభుఁడు
మగధసర్వంసహా మండలేంద్రుని యొద్దఁ
జోళభూకాంతుండు చోళనృపతి
దాపునఁ బాండ్యక్షమాపతి పాండ్యభూ
పతిప్రాంతమున సింధుభర్త సింధు
పతిసమీపమ్మునఁ బాంచాలభర్త పాం
చాలుని కెలనఁ గోసలవిభుండు

తే. గదిసి కూర్చుండి యైశ్వర్య గర్వశౌర్య
విభవబలముల నొక్కింత వెలితిపడక

శైలతటముల మృగరాజసమితిఁ బోలె
నొప్పి రొప్పులకుప్పలై యొకరికొకరు. 190

వ. మఱియు నంగవంగకళింగగాంధారసౌవీరసూరసేనకరూశకు
కురకుంతలావంతిలాటచోటమత్స్యమద్ర కాంభోజబర్బరవిద
ర్భకొంకణటెంకణత్రిగర్తనేపాళఘూర్జరప్రముఖదేశాధీశ్వరు
లును, సరససల్లాపబహుమానంబులం గలసిమెలసి తగు తె
ఱంగుల సుఖాసీనులై యుండి రంతఁ గొందఱు బిరుసుమ
గలు మగఁటిమి చూపి మేము మేము కన్యకం బరిగ్రహింతు మని
మాత్సర్యకుటిలబుద్ధియుద్ధసన్నద్ధులై బలంబులఁ గెలంకుల
ననువుపఱచుకొని హయగజారూఢులై యుండి రట మున్న
యీసర్వంబును జారదృష్టి నెఱింగినవాఁడై కంసుండు రోష
విషాదవిహ్వలహృదయుండై స్వయంవరసమయంబున రా
ధామాధవులం బట్టుకొని త్రింగిరమ్మని ప్రేరేచి పంచిన
హలగ్రీవుం డనురక్కసుండు నిజమాయాబలంబున నపూర్వ
చిత్రరూపవర్తనంబులఁ బొలుపారు చతురంగబలంబు లనే
కంబులు గల్పించుకొని మనోవేగంబునవచ్చి రాజరూపం
బున నలంకారభాసితుండై వారిలోనంగలసి యొకయెడ
నెడరువేచియుండె వెండియు. 191

సీ. బహురత్నకాంతిసంపదపొంపు గాన్పించు
[1]బర్హాదామము మౌళిఁ బ్రజ్వరిల్ల

1. బహుళి దామము—మూ.

రాజార్కరుచులఁ దిరస్కరించెడు శంఖ
చక్రాంశు లాశల సంస్పృశింపఁ
బారిజాతద్రుమప్రసవమాలిక పెన్ను
రంబున మకరందరసముఁ జిలుక
మెఱుఁగుఁదండంబులఁ గిఱికొల్పు పీతాంబ
రము కటిస్థలమున రంగుమీఱ

తే. నలికమునఁ గల్కిమృగమదతిలకమమర
గండతలమునఁ గుండలకాంతులొలయ
జలజనేత్రుండు బలభద్రసహితుఁ డగుచు
వచ్చె గోపాలసుతులు క్రేవల నటింప. 192

క. మదవతి యొక్కతె కృష్ణున
కెదురుగఁ జనుదెంచిచూచె నిఱిచన్నులు ప
య్యెదజాఱి మీఱఁ జక్రియు
ముదమున నవి పూర్ణకుంభములుగాఁ జూచెన్. 193

ఆ. పద్మనాభుమీఁదఁ బర్వె వల్లవిచూపు
లెల్ల రాజకోటి నీడవిడిచి
మెలమిఁ దియ్యనీటి కెదురెక్కు మత్స్యంబు
లుప్పునీరు దొఱఁగు[2]నుపమపరఁగ. 194

ఉ. కారుమొయిళ్లనల్లసిరి కాయముఁ దాల్చెనొ కాక నవ్యశృం
గారరసంబుచేఁ గరడుకట్టెనొ కాక మనోజమోహనం

1 మపను పరదు ...మూ.

భీరతనూవిలాసములఁ బిల్చెనొ నాఁగను మల్లుగొల్పె సం
భోరుహనేత్రుదివ్యతనుభూతి విలోచనవత్పరంపరన్. 195

వ. అందు. 196

సీ. ఏలనాయౌవ నంబీయౌవనోద్దాము
నెలయించికనుమరుల్ గొలుపకున్న
నేల నావిభ్రమం బీవిభ్రమాకారు
దీకొనివెనువెంటఁ ద్రిప్పకున్న
నేలనాచతురత్వ మీచతురశ్రేష్ఠు
బహుకేళిగతులలోఁ బఱుపకున్న
నేలనామధురోక్తు లీమధురాలాపు
చెవులకు నమృతంబుఁ జిలుకకున్నఁ

తే. గలికితనమేలయీకల్కిఁ గరఁపకున్న
దిట్టతనమేల యీదిట్టఁ దేల్పకున్న
ననుచు విస్రస్తతనువులై యబ్జముఖులు
మాధవునిఁ జూచి వాంఛాబ్ధిమగ్నలైరి. 197

వ. ఇట్లు జగన్మోహనాకారం బగుచెలువంబున నెల్లవారియుల్లం
బులుం బల్లవింప నావల్లవవల్లభుండు చనుదెంచి వికచపు
ష్పమంచాగ్రంబున నగ్రజుండును దాను ననర్ఘముక్తాఫల
మాలికాభిరామంబులగు మయూరచ్ఛత్రంబులక్రీనీడ విశ్ర
మించి పరమయోగిని నాకర్షించుమహామంత్రసిద్ధుండునుం
బోలె రాధికరాకఁ గోరుచుండెనప్పుడు. 198

క. జలజాతహితువిరుచులఁ గ
ళలడంగి వరాజమండలంబును బోలెన్
జలజోదరుపి బ్రము లీ
లలఁ బొలుపఱిరాజమండలము గడుమాసెన్. 199

శా. హేలామన్మథునమ్ముకుందుఁ గని యెంతేఁ గంది తన్మేదినీ
పాలాగ్రేసరులు స్మరించునిజ సౌభాగ్యంబు నిందించి లో
లోలజ్జం బెనఁ గొంచు రాధపయిఁ గీర్త్యొన్నట్టి యాశాలతా
జాలచ్ఛేద మొనర్చిరుల్లముల మాత్సర్యంబు సంధిల్లఁగన్.

వ. ఆసమయంబున.

గీ. బ్రహ్మరుద్రాది విష్ణులు భారతీశ
వారమాయుక్తులయి పయోవాహవీథి
నోలిఁ గొలువుండిరాలోక నోత్సవమున
నార్యగణభాగవతవర్గ మలరి కొలువ. 201

చ. హరిదహనాంతకాసురపయఃపతి మారుతయక్షరాణ్మహే
శ్వరులు గజాజసైరిభ నృవారిధరైణతురంగ నందికే
శ్వర కృతవాహులై కులిశ శక్తి గదాకరవాలపాశము
ద్గర పరిఘత్రిశూలములు దాలిచివచ్చిరి చూడవేడుకన్.

సీ. శేషాదిఫణులు, వసిష్ఠాదిమునులు, న
ర్కాదిగ్రహములు, రంభాదిదేవ
మానవతులుఁ, జిత్రసేనాదిగంధర్వ
నాయకోత్తములును నారదాది

పరమయోగీశ్వరప్రకరంబులును, నరుం
ధత్యాది పుణ్యకాంతలును, దివిజ
సరిదాదినదులు, నశ్వయుగాదితారలు
పారిజాతాది కల్పతరువులును

తే. నశ్వినీదేవతలును నింద్రాదిదేవ
తలును దర్శింపవచ్చి సంతస మెలర్ప
నిండియుండిరి యాకాశ మండలమున
వరణవిభవోచితాలాప వర్ణనముల. 203

వ. సకలదేవతావ్రాతంబులుం గొలువనొప్పు నా హరిహరబ్ర
హ్మలపేరోలగంబు పేర్కొన నరిదియయ్యె నిట్లు భూనభోం
తరంబుల నేకోత్సవంబై యుండె నప్పుడమ్మహారాజమండల
మధ్యంబునఁ దేజరిల్లు రాజీవలోచనుచెలువంబుఁ జంద్రబి
కారసంబుఁ గ్రోలుచకోరంబులునుం బోలె ననిమిషకాంతల
చూపులు చూఱవట్టుచుండె నయ్యెడ. 204

క. కలితధ్వజాంశుకంబులు
బలుపై దివినుండి యాతపముదొలఁగింపన్
గలువడముల పూదండల
వలపున వలిగాడ్పు లెల్ల వారిందనిపెన్. 205

వ. అంతసహస్రగోపకుండు కన్యారత్నంబును దోడ్తెండని సంగా
తకత్తెలవర్గంబుల నియోగించిన. 206

సీ. పసిఁడిగేదఁగిఱేకు పలకలు హత్తించి
యబ్జకర్ణికలఁ గోళ్ళనువుపఱచి
పద్మకోరకముల పైఁడిగుబ్బలునించి
మొల్లపూమొగ్గల మొగడలిచ్చి
కురువేళ్ళ గొజ్జంగకుచ్చులు సమకట్టి
పల్లవంబుల వ్రాఁత పలకదీర్చి
బొండుమల్లియపువ్వు దండలు గీలించి
తగఁబగడపుఁదీఁగె దండనిలిపి
తే. కమ్మచేమంతిపువ్వుల కడలజాజి
పాన్పు వొందించి చెంగావి పైనమర్చి
పాలకీ యొక్క టాయత్త పఱచి తెచ్చి
తరుణిముంగలనిడిరి నేత్రావులలర. 207

వ. ఇట్లు ముందటఁ బాలకీనిల్పి కరంబు మొగిడ్చి. 208

క. నందజుఁడాదిగఁ గలనృప
నందనులే తెంచినారు నలినాక్షి భవ
త్సౌందర్యవాగురందగి
లం[1]దఱువలలోని జలచరావలివోలెన్. 209

వ. అయిననందు నీకృపాలక్ష్మికిఁ బాత్రంబగు పవిత్రమూర్తి మదనగోపాలచక్రవర్తిగాక వేఱొకండు గలుగనేర్చునే యని తన్మనోరథంబు సూచించి దేవీ! నిన్నుం దోడ్తెమ్మని జన

1. అందలబలువైన... మూ.

కుని యానతీయవయ్యె విజయం చేయుమని విన్నవించిన
నమ్మధురోక్తులకు వికసించి సిగ్గులగ్గు దేర మెఱుఁగుఁ
జూపులకలికితనంబు నిలుపుకొనుచుఁ జెక్కులఁ జిన్నివెన్నె
లనగవు తొంగలింప సంగడికత్తెలకు భ్రూవల్లీవేల్లనంబున
గమనోన్ముఖత్వం బెఱింగించి మంగళతూర్యంబులు చెలంగఁ
బుష్పఁబాలకి యెక్కి యక్కన్యకాతిలకంబు లీలారవిందసుం
దరకరారవిందయై కదిసివచ్చునపుడు. 210

గీ. విమలకర్పూర తాళవృంతములు ధవళ
చామరంబులు మణిమయచ్ఛత్రములును
దాల్చి సౌవర్ణకంకణధ్వనులు చెలఁగఁ
గుబ్బెతల్వచ్చి రిరుగెలంకులఁ గొల్చి. 211

వ. ఇవ్విధంబున సఖీమండలపరివృతయై యెడనెడ నమృత
పూర్ణకలశంబులును సాధ్వీజనంబుల నాలోకింపుచుఁ గొన్ని
వాకిళ్ళు గడచి వచ్చి యవ్వల్లవీరత్నంబు వల్లభదర్శనా
పన్నసమయంబగుటం జేసి సంతోషభయలజ్జారసంబులఁ దోఁగి
చిత్తంబు జీరువాఱుచుఁ జన్నుఁగ్రేవలు గరుపాఱ నేచందం
బునఁ బ్రాణేశ్వరు వరించుదాననో కోయని తత్ప్రకారంబు
లుగ్గడింపుచు. 212

సీ. ప్రీడ లోఁగకపోక్కు కే విడిచినందకుమారుఁ
జూడుఁడీ నాకనుకేచూపులార

గడగడవడఁకి వెన్కకుఁ బోకధృతిఁ జక్ర
ధరుఁజేరుఁడీ నాపదంబులార
జడియకనిగిడి కంజాతనేత్రునిఁ జెట్ట
వట్టుమీ నాపాణిపల్లవంబ
యడఁకువమాని పద్మాక్షుచంకిట నిటి
కుండుమీ నాకటిమండలంబ

తే. యతనిచెలువంబు నతని నెయ్యంబు మ్రొక్కు
నతని కేశగ్రహణకేళి నతనిచారు
నిశితనఖరాంకకలనలు నేఁడులంచ
మిత్తునతనికి చేవిన్నె యేనుమీఁకు. 213

వ. అనిపలికి తనకు నొయ్యొయ్యనఁ బ్రౌఢవయస్యలు స్వయం
వరసమయోచితకృత్యంబు లుపదేశింప వినుచు హజారం
బుగడచి వచ్చినప్పుడు. 214

గీ. జలదమండలివాసిన చంద్రరేఖ
కరణి గేహంబు వెలువడి కాంతులొలయఁ
బాలకీయందుఁ దానొప్పెఁ బద్మగంధి
లోలకల్లోలడోలమరాళివోలె. 215

సీ. కలకలమనెడు నెచ్చెలుల నెమ్మోములు
విరిసిననెత్తమ్మివిరులుగాఁగఁ
దనుఁ జూచిసిగ్గున మునుఁగుదేవాంగన
లవిలోచనములుత్పలములుగాఁగ

మదనాగ్నిదరి కొని ఽ మండు కాముకులచి
త్తంబులు సూర్యకాంఽతములు గాఁగ
జగదేకవంద్యుఁడై ఽ నెగడు యశోదాత
నూజుండు లోకబంఽధుండు గాఁగ

తే. స్వపదయావక మాతపఽచ్ఛాయమెఱుపు
గాఁగ విలసిల్లె సకలలోఽకప్రియైక
దర్శనోత్సవమగుట రాఽధావధూల
లామమభినవ [1]దినముఖఽలక్ష్మివోలె. 216

వ. ఇట్లు చనుదెంచి వాహనంబు డిగ్గి,... 217

గీ. నిఖిలజనములచూపులు ఽ నిండఁ బర్వ
యవయవశ్రీల గిఱికొని ఽ యాఁచుచుండఁ
దేంట్లు వ్రాలిన లేఁబువ్వుఁఽదీఁగవోలె
మానవతి నిల్చెనాస్థానఽమండపమున. 218

సీ. కోమలకుంకుమాంఽకూరంబులని పాద
సురుచిరాంశులు దెంపఁ ఽ జూచువారుఁ
బైఁపయిఁ దొరఁగెడు ఽ పసిఁడిపొళ్లని తను
ప్రభలకు దోసిళ్లు ఽ వట్టువారు
నాణెము తెప్పుఁజేరుఽలని దృక్పరంపరల్
సంస్పృశింపఁగఁ జేయి ఽ సాఁచువారు
నెలచందురుం డుదఽయించెనంచు లలాట
మునకుఁ గానుకలెత్తి ఽ మ్రొక్కువారు

1. దాన్యప్రతి. మూ.

తే. నైరియాస్థానమునఁ గల్గు నఖిలజనులు
సకలలోకైకవిజయ దీక్షాధురీణుఁ
డైన పుష్పాస్త్రసమ్మోహనాస్త్రమనఁగ
నెగడురాధిక చనుదెంచి నిలుచునపుడు. 219

వ. ఇట్లు నిలిచి యమ్మహాసభామండపంబున సాక్షాత్కారం బువహించిన జగన్మోహనలావణ్యాధిదేవతయునుంబోలె న పూర్వసందర్శనానందసంధాన హేతువై విద్యుద్దండవిలాస పాండిత్యంబు విడంబించు నిజతనులతావిస్తీర్ణప్రభామండల ధాళధళ్యంబులం గన్నులు మిఱుమిట్లుగొలుపుచున్న కన్యా తిలకంబుం జూచి కౌతుకాశ్చర్యమగ్నంబగు మనంబు పరి పక్వఫలంబునుంబోలె రసమయంబై యుండ వేపమాన మౌళిమండలులగుచు భూమండలేశ్వరులు నాసికాగ్ర నిహి తాంగుళీపల్లవులై యిట్లనిరి. 220

ఆ. తియ్యవిలుతు కామధేనువు మరురాచ
సిరి మనోజువిజయచిహ్న మతను
మంత్రశక్తి కంతుయంత్రాధిదేవత
యిదియ కాక కలదె యింకనొండు. 221

క. మేలిమియగునవజలద
శ్రీలచెలువు గూడఁదిగిచి చేసెఁ జుమీ యీ
నీలాలకలోలాలక
జాలకమంజులు ధాతచాతురి మెఱయన్. 222

ఉ. వెన్నెలపాలవెల్లిఁ బ్రభవించిన మీఁగడనిగ్గుఁ దీసి సం
భిన్నపయోజగర్భమునఁ బెట్టితదీయవిరోధదోషమున్
గ్రన్నన మాన్చిసంతత విలాసవికాసముగల్గ బ్రహ్మ యీ
కన్నియ మందహాసరసికంబగు మోము సృజించెనేర్పునన్.

ఉ. ప్రాంచదిభేంద్రదంతరుచిరద్యుతిపూరము చిల్కుయుల్లస
త్కాంచనచంపకప్రసవకంచుకముల్ సతిచెక్కుదోయిగా
నించిమెఱుంగుఁ దీఁగెజిగినెక్కొనఁ దోమెనొ ధాతలేకయీ
మించుమృదుత్వమున్ నునుపుమేలిమియుంగలుగంగ నేర్చునే.

గీ. మానవా[1]రాకరోన్మాధి మందరంబు
ధై[2]ర్యకందళనిశితకుద్దాలధార
[3]మాంద్యకంచుకకర్తరి మహితబోధ
వనజచంద్రిక యీయింతి వాలుఁ జూపు. 225

ఆ. లలితనీలమణిశిలాకనా రనుపేర
నిలిపెఁ గాక నలువ నిలుపఁడేని
గురునితంబబింబకుచకుంభభరమున
వెలఁది యసమానడుము విఱుగకున్నె. 226

సీ. కవగూడియుండు జక్కవలసౌభాగ్యంబు
ఫలపూరఫలముల నిలిచెనేని
ఫలరసంబులు చిల్కు చిలుకపలుకులు ముద్దు
వీణెయం దావిర్భవించెనేని

1. వారాకలోన్మాది. 2. దైత్య 3. మంద్ధ. మూ.

యమృతంబు స్రవియించు హిమధామరుచిరాజి
కలువఱేకులయందుఁ గలిగెనేని
మొనసినీడలు దోఁచు ముకురబింబము తేట
వికచాబ్జమున సంభ వించెనేని

తే. పడఁతిబంగారు చన్నుగు బ్బలకుఁ దియ్య
పలుకులకు సత్కటాక్ష దృ క్పంక్తులకుఁ బ్ర
సన్నముఖమండలమునకు సాటిసేయఁ
జెల్లుఁ బ్రత్యేకసమయుక్తి చెల్లదెపుడు. 227

ఉ. లేఁ గురులింద్రనీలరుచి రేఖలు, నవ్యసుధారసంబుపై
మీఁగడలప్పమోవి, నును మించులకుప్పలు చన్నుదోయి, మై
తీఁగ మెఱుంగు, చారుకటి దేశము పువ్వులగద్దె, యారుకా
లాగురేఖ, యింతినిలు వంతయుఁ జక్కెరరాసి యేమనన్.

ఆ. కాంతజఘనసీమఁ గంట బ్రహ్మముఁ గంట
యింతి సంప్రయోగ మింద్రభోగ
మబలమోవిఁ గ్రోలు టమృతంబుఁ గ్రోలుట
నీరజాక్షి చెలిమి నిధులకలిమి. 229

సీ. ఈయింతిదరహాస మెవ్వనిపైఁ బర్వ
నఖిలదిక్కులఁ బర్వు నతనికీర్తి
యీరామ యెవ్వని నేలు - నాతండేలుఁ
త్రిభువన సామ్రాజ్య దివ్యపదవి
యీబాలజవ్వన మెవ్వనికబ్బు నా
తనికబ్బు సర్వ నిధానములును.

నీ కాంత యెవ్వని ౹ నేకాంతరతిఁ దన్పు
నతఁడు చిదానంద ౹ మనుభవించు

తే. నీతలోదరి కరుణకు ౹ నెవ్వఁడర్హుఁ
డతని మన్ననఁగోరుదు ౹ రమరముఖ్యు
లీచకోరాక్షిపదధూళి ౹ యెవనియలిక
మంటునాతనిసోఁక ౹ దనంగపీడ. 230

క. మధురాధరాధరీకృత
మధుధారామిక్షు నీక౹మలనేత్రఁగళా
నిధికిం బురు షోత్తమునకు
విధాతసృజియించె నొక్కొ ప్ర౹వీణత వెలయన్. 231

వ. అని సాత్త్వికభావకలితలలితశృంగారచేష్టాకులమనోహరా
కృతులై యమ్మదవతీరత్నంబు కెలంకుల, 232

క. పులకలు దోర్దండంబులఁ
దిలకింపఁగ నొక్కవసుమ౹తీవరతనయుం
డలవోక మాదిఫలమన్
ఫలమునఁ జిన్నారినఖర౹పంక్తులు నిలిపెన్. 233

క. నూనూఁగుమీసముః పైఁ
జేనించి లతాంగిమేని౹చెలువంబునఁ జూ
పానుకొలిపి ప్రమాస్పదియొక
భూనాయకుఁ డుండెవ్రాఁత౹బొమ్మయుఁబోలెన్. 234

క. నరనాథసూనుఁ డొక్కఁడు
వరమణిమయవలయకలరవంబులు చెలఁగన్
సరసతఁ బూబంతాడెన్
బొరిఁబొరిమై చెమటగందవొడినిగురుపుచున్. 235

ఉ. ఇమ్మునమేనిపంకమొకరెత్తునఁదోయుచుమ్రోలఁబైపయిన్
దిమ్మరి మిండతుమ్మెదలు రేఁగెలు గ్రొమ్మధూళిపూరముల్
గ్రమ్మెడుపువ్వుఁ గోలనృపకాంతుఁ డొకండువినోదలీలమైఁ
జిమ్మెఁగరాంగుళీయకవిచిత్రమణిప్రభలుల్లసిల్లఁగన్.

వ. వెండియుం బెక్కువికారంబుల విలాసంబులు చూపుచుఁ
బరిభగ్న[1] వ్రీడానురాగఘట్టితాభోగంబగు మనంబుతో రాగ
రసరంజితంబును లోలదృగ్విన్యాసంబును బహురూపచేష్టా
కలితంబును గృతకరకంకణఘుల్లఘులాత్కారంబును మోహా
యవనికాక్రాంతంబును నై మదనమాయానాటకసద్విధాన
రంగమండలతాండవలోలంబగు నర్తకచక్రం బను భావంబు
దోఁప నప్పుడప్పెనురాచకొలువు చెలువారె నాసభాసాభా
గ్యంబుఁ గనుంగొని సహస్రగోపాలుండు తనమనంబున.237

గీ. దేవతామూర్తులీనరదేవవరులు
వీరికులరూప విక్రమవిభవగతులు
తగు తెఱంగులఁ గన్నె చిత్తమున కెక్క
నేర్పరింపంగఁ జాలువా రెవ్వరొక్కొ. 238

---

1 వ్రీడారదాగఘట్టితా...మూ.

వ. అని సాంకేయికభాగంబుననున్న యతని తలం పెఱింగిసర్వాం తర్యామినియుఁ దత్ప్రయోజనసంధానహేతువునగు బ్రహ్మాణి సకలవిద్యావైశారద్యంబును నశేషభాషావిశేషనైపుణ్యంబును సుధాకల్పజల్పపాండిత్యంబును గామకళారహస్యాంతర్వాణిత్వంబును జతుర్దశభువనవ్యాపారజ్ఞానకలనయుం గలిగి భూతభవిష్యద్వర్తమానసమయభంగు లెఱింగినప్రోడయుఁ గూర్మిచెలికత్తెయునగు తనకెంగేలి ముద్దుఁజిలుకం జూచి తదభిప్రాయం బెఱింగించి యిట్లనియె. 239

క. నాచేయంగల పనియిది
నీచే నొనరింపవలసె నిఖిలహితముగా
వేచని రాధాకన్యకు
వాచాకౌశలము చూపవలయును నీకున్. 240

చ. పరువడి పేరుపేర్వరుసఁ బారివసూనులనెల్లఁజూపి త
ద్గరిమలుఁ దత్కులస్థితులుఁ దద్భుజవిక్రమసాహసశీలసుం
దరతలుఁ దత్ప్రభావములుఁ దద్విషయంబులు నాదిగాఁగ ద
త్పరమతిఁజెప్పుమీ యబలభావముభంగి యెఱింగి నేర్పునన్.

వ. అని యానతిచ్చిన జననీ! మహాప్రసాదంబని మ్రొక్కి త చ్ఛాసనంబు శిరంబునఁదాల్చి యద్దేవి వీడ్కొని, 242

గీ. రాధికాకన్యపెండ్లికి రాజులెల్ల
నరుగుదెంచినఁ దాను రాజవ్వుటఁ జేసి
శశి పురారికపర్దదేశముననుండి
వచ్చెనోయన వెలిచిల్క వచ్చె మెఱసి. 243

సీ. కలికిపాదాంగదకలఘులఘులాత్కృతికి మి
న్నేటిహంసములు మా కెలుఁగుమాప
సురలు పైఁ గురియు పూసోనల ననుగాడ్పు
సోఁకిచెక్కులపొది కేకులెత్త
లలితప్రపదీనలీలావిహారంబు
లందందఖగశ్రేణు లభ్యసింప
స్వచ్ఛమూర్తిచ్ఛాయ చంద్రిక సవియుబ్బి
వెన్నెలపులుఁగులు మిన్నుముట్ట

తే. నభ్రఘంటాపథంబున నరుగుదెంచి
యఖిలజనములు నచ్చెరువందిచూడ
నతులశుభమూర్తియగు నా సహస్రగోపు
కరతలంబుననిలిచె నా కలికిచిలుక. 244

వ. ఇట్లు నిలిచి, 245

క. నీతలఁ పెఱిఁగి సరస్వతి
భూతలవరచంద్ర నన్నుఁ బుత్తేరనతి
ప్రీతిఁ జనుదెంచితిని నీ
కూఁతున కెఱిఁగింతు రాజకులలక్షణముల్. 246

వ. అదెనభోమండలంబున మహర్షి గంధర్వగరుడకిన్నరయక్షా
ప్సరోగణంబులు నింద్రాదిదిక్పాలురుఁ గొలువ ననుకంపా
సంపన్నులై కొలువుచేసి హరిహరబ్రహ్మలు ప్రియవనితా
సమేతులై నారదవీణానాదంబున నానందింపుచు నీమహో

త్సవంబుఁ జూచుచున్నవారు. నీభాగ్యంబునకుఁ గొలంది యెన్నంగలదే?మహావీరశైవశ్రేష్ఠుండవు.సత్యసంధులయెడల వేల్పులు మిత్త్రిభావంబున వర్తింతురనుట నీయందు సుప్రసిద్ధంబయ్యె. నన్ను వాణీకరపంకజపంజరంబుల విహరించు దివ్యకీరరాజంబుగా నెఱుంగుము. 247

క. అని పలుకఁగ నప్పలుకులు
తనకర్ణపుటముల నమృతధారలగతి ని
ల్చిన వేపమానమణికాం
చనమకుటముతోడ వినయసన్నిహితుండై. 248

వ. అద్దేవఖగరాజంబుఁ బరమదేవతాబుద్ధి భావించి తనహస్తతలంబర్హపీఠంబు గావించి యిట్లనియె. 249

సీ. వేదాంతరాద్ధాంత విద్యావిశేషంబు
నీచేఁ ప్రబుద్ధులు నేర్చికొంద్రు
శారదాదేవితో సకలశాస్త్రంబులఁ
జర్చింపనేర్చిన చతురమతివి
దిక్పాలకాంగనల్ తియ్యన నీకల్కి
పల్కులునేర్చియే ప్రౌఢలాట
భవదీయసంతతి ప్రాభవంబునఁగాదె
యతిరథుండాట పుష్పాయుధుండు

తే. పారిజాతఫలంబులు ప్రతిదినంబు
దివ్యవనలక్ష్ములర్పింపఁ దృప్తిఁబొంది

యుపనిషత్పంజరంబున నొప్పుకీర
రాజకులపాళి నిన్నెట్లు ప్రస్తుతింతు. 250

క. నినుబోటి వారిచేతఁ
ఘనబహుమానంబు వడయఁగాఁ గంటి జగం
బున వన్నెకెక్క నాకుల
మును వంశము రాజవర్గములలో నెల్లన్. 251

వ. అని యనేకవిధంబుల నభినుతించి తనుపదేశంబున గురుజనానుమతంబునఁ బురోహితాది భూదేవతాపూజావిధానంబు లాచరించి తదాశీర్వాదనాదంబులతోఁ గూఁతుచేతికి మధూకపుష్పమాలిక యిప్పించి లోకోత్తరచరితుండును మనోహరాకారుండును నగుపురుషోత్తము వరియించుంగాకని దీవించినఁ దచ్ఛాసనంబునఁ గన్యారత్నంబునకుఁ బ్రాణసఖియైన ముకుందిని యక్కీరరాజంబుఁ దనకరంబున నిడుకొని యద్దేవితోడఁ గూడి చతురంతయానంబెక్కి రాజసభామధ్యంబున నిలిచె నప్పుడు శుకవధూరత్నంబు చతురహరిదంతకాంతభూకాంతబృందారకనందనులం జూచి యయ్యబల కిట్లనియె. 252

మ. తరళేందీవరనేత్ర చూడుమిదె సత్పద్వీపసర్వంసహా
వరచంద్రావళి నేతదాఢ్యగుణముల్ వర్ణింప వేవేలు వ
త్సరముల్ వట్టును వాణికైన ననిన న్శక్యంబె వాక్రువ్వనె
వ్వరికిందూకొని యైననేనొకగతి న్వాగ్వైఖరుల్ చూపెదన్.

ఆ. ఇట్టి రాజసూను లెల్ల నీయడుగుఁగెం
జిగురు లలికవీథిఁ జేర్పఁగోరి
తగిలియున్నవారు తరుణి నీకరుణకుఁ
బాత్రమూర్తి యేనృపతియొ కాని. 254

వ. అని యుల్లాసవాక్యంబుల నవ్వల్లవియుల్లంబుఁ బల్లవింపఁ జేయుచు మెల్లన నవ్వాహనం బొక్కమహీవల్లభుం డాయ సమకట్టి యాదిట్టచిలుక యిట్లనియె. 255

క. ఇభగమనాచూడామణి!
విభాకరాన్వయుఁడు లాటవిభుఁ డితని న్నీ
యభినవదృగమృతధారల
నభిషేకముసేయుమా దయారసమతితోఁ. 256

శా. ఏతద్దివ్యదుదారదోరసిమరాళేంద్రంబు దృప్యద్భుజా
రాతీరాధవకంధరాంబుజలతావ్రాతంబు ఖండించుఁ బ్ర
స్ఫీతాసృగ్రసధారలొల్క రణరాజీవాకరశ్రేణులన్
బ్రీతి న్వీరరసాంబులోలలహరీప్రేంఖాళులందేలుచున్.

వ. అని వెండియుఁ దద్గుణంబులు విస్తరింపఁదలంచి యాదంట పులుఁగు పరమవిద్వల్లగ్నంబై యల్పవిషయరసంబునకుం జాగనియోగిహృదయంబునుంబోని యమ్మానిని యుదాసీనంపుఁ దలంపులం దెలిసి వాహనభారకులకు సన్న సేసి యచ్చోటు వాసి వేఱొక్క రాకుమారునికడకు వారినిధానమధ్యంబున దైవయోగంబునం జేసి నిరర్థకద్వీపంబు చేరిన

నావఁ గర్ణ ధారుం డితరద్వీపంబునకుంబోలె నయ్యంగనం
గొనివచ్చి యతనింజూపి యిట్లనియె. 258

క. కుంతలభూపతిఁ గని

కుంతల! ప్రమదాహ్వయుందు గుసుమాయుధవి
ద్యాంతర్వాణి నితని నీ
యంతఃకరణమున నిలుపు మాదరలీలన్. 259

చ. కెరలియితండు దిగ్విజయకేళియొనర్చుడువేళలందుఁ ద
త్సరణి మదా[1]వళావళి మదద్రవపూరపరంపరల్ విని
ర్భరసరిదాకృతింజని యపాంపతి కిం పొనరించు వైరిభూ
వరతరుణీదృగశ్రుజలవాహినులొక్కటఁ దమ్ముఁగొల్చిరాన్. 260

క. దేవులు పెక్కండ్రీనర
దేవమణికి నైన నీవు దేవివగుదు తా
రావర్గములో రోహిణి
దావిధునకునైన యట్లు తామరసాక్షీ. 261

వ. అని యప్పల్లవాధర యొల్లమి తన్మందహాసలేశంబున నెఱింగి
యింగితవేదియగు నక్కింకరంబు తదనంతరరాజమంచమార్గం
బునకు నియోగించిన వేగవశంబునఁ గుటిలగతిం బాఱి గండ
శైలంబు దాఁటి మరలి యథాపూర్వంబునఁ బ్రవహించునదీ
ప్రవాహంబునుం బోలె వాహనంబు చనియె నంతనమ్మహీ
కాంతునింజూపి యిట్లనియె. 262

1 శావధి...మూ.

ఉ. వారణభేది యీనృపుఁ డరివారణదోరసిధారవైరిరా
డ్వారణకుంభకూటములు వ్రయ్యలుసేసి తదంతరాళము
క్తారుచిరాక్షతాంజలు లుదారతమాళి నలంకరించి గం
భీరజయేందిరారమణిఁ బెండిలియాడు రణాంగణంబునన్.

క. పోరాటల వేఁటల నీ
ధారణిపతి మత్తకరులఁ దనభుజశక్తిన్
దారించుకతన నితనికి
వారణభేదిత్వ మొదవె వారణయానా. 264

క. వరియించు మితని నేత
త్కరభిన్నద్విరదదంతదళతాటంక
స్ఫురదంశుజ్యోత్స్నావళిఁ
దిరుగుదు సాక్షాత్తమోధిదేవతవోలెన్. 265

వ. అని యతనియందుఁడిందనియాదంబుపొందరసి వసంతసమయ
లక్ష్మి నిర్మదగజంబుఁబాపిమెలదేఁటిఁ గుసుమితసహకారం
బునుంబోలెఁ గదియించి యక్కీరంబు కీరవాణి కిట్లనియె. 266

క. వారాణసి కధినాథుఁడు
నారీమణి యితఁడు విశ్వనాథుఁడు సాక్షా
త్కారమునఁ బూజవడయుఁగ
యారతి నీరాజుచేత నార్యయుఁ దానున్. 267

సీ. చంద్రకేతుఁడుపేరు చంద్రబింబానన
కైకొమ్ము తత్కరగ్రహణకేళి

వల్లైనఁ దుహినధరాధీశకన్యకుఁ
ప్రాణవయస్యవై ప్రతిదినంబు
నమరకన్యాసహస్రములు సేవింప భా
గీరథీవారివిహారకేళి
నానందమందుచు నానందవననికుం
జక్రోడములఁ గ్రీడ సలుపవచ్చు

తే. నింక నొక్కటివినుము మీకిద్దఱకును
ప్రణయకలహార్తినిమిషంబుఁ బాయరాము
శివజటాజూటగర్భకశిశిరకరక
రావళులశాసనమున నహర్నిశంబు. 268

గీ. ఇతఁడు నీవును గూడిన నేమిచెప్ప
వామలోచన! దేవి దేవరయుఁ బోలె
మెఱయుచుందురు జగమెల్ల మెచ్చిపొగడ
నింతకంటెను సౌభాగ్య మెందుఁగలదు. 269

వ. అనిపలికి యప్పలుకుఁబొలంతిచిలుక యొడంబడనిచిత్తంబు
గల కలికిజవరాలి నుషఃకాలకలన యిందిర నిందీవరంబుఁ
దొలఁగించి వికచారవిందంబునుంబోలె నారాజు వీడుకొలిపి
మఱియు నొక్కపుడమిఱేనిం జేర్చి యిట్లనియె. 270

క. భోజవిభుని నితనిం గాం
భోజవిషయభర్తఁ జూడు పొందుగ వికచాం

భోజాక్షి! మదనవిద్యాం
భోజభవుఁడు నీకుఁబోసఁగుఁ దే బోల్పండ్లాడక్. 271

మ. అరిభూపత్యవరోధకేళికుధరప్రాంతంబు తద్దాటి ని
ష్ఠురతుక్ఖారఖురాంకచంద్రకితమై సాంపారసాంపారు ని
ర్జరకాంతాహతపీరదత్తనఖచంద్రశ్రేణి నీరంధ్ర భా
స్వరకుంభస్తనముఁడలంబన మిథస్సాంద్రదృశ్యసంపద్గతిన్.

ఆ. వజ్రపదకమున్న వలనుగాదదిపీడి
నిండుగౌఁగిలిచ్చి నీవు వీనిఁ
గేలిఁ దనువుమెచ్చి బాల! నీమెఱుఁగు గు
బ్బలకుఁ దా మయూరపదకమొసఁగు. 273

వ. అనిపలికి యద్దివ్యకీరరాజంబు రాజవదన మెఱుంగుఁజూపులు మెచ్చొప్పలయక విచ్చివచ్చుటంజేసి వికళితకుసుమభారంబగు మహీరుహంబునుం బోలెఁ జెన్నుఁ దఱిఁగియున్నయన్నరేం ద్రునియాకారరేఖఁ జూచి యచ్చపలలోచనవవ్వలియాలాత లనాథునమీపంబునకుం గొనిపోయియిట్లనియె. 274

క. గజరాజయాన కను మం
గజసన్నిభమూర్తి నితని¹ గజకేళి రతుల్
గజగతి కేలిక పదివే
ల్గజములఁ దానేలు నొప్పుగ జగన్నుతుడై. 275

ఉ. నారదబర్హి తాండవము నాకవధూకులచాతకక్షుధా
పారవిలోపముంగలుగ భద్రగజాంబుదదానవృష్టి భే

---

1. గజకేతురంగళి. మూ

రిరవగర్జ నీనఁగ నరిప్రకరోగ్రదవాగ్ని యార్పుఁ దొ
ల్కారునుబోలె వీఁడు కరకంపితఖడ్గతటిద్విలాసియై. 276

చ. నలినదళాక్షి సింహగిరినాయకుఁ జందనపర్వవేళ నీ
చెలువునిఁగూడి నీవెలమి సేవయొనర్పఁగఁబోలు రత్నరు
గ్విలసితశృంగకోణములవీణెలుమీటుచుఁ గిన్నరాంగనల్
కెలయుచుఁబాడుతన్మధురగీతివినంగలభింపుసొంపులన్. 277

వ. అని పలికి యప్పలుకులు కలికిపోలంతి తలంపునందగిలినిలుఁ
వక నళినీదళంబునందుఁ జిందు నంబుబిందుబృందంబుల చందం
బునంబోలి చెలువుగలుగకయున్న కన్నెఁజెంగి సన్నచేసికొని
చని యొండుభూమండలేశ్వరు దండనుండి యిట్లనియె. 278

క. బాలా! యీ రాకొమరుఁడు
మాళవభూభర్త రత్నమాలికయను పే
డేలెడువాఁడీతని నీ
వేలుకొనుము మదనకేళి కేలికవగుచున్. 279

మ. అలఘుప్రాభవుఁ డగ్నిసేనుఁడనువాఁడౌ వీఁడె నీకుందగున్
దళదిందీవరనేత్ర యీతఁడుజయస్తంభంబు[1]లన్ దిక్కులన్
నిలువంబె[2]ట్టఁ బురందరప్రముఖదిగ్నేత్రాళి యభ్యాసలీ
లలకై దిగ్గజరాజిఁ గట్టనవి యాలానంబులయ్యెంజుమీ.

క. పువ్వునకుఁ దావిఁ బోలెన్
జవ్వనమునకు న్విలాససంపదలొదవెన్

---

1. లశ్వానలన్ 2. బెట్టివు మూ.

మవ్వమగు నితనికలిమికి
నివ్వెలఁది దనర్చునన వశోహింతువుక్రీర్తుల్. 281

వ. అని యాడి యచ్చేడియ కలుషపల్వలోదకంబులు గోరని చాతకశాబకంబునుంబోలె నతని నాసపడక నిరసించియుంట యుపలక్షించి యతనిఁ బూర్వపక్షంబు చేసి పాసి చని వేఱొక్క రాచవానిం జూపి యిట్లనియె. 282

క. తుహినకరమండలానన
దహాళీపురభర్త నీ సుశోదర్శనుఁ గనుము
స్పృహమహితాహితరాడ్భవ
దహనశిఖాఖండవర్షశోధారాశ్రేణిక. 283

శా. చోళక్ష్మాతలమేలు వీఁడునిఖిలక్ష్మోణీశపూజ్యుండు లీ
లాలక్ష్మీతనయావతారుఁడు భవల్లావణ్యపుష్పాగ్రధా
రాళాభీష్టవయోమరందరసపూరంబానఁగా నేర్చు లో
లాళీంద్రంబును బోలెనంగలతికాశోవ్యాసక్తిఁ గేళీగతిన్. 284

గీ. చిత్తగించినమగఁడని సిగువడక
లెస్సగాఁ జూచి పెండ్లాడు లేమ వీనిఁ
గాంతకుఁ దగిన పురుషుండు కలిగెనేని
సురతసౌఖ్యంబు తంగేటిశోజున్నగాదె. 285

వ. అని ప్రస్తుతింప నతనిసౌభాగ్యంబు మఱచి వికాసలీలావగాహంబుగా నంతర్వాసంబున నిరాకరించుచుఁదదంతఃకరణభంగి యెఱింగి యక్కురంగలోచన నచ్చటు దొలఁగించి చని వేఱొక్కనెడ నిల్పి యాకలికిచిలుక యిట్లనియె. 286

గీ. చెంతరాజులుతమకుఁ జూచి సిగ్గువడఁగ
నాశ్వినేయులపగిది సోమార్కు లట్లు
చారుసౌందర్యకాంతి తేజములనొప్పు
చున్న యీయిద్దఱను జూడు ముత్పలాక్షి. 287

క. విందానువిందులీనృప
నందనులు ప్రసిద్ధు లఖిలనరనాథులలో
నం దామరసేక్షణ! నీ
విం దొకని వరింపవమ్మ హితమతితోడన్. 288

స్రగ్ధర.
కాంక్షిజిహ్వాకరాళోత్క[1]ల కపతులదోః కార్ముకోగ్రాశుగాగ్ని
జ్వాలామాలాకులారివ్రజగజగమనావార్య? సాంరావిణాబా
భీరార్వ్వర్చిష్మదుద్యత్పృథుకుటిలశిఖా బృందసంవిగ్నయాదః
పాలాంతర్గ్రాహఘల్యార్భటి చటులువడంబస్వనుగ్రాజిభూమిన్

మత్తకోకిల.
ఏడుదీవుల వీరితేజు లహీనభంగినిరర్గళ
క్రీడనంబుల సంచరింప నరిక్షితీశులు చూచుచున్
వ్రీడనందురుగాని యెవ్వరు విక్రమంబులు చూపర
ల్గాడుచిత్తము ధైర్యసంపద నవ్వలవ్వలఁ ద్రోయఁగాన్.

వ. అని చెప్పిన నప్పుడంతుకచూపు పిపాసాతురుండాజ్యపూరంబు
నుం బోలె నిరపేక్ష నిరీక్షింపనైన నొల్లక వారిచెలువుఁబరిత్య

1. ఉత్కలతపతులు....మూ.

జించియున్న యన్నెలంత నవ్వులం గొనిచని యాశుకరాజం
బిట్లనియె. 291

శా. గంధానేకపరాజయాన ! యితనిం గంటే చమూరేణురే
ఖాంధీభూతసమస్తదిగ్గమను శుద్ధాంతాంతరాళున్ జరా
సంధున్ గర్జితనిర్జరేంద్రకరిహస్తస్ఫారగంభీరదోః
స్కంధుండంతకునైనఁ బీఁడు గదియంగాఁ జాలుఁబోరాటలన్.

చ. కలుకుఁదనంబునన్ రణముఖంబున నిల్చినవైరిరాజులం
దఱమిడి పట్టి తెచ్చి నిజధామమునందు సహస్రసంఖ్యలన్
జెలనిడి చెప్పఁ జిత్రముగ శీతకరానన! వీఁడు నిచ్చలున్
గొలియలఁబోలెఁ గట్టి నలుకున్నడి భైరవపూజసేయుచున్.

ఆ. గహనమధ్యవీథిఁ గార్చిచ్చుచందాన
నంబురాశి బాడబాగ్నియట్లు
విమతబలమునడుమ వీఁడు శౌర్యము చూప
సురలకైనఁ దేఱి చూడరాదు. 294

క. ఈరాజుఁ బెండ్లియాడిన
నోరాజీవాక్షి ! నీకు నొదవును శేష
క్ష్మారమణకామినీకర
నీరేరుహధృతరత్ననీరాజనముల్. 295

క. అనిపలికిన నవ్వులుకులు
విని మేనరువాలు నర్థవీక్షుల నతనిన్
గను ముగ్ధఁ జూచి సాత్త్విక
మునఁ గాదిది చిన్నిభీతి మొనపినదనుచున్. 296

వ. తన్మనోభావంబు భావించి యవ్వేల్పుఁజిలుక యాచిలుకల కొలికి మార్జాలముఖంబునం దలఁకు చిలుకనుంబోలె నతని సమ్ముఖంబునకుఁ దొలంగించి మఱియును వేరువేరరాజుల నెల్లంగలయం జూపిన సరసగంధవిహీనంబగు బంధుజీవకజా లంబునుంబోలె రిత్తమాపరితనంబువడసిన గుణశూన్యులం గాఁ బరిగణింపుచు దృణీకరించి పచ్చనయ్యాదిగర్భేశ్వరి మహారాజసప్రకృతి కచ్చెరువందుచు వచ్చి ముందటఁ బురా కృతపుణ్యఫలవిశేషంబున భాగ్యదేవత పేదకుఁ బెన్నిధిం జూపినట్లు దయానిధానంబగు మాధవుంజూపి తత్పురోభాగం బునిలిపిన బలపరాక్రమసంపన్నులును దిక్పాలకోపమాను లును రూపవంతులును నవవయోవిలాసులును బిరుదతులా కోటికోటి సంఘటితమణికిరీటప్రజ్వలితపాదపద్ములును మహా మానధనులును మూర్ధాభిషిక్తులు ను నగునుత్తమక్షత్త్రియ కుమారులు వల్లవరాజకన్యచేతఁ దిరస్కారంబువడసి హాస్య రసస్థానంబై మానంబు లూనంబై పోవ సంతోషరసంబులు దిగంగాఱె మోటికడవలచాలుపుపోలిక రిత్తవడియును జిత్ర రూపంబులచందంబునఁ జేష్టలుదక్కియు దారుకృత్రిమా కారంబులప్రకారంబున బ్రమానువడియు నాఱెపదీపదండం బులమాడ్కిఁ దేజంబులు వొలిసియు వాసరావసానసమయ బిసరుహావిసరంబులజాడ బ్రీడంబ్రాఁగి వాడినమొగంబులు బ్రాల్చుకొని నిట్టూర్పులు నిగుడ్చుచు దైన్యంబునకుం బా లుపడి యుండి రాసమయంబున.

క. కోరికల ఫలము, వలపుల
యూరిక, వలరాచవాని యేపు, సుఖశ్రీ
సార మిదె చేరెనని యా
నారీమణిఁ జూచెఁ బద్మనయనుఁడు ప్రీతిన్. 298

క. ఆఁకటిపెచ్చునమలఁగెడు
చాకోరం బమృతకిరణచంద్రికఁ గని యొ
క్కూఁకువఁ గవిసినకరణి సు
ధాకరముఖిఁ బొదివెఁ గలయఁ దద్వీక్షణముల్. 299

క. జలజదళాక్షునిముచ్చట
తొలుచూపులువాఱి నిలిచెఁ దొయ్యలి చనుగు
బ్బల సతుల రూపమునకుం
గల శృంగారంబులవియె కావె తలంపన్. 300

క. మారుని నగరికిఁ గనక
ద్వార స్తంభంబులయిన తరుణినునుఁదొడల్
చేరుఁ దదంతర్లీలలు
గోరున్ దిగజాఱు నూఁతఁ గొనుమణికాంచిన్. 301

చ. కడఁకనితంబచక్రమునఁ గ్రాలుచు నెత్తము లెక్కియెక్కి జా
ర్పడి నతనాభికూపమునఁ బ్రభ్రమణం బొనరించి యొక్కమై
వెడలటనారునం దగిలి వెంద్రుకవట్టియుఁ గొండఁ బ్రాఁకె న
న్నొడువుగ నవ్విలాసినిచనుంగవఁ జెందె మురారిచూపొగిన్.

క. మచ్చికఁ జొచ్చినచోటులఁ
జొచ్చురహస్యస్థలముల । సుడిగొనుమలయున్
గ్రచ్చుఱ నవయవరుచులకు
నచ్చెరువడు జవ్వనంపు । టామనికలమున్. 303

వ. మఱియును, 304

చ. మెలఁతుకనాభియన్కొలన । మేలిమిమేఁతలు వట్టి లీలమై
వళులను తేఁగడల్లఁగయి । వ్రాలుచుఁ ల్లనరోమరాజికై
వలలతఁదూఱి మోవియెఱ । వాంఛవడింజని వాలుఁగన్నెఱుం
గులవలఁ జిక్కె గోపకుల । కుంజరు లోలకటాక్షమీనముల్.

సీ. కెందామరలయందు । నిందిందిరమువోలెఁ
జరణయుగంబున । సంభ్రమించుఁ
బులినమండలమునఁ । గలహంసమునుబోలెఁ
బిఱుఁదు చక్కటిఁద్రొక్కి । బిత్తరించు
నగశృంగములఁ గల్కి । నమిలి కొదమవోలె
గుబ్బచన్నులమీఁద । గునిసియాడు
నారఁబండిన పండుఁ । గీరరాజమువోలె
నమృతాధరమ్ముఁ బ్రేమ । నాక్రమించుఁ

తే. గురులఁ గబళించుఁ గనుమెఱుం । గులభ్రమించు
నలిక వీథిఁ జరించుఁ జె । క్కులకు నొఱగు
గళమునఁ బెనఁగుఁ గక్షభా । గమున నొలయు
మాధవునిచూపు సతిమేను । మరులఁజిక్కి. 306

ఆ. చక్రవర్తి యయ్యె జలజనేత్రునినేత్ర
మతివజఘనచక్ర మాక్రమించి
కొమ్మమోవితేనె గొనిసుధాంధశ్శ్రేష్ఠుఁ
డామహాత్ముఁడగుట యరుదె యింక. 307

సీ. కమలాక్షివికచదృగ్జాలకవిచికిల
సూనవల్లరులకై సుడిసిసుడిసి
కాంతమనోహరకక్షభాగస్ఫుర
ద్ద్యుతిలతాకుంజముల్ దూఱితూఱి
మత్తకాశినిసముద్వృత్తవక్షోజర
థాంగదంపతుల జట్టాడియాడి
వనితమృదూరుసౌవర్ణరంభాకుంభి
నీరుహచ్ఛాయల నిలిచినిలిచి

తే. లేమవళిభంగవదన నాళీకచికుర
మధుపవిలసితయౌవనాంభఃప్రపూర్ణ
విభ్రమాబ్జాకరమున గోవిందువలపుఁ
జూపులోలాడె మదనసంతాపమడఁగ. 308

వ. ఇట్లు మాధవుండు రాధలావణ్యరాజీవాకరంబున నిజలోచనపుండరీకంబులు దేలియాడఁ గోర్కులచొక్కునం జిక్కిన మనంబున నిట్లనియె. 309

సీ. అమృతాంశుఁ డెంతదానముఁ దానొనర్చెనో
పోలఁతి నెమ్మోముతోఁ బోల్పఁబడియె

నఖులెట్టి పుణ్యాటవులనిష్ఠమెలఁగెనో
యింతిపెన్నెరులకు నీమవడసెఁ
దమ్ములెన్నెన్ని తీర్థమ్ములఁ దోఁగెనో
సతిక్రాలుఁ గన్నుల సాటినొందె
గజము లేక్షేత్ర మార్గములవర్తించెనో
చెలువనడకు సరిచెప్పనొప్పెఁ
తే. గాంచనము భూమినేమి సత్కర్మములకు
వచ్చెనో చామ మైచాయ వన్నెకెక్కెఁ
జిలుక లేసత్యవాక్యముల్ పలికె ననియొ
యబలమధురోక్తులకు సవతయ్యె నిపుడు. 310
క. కౌఁగిటికి వెక్కసంబై
వీఁగుఁ జనుంగవకు నదురు విధుముఖనడుమే
లాగున నోర్చెనొ క్రేఁగా
తీఁగెకు[1] నుంగాయలనుట దృష్టంబయ్యెన్. 311
క. కలకంఠకంటిమంటల
చుఱచుఱ రూపఱిన యాప్రసూనాస్త్రుఁడు గ్ర
మ్మఱఁ బెక్కురూపముల నీ
తెఱవవిలసదమృతపూర్ణదృష్టిఁ జనించెన్. 312
సీ. కొనవాఁడిగోరుమోపినయంతనే బిట్టు
వగులవె యీయింతి బిగువుచన్ను

1 నూగాయ. మూ.

లలమిపైఁ జేవేయునంతనే మెచ్చితి
కరఁగవేఁ యీకాంతకళలపట్లు
చుంబనక్రియకు వా జూపినయంతనే
తొరఁగదేయమృత మీతరుణిమోవి
ప్రేమఁ గౌఁగిటను జేర్చి నయంతనే యీల
తాంగి దా మఱవదే యవయవములఁ

తే. బంచశరకల్పతరుపక్వఫలము దీని
ననుభవింపంగఁ గలదొకో యనుచు శౌరి
చూపుతీపులచిత్తంబు చూఱవిడిచెఁ
గాదమగుబ్బెతఁ గనుగొన్నఁ గోర్కులరుదె. 313

గీ. కాముఁ డట్టాడుచున్నాఁడు కన్నె సుప్ర
సన్నచంచలలోచనాంచలములందు
మించుగుబ్బల నిది గౌఁగిలించెనేని
యవయవంబులు వొదలి ఝల్లనకయున్నె. 314

క. మదనునకు వెక్కసం బీ
మదవతి మదగర్భరేఖ మహనీయసుఖా
స్పదలీల కదియమూలం
బిది తనమై నెట్టి వానికిచ్చునో దయతోఁ. 315

వ. అని పలుకుచున్న నమృతకిరణచంద్రికాంకురనికరంబులు సోఁకినతుహినకరకాంతగ్రావంబునుబోలెఁ దదీయమధుర దృక్పరంపరాతరంగసమాలింగితంబైన హృదయంబమందా

నందరసస్యందనప్లుతంబగుచుండ మర్త్యామర్త్యకామినీనయ
నోత్సవరూపశీలుండైన మదనగోపాలుండు గండమండలవి
సారిచారుపులకకనకకలికారామణీయకసంపన్నుండును, సం
ప్రాప్తసందష్ట్రకప్రసన్నుండును సందర్శితముహుర్ముహుర
ప్రతిమవల్లభాభ్రూవల్లికా వేల్లనవిభాసికుసుమకార్ముకకఠో
రజ్యాటంకారకాతరీకృత పాంథస్వాంతరతికాంతనిర్వక్రపరా
క్రమవిభవాడంబరప్రచండదోర్దండుండును శిరఃకంపితధళధ
ళాయమానవజ్రమాణిక్యకుండలయుగళమయూఖమండలుం
డును నైయున్న యమ్మోహనమూర్తిం జూచి రాధావరారో
హకు[1] నుంఫోహాపోహనివహంబు లసంఖ్యంబులంకురింప నిలిం
పశుకతిలకం బి ట్లనియె. 316

క. వారిజలోచన! నందకు
మారు నితని మదనదివ్యమంత్రకళాత్మున్
గోరి దృగుత్పలదళముల
నారాధన మాచరింపుమా తత్పరతన్. 317

క. నందునకు నయ్యశోదా
సుందరికినిఁ బూర్వజన్మసుకృతఫలం బీ
చందమున నందనుండై
చెందెన్ దద్భాగ్యమహిమ చెప్పఁగఁదరమే. 318

సీ. సకలలోకరాజ్యైకలక్ష్మికినెలవుగఁ
జేసిప్రేవపల్లెయేలు నీకిచిన్నెలాఁడు

1. నీహారపురోహ. మా.

చామ! యేతన్మహా దివ్యశాసనంబు
కమలగర్భాదులకుఁ బుష్పకగర్భకంబు. 319

క. గంభీరదీర్ఘ బాహా
కుంభీనసుఁ డితనియన్న కోమలి యతఁడున్
జృంభాంతర్ఘనకీర్తి
స్తంభముక్రియనున్నవాఁడు దర్శింపు హలిన్. 320

క. వ్రేల్మిడినీతఁడు ప్రజ్వలి
తోల్ముకముఖునిం బ్రలంబు నుక్కణఁగించెన్
బల్మిమియనిన నతనికిఁ
గేల్మోగిచిమృగాక్షి మగుడఁ గృష్ణునిఁ జూచెన్. 321

క. వలపెక్కడఁ గలిగుండెడుఁ
దలఁపును నక్కడ నెయుండుఁ దలఁపుబడినె చూ
పులుగలయఁ బోలయుఁ బై పెఁ
జెలువలకుం బురుషులకు విశృంఖల వృత్తిన్. 322

క. చూపెటిఁగిదివ్యకీరము
గోపాలున కింపుసొంపుఁ గొలుపుచు సుమన
శ్చాప సహస్ర విలాసో
ద్దీపితుమాధవునిఁ బ్రస్తుతింపుచుఁ బలికెన్. 323

శా. ఓలీలావతిచూడుమీవిభు జగజ్జ్యోతిర్మయోద్దామ తే
జోలక్ష్మీవిభవాభిరామమగు వక్షోపీఠమాణిక్యముల్
నీలేందీవరకోమలాంగరుచియున్ శ్వేతాంబుజస్వచ్ఛ దృ
గ్జాలంబున్ వలపించుచున్నది జగజ్జాలంబుఁ గేలీగతిన్.

ఉ. ఏతదుదారచక్రము సుమీ మృగలోచన! ఖేచరామరా
రాతి ధరోరుమూర్తి శిఖర ప్రకరంబుల దుర్నిరీక్ష ని
ర్ఘాతశతాకృతిం జదిపి గహ్వరభారము మాన్పుచుండు న
త్యాతతలీలశూలిచతురాననముఖ్యులు సన్నుతింపఁగన్.

శా. నందాండేంద్రమఖంబుభక్తిమెయి నానాద్రవ్య సంపత్తిగో
బృందాభీరసమేతుఁడై నడపవారించప్పు తద్వైరి తా
మందధ్వానఘనాభ్రవర్షితమహాశ్మశ్రేణులన్ వారి కే
కుందంజెందక యుండనెత్తెనితఁడా గోవర్ధనాద్రీంద్రమున్.

ఆ. ఇతనిదివ్యలీల లెలమినలువమ్రోల
వాణినారదాది వైణికులకు
వీణెయిగురుకొనఁగ వివిధభంగులఁ బాడి
నేర్పుఁ జూపవిందు నీరజాక్షి. 327

ఉ. భావమెలర్పగోపికలఁ బల్వురవేణువిచిత్రగీతి బృం
దావనమధ్యవీథులకుఁ దార్చిలతాగృహమంటపంబులన్
కేవలమన్మథుండితఁడు కేళియొనర్చు నిరంతరంబు నీ
వీవిభుఁ గూడి యుందఱకు నేలికవై విహరింపుముగ్మలీ.

క. కలగొనఁ జూచితి రాకొమ
రులనీకొనగూడ రెవ్వరును జగమున నీ
తలఁపునకెక్కిన వలపుల
కలికిమగఁడు మాధవుండె కానిమృగాక్షీ. 329

వ. అనిపలికిన కీరరాజంబుపలుకు లాకర్ణించి తిలకించి. 330

శా. సాక్షాన్మన్మథు, మన్మథప్రణయ సమ్యఙ్మందహాసోల్లస
చ్చక్షుఃపద్మ,నిజస్వరూపవిహితస్వాంతుంద్రిలోకాంగనా
వీక్షాంభోజదళార్కు నిన్బ్రియతమున్వీక్షించెవామాక్షి సా
పేక్షన్ స్వైరకటాక్షజాలములఁ బుష్పేషుం బ్రబోధింపుచున్.

ఉ. ప్రేమరసార్ద్రదృష్టియుఁ బరిస్ఫురితస్తవకంటకంబు ల
జ్జామిళితానతాస్యజలజస్మరగర్భితమందహాసరే
ఖామధురత్వమున్ విమలగండతలశ్రమవారిలేశమున్
రామ మురారిఁ గైకొను తెఱంగెఱిఁగించె నృపాలకోటికిన్.

మ. హృదయాబ్జాతము సంతసింపమరులెంతేన్ సుబ్బఁగానంగ ముల్
వొదలన్ లజ్జపెనంగఁగన్ బులకముల్ పుంఖానుపుంఖంబులై
యొదవన్ వంచనలోలదృష్టిఁ జెలువొవ్వొప్పార లీలాగతిన్
సుదతిన్ జూచు మురారిచంద్రముఖిమాచున్ గోపికావల్లభున్.

క. పొలఁతియు విభుఁడును నురవడిఁ
దెలిమొగములఁ జూడఁ జూడదృష్టులు నడుమన్
గలగొని సమధుపజలరుహ
దళవందనమాలికల విధంబునవొప్పెన్. 334

వ. అప్పుడు. 335

మ. కనుఁదమ్ముల్ వికసింపనంగలతికాకంపంబుగండస్థలీ
స్తనరోమాంచము మేలుకీలుదెలుపన్ ధాత్రీవరుల్ చూడనం
గన మాం రక్షతు తేకటాక్షవిభవః కామాకృతే సంతతం
బనుచున్ బువ్వులదండవై చెఁగడఁకన్ బ్రాణేశుకంఠంబునన్.

క. సురసతులు పుష్పవర్షముఁ
గురిసిరిదుందుభులు మ్రోయఁ గొనకొనిమింటన్
వరమునిజయజయపుణ్యమ
ధురనాదములెసఁగనా వధూవరులపయిన్. 337

క. ఆలోఁ దత్పురపరిసర
కాళిందీసింధువికచకమలపరాగ
శ్రీలంపటవీచిఘటా
వ్యాలోలానిలము దనిపె నామిథునంబున్. 338

సీ. పెండ్లికూఁతునకును బెండ్లికొడుకున
కనుకూలదాంపత్య మనెడివారు
మేలుగా నెల్లర మేలునకీబాల
యచ్యుతువరియించె ననెడువారు
తగుమాటలాడి మాధవునిరాధికఁ గూర్చె
నమరకీరంబు మేలనెడువారు
రమణికి నిజమనోరథమైననెయ్యపు
మగఁడంచుసుహాసినిఁ బొగడువారు

ఆ. మధురవాణిసరసమధురభాషణముల
నెరసెఁ గూర్మిలోన నిరువురకును
సఫలమయ్యెనిపుడు సకలంబు నెఱుఁగ న
న్యోన్యయోగసిద్ధి ననెడువారు. 339

ఆ. అనుచు బురజనంబు లభినుతింపుచు[1]జయ
పెట్టిరొక్కరొకరె ప్రియమెలర్ప

1 జయము వేడిరొకరికొకరు. (మూ)

గరిమవందికోటి కైవార మొనరించె
నావధూవరులకు భావమలర. 340

శా. శ్రీరామారమణీయవక్ష! నవరాజీవాక్ష! లోకైకశి
క్షారక్షాకరణప్రవీణ! మకరాంకబ్రహ్మపాకీణ! బృం
దారణ్యస్థలసద్విహార! హితపూజ్యాకార! దృఙ్మోషణా
భీరస్త్రీహృదయాధినాయక! మరుద్బృందేష్టసంధాయకా!

క. అక్షయగోపీతరళక
టాక్షమధువ్రతవికాసి హాస కుసుమ గు
చ్ఛాక్షీణ సత్కృపామధు
లక్షితనవకల్పవృక్ష లక్ష్మీవక్షా. 342

మాలిని. సుజనహృదయవాసా శుద్ధసౌవర్ణవాసా
వ్రజసుతవరమిత్రా వైరిసంహారమిత్రా
కుజనవిషమరూపా క్రోడమూర్దాంతరూపా
త్రిజగదభినుతాత్మా దివ్యతేజోమయాత్మా. 343

గద్య. ఇది శ్రీమన్మదనగోపాలచరణకమలసేవాధురీణ సత్కళా
పారీణ కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభు
సుపుత్ర సుకవివర్య రాధామాధవయెల్లనార్య
ప్రణీతం బైన రాధామాధవం బను శృం
గారప్రబంధంబు నందుఁ
జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీ రాధామాధవము.

## పంచమాశ్వాసము.

శ్రీరాధానఖరక్షత
తారేశకళానిరస్తదర్పక దర్పో
దారాంధకార ! జగదా
ధార ! గుణావాల ! నవమదన గోపాలా ! 1

గీ. అవధరింపుము దేవ ! సంయమివరుండు
సకలవేదాంత విద్యావిశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకత మెఱయ
నింపుగా నాపరీక్షిన్నరేంద్రునకును. 2

క. ఆరాధామాధవులను
గారామారంగఁ గూర్చి కడుఁ దత్కరుణా
గౌరవము వడసి మగుడన్
గీరము దివికేఁగి వాణికేలన్ వ్రాలెన్. 3

గీ. నీలవర్ణుని వరియించి నీరజాక్షి
గూడియుండిన నెంతయుఁ జూడ నొప్పె
నీలమేఘంబు చెంగటి కోలమెఱుఁగుఁ
బోలె లావణ్యవైభవస్ఫూర్తి మెఱసి. 4

వ. ఇవ్విధంబున సకలలోకహితం బగు నమ్మహోత్సవంబునఁ
బ్రాణవల్లభాసమన్వితుండై మహావైభవంబున వర్తించి
యున్న పురుషోత్తముం జూచి యమ్మేలు సహింపఁజాలక
విశ్వవిశ్వంభరామండలేశ్వరకుమారకంఠీరవులు క్రోధలజ్జా
విషాదవేదనాభారదూరీభూతధైర్యులై దురభిమానంబునఁ
గనలి మోహాంధతమసంబునఁ గానరేక యవార్యదోర్వీ
ర్యంబున శౌర్యంబు గార్యంబుగాఁ బ్రతిష్ఠించి పోరాటు
నోటుపఱచి గోపాలుని గోపాలనంబున కనిచి బలాత్కా
రంబుననైన నీయబలఁ గొనిపోవుట తగుఁగాక యూరక
మరలినఁ బౌరుషయశోహాని గాదె యని నిశ్చయించి మత్స
రంబుతమకంబునఁ దమతమగంబులు భగ్గున దిగ్గనుఱికి
హయగజారూఢులై సైన్యంబులు గూర్చుకొని పేర్చి రమ్మ
హాబలకోలాహలసమయంబున నమేయమాయాబలుం డగు
హలగ్రీవుం డను నానిశాచరవిభుండును రాజరూపంబుఁబరి
త్యజించి నిజఘోరవికృతాకారంబుఁ బ్రకటించి ప్రజ జడియ
సందడిఁ డాయవచ్చి, కొందలపడక గోవిందుముందట నున్న
కన్నెంబట్టి బిట్టువడిం దిగిచి తనరథంబున నిడుకొని కరాళ
శార్దూలముఖంబునం బడిన యామిషంబు నోడిచికొనిపోవు
సాలావృకంబుకైవడి రయంబునఁ బురంబు వెడలిపఱచిన.

క. మేడలఁ గోటల వీథుల
వేడుకఁ గనునెల్లజనము ౕ విధుముఖి దనుజుం

డోఁడక కొని చనుటకు వడఁ
కాడెకుమది నొక్కపెట్టఁ యాక్రందించెన్. 6

వ. అప్పుడు. 7

మ. పటుగోపారుణితేక్షణంబులఁ బ్రబలంబద్వేషిమున్నాడి యు
త్కటవేగంబునఁ దేటిపై కుటికి దోర్దండంబులుప్పొంగ నో
క్కటవిల్లెక్కిడి కేలఁ గ్రూరశరముం గ్రస్ఫూర్తిమైఁ ద్రిప్పుచున్
గుటిలాత్మా! యెటుపోయెదంచుఁ దగిలెన్ గోవిందుఁ డుద్యద్గతిన్.

శా. ఘంటాకింకిణి నిస్వనంబులు చెలంగఁగన్ దార్క్ష్యకేతుప్రభల్
మింటంబర్వహరుల్ సమీరణులువోలెంబోవఁగా దైత్యుతే
రంటంబాటె రథంబు రాధిక భయోద్యద్దీవమై చూడ వె
న్వెంటన్ రాముఁడు గోపకాళియుఁ దగన్ నేత్రోత్సవంబై వడిన్.

క. కూడుకొని రపుడు శౌరియుఁ
గూడెననుచు [1]నాశ యెడలఁ గుటిలుఁ డదృశ్యుం
డై డాఁగె నసురపతి; హరి
జాడకు నొకకొంత దొలఁగి సైన్యముఁ దానున్. 10

మ. అతివేగంబున నల్లు శార్ఙ్గి గదుడాయ న్వచ్చి సేనాసమ
న్వితుఁడై కన్పడకున్న మాయఁగొలిపెన్ వేఁడంచులీలన్ జగ
త్త్రితయంబున్ దనమాయఁ గప్పు చతురశ్రేష్ఠుండు దన్నాయసం
గతిగా వైష్ణవశక్తిఁ దూల్చి కని యాక్రవ్యాదుతో నిట్లనున్.

1 డిఁయను. (మూ)

శా. ఓరీ! దానవ! యింతనీచమతిఁ బ్రత్యూహింప నేమేమి చే
కూరెన్ వేఁగయితోఁచెనే యకటనీకున్ బాణముల్ మేనికిన్
జేరంబోదు రె ! రానివస్తువుల కీస్త్రీ దక్కునే నీకు నీ
మూరింబోయినకండక్రొవ్వునిను నిర్మూలంబు సేసెంమదిన్.

వ. అని కోపించి. 13

క. మును దనకేల నమర్చిన
ఘనకాండంబేయఁ బిడుగు కంటెను వ్రేఁగై
చని యది యవిరళగతి న
ద్దనుజునురము గాఁడి వెడలి ధారణిఁ గంటెన్. 14

క. రక్కసుఁడు దాన నెత్తురు
గ్రక్కుచు మూర్ఛిల్లె నంత రథము రథముతోఁ
గ్రక్కునఁ జేర్చి యుపేంద్రుఁడు
నెక్కొనఁ దనయరదమునకు నెలఁతుకఁ దిగిచెన్. 15

వ. అట్లు మగుడం దిగిచికొని తనశతాంగం బెడగలుగనిలిపి,

గీ. భీతియును సిగ్గు మోదంబుఁ బెనఁగొనంగ
శిరము వ్రాలిచియున్న యచ్చెలువ మేను
హస్తపంకజమున శౌరి యట్టె నిమిరె
వెఱచితే యని పులకలావిర్భవింప. 16

గీ. ప్రియతలోదరి మదిలోని భీతి యడఁచి
విజయశంఖంబు పూరించె వెన్నుఁ డంతఁ
దన్మనోహరరవము సంతస మెలర్ప
గోపకులతోన చని శౌరిఁ గూడె హలియు. 17

ఆ. అపుడు మూర్ఛఁ దేఱి ♦ యమరారి యంతకు
చెలువుఁ దాల్చి క్రుద్ధు ♦ డే పురిఁ చింపఁ
జివురుఁ బోణి మగుడఁ ♦ జేకొని యుద్దండ
శౌర్యరేఖ నున్న ♦ శౌరిఁ జూచి. 18

మ. తరుణీరత్నముఁ గ్రమ్మఱం బడసి యుత్సాహంబు దీపింపఁగా
మరలం జూచెదు పోవనిత్తునె నినుం ♦ మద్బాణశాతాశుగో
త్కరపాతంబుల రామయుక్తముగ నీ ♦ దర్పంబు వారించియా
సరసీజాయతనేత్రఁ గ్రింగక వృథా ♦ జల్పంబు లింకేటికిన్. 19

వ. అని పలికి కుటిలభ్రూకుటిచటులనిటలఫలకుండై వికటదంష్ట్రా
కరాళవదనగహ్వర నిష్ఠ్యూత నిష్ఠుర భయంకరాట్టహాసంబు
న దిక్కటాహంబులు వగిల్చి యుద్ధసన్నద్ధుం డయ్యె నాసమ
యంబున. 20

సీ. గజఘటాఘంటికా ♦ ఘణఘణాత్కృతులు ది
గ్దంతుల చెవులు చిం ♦ దఱలు గొలుపఁ
బటుతురంగమఖుర ♦ పుటకఠినధ్వనుల్
పిడుగుల చప్పుళ్ళ ♦ బడలువఱుప
భటసింహనాద ము ♦ ద్భటభంగిఁ గొండ గు
హాలు ప్రక్కలించి సిం ♦ హములఁ గలఁప
నిర్వక్రరథచక్ర ♦ నిష్ఠురగతు లనం
తోరగస్వామి ను ♦ త్త్రాంతఁ లూఁప

తే. సకలదిగ్దేశరాజన్య ♦ సైన్యములును
బెల్లగిలి యొక్కపట్టున ♦ బిరుదుపడగ

లోకసంబున ముడివడ నవనిరేణు
పటలములు చీఁకటులు గొల్వ భయదలీల. 21

క. నలుగడల గోమతీపురి
వెలువడి హరిఁ బొదివి దెసల వీరావేశం
బులఁ జూపి గుణారవంబులు
చెలఁగఁ బరిష్కారమణిరుచి శ్రీ లడరఁగ. 22

వ. నిట్టవడిఁ జుట్టుముట్టి తత్పురగోపురోపకంఠంబున యమునాతరంగిణీతీరంబున నిలిచి యన్యోన్యానుమతంబున రామకృష్ణు లెందునుం బోవకుండ నడ్డుకట్టుకొనువారై వారున ముమఁ జిక్కునట్లుగా హలగ్రీవు ననుసరించి చక్రాకారంబున నాక్రమించి తమతమ నెలవులఁ గ్రౌంచ గరుడ శకటీర్థ చంద్ర ప్రముఖ మహావ్యూహంబుల మోహరంబులు దీర్చి ముందట నరిగ తండంబును దానికిఁ బ్రాపై విలుకాండ్రమొత్తంబును దానికిఁ బాసటయై యెడనెడ దారుణశిలాబాణయంత్రకారులును వారికిఁ దోడై యుభయపక్షంబుల హయఘట్టంబులు బోటొగ్గి నిలిచె వానివెన్నుఁ దన్ని నానాభూమండలేశ్వరులును నెలవంకల వలవంకల మత్తకరిఘటల నిడుకొని యనేకరథకదంబపరివృతులై కేతనంబులు గ్రాల నాతపత్రంబుల క్రీనీడ ధనుష్టంకారంబు లొనర్చుచు శిరస్త్రాణచిత్రకవచభాసితులై సముజ్జ్వలమకుటమణిదీప్తులు కిరణజాలంబులై గ్రాల నానాదిక్కుల నొక్కసమయంబున

న్నుగ్రతేజంబుల నుదయించి వెలుంగు మార్తాండమండలం
బు లనునోజఁ దేజరిల్లుచుండి రమ్మహారణమండలంబు దేవ
మానవకోటులచూడ్కికి విస్మయభయోత్సాహకారి యు
య్యె వెండియు. 23

చ. సరిన్నృపకోటి తీరతరుషండము, వీరరసంబు నీరు, భా
స్వరకమలంబు గోపసుతసైన్యము, కర్ణిక తేరు, రాధికా
తరుణి మధూళిధార, హరి తత్ప్రియసక్త మధువ్రతంబు గా
సరసిరుహాకరంబుక్రియ సంగర మొప్పె సుదర్శనీయమై. 24

క. ఇవ్విధమునఁ దనుఁ జుట్టిన
యవ్వసుధేశ్వరుల దైన యాటోపంబుఁ
గ్రొవ్వును మత్సరమును గని
నవ్వుచు మాధవుఁడు రామునకు నిట్లనియెన్. 25

ఉ. కంటివె రామ! యీనృపులగర్వము కార్యవిజృంభణంబుఁ బె
న్బంటుఁ దనంబు మోహరము భంగియు వీరికదావవహ్నిఁ బె
ల్లంటఁగఁ బోవునల్పశలభావళికై వడి నన్నుఁ దాఁకి యొ
క్కంట నణంగి పోఁగల రఖర్వమదీయ శిలీముఖార్చులన్.

క. కనుఱెప్ప వెట్టునంతనె
మునుమిడి యీరాజసైన్యముల రక్కసునిన్
సునిశిత శరపంక్తులచే
ననిచెద జముకడకు నీవు నమరులు మెచ్చన్. 27

మ. అనునాలో ననలోగ్రమూర్తి దనుజుం డాభీలదోర్లీలమైఁ
దను వేల్పుల్ గొనియాడ నోడక వడిన్ దామోదరున్ డాసియే

సె నితాంతఘోరు నిశాతమార్గణములన్ సేనాట్టహాసస్ఫుర
ద్ధ్వని దిగ్భిత్తులఁ బర్వ రాధ కడుభీతస్వాంతయై చూడఁగన్.

ఆ. శరము పింజపింజ గ్రుచ్చి రక్కసుతూపు
గములు శౌరిఁ దీవ్రగతులఁ గప్పె
ఘోరవిలయమేఘ వారిధారాసహ
స్రములు ధారణీధరంబుఁ బోలె. 29

క. ఆ సాయకములఁ దునుకలు
చేసెం దత్కాండవితతిఁ జెదరక తత్సే
నాసముదయములఁ గూల్చ శ
రాసనవిద్యావినోదియై హరి లీలన్. 30

మ. తనకాండంబులుఖండఖండములుగా దామోదరుం డేయఁగాఁ
గని నక్తంచరుఁ డాగ్రహంబున మహోగ్రస్ఫూర్తి రక్షశ్శరం
బెనయన్ నారి నొనర్చి మంత్రయుతమై యేపారఁగా నేసె నే
సినయాఘోరశిలీముఖంబుబహుశాఖోచ్ఛిద్ధూమముల్ గ్రక్కుచున్.

చ. ఘనవికృతాస్యనేత్రములుగర్కశదంష్ట్రలుదీర్ఘజిహ్వలున్
ఘనమలినోరుకాయములుగల్గు నిశాచరకోటు లుద్భవిం
ప నతిభయంకరాకృతిఁ బ్రభంజనవేగము మీఱి దిక్కులె
ల్లను గబళింపుచున్ హరిబలంబునుడాసె మహాశనిక్రియన్.

క. దానిఁ గని శౌరి కఠిన
జ్యానాదం బెసఁగ వైష్ణవాశుగ మేయన్
మానుగ నా దివ్యాస్త్ర మ
నూనోద్యమదివ్యతేజముప్పతిల్లంగన్. 33

మ. పటుశంఖోత్కరరావముల్ చెలఁగ శుంభచ్చక్రకోటిచ్ఛవి
చ్ఛటలాశావలయంబునన్నిగుడఁ జంచద్విష్ణురూపంబు లో
క్కట వేవేలు జనింపఁగా నమరసంఘప్రస్తుతప్రాభవో
త్కటవేగంబునఁ దాఁకి తత్ప్రదరముల్ ఖండించెఁ జండార్భటిన్.

ఉ. దానవ దానవారి కర ధర్మగుణ ప్రవిముక్త బాణ సం
తానము గప్పి సూర్యకిరణ ప్రతిరోధ మొనర్ప నెయ్యెడం
గానఁగ నీక చీఁకటులు గ్రమ్మి కఠోరపరస్పరాశుగా
నూన మహోగ్రఘట్టనల నుబ్బెఁ గుమంటలఁ బాయునుద్ధతిన్.

క. ధవునిశితశరము లసురం
దవిలినఁ గడు నుబ్బు, ధవుని దద్బాణంబుల్
దవిలినఁ బొక్కును రాధిక
ధవునిజయము దితిజుపాటు దలఁపుచు మదిలోన్. 36

సీ. అమరారి యురవడి నార్చినఁ గడు నుల్కి
వడి డాసి ప్రియు కేలి నొడిసి పట్టు
వెడవాయు దానవు వికృతరూపముఁ జూచి
వెఱచి ప్రాణేశ్వరు వెనుకఁ డాఁగు
నాసురాస్త్రములు ఉవ్వని రాఁగ మార్మ్మము
సేయుచోఁ బతినవ్వ సిగ్గునొందు
దనుజుఁ దూలఁగ నేసి తనుఁ జూడుమని సన్న
సేయువల్లభు దృష్టిఁ జెంగలించు.

తే. ఘనపరస్పరబాణఘట్టనలఁ బొడము
నగ్నికణముల కధిపు హేమాంబరాంచ
లంబుఁ బాపెడు రాధావిలాసినీల
లామ మాహవభూమి నెల్లరును జూడ. 37

క. కలయఁగఁ జెలువుని జూచిన
జలజాక్షికిఁ బొడముఁ జిత్తజవ్యథ పైపైఁ
గలయఁగ రాక్షసుఁ జూచిన
జలజాక్షికిఁ బొడముఁ జిత్తజవ్యథ పైపైన్. 38

సీ. చెలువకు నన్యోన్యసింహనాదంబున
గాత్రవల్లికఁ గంటకములు మొలచు
శతపత్త్రగంధికి నితరేతరవిలోక
నంబుల ఘర్మకణంబు లొలయు
వరవర్ణినికిఁ బరస్పరమర్మభేదక
వాక్యసంగతి నశ్రువారివొడము
నిభరాజగమనకు నుభయాభిముఖసన్ని
కర్షణవ్యాప్తిచేఁ గంపమడరుఁ

ఆ. దరుణి కొకరి యొకరి తనురక్తధారల
భంగిఁ గనిన మ్రానుపాటు చెందు
వల్లభుండు నసురవరుఁడుఁ బోరాడ శృం
గారభీతిసాత్త్వికములచేత. 39

వ. అట్టియెడ. 40

ఉ. చక్రి నెదిర్చి పోరుబల సంపదయున్ విలువిద్య నేరుపున్
విక్రమ రేఖయుం గలుగు వీరుఁడు వీఁడె యటంచు భూమిభృ
చ్చక్రము మెచ్చఁగాఁ గనలి శార్ఙ్గి ప్రియాంగన దేఱదోర్విలా
సక్రియ నొక్కభల్లమునఁ జంపె నిశాచరనాథసూతునిన్. 41

ఆ. మఱియుఁ బెక్కు తీవ్రమార్గణంబుల రథ్య
వితతిఁ గూల్చి వాని విల్లుఁ దునిమి
రథము నుగ్గు సేసి రయమునఁ దన్మహా
రూఢకపటబలము రూపు మాపె. 42

క. విరథుఁ డయి దానవుండును
ధరణికి లంఘించి క్రోధ తామ్రాక్షుండై
పొరిఁ బొరిఁ గనులను నిప్పులు
దొరుఁగఁగ సంవర్త రుద్రమర్దమలీలన్. 43

మ. క్రకచక్రూరనిశాతదీర్ఘతర దంష్ట్రల్ గీఁటుచున్ జిహ్వామృ
త్యుకరాళోగ్రముహుఃప్రకంపితమహాదోర్మండలోగ్రాకృతిన్
వికృతాస్యంబునఁ గ్రాలశూలధరుఁడై విక్రాంతికిన్ దేవతా
ప్రకరంబున్ భయమందిచూడఁబటుశుంభద్వేగసంరంభియై.

ఆ. తనమహాభంగిఁ జూచి జనులెల్ల హరి మ్రింగె
మ్రింగె దానవుం డనంగఁ బొంగి
రాజు లార్వ నుర్వరాచక్ర మల్లాడ
నీడులేని కడిమి నీడఁ బోక. 45

క. వెడవెడ నార్చుచు శూలము
వడిఁ ద్రిప్పుచు నూర్ధ్వకేశవల్లులు దూలన్
గడు నుగ్రోల్లంఘున గతు
లడరన్ మాధవుని మ్రింగు నాసన్ డాసెన్. 46

మ. రవిఁ బట్టం బఱ తెంచు రాహువు క్రియన్ రాత్రించరుం డట్లు ద
న్నువడి న్మ్రింగెద నంచు వచ్చు రయముం రోషంబు నాటోపమున్
భువనక్షోభణభంగియుం దెలిసి యంభోజాక్షుఁ డక్షీణదోః
ప్రవిజృంభం బడరన్ ధనుర్గుణలతారావంబు నిండారఁగన్.

మహాస్రగ్ధర.

సమస[1]ప్తార్చిష్మదర్చిశ్ఛట కుపమ
యనం జాలు నాభీలకాలా
స్త్రము చంచద్భంగి నేయం జటులత
నశనిస్ఫారమూర్తిన్ మహీశుల్
భ్రమ నొంద న్మింట మంటల్ పయికొనఁగఁ
బొగల్ పర్వ నుద్దామవేగో
ద్యమలీల న్వచ్చి త్రుంచెన్ దనుజుని
తల భూతవ్రజంబుల్ వడంకన్. 48

క. హరిశరహతి రక్కసుతలఁ
ధరఁ బడఁ బిచ్చిల్లి రక్తధార లెగయ న
చ్చెరువై చిమ్మనగ్రోవికిఁ
బురుడయ్యెన్ దత్కబంధము రణక్షోణిన్. 49

1. స. ప్త్యర్చి. మూ.

గీ. కత్తిఁ బూరసిన తేనియఁ గాంక్ష నివిరి
జిహ్వ తెగిపడఁ బడుబేల చెలువు దోఁప
మాధవాన్విత మై యున్న రాధఁ జెనకి
నీచమతి నిర్జరారాతి నేలఁ గూలె. 50

శా. ఆ నేత్రోత్సవ మైనగెల్పునకు మోదాంభోధి కల్లోల డో
లానిత్యోత్సవ కేళిఁ దేలె జగమెల్లన్ లీలమై నప్సర
స్త్రీనృత్యక్రమగానముల్ చదలఁ బర్వెన్ బర్వమైవల్లవా
న్యానోత్సాహకృతోల్లసన్మధురవేణుధ్వానమొప్పెంగడున్.

క. దానికి మదిఁ గన లొదవఁగ
భూనాయకు లొక్కపెట్ట పొదివిరి శౌరిన్
నానాముఖముల నార్భటు
లీనన్ బెన్ ధూళి లోకమెల్లను గ్రమ్మంగన్. 52

మ. హరిహేషాకరి బృంహితంబులుభటోద్యద్గర్జలున్ స్యందనో
త్కరచక్రారవముల్ ధనుర్గుణనినాదంబుల్ హతానేకని
ర్భరభేరీపటహాదివాద్యరవముల్ బ్రహ్మాండభాండంబు ని
ష్ఠురభంగిన్ బగిలించె నొక్కట రణక్షోణిన్ జగత్క్షోభమై.

క. జలజోదరుఁ బొదివినయ
బ్బలములకుఁ గవిసి గోపబాలురు శరపం
క్తుల నొంచిరి సింగపుఁగొద
మలు నఖరాగ్రముల గజసమాజముఁ బోలెన్. 54

క. భూపాలసైన్యసంఘము
గోపాలకబలము పోరెఁ గుంభిని వడఁకన్
భూపాలకులును మన్మథ
గోపాలుఁడు దమజయంబుఁ గోరుచుఁ జూడన్. 55

క. పడుహారులుఁ గూలు రథములు
మఱియు భటోత్తములు నొఱలు మాతంగములున్
మిడుఁగుఱులు చెదరఁ బొడియై
పుడమిఁ దొరఁగు కైదువులును బోరఁ దనర్చెన్. 56

సీ. కడుపులు చించి యొక్కటఁ దెంచి రాఁ దీసి
ప్రేవులు పేర్లుగాఁ బెనచువారు
కోసిన తలలెల్ల కొండలుగా వైచి
పలుమాఱుఁ బతిమెచ్చు వడయువారు
తలఁ ద్రుంచి తత్కబంధమునఁ గ్రమ్మెడు రక్త
జలధార లెల్లెడఁ జల్లువారు
కట్టల్కఁ జిదియంగఁ గొట్టి మేనులు ముద్ద
సేసి మాసిరూపు చెఱుచువారు

తే. నై సురాసురగంధర్వయక్షముర్ని
రీక్షముగఁ గేళి సలిపిరి యేచి త్రోచి
యుభయసేనలవారు దోర్విభవ మెసఁగఁ
గుంభినికి భారమై యొక్కకొంతప్రొద్దు. 57

వ. అట్టియెడ. 58

సీ. పదివేల నొకఁడు పాట్పడి గెల్వఁజూచును
దూలింతు రొకనిని వేలుగూడి
మొనసి జోడై సంతమునఁ జొచ్చిపోడుతురు
గుంపు విప్పుదురని గుంపుగట్టి
తముఁ దాఁకఁ దలఁచు సైన్యము దాఁకుదురు మున్నె
యాడాడ బిరుదులు వాడిమొత్తు
రుక్కున నొకమూఁక పెక్కుమూఁకలు సేతు
రన్నిమూఁకల వారె యై చరింతు
తే. రమలచూడాగ్రపింఛ గుచ్ఛములు దూలఁ
బేరురంబులఁ దామరపేరు లొలయ
నచ్యుతాపారమూర్తు లుదగ్రబలప
రాక్రమంబున నాభీరరాజసుతులు. 59

క. నానాబలములు వల్లవ
సూనులకొల్లలకుఁ గాక సుడివడె ఘనసం
తానము లత్యుత్కటజం
ఝూనిలరయమునకుఁబోలె నాహవభూమిన్. 60

క. ఆ వల్లవవీరుల బా
హావిభవము నెలమి సొంపు నాటోపము దే
వావళులు చూచి పొగడె న
భోవీథి న్విజయమంగుభులు మొరయంగన్. 61

ఉ. అంత సమస్తభూపతులు నాత్మచమూనిచయంబువేఁగవి
భ్రాంతివహింప వీరుల మఱల్పుచు నొక్కట వచ్చి తాఁకిర
త్యంతరయంబునఁ లయకృతాంతమహోగ్రగతిఁ రథాశ్వదు
ర్దాంతమదాంధసింధురశతంబులతో ధర గ్రక్కతిల్లఁగన్.

వ. సకలసాగరంబులును గల్పాంతసమయ వాత్యాఘుంపాకంప
మానసముత్తుంగ భంగంబులై యభంగనిర్ఘోషంబున ఘూ
ర్ణించుచుఁ బొంగి నింగిముట్ట వెల్లివిరియుచందంబున నమం
దక్ష్వేళాడంబరంబుతో మొగులు ముట్టిన కేతనాతపత్రనివ
హంబులు ముడివడ రోషావేశవేగంబున నిఖిలహరిద్భాగం
బులఁజుట్టి గట్టిమోహారంబై తాఁకినఁ దూతకొమ్ము లొత్తి
కూఁక లాకసంబు నిండ మోదుకొని చండపుండరీక సింహా
రంహంబునఁ దొట్టి కట్టలుక నాదిట్టగొల్లకొమరులు పట్టిస
ప్రాసతోమరగదాకుంత పరిఘుకరవాల ముసలముద్గర
శూలభిండివాల చక్రక్రకచ ధనురాదిసాధనకలహాకళావై
దగ్ధ్యంబు మెఱసి వారివారికిం దలకడచి వీరరసావేశంబున
జేతులతీఁట దీఱదనుచుఁ దలపడి రమ్మహావీరసంగ్రామంబు
సుపర్వపర్వంబై యుండె నట్లు నృపగోపాలబలంబులు హరి
ణశార్దూల సమజంబులును ద్విరదమృగేంద్రబృందంబులు
ను నాగగరుడ నివహంబులును బోలెఁ బోరాడునెడ నా
భీరకుమారుల యగ్గలికఁ గని మాధవుండు వేణుగుళం బుని
కొలిపిన.

క. కొండల పోడ్పై మదవే
దండసహస్రములు తండతండములై యు
ద్దండగతిఁ దనరె ఘనతర
తుండాగ్రము లెత్తి ఘీంకృతులు పెల్లడరన్. 64

సీ. ఫూత్కారములతోడఁ బోరిబోరివర్షంబు
వడువున సీకరావళులఁ ద్రోచి
కాలసర్పంబుల కరణి సల్లాడెడు
శుండాగ్రములఁబట్టి చుట్టివైచి
వాఁడికొంతములకై వడి మీఱుఘనదంత
కోరకద్వయములఁ గ్రుమ్మిగ్రుమ్మి
ఘనమహీధ్రములనై నను వాలుకగఁ జేయు
బల్లిదంబునఁ బట్టి మల్లలాడి
తే. రుధిరమును మాంసమును బెనుజొంపి గాఁగ
సంచరించుచు ఘంటికాస్వనము లొలయ
దుర్నిరీక్షంబు లగుచు సింధురము లని న
పారబలమున గోపాలబలముఁ గలఁచె. 65

క. కని బలభద్రుఁడు ముసలముఁ
గొని యరదము డిగ్గనుఱికి కొండలఁ జెండా-
డ నెసంగు వజ్రివిధమున
ఘనసంరంభమున దంతిఘటలకుఁ గవిసెన్. 66

క. లాలిత నవరత్నరుచి
శ్రీ లలరఁ బ్రలంబవైరి చేత నుదంచ
ల్లీలల ముసలము వెలిఁగెం
గైలాసాగ్రేంద్రచాపఖండము వోలెన్. 67

క. తునిసెడు తొండములు భ
ల్లని విఱిగెడు దంతసముదయము పిచ్చిలి క్ర
మ్మ నసృగ్ఝరులు దఱుచు గ
దనికి యొఱలెఁ గరులు ముసల దండాహతులన్. 68

సీ. ఒకటి కుంభములు వ్రచ్చి కడంక ముత్తియ-
ములు వీరలక్ష్మి కంజలులొనర్చు
దృఢశక్తి నొకటి దిర్దిరఁ ద్రిప్పి వినువీథి
నెగుర వైచును వేల్పులెత్తిచూడ
నురువడి నొకటిపై నొకదాని వైచి పై
కుఱికి యారెంటి గుంజుఱికమట్లు
నొండొంటి యొకరెంటి తొండముల్ బిగియఁగ
ముడిచి యుయ్యాలలూఁగి మురుఁగఁద్రోచుఁ
తే. దెగువఁ గొన్నిటి గుల్లల తిత్తులుగ మ
హీస్థలిం దొండ మొడిసి యెత్తెత్తి పొడుచుఁ
జటులగతి మత్తమాతంగఘటల కుఱికి
కామపాలుండు భీమసంగ్రామకేళి. 69

సీ. [1]గురుసు గూడఁగఁ దీసికొని దంతములఁ గరి
కుంభముల్ వగులంగఁ గొట్టికొట్టి
యురుసు లెడలఁ ద్రోచి యెత్తి కండుల రథా
వళి నుగ్గు నూచగా వైచి వైచి
కళ్యాలు సడలించి గళములఁ బెనఁ గొల్పి
వీతుల నేలతో వ్రేసి వ్రేసి
కరములు విఱిచి తద్గతమహాసులఁ బదా
తులకంఠనాళముల్ గ్రుంచి త్రుంచి

తే. కలఁచి తెరలించి గగ్గులకాడు సేసి
సకలబలముల దెసలకు సరగఁ దెచ్చె
నచ్యుతాగ్రజుఁ డాగ్రహావ్యగ్రభర్గ
చటులనిటలేక్షణ జ్వలజ్జ్వలనలీల. 70

క. వారణకోటికి నడ్డం
బై రౌతు లనేకహయసహస్రములను న
వ్వీరునిపైఁ బఱపిన హాలి
వారల నెదిరించి యంపవానల ముంచెన్. 71

చ. అసదృశమత్స్యకచ్ఛపముఖాంబుజనిప్రకరాకులంబులై
శ్వసనవశంబున న్నిగిడివచ్చు నుదన్వదభంగిభంగముల్
వెస బడబాగ్నిచే నడఁగులీలఁ దదుత్తమపీతిజాతముల్
బిసరుహనేత్రుచేఁ బొలిసెఁ బెక్కులు సాదిసమన్వితంబులై.

1 గురులు నూడగ (మూ)

వ. ఆసమయంబున. 73

శా. మౌర్వీనిస్వనగర్జ లుల్లసిల వర్మప్రస్ఫురద్రత్న రో
చిర్విద్యుల్లత లీనఁగా నృపవరా క్షీణాంబుదశ్రేణి పె
ల్లుర్వీన్ యంత్రశిలాతతుల్ పిడుగులై యొంపొండరాలన్ జగ
త్పర్వంబై వడి ముంచె నచ్యుతగిరిన్ బాణావళీ వృష్టితోఁ.

చ. తనుఁగడుముంచిమించి బెడిఁ దంపువడిన్ నృపులేయునస్త్రముల్
సునిశితసాయకావళులఁ జూర్ణము సేయుచు లీలమైఁ గన
త్కనకమయోరుపుంఖమణి కాంతులు పర్వఁగ నర్ధచంద్రబా
ణనిహతిఁ ద్రుంచె నానలిననాభుఁడు సత్కరచాపసంహతిన్.

క. అరిమౌర్వీటంకృతులును
గురుశరములు రాధ కాంచి గుణమణిరవమున్
దరళకటాక్షశ్రీలును
సరిగాఁ గ్రీడించె శౌరి సంగరకేళిన్. 76

సీ. చిద్రుపలై మణికోటి చెదర నుద్ధతి మిట్ట
కోలల మకుటముల్ గూలనేయు
వడిఁ జిప్పగమిరాల వెడఁద నారసములఁ
గవచముల్ దునుకలుగాగ నేయుఁ
దనువులు వడ వాఁడి మొనలసాయకముల
వరముష్టిబంధముల్ వదలనేయు
నశ్వముల్ చెడి పాఱ నర్ధచంద్రాశుగ
శ్రేణి సూతులతలల్ ద్రెవ్వ నేయు

తే. బలవదవనీతలేశమండలము దఱిసి
ధీరగతిఁ జిత్రభంగులఁ దేరు మెలఁగఁ
జక్రధరుఁడు త్రిలోకైకచాప గురుఁడు
ప్రాణదయితకుఁ గన్నులపండువుగను.

క. బలదేవునిచే నంబర
తలమునఁ దూలాడు కరులఁ దార్క్ష్యని హరితో
ఫులఁ దెగి యెగసినవెలిగొడు
గులు ఘనయుతబకము లనుటకుం దగియుండెన్. 78

క. నారాయణశరఖండిత
వైరిసుభటకరటిఘోటవారంబు జగ
ద్ఘోర మయి పొలిచె హలికకు
ఠారముమై దళిత మైనయడవియుఁ బోలెన్. 79

క. హరిచండకాండహతి భూ
వరులు కిరీటములు వాసి వాసవభిదురో
ద్ధుర ధారాంచల భిన్నశి
ఖరధరనీకాశతం బ్రకాశించి రనిన్. 80

క. పై పైఁ బదుబలములు బహు
రూపంబులు సకలసుర వరులు చూపఱుగాఁ
జూపెఁ గళానిపుణత్వము
గోపాలమణీంద్రజాలికుఁడు రణవీథిన్. 81

తే. ఏచి విక్రాంతి చూపఁగాఁ గనేనృపాలు
[1]నాదరింపక విజయ కన్యాలలామ
శౌరి వరియించె సత్కీర్తికౌచారుహాస
చంద్రికల దిశల్ వెలుఁగఁ బ్రసన్నమూర్తి. 82

వ. ఇట్లవిరళబహుళ నవ్యక్రవ్యరుధిరపూరమత్తనృత్యదనేక భీకర భూతభేతాళ కరకవాళ కపాల కంకాళ తాళ కోలాహలదుర వగాహం బగుమహాభీమ సంగ్రామమధ్యంబున మధ్యందిన మార్తాండమండలంబు తేజంబునఁ దేజరిల్లుచు విజయోల్లాస భాసితుండై యవార్యదోర్వీర్యంబున ననవద్యధనుర్విద్యా చండ పాండిత్యంబున విక్రమంబు నెఱపుచక్రపాణియఖర్వ దుర్వార ఘోరనారాచనిచయంబు లనల్పవేగంబున నశనిక ల్పంబులై వచ్చి చిచ్చుముట్టించినట్లు మర్మంబులు విదారింప వీరకర్మంబులు విడిచి విహ్వలులై యతిరభసంబున జరాసంధ సింధురాజ విందానువింద శిశుపాల నేపాళ చోళ మాళవ కుంతల లావంతి కాశ కరూశ లాట భోట కొంకణ టెంకణ కళింద పుళింద బర్బర విదర్భ ప్రముఖనిఖిలదేశాధీశులు తలచెదరి బెదరి బిరుదకేతనాతపత్ర వాలకరవాల బాణా సన తూణీరంబులు వైచి రాచగ్గంబు వదలి వెఱచఱచి పఱచినఁ గో యని యార్చి ఘనధనుష్టంకార ఝంకారంబు లొనర్పుచుఁ బ్రచుర దర్పంబున వెన్నుండు వెన్నాడినఁ

1 డేలగింపక...మూ.

గలంగి మలంగి ప్రాణభీతిఁ బోఁడిమి చెడి యెగ్గుసిగ్గులు లేక నానాదిక్కులఁ దలచీర లెఱుఁగక గాలిగొడుఁగు లై కైదువులు వైచుచుఁ బఱచి యంధకారబంధురంబు లగు గిరిగుహాగర్భంబుల డాఁగువారును, గిరిగుహాగర్భంబు లడాఁగంబోయి తదంతరాళంబు లుడుగక పట్లు సేసికొని యున్న సింహశరభ శార్దూలకోలాది దుష్టసత్త్వంబుల వివిధకఠోరరావంబులు విని గుండె లవిసి బ్రమసి ఝల్లనం బ్రేలి కాలు జాఱి చఱులం బడి మ్రగ్గువారును, గాఱడవుల నీరంబు లైనజాడలు దూఱి పాఱి నీరంధ్రనికుంజక్రోడంబుల నొదుఁగువారును, నీరంబులు దూఱంబోవు తమకంబునఁ దమకరంబులఁ దలవెండ్రుకల ముండ్లకంపలు పట్ట విడిపించుకొనంజాలక చీకాకై పైసందడి గ్రమ్ము పెంపై కాలుమట్ట దానం గెడయువారును, మ్రానువడి పీనుంగు పెంటలు చొచ్చినవారును, జచ్చినట్లు కాలు చే యార్పక పడియుండువారును, నట్ల పడియుండి కాకగృధ్రకంకనివహంబులు నిశితచండ తుండాగ్రంబుల వదననేత్రోదరంబులు పొడిచి చించినఁ బంచత్వంబు నొందువారును, నెత్తుటం దోఁగినకుణపంబుల నుపలక్షించి రణకంపంబు వట్టి గిజిగిజం దన్నుకొనుచు ధరణిం బడి పొరలువారును, వారల వికృతాకారంబులు చూచి వెఱచి భూతావేశవికారంబునఁ గళవళపడుచున్న పదాతులును, జోడుపక్కెరలు తెగం గోసి

యఱుతలకుం ద్రోయుచుఁ గేడెంబులు వెన్నునకుఁ దిగిచి తేజీలం బఱపుకొని తలవీఁడులం బాఱిపోవువారును, కోయని గుఱ్ఱంబుల కాళ్లు నఱికి తెగసెడక యడిదంబులు ఝుళిపించుచు ముట్టిపాటైనఁ బ్రాణంబులైన నిత్తుమని నెత్తురుజొత్తుకూడుకొని సందడింబడక నెలవరులై చేరువ తెరువున నేఁగువారును, [1]గోరిసెలపసచెడి పఱచి పఱచి యవి దగదొట్టి నిలిచినఁ బాసిపోవక యండగొట్టు గుఱ్ఱంబులవలనియాస విడిచి భగ్గన డిగ్గనుఱికి పాఱువారును, నెలవుదప్పి తప్పు త్రోవలఁ జని కాలువయొడ్డయొఱకంబులఁ జేలగట్లఁ దగిలి జాడంగానక తిరిగి తిరిగి వచ్చినచోట్లకు వచ్చుచు నుపాయశూన్యులై సంచరించువారును, దట్టని యడవులం దొట్టి విడివడినగుఱ్ఱంబులఁ గూడింపుచుఁ బయిఁ బడినఁ బట్ట నలవిగాక హేషాభీషణంబుగా మార్కొని కొట్లాడుచుఁ గల్లరిగొట్లు పొదలు దూఱి పాఱువడిం గంటకంబులు మేనులు చింపఁ గ్రొన్నెత్తురుల జొత్తిల్లుచు నక్కడక్కడ బలుఁదీఁగెలం దగిలి వ్రేలువారును, నై వాహకులును మానంతులుఁ గూలిన యథేచ్ఛానువర్తనంబున నయ్యెయెడల నెత్తురుమడుఁగులు చొచ్చి ప్రేవులతీఁగెలు మృణాలజాలంబు లని తిగిచివైచుచుఁ దిరుగునవియును,విచ్ఛిన్నకక్ష్యాజాలంబులై యంకుశంబులు లేని యాధోరణులం గైకొనక జాడించి

---

1. గోరిగల వసించెడి (మూ)

వైచి వనవేదండంబుల వెంబడిఁ గొండలకుఁ బోవునవి యును, దానధారాభారంబులై యంతృశిక్షులకు రాక యొ కటి కొకటి దార్కొని శకలీభూతదంతకాండంబులగుచుఁ ద్రోవలఁ గిట్టి బలంబులం బఱవనీక చలంబునఁ బోరునవి యును మదమేనుంగుల గాలునకుం గాక చెదరి హాస్తిపకు ల కశక్యం బై శకటాందోళికా గోతురంగమనివహంబులఁ బడలు వఱపుచుఁ బఱపుచున్నవియు, నైన మాతంగంబులు ను సారథులు లేక రథ్యంబులు చెడి పఱచుచు విషమస్థలం బుల యొఱకంబులఁ బడి యొడ్డగడ వై వ్రాలునవియును, నొకటి నొకటి గడువం బొఱురభసంబునఁ గదిసి కేడింప నెడలేని యిఱుకటంబుల నొండొండ భగ్నుచుఁ దాఁకి వికలఫలక కూబరయుగకీలక చక్రంబులై కూలునవియును సమతలంబు లగు మహాపథంబుల నేటిమీఁదియోడలుం బోలెఁ బడగలు దూల నతిజవంబున ధాటి దప్పక వడిం బ ఱచి యిసుకతిప్పలం బడి దుమ్ము దూలఁ గ్రుమ్మరునవి యును, మేదోమాంస మస్తిష్కంబుల రొంపిం బడి డిందిన కుండలు వెడలఁ ద్రిప్పరాక రథికసారథులు దిగి పఱచిన గుఱ్ఱంబులతోన చిక్కియుండునవియు నైన రథంబులును దీనదశం బొంది యిట్లు చతురంగబలంబులును బలాయితం బులైనఁ జూచి గారుణికాంతరంగుండై యార్తజనశరణ్యుం డగు నారాయణుండు విజయశంఖంబుఁ బూరించి మరలి

యింత నంత దారిచిక్కిన కాలుచెయ్యిఁ గూర్చుకొని యొయ్యనొయ్యన వచ్చువారు తనపొడఁ గని వడ వడ వడఁకుచుఁ గసవుఁ గఱచి ప్రణమిల్లిన నోడకుఁ డోడకుం డనుచు నభయదానంబు లొసంగుచుఁ దదాశీర్వాద స్తోత్రంబు లాకర్ణింపుచు నెడనెడ విశీర్ణంబు లైన కటకకేయూరహారకిరీటకర్ణపత్త్రాది కనకమాణిక్య మండనంబులును వికలంబు లైన యంకుశచంద్రహాసప్రాసప్రదరధనురాది సాధనంబులును విచ్ఛిన్నంబు లైన మణిమయచ్ఛత్త్రచామరధ్వజవ్యజననివహంబులును జిక్కైన కక్ష్యారశనామేఖలాజాలంబులును భిన్నభిన్నంబు లైన శంఖకాహళభేరీపటహడిండిమ వీణావేణుకాంస్యనికరంబులును జక్షురుత్సవం బొనర్ప వచ్చుచుఁ దన్మార్గంబున. 83

సీ. ముదిత! నీకుచకుంభములను బోలుదు మన్న
వారణకుంభముల్ క్రవ్యలయ్యెఁ
బాలఁతి! నీకరివంకబొమలఁ బోలుదుమన్న
సింగిణిచాపముల్ చిద్రుపలయ్యెఁ
జామ! నీకేశమంజరులఁ బోలుదుమన్న
పీలిజల్లెడెలు పిసిక్వకు లయ్యె
లలన! నీకంధరాలక్ష్మిఁ బోలుదు మన్న
చిందంపుగుల్లలు చిప్ప లయ్యె
తే. జలజలోచన! నీకటాక్షుములతోడి
మైత్రి వడసిన నిశితమార్గణశరముల

సమదవిద్వేషి రాజన్యసైన్యభూమి
నువిద ! మోమెత్తిచూడు నేత్రోత్సవముగ. 84

క. అని ప్రియురాలికిఁ జెప్పుచు
వనజాక్షుఁడు రామగోపవర్యులతో న
య్యని వెడలి కడఁక బృందా
వనమార్గము పట్టి చను నవసరమునందున్. 85

క. గుణనాదము గజఘంటా
గణధ్వనులు మింటఁ జెలఁగఁ గదిసి మొరయఁగా
మణిమయవివిధ విభూషా
ఘృణులు నిగుడ భద్రకుంభ కినుక మెలర్పన్. 86

తే. ఇరుగెలంకులయందు ననేకబలము
లెలమిఁ గొలువంగఁ బఱచి వీఁ డెవ్వఁడనుచుఁ
దన్నుఁ గనుఁగొను నా గదాధరుని ననతి
దూరమునఁ జూచి పలికె గంభీరఫణితి. 87

చ. నిలు నిలు కృష్ణ! కృష్ణ! ధరణీవరసూనుల భీతచిత్తులన్
నలువురఁ బోరునన్ గెలిచినాఁడ నటంచును విఱ్ఱవీఁగి నా
చెలియలిఁ గొంచుఁబోయెదవి సీ! యిదిబంటుతనం బెభద్రకుం
డలఘుపరాక్రమాఢ్యుఁడని యాత్మఁదలంపవయించు కేనియున్.

ఉ. ఆసురవృత్తి నీ సరసిజాననఁ జేకొని యవ్వలవ్వలం
బాసి పురంబునం జొరక పాఱెద వీక్రియఁ బోవనిత్తునే

వాసికి నెక్కు నాకు నెన వచ్చినరాజవె విక్రమింప నీ
కీసతి రాజకన్య దగునే మదిలోనఁ దలంచిచూడఁగన్.

ఉ. నాసరి గొల్లవారని మనంబునఁ జూచెద వేమొ కాముసూ
పాసిన దా కళంకము కృపానిధి యైనసువర్ణభూధరే
ష్వాసనుచేత రాజ్యమహిమాతిశయంబునుభూపతిత్వమున్
వాసియుఁ గల్గినాము సరివారె? మహీశులుమాకునీభువిన్.

ఉ. ఆలరికాండ్రతో వలసినట్టులు గొల్లలయిండ్లలోపలన్
బాలును నేయియుం బెరుఁగు బల్మిహరింపుచుఁ గ్రొవ్వితత్తుల
స్త్రీలకుఁగన్ను లార్పుచుఁ జరించెదు ఘోషమె వీరసంకులా
భీలత లోకపూజ్యమయి పెంపెస లారెడుమత్పురంబనన్.

క. గొల్లవు నీవిట్టులు నా
చెల్లెలిఁ గట్టెదురఁ బలిమిఁ జేకొని చనినన్
జెల్లుబడి సాగవిడిచిన
గొల్లఁడ నేఁ గాక నీవు గొల్లఁడ వగుదే. 92

ఉ. లాలితమచ్ఛరాసన కళామహిమోద్ధురభంగి కీవృథా
స్థూలుఁడు హాలికుండు వ్రజసూనులునీవునునోర్వఁజాల రీ
బాలిక డించి ఘోషగతి వట్టుము కాచితి నందపుత్ర! గో
పాలక! యాలఁ గాచి వనపంక్తుల వెంటఁ జరింతుగాకొగిన్.

ఆ. కాక రణ మొసర్పఁ గలిగిన నామ్రోల
నిలుము వింటివిద్య నేర్పుకడిమి

శంకరప్రసాద ǀ సంప్రాప్తమామకా
శుకనితాంతగతులఁ ǀ జూతుగ ని. 94

వ. అని మిక్కిలిఁ బోటుబంటునుంబోలె బిరుదు వక్కాణింపుచున్న భద్రకుం జూచి మాధవుండు కలికిమొగంబునఁ జిఱునగవు దొంగలింప లేఁ గెంపుచాయ కొనచూపులు నిగుడ్చుచు వానితో నిట్లనియె. 95

తే. అంతవాఁడవె నీవు నీ ǀ వాడినట్ల
సేయనోపుదు వేమన్నఁ ǀ జెల్లు నీకు
నీవు వలికినయట్టుల ǀ నృపులతోడఁ
బోరనేకాక నీతోడఁ ǀ బోరఁ గలనె ! 96

క. అంతవిజృంభంబున బల
సంతానముతోడఁ బోదువఁ ǀ జల మేటికి నీ
స్వాంతమునఁ బోడమె చెప్పుమా
యంతయు నీచిత్తవృత్తి ǀ నరయఁగ వలయున్. 67

క. సురభూసుర గురుభూవరు
లరుదందుచుఁ జూడఁ దత్స్వ ǀ యంవరభూమిన్
గర మర్థి వరించిన సర
సిరుహాననఁ గొంచుఁ బోవఁ ǀ జెల్లదె నాకున్. 98

క. ఆవల నావలఁ బోవక
నీ వీఁ డేమిటికిఁ జొత్తు ǀ నే నిదె చెప్పుమా
నీవేటికిఁ బుర మేటికి
నావచ్చినరాకయెల్ల ǀ నాతిక కాదే. 99

ఉ. ఈనలినాక్షి నన్ను వరియించిన నీరసమెత్తి పోరి య
ద్దానవుఁడున్ నృపాలక కోదంబముఁ బడ్డవిధంబుఁ గంటివో
కానవొ తేటతెల్లమిగఁ గానఁగవచ్చునె నీకు లోన దు
ర్జ్ఞానముతోడఁగూడినదుర్మంత్రపురాజ్యమదంబుమీఱఁగన్.

క. అనఘచరిత్రుం డగు నీ
జనకుని మన్ననయు రాధ చంచలభావం
బును నీకు నడ్డువడినవి
చను చను మిఁక రాముఁ డోర్వఁ జాలఁడు దీనిన్. 101

మ. అనిఁ బ్రస్ఫురితప్రచండ భుజసవ్యకార్ముకజ్యాలతా
ధ్వనిదిక్కుంజరకర్ణ [1]పూర్ణమయియుద్యత్సింహనాదంబుతోఁ
గొనసాగన్ వలకేలదీప్తులడరన్ ఘోరాస్త్ర మల్లార్చి యా
వనజాతాక్షునిఁ బల్కె భద్రకుఁడు గర్వగ్రంథిలస్వాంతుఁడై.

చ. అరిగెదుగాక యీ సరసిజాననఁ దోఁకొని పల్కినట్ల నీ
బిరుసుఁదనంబు నాకడిమిపెంపును నిప్పుడె నీళ్లఁబాలుసాం
పరుమగ నేర్పఱించు కలహంసకదంబము జోక లోకభీ
కరతరమచ్ఛిలీముఖనికాయము లే విభజించు నాజిలోన్.

వ. అని యిట్లు మహారౌద్రంబున భద్రకుండు వలికి నవ్వొలయ
విలయసమున్నిద్ర సక్రోధాట్టహాసభాసితుండగు దండధరుని
రెండవమూర్తియన నెఱవాఁడితనంబున మార్గంబున కడ్డమై
తనచేతనున్న కరవాఁడి బాణంబు మాధవులలాటంబు గాఁ

1. దిక్కుల్ జొర...మూ.

డనేసిన నతం డలుక మలఁకగొనునంతరంగంబునఁ గలంగియుఁ గలంగక నాదుప్రాణేశ్వరి సహోదరుం డగుటఁజేసి ప్రాణంబుల కలుగుట యుచితంబు గాదని యొక్కహాస్య కృత్యంబు విచారించి, 104

ఆ. పడగఁ ద్రుంచె నొక్కకొబాణంబుచేఁ దేరు
గూలనేసె నొక్కకోలచేత
హయముఁ జంపె నొక్కయస్త్రంబుచే నొక్క
నారసమున విల్లు నఱికివేసె. 105

వ. ఇట్లు విరథుంజేసి. 106

క. వనజాక్షుఁడు లేనగ వా
ననమునఁ జెలువార వికటనారిగర్భం
బనుబాణము వఱపిన నా
సునిసితసాయకము దాఁకి చోద్యంబందన్. 107

క. ఎక దిగఁ బాఱినచన్నులు
చికిబికి వెంట్రుకలకొప్పు చిఱుతపిఱుందుల్
వికటపుమోముం గలిగిన
కొకిబికి యంగమున నొక్కగోతై నిలిచెన్. 108

క. ఆ యట్టహాసభంగియు
నా యలుకయు నామహాభుజాటోపము నా
భ్రూయుగ వక్రత్వంబును
నే మెడనెడ వాసెనోసుకవిహా సతిమైనన్ 109

క. ఏ మంత్రంబునఁ గూడియొ
యూమాయానాటకుని మ-హాస్త్రము చూడం
గామినిఁ జేసెను బురుషునిఁ
దా మును పదధూళి సేయ-దా శిల సతిగాన్. 110

సీ. జోఁదల మణిమయుం - బగుకికీటము వోయి
కుఱుచ వెండ్రుకలతోఁ - గొప్పదోఁచెఁ
గొమరారువజ్రాల-కుండలంబులు జాఱి
చెవులఁ దాటంకముల్ - చెన్నుమీఱె
ఘనమైనవీరకం-కణవైభవము మాఱి
కరముల గాజులు - మురిప మొప్పె
తీవైన పట్టుధ-ట్టీరింగు లెడఁ బాసి
కటితటంబునఁ జీర-కట్టుదనరె
తే. మీసములు విచ్చి మూతికి - మెఱపు చూపె
రిత్త ఱొమ్మునఁ జన్నులు - బిత్తరించెఁ
గపటగోపాలు బాణసం-ఘటన నరిది
భద్రకున కాఁడురూపు సం - ప్రాప్తమయ్యె. 111

సీ. కన్ను లార్చుచుఁ గొన్ని-సన్నలు గావించుఁ
దీఁగెనవ్వులు నవ్వి - దిస్సువాఱుఁ
బయ్యెద దిగజార్చి - పాలిండ్లు పచరించు
నఱుతఁ బేరులు చక్క - నలవరించు

గాజులచప్పుళ్ళు ఘలఘల మనఁజేయుఁ
గొనగోళ్ళ నందంద కురులు దిద్దు
నేలపాటల నెల్ల నించుకించుక పాడుఁ
దగవుమాటల జాణతనములాడు

తే. సిగ్గువడు దిట్టతనముల చేగచూపుఁ
బాయుఁ గడుడాయు మఱియును బహువిధములఁ
జేష్ట లొనరించు నాయింతి సేననడుమ
హాస్యరస మొక్క-రూపమై నట్టిభంగి. 112

క. కరతాళగతుల నాడఁగ
మురిపెంబులు చూపు వికట ముగ నవ్వాలయఁగ
బూరి సివములాడు సంగర
ధరఁ బెంపు మ్రొక్కతివిధము దళు కొత్తంగన్. 113

క. సురవరు లచ్చెరువందిరి
పరిహాసము చేసె గోపబాలకతతి త
త్పరిజనులు వెఱఁగుపడి రా
హరి భద్రకు నింతిఁ జేసి యాడింపంగన్. 114

తే. అద్భుతము సిగ్గు దైన్యంబు నసఁగి పెనఁగ
నాఁడుపోడిమి నర్తించు నన్ను మొగము
రాధ గనలేక యాదల వ్రాల్చియుండెఁ
జిత్తమునఁ బ్రేమ సాలయక స్నేహ మొంది. 115

వ. అంతఁ దద్వృత్తాంతం బంతయు నెఱింగి సహస్రగోపాలుం డును బరిజనబంధుసహితుండై రయంబున వచ్చి బహువిధ దీనాలాపంబులఁ బ్రార్థించి దుర్జనుం డని చూడక మాకొ డుకునకు మరలఁ బురుషత్వంబు దయసేసి పుత్రదానం బొసంగవే మహాత్మా ! యని పలికి కరంబులు మోడ్చిన భక్తవత్సలుండు కావున నప్పరమపురుషుండు కరుణార్ద్రి హృదయుండై యతనిని దగ్గఱం బిలిచి మేను నిమిరినఁ దత్కరస్పర్శనంబునఁ జిత్రంబుగా నెప్పటియట్ల పురుషరూ పంబు వహించి లజ్జావనతవదనుండై యున్న బావమఱంది సయ్యాటంబునఁ బ్రదస్తరులాడి యుపలాలించి మన్నించి జనకసహితంబుగాఁ బురంబునకు వీడుకొల్పి యమ్మాధ వుండు రాధమదిఁగలంకఁ దీర్చి సుప్రసన్నంజేసి ముకుంది నియుఁ దానుం దగినజాణతనంబు లాడుచుఁ జని కొంత దవ్వున సేవార్థంబు సుందరవల్లవకుమారుల నిడుకొని బల భద్రునిం దక్కినగోపాలుర మంద కనిచి బృందారణ్యంబు చేరంబోయి యమునాతటంబునఁ దేరు డిగ్గి యున్నయవ సరంబున. 116

క. రాధా మాధవులను జగ
దాధారులఁ జూడ వచ్చి రమరోరగ వి
ద్యాధరముఖ్యులతో గం
గాధరపద్మజులు మౌని గణములుఁ దారున్. 117

క. దేవీసహితుండై యా
గోవిందుం డెనుఱువోయి కోరిక< దగుసం
భావన లొనరింపుచు< ద
ద్భావములకు సంతసంబు దలకొన< జేసెన్. 118

వ. తదనంతరంబ వారును దానును నొక్కమనోహరపులినమం
డలంబున< గూర్చుండి రప్పు డార్యాపల్లభుండు మనోహర
చ్ఛద్మగోపాలమిథునంబు నుచితాన్యోన్యప్రేమానుకూల
తలకు ముచ్చట వడి మెచ్చి కౌతుకంబున నిట్లనియె. 119

తే. క్షీరవారాకరంబున సిరియు నీవు
నలినలోచన! కూడుండు నాఁటికంటె
మదనగోపాలమూర్తి! ప్రేమమున రాధ
తోడఁ గూడున్న నినుఁ జూడ వేడుకయ్యె. 120

వ. అని వైకుంఠంబులోని మాటల నూహించి మీయిద్దఱకు
నితరేతరప్రణయసంగమసౌభాగ్యంబు పరిణయమహో
త్సవం బని పలికి మఱియును. 121

సీ. మదనగోపాలకవిదితరూపములు ము
ప్పదిరెండు త్రైలోక్యపావనములు
మదనగోపాలకపదపూజనాకల్పి
తార్థంబు లఖిలక్రియాకలనలు
మదనగోపాలకమంత్రంబు సకలతం
త్రములలో నిహపరదాయకంబు

మదనగోపాలకమంత్రసంసిద్ధులౌ
జనులు పరిష్కృతసకలహృదయు

తే. లనుచు నిగమాంతములు చెప్పినట్లు చూడ
మదనగోపాలకృష్ణ ! యీ మహితమూర్తి
నిఖిల లోకైకపూజ్యత నీకుభూత
భావిమూర్తులకంటె దృక్పర్వమయ్యె. 122

వ. అని తల్లీలలు ప్రకటించు సమయంబున. 123

క. నారదుఁడువచ్చె వీణా
నారాయణనామపూర్ణనానాశ్రుతియై
యా రాధామాధవుల య
నూహ్యగుణంబులఁ బాడియాడుచు నవ్వనవీథిన్. 124

వ. ఇట్లు చనుదెంచి నందనందనుచేత పూజాభినందితుండై యా నందలహరిం దేలుచుఁ గొంతవడికు వీణవాయించి యలపు దొట్టి తనకుం దానె చాలించి గట్టనఁద్రేన్చి కుట్టూర్పు లూర్చుచు నిట్లనియె. 125

క. నారాయణ ! నీనామసు-
ధారసమాకంఠపూరితంబయ్యెను నా
కోరినయట్లన నీ వీ
ధారణిపై గోపవేషధారివి యగుటన్. 126

వ. అని కొలువుఁ గలయంజూచి. 127

గీ. అయ్యయీఘాలలోచనుం ◊ డలిగి నాఁడు
పురనిశాటులతో నేమి ◊ పోటులాడె
నిఖిలశస్త్రాస్త్ర వైచిత్రి ◊ నేఁడు శౌరి
పోటులాడుటచూచితిఁ ◊ బొందుగాను. 128

వ. తక్కిన నరదేవదానవుల పోట్లాటలును నానాయుగంబులం
జూచిన యవియున్న నెన్నఁడు నేఁడువోలెఁ గన్నుదనియద
నీస్వయంవరమాహాత్మ్యంబు నాకుఁ బెనుపంపువై సం
తుష్టి యొనర్చెననుచు మునులంజూచి పాణిపల్లవంబెత్తి
"రాధామాధవ దంపత్యోరవిచ్ఛిన్నప్రీతి రస్త్వతిభవంతో
బ్రువంతు" అని యాశీర్వదించిన నందఱు నట్ల వలికిరి. త
ద్వాక్యంబుల కలరి మాధవుండు మందస్మితంబు దళుకొత్త
నతని సంభావించె నాసమయంబున. 129

గీ. దివ్యగంగామహానదీ ◊ దేవి దివ్య
భామయై వచ్చి నవహేమ ◊ పంకజముల
నరిఁ బూజించెఁ బుండరీ ◊ కాక్షు రాధ
తోడఁ గూడంగ సురముని ◊ స్తుతులు చెలఁగ. 130

గీ. కనకకలధౌతమణిపుష్ప ◊ కలితలలిత
హర్మ్యమండపచంద్రశా ◊ లాభిరామ
మైన దివ్యాలయము తన్మ ◊ హావనమున
నచ్యుతక్రీడలకు బ్రహ్మ ◊ యటు సృజించె. 131

క. ఏవేళకు నేవస్తువు
లావల్లవుఁ డాత్మఁగోరు నల్లన నాబృం
దావనమునఁ గలిగుండె మ
హావైభవమెసఁగఁ దన్మహత్త్వము కలిమిన్. 132

గీ. హరికిఁ గ్రీడార్థమై పురందరునియాజ్ఞఁ
బారిజాతాది సురలోకపాదపంబు
లనిశకిసలయకుసుమ ఫలాభివృద్ధి
నుండె బృందావనమున నేత్రోత్సవముగ. 133

క. వనకేళి కౌతుకంబున
వనజాక్షున కెప్డు డెద్దివలయునో యనుచున్
వనమున నన్నిఋతువులును
ననువొందెందగినభంగినన్యై యెడలన్. 134

వ. ఇవ్విధంబున వేల్పులందఱు నందనందను నభినందితహృద
యునిం జేసి యుచితగతుల వీడుకొని నిజవాసంబులకుఁ
జనిరి. రాధాసహితుండై మాధవుండు నవ్వనంబుఁ బ్రవే
శించె నంత. 135

క. లవలీతక్కోలైలా
లవంగనవమాలికాది లతికాపుష్ప
స్రవదవిరళమధుపిచ్ఛిల
పవనంబాడంపతులకుఁ బ్రమదం బొసఁగెన్. 136

సీ. అంబరంబునఁ జెరలాడు రాచిలుకలు
పచ్చతోరణముల బంతిగాఁగ
ననుగాలిదూలిమిన్నుల్రాఁకు నవపరా
గంబు మేలిమి మేలికట్లుగాఁగఁ
గాసారమకరందకలితపయోజముల్
కమనీయ పూర్ణకుంభములుగాఁగఁ
బ్రవిమల కనక చంపకతరుకోరక
ప్రతతి నివాళిదీపములుగాఁగఁ
తే. బరభృతంబుల రొద లింపుపాటగాఁగ
శోభనపుఁ బెండ్లిచందాన సొంపుమీఱు
వనము సొత్తెంచి రావధూవరులు వేడ్కఁ
జెలఁగి వనదేవతలు పువ్వుసేసలొలుక. 137

చ. సితకిరణోపలావళి రచించిన మించుటరుంగుమీఁదఁ బు
ష్పితవకుళావనీ రుహముచెంతఁ దమాలలతామతల్లితో
హితమొనరించెవారలకు నెంతయు నక్కడ వెండికొండఁ బ
ర్వతతనయాసమేతుఁడయి రాజిలురాజకిరీటుపోలికన్. 138

క. మరకతమణి సోపానో
త్కరములఁ దగునారికేళకదళీపున్నా
గరసాలంబులఁ గాంచన
సరసిజముల సొంపుచూపె జలజాకరముల్. 139

క. సురమిథున మధురసింజిత
భరముఖరితగుహాల, శిఖరపర్యంతనట
త్సురుచిర బర్హిణముల, మణి
కిరణాంబులఁ బ్రియమొనర్చెఁ గ్రీడానగముల్. 140

సీ. సురపొన్నపువ్వులఁ బారిఁబారిఁ దొరిఁగెడు
మధువులఁ గ్రోలెడు మధుకరములు
కలికి లేమావిమోకలఁ జిగిర్చిన చిగు
రాకులు గబళించు కోకిలములు
కదళికాతరువుల [1]ముదిరిచిల్లెడు ఫల
రాసులు చవిచూచు రాచిలుకలు
కొలఁకులమేలైన నలినమృణాలంబు
లప్పళించెడు మల్లికాక్షములును

తే. దయితలకుఁ గొంత యందిచ్చి తాముగొనుచు
ఱెక్కలార్పులు మదిఁ దత్తఱింత లెసఁగఁ
బ్రేమఁ గవఁగూడి పెనఁగుచు బిత్తరించు
సొంపులింపులఁ దేల్చె నాదంపతులకు. 141

ఉ. పొన్నలపుప్పొడిన్ మొగలిపువ్వులపుప్పొడిసన్నగాడ్పులన్
మిన్నులుప్రాఁక భానురజనీకరదీప్తులటంచు జక్కవల్
గ్రొన్ననవిల్తుసేతలకుఁ గూడువిధంబును నింగిముట్టు న
వ్వెన్నెల పుల్గులాటలును వేడుకఁదేల్చెఁ దదంతరంగముల్.

1. మదరించిచిలు.

క. ఫలనిబిడంబై కుతుకము
నెలవుకొనం జేసె నొక్కొ నేరేడుం బొదయా
నలినాక్షీ నలినాక్షుల
కలసాలగ్రామశైలశకలము లీలన్. 143

వ. మఱియు నవ్వనవాటియందు హాటకమణిఘటితయంత్రప్రణాళీజాలకీలితప్రవాళలతాంబువాహినీసుఖంబుల బహుముఖంబుల వికచకమలకహ్లారనికరమకరందపరాగపరిమళమిళితంబులగు కాళిందీనదీప్రవాహపయఃపూరంబులు మృగమదశాదంబునం దీర్చిన కాలువల వెంటవచ్చి విప్పుగల కప్పురపుంగుదుళ్ళునిండి మూలకందంబులం బొందిన రవలమేలిమిగొని యేచి చూతపున్నాగసరళవకుళకేసర, జంబూజంబీరకదంబముఖ్యతరుకదంబంబుల కొమ్మలందగిలి కలయం బ్రబ్బుకొని వీథీవిటంకంబుల సౌధచంద్రశాలామంటపకుటీరతోరణాకారంబుల వివిధవిచిత్రకిసలయకుసుమ ఫలనివహంబులు సముచితసన్నికృష్టంబులై నవరత్నకీలితంబులగు సోపానవలభి గవాక్షకనకకుంభంబుల విడంబంబుచూప, వలరాచవాని సిరినగరనుసొంపున నొప్పు లీలాలవలీ నాగవల్లీ మల్లికామాధవీయూథికామ్రాలతీజాతిలలితలతానికుంజపుంజంబులతో శశికాంతమణివేదికలమీఁద మధూలికణగణాకీర్ణంబులును, పరాగధూసరితంబులును నవకుంకుమోపధానపద్మదళాస్తరణశోభితంబులు నగుకనకడోలాతల్పంబులును నీరె

క్కని యున్నతస్థలంబుల లతాపాదపంబులకుఁ గనకకలశం బుల నీరువోయు క్రీడావిబుధవధూజనంబులకుఁ జెంగల్వ బావుల క్రేవలంగనుపట్టుపరిణతలతాభరణంబులగు మాదీ ఫలము దీఁగెలచిగురుంబోణుల మోవులందెగడు కెంజిగురు జిగినిగనిగలు తీఁగెలువాఱి తిర్యక్కృతంబులై పయింబర్వి నవలరాచజోదుసైచిన పగడంపుఁగొత్తడంబులఁ గీలుకొని క్రొన్నెత్తురులఁ దోఁగియున్న విరహిజనసముదయంబుల రూపనుశంకఁగొల్పు నిర్మలస్ఫటిక హర్మ్యకుడ్యప్రదేశంబుల నింగిలీకపురసంబు నింపులవెలుంగారు కనకకలధౌతకరిదంత రత్నపాంచాలికాసహస్రంబులను బాంధపరిపంథిసంతానం బులపై దండువెడలు కుసుమకోదండు యాత్రాసమయం బునకు నాయితంబుసేసి తెచ్చి నిలిపిన కరిఘటలసౌవర్ణ ఘంటికాకారంబున విలంబమానఫలంబులును విశదదంతం బులభాతిఁ గోరకంబులు నొప్పనొప్పు కేతకీతరుషండంబుల దండల వటవిటపిచ్ఛాయలఁ బచ్చికబయిళ్ళఁ బ్రాణవల్లభు లు తగుతెఱంగుల శృంగంబుల నివురఁదనుకండూయన ముకుళితలోచనంబులతో గగురుపొడిచి సుఖపారవశ్యంబు నుంజెంది యుంచుకించుక తృణఖండంబుల నమలుచుఁ గ్రీడ సల్పు హరిణీగణంబులంజూచి యనురాగంబు నొందుచు నుభయపార్శ్వంబులఁ జమరీమృగంబులు వివిధసముద్ధూత శిఖికలాపజాలంబులు నవరత్నవిరచితాతపత్రంబులై వెలుం

గనుత్కంఠమరాళసారస చక్రక్రేంకారంబులు వేత్రపాణుల యుపచార వాగ్రచనలుగా సంప్రీతిఁ బ్రీతిమాధవుల యింటికి వింసువచ్చు రతిమకరధ్వజు లనుమాడ్కిఁ గర పల్లవంబులఁ జూతపల్లవమంజరులు రంజిల్ల వివిధ సురభి కుసుమసుగంధంబు లాఘ్రాణింపుచు రసాలఫలసామగ్రికి మెచ్చుచు శ్రేణిశృంగార భంగులగ్గింపుచు ముక్తాఫలరంగ వల్లికాకారవికీర్ణ మల్లికాకుసుమజాలక విరాజమాన మోహనస్థలంబుల నిలిచి నెరసి దట్టమైన పుప్పొడి నెలవులు మెత్తమెత్తన మట్టి కోమలపదపద్మరేఖా లక్ష్మలక్ష్మీ పరభాగంబులు గావింపుచు రవిరశ్మి సోరక జీబుకొనియున్న సేమంతిపొదలఁ బువ్వుదేనెలుబ్బి సోనలుగురిసి పర్ణాగ్రం బుల పయింబడి తుప్పునఁ దూలి తుంపరచింది మసకతిత్తు లం బట్టినయట్లు బిరుసుమంచు నెరసినచందంబున మంద పవమానంబున నివతాళించు నీడలైన బొట్లమేనులు గగు రుపాటెన కుంకుమరజంబు లద్దుకొనుచు మధూళిశీకర షం సిక్తమార్గ పంకిలంబులగు మణికుట్టిమ మార్గంబులఁ గాలు జాఱిన లీలాసంభ్రమంబున నవ్వుచు నొండొరులంబట్టుకొని యంగాంగ సంస్పర్శసుఖకేళిం దేలుచు మెఱుంగుఁ గెంపు టాలతాపలవెంటఁ గనకవేదిక లెక్కునెడల పువ్వుఁదేనె మీఁదఁగొనుచు నతిశయస్వచ్ఛస్ఫటిక మాణిక్యస్థలంబులు పన్నీటి పటిమ లనువిభ్రాంతిఁ జరణపల్లవ సంసక్తపరాగ

పంకంబుగడుగడగ్గటి తేటచూచి కాకుంచుటకు సిగ్గునడి మందస్మితంబులు నిగుడఁదొలఁగిపోవుచుఁ జని చని కేళీభవనంబుదండఁ గదంబతరుషండ మధ్యంబున విహారణశోణమణి మంటపంబు తత్కుసుమరంజితంబై వియోగజనాధిక కంఠర క్తసి క్తంబగు మదనభూతబలిపీఠంబు నమువునఁ దేజరిల్లిన గుండెఝల్లనఁ దదావేశంబునం బొంది యెట్టకేల కించు కించుక దేఱిన మనంబుతోడఁ దదంతికంబున. 144

సీ. పచ్చల తలుపులు ♦ పవడంపు ద్వారబం
ధంబులు ముత్యాల ♦ తావళములు
వజ్రాలకంబముల్ ♦ వైడూర్యకుడ్యముల్
జాలమార్గముల నీ ♦ లాలగములు
పటికపుం జవికెలు ♦ పద్మరాగపువేది
కలు పుష్యరాగంబు ♦ గద్దెపీఁట
లుజ్జ్వలగోమేధి ♦ కోన్నతడోలికా
స్తంభముల్ శశికాంత ♦ దర్పణములు.
తే. పసిఁడి జలపోసనంబుల ♦ పావజోళ్ళు
పువ్వుఁబాన్పులు పచ్చకప్పురపుసురటు
లింద్రనీలంపుఁ జంమవా ♦ లెనసియొప్పు
స్వర్ణహర్మ్యంబు సొచ్చి రాసతియుఁ బతియు. 145

వ. ఇట్లు ప్రవేశించి యయ్యిద్దఱుం బసిఁడికెందమ్మి తూఁగుటుయ్యాల రతిరాజరాజ్య సింహాసనంబునం బోలె సుఖాసీనులై రప్పుడు. 146

సీ. మంజరీ కుచకుంభ ƒ మండలి పుష్పాడి
పయ్యెద దిగజాఱ ƒ బయలుపడఁగ
మధుకరప్రేమార్ద్ర ƒ మధురదృక్తతి మొగ్గ
సిగ్గుమఱుంగునఁ ƒ జీరువాఱ
సైకతోన్నతకటి ƒ చక్రదేశంబునఁ
గలహంసమేఖలా ƒ క్వణనమెసఁగఁ
జిగురాకుమోవిపై ƒ నిగిడికుందద్యుతి
స్మితరుచి చంద్రికల్ ƒ చెంగలింప

తే. నన్యభృతసుత మధురవా ƒ క్యములతోడ
వాసనల మేనిలోపలి ƒ వలపుఁ జిలికి
వల్లభయుఁబోలె వనలక్ష్మి ƒ వనజనేత్రు
హృదయ పద్మంబునకుఁ జాల ƒ నింపొనర్చె. 147

వ. అప్పుడు. 148

ఆ. వె. చిత్తవృత్తిమెఱిఁగి ƒ చెలఁగి సంభ్రమలీల
నీరజాతపత్రి ƒ నేత్రుచేతి
శంఖచక్రపుష్ప ƒ చాపశరము లందు
కొని తొలంగి చనిరి ƒ గోపసుతులు.

ఉ. సంతసమారఁ బ్రాణవిభు ƒ సంగతిడగ్గఱి యేకశయ్యనా
యింతివసించె నెమ్మొగ మొ ƒ కించుకయడ్డముసేసిసిగ్గుతోఁ
గంతుఁడు మానసంబు చెలి ƒ కానిగతిన్ గిలిగింతవెట్టఁగా
నెంతయుఁగుబ్బచన్నులప ƒ యింబులకాంకురరాజినిల్పుచున్.

సీ. జలరుహాగంధి నిర్మలగాత్రి తరళాక్షి
సురుచిరావయవ భాసురనఖాగ్ర
సుప్రసన్నానన శుద్ధాత్మ సురభిళ
మాల్యానుకలిత ప్రేమార్ద్రహృదయ
భార[1] వేణిక కళాచాటుభాషిణిమాన
వతికృత్యోత్సవలీల ధృతిసమేత
బాలికలావణ్య హేలావిలాసిని
ఘనకుచయుగళ యౌవనమనోజ్ఞ
తే. యాదిగర్భేశ్వరి రత్న మాలతాంగి
కల్పవల్లియుఁబోలె సంకల్పఫల స
హస్రము నొసఁగకున్నె శయ్యాతలమునఁ
బ్రాణవిభునకుఁ గన్నుల పండువగుచు. 150

గీ. అధిపుచెంగట నపుడు బింబాధరంబు
తొడలు నించుక యదర మైఁబొడమెఁ జెమట
పోఁకముడి కొంత బిగిజాఱెఁ బువ్వుఁబోఁడి
తలఁపు కందర్పవిభ్రమాకులముగాఁగ. 151

క. లీలముకుందిని దగన
వ్వేళం గర్పూరగంధవిస్మరపుగు-తాం
బూలమొసఁగె డగ్గఱి గో
పాలికి గోపాలకునకుఁ బ్రమదంబెసఁగన్. 152

1. ప్రకటభార వేణి...మూ.

మ. చెలిచుట్టిచ్చిన వీడ్యమందఁ కొని యాకెశీతాంశు బింబాస్యసి
గ్గులమార్గ్గమున లేఁతనవ్వొలయఁ జెక్కు ఘోణవీథుల్ కెలం
కులఁ ద్రాక్షాంగరవల్లి లేఁబులక లంకూరింప నవ్వారిగా
నలసప్రక్రియనిచ్చె నెయ్యమలరం బ్రాణేశు కెంగేలికిన్. 153

క. చెలియొత్తి చెప్పనగుచున్
జలజానన గఱచి యాకు సగమిచ్చిన నా
చెలువుండలరుచు వాతెఱఁ
జులకనఁగొనుచుం బ్రియోక్తిఁ జుంబనమడిగెన్. 154

క. వెలుపల సిగ్గరియును లో
పలదిట్టయునయ్యె నేని బాలికవలెన్
గలికియగు నీవిధంబులు
గలవారాధికకు వలపు గాదే పతికిన్. 155

సీ. ఆకందఁ గొనియెడి నసువున బుజముపైఁ
జెయి వేసికొనఁ గోళ్ళఁ జెక్కు పుణుకుఁ
దాంబూలలహరిచేత జనించు చెమటార్చు
వెరవునఁ బయ్యెదచెఱఁగుదిగుచు
మొలకట్టుమాణిక్యములు చక్కఁద్రోయుచు
జఘనమల్లల్లన సంస్పృశించుఁ
దలగడపైనొత్తి వెలికాలుసాచియం
గుళులు లోఁ దొడలసందులనిడుచ్చుఁ

తే. జిన్నినగుమోము తనదిక్కు సేయఁగోరి
వీడియును వీడ నరగొప్పు వీచ్చనగుచు
భావరసగర్భచేష్టలఁ బ్రథమరతిని
రాధమదిమేలు కొలుపుచు మాధవుండు. 156

క. హాటకవిచిత్రముక్తా
స్ఫోటతుషారాంబు ఘుసృణసుస్నిగ్ధరజః
పాటీరకర్దమము స
య్యాటంబున నలఁదె కోమలాంగి కుచములన్. 157

గీ. శీతకరకాంతి శశికాంతశిలయుఁబోలె
నలినలోచన కరలీల నవిఁగరంగి
[1]యవయవంబులు పొంగెఁ దా మవసియవలఁ
గళలు నెలవుగఁ బయిపైని పులకలెసఁగ. 158

క. నలినీదళతరళంబగు
జలబిందువు వోలెనపుడు సతియంగమునన్
గళదాలఁకాడఁ దొడంగెం
గలికి తలఁపుమరునిచేతఁ గళవళమొందన్. 159

గీ. తన్మనోభావములఁ దహాతహాలుఁజూచి
జాలవల్లిక తాంబూలచయమునించి
శౌరిఁగనుఁగీటి సన్నకు సన్నజాజి
పువ్వుఁ దెరవేసిపోయె నబ్బోటికత్తె. 160

1. యవయవంబులయందె బాపినసియవల కళ. మూ.

చ. చెలియటువాసిపోవుటయుఁ[1] జెల్వభయంపడకించు కేనియుం
దలఁపునఁ గాకులేక దయితప్రియలాలనమాత్ర నప్పుడే
వలపులకేళిఁ దన్మయత ప్రాలిసుఖాబ్ధి తరంగమగ్నయై
దలఁపదు దేహమైననదిదర్పకవిభ్రమమేమిచెప్పఁదుం. 161

ఉ. చిత్తజుకేళికిం మొనయఁ జేయుచు సిగ్గులయుగ్గువిప్పియ
మ్మత్తచకోరనేత్రనవమన్మథమూర్తి సరోజలోచనుం
డత్తఱి[2]వేడ్కఁ గౌఁగిటికినల్లనఁజేర్చి బిగించెఁ బ్రేమఁ బూ
గుత్తులమించు నాబిగువుగుబ్బ లురస్థలిగాఁడి పాఱఁగన్.

క. అంగనయు హరియు గాఢా
లింగనబంధముల నెఱఁగ లేరైరి యెడ
భృంగభవమధుమదాలస
తంగూడొక కొంతతడవు తాదాత్మ్యమునన్. 162

గీ. కొదమ సంపెంగపూదండ గుణముగలిగి
[3]గాసె నెడలెక్కపెట్టని కంతునల్ల
చెఱకువిలుఁబోలెఁ గృష్ణుఁడా చిగురుఁబోఁడి
తోడఁగలికాముకక్రీడఁ గూడియొప్పె. 163

చ. వనజదళాక్షియుం హరియు వాతెఱ తేనియలానమోముమో
మునఁ గదియించుటొప్పెఁ బ్రియముల్ దళుకొత్తఁగఁ జంద్ర
బింబమున్

---

1. జెల్వదయింపదయించు. మూ. 2. రికేళు. 3. గవిశెనదరెక్కపెట్టని.

వనజముమైత్రిఁ గూడుకొని । వైరము లేక సుధాంశుధూళులిం
పొనరఁగనీడుజోడెసఁగు । చున్న వియో[1]తములోనఁ దామనన్.

సీ. పంబినవిరహతాపమున । శోషిలినవా
  తెఱలఁ జుంబనలీలఁ । దేనెలుబ్బెఁ
గడువియోగార్చులఁ । గ్రాఁగినతనువులు
  శ్రమజలంబులఁ దోఁగి । చల్లనయ్యెఁ
జిరవిప్రయోగార్తిఁ । జిక్కిన యంగముల్
  పరిరంభసంపద । నురవుకొనియె
నాయల్లకవ్యథ । నలఁగిన చిత్తంబు
  లితరేతరాసక్తి । నెలమిఁబొందెఁ

ఆ. ప్రేమవాదల సిగ్గు । బిగిజాఱెఁ దహతహ
లెసఁగె శంకలుడిగె । నేపుమీఱెఁ
దమకమెక్క నొలసెఁ । దర్జనగర్జాతి
తరళవచనఘోష । తాడనములు. 165

క. కలమధుర మణితములఁ జం
చలకరకంకణ రవములఁ । జరణతులాకో
టిలలితశింజితములఁ బూ
విలుకాఁడచ్చోట నాట్యవిధమొనరించెన్. 166

1. తకోతములోన. మూ.

**సీ.** వలయు బంధములకు । మెలపుటకై సన్న
గావించుఁగుంతలగ్రహణకేళి
మూర్ఛాలసతఁగన్ను । మోడ్చుచో వాతెఱఁ
బలునోవనాటించి । తెలివిగొలుపు
నానందసాంద్రత । నంగముల్ వదలుచోఁ
గెరలించియొత్తిరాఁ । గేలబిగుచుఁ
గళజాఱు గిలిగింతఁ । జలియించు మేఁదీఁగె
బిగియఁ గౌఁగిటఁజేర్చి । సొగయఁజేయు

**తే.** గురుకుచంబులఁ బాడము కర్పూరపుఁజెమట
లద్దుకొను నవయువముల । ననఁగిపెనఁగి
[1]మాధవుండు మదనతత్త్వ । సాధకుండు
నాత్మనాత్మేశ్వరికిఁ గోర్కె । యభినవముగ. **167**

**క.** కేళీగృహకుడ్యంబులఁ
గీలించిన బంధగతులఁ । గీల్బొమ్మలుగా
నీలీలనుండి యల్లనఁ
గేళిసలిపి రింపుసొంపు । గిఱికొనుచుండన్. **168**

**క.** తరుణీకృత హరివిక్రమ
కరణోదంచిత చలాంఘ్రికమలము మణినూ
పురకల ఝులంఝుల ధ్వని
మరుమువ్వల కోలవోలె । మనములరించెన్. **169**

---

1. మాధవుఁడు మదనతత్వకళ...రాధ...తుమ్మఁడా. మూ.

ఆ. చతురశీతిబంధచతురత్వములు చూపి
చెలువుఁ డలయు టెఱిఁగి చెంగలించి
గురునితంబబింబకుచభారభరలీల
లోచనోత్సవముగ లేచియేచి. 170

సీ. ఒక కేలఁ బ్రాణేశు చికురముల్ గబళించి
కేలొక్కటురమున లీలనూఁది
యడుగుఁ గెందమ్ములు తొడలపై నొకకొంత
సమకొల్పి యర్ధంబు శయ్యమోపి
కించిదుదంచితాకుంచితగతులచే
మొలనూలి చిఱుఘంటి కలు చెలంగఁ
జిన్ని కొనసియాడఁ జేయుపయోధర
ముల గుబ్బసరములు ముడివడంగఁ

తే. దనుతరస్వేదబిందుసుందరముఁ దరళ
చూర్ణకుంతల పంక్తి భాసురము మంద
హాసగర్భంబునై వదనాబ్జమలర
సరసపురుషాయితక్రీడసలిపె నింతి. 171

క. కమలాక్షి యుపరికేళీ
సమయంబున నుల్లసిల్లె సరసక్రీడన్
గమలజముకుళాగ్రంబునఁ
గొమరారెడు పసిఁడి యంచకొదమయుఁ బోలెన్. 182

మ. ప్రచలత్కాంచికలాపదీప్తకటి చక్రశ్రీలు సంశోచ్ఛల
త్కచభారోద్గళితప్రసూనములు రంగత్కుంతలప్రోల్లస
ద్రుచిరేఖావలనంబు దృగ్గలితచేతోజాతసమ్మూర్ఛనా
రచనాభంగియు శౌరి కింపొసఁగె నారాజాస్యక్రీడింపఁగన్

క. హరి కరజక్షతి యాసర
సిరుహాననమెఱుఁగుఁ జిన్నిచెక్కునఁ బొల్చెన్
సురుచిరదర్పణ బింబాం
తర బింబిత బాలచంద్రుకైవడిఁ జివ్వలెన్. 174

క. పొలఁతి చనుగ్రేవఁదొడికిన
[1]పలుఁగాటుల చాఱనడఁచుఁ బైపై హరియూ
హాలు గాకా జిగిబిగులం
బలుఁ జారనె చూపు జీరువాఱు నటించున్. 175

సీ. చామవసివాళ్ల మేనును జాఱుతుఱుము
సోలమును జొక్కుదేరెడు చూపునలస
గతులు రతితుది నెమ్మదిఁ గరఁప మగుడ
మగుడఁ దమిఁ బెంచి క్రీడించుమాధవుండు. 176

క. ఆలీలామిథునము కే
లీలంపటజాతఘర్మలేశశ్రమముల్
దూలించ దన యాకపటికి?
నేలాసుమనోజలంబు హేలాగతులన్. 177

1. బలువాటకజారనొడుచుఁ బైపై హరియూ । హాగా.........
నటన్నన్. మూ.

క. ఎప్పుడు రవి యుదయించునో
యెప్పుడు గ్రుంకునో యెఱుంగ కీక్రియఁ గాంక్షల్
ముప్పిరిగొనఁ గ్రీడించిరి
యప్పంకజముఖియుఁ బంకజాక్షుఁడు మఱియున్. 176

చ. మదిఁగదురుల్లసిల్లిమధుమాసమహోత్సవముంగడించుచున్
మదనధనుర్లతాగుణనినాదము వీనుల కింపు చేయ న
మ్మదవతియున్ ముకుందుఁడునమందకుతూహలరేఖఁ జంద్రికా
సదమలచంద్రశాలికలఁ జల్పిరనేక[1]వినోదనక్రియల్. 179

సీ. భ్రమరదంపతుల విభ్రమముల సొంపారు
మల్లికానవపుష్పమండపములఁ
గలకంఠకాకలీకలకలంబుల మించు
మేలైన గుజ్జుమామిళ్ళనీడఁ
గలికిజక్కవ[2]పులుంగుల కేళికలమీఱు
జలజాకరోదారసైకతముల
బర్హిణమిథునశుంభన్నాట్యముల నొప్పు
సురుచిరమణికేళిగిరులచఱులఁ

తే. గుసుమఫలవీచికారత్నవిసరవిభవ
లీల కలరుచు మదనగోపాలవిభుఁడు
భృంగకోకిల కోకబర్హిణవికస్వ
రస్వరంబులఁ గ్రీడించి రమణిఁదేల్చె. 180

1 విధానసంక్రియల్...మూ. 2.లపు గులముల...మూ.

సీ. మేలి పువ్వులు గోసి । మొలఁతకు నొకచోటఁ
గుంతలంబులుదీర్చి । కొప్పుముడుచు
నవపరాగమునూర్చి । నలినాక్షికొకచోట
మెఱుఁగారు పాలిండ్ల । మీఁద నలఁదుఁ
బాగడపువ్వులదండఁ । దగఁ గ్రుచ్చి యొకచోట
లలితాంగిజఘనమం । డలిసమర్చు
మకరందములుగ్రోలి । యొకచోట నలినీల
కుంతలవాతెఱఁ । గ్రుమ్మరించు

తే. నొక్కయెడఁ దీఁగె యుయ్యాల । నూరుయుగళి
బాల నిడుకొని ప్రియమైన । లీల నూఁచు
నొక్కయెడ మృగమదమున । నువిదగండ
పాళికల వ్రాయుఁ గొనగోళ్ళఁ । బత్త్రిలతలు. 181

సీ. శృంగారవతిలీల । శిఖిపింఛమౌఁ దలఁ
జుట్టి కౌస్తుభము వ । క్షోజసీమ
నమరించి పీతాంబ । రము నితంబంబునఁ
గై సేసి శౌరిశృం । గార రేఖఁ
దాఁ దాల్చి కీల్కొప్పు । ధవునకుముడిచి పూ
గుత్తులురమ్మునఁ । గుచయుగముఁగ
సమకొల్పి గుబ్బస । రములఁ దొడిగి తన
వలువ పయ్యెదదీర్చి । యలరఁగట్టి

తే. తనదు శృంగారమొసఁగి మోదమున నగుచుఁ
ప్రియుఁడ నే నీవు నాప్రియఁ బ్రియవటంచుఁ
దక్కు గిలిగించు మ్రొక్కుఁ గందర్పకేళిఁ
బురుషరతి నైపుణముచూపి పరిణమించు. 182

సీ. కుంజగర్భంబులఁ గూడాడునప్పుడు
సారంగమిథునంబు సరణిచూపి
క్రీడాచలంబులఁ గ్రీడించునప్పుడు
విద్యుదంబుదముల విధముచూపి
వీథీతలంబున విహరించునప్పుడు
మల్లికాతరువుల మహిమచూపి
సైకతస్థలములఁ జరియించునప్పుడు
కలికి జక్కవదోయి చెలువుచూపి

తే. స్నేహభంగులు గమనీయ దేహరుచులు
పెనఁకువలజోడు వాయక యెనసియుండు
చందములు నందములుగఁ బూర్ణేందుముఖియు
నందసూనుండు నొప్పి రానందలీల. 183

ఉ. లాలితపాదనూపురఝుళంఝుళరావము లుల్లసిల్ల లీ
లాలసబంగిఁ గ్రుమ్మరు మురాంతకు సంగడి నాసహస్రగో
పాలతనూజక్రేంకృతులఁ బంచశరుండను వేఁటకానితోఁ
బోలఁగ వేఁటమైఁదిరుగుపోషితరాజమరాళిమో యనన్.

చ. చెలువ వినూత్నపాదసరసీరుహకుంకుమపంక రేఖలన్
జెలువయి కేళిహేమగిరిశృంగతలంబులు చుంబనక్రియన్
జలజదళాక్షు వీడెపురసంబున ముద్రలు చెందియొప్పు నా
లలన పయోధరంబుల విలాసముచూపె వియచ్చరాళికిన్.

చ. పొలఁతియు శౌరి గల్పతరుపుష్పవిభూషణభూషితాంగులై
మలయుచుఁ బ్రీతిమాధవులమాడ్కి వనావళిఁ గేలి మైరహః
కలనల సంచరించెను వికాసము మన్మథ విభ్రమైక[1] చ
ర్యలుగని చొక్కి రాత్మహృదయంబుల ఖేచరకామినీమణుల్.

వ. ఇట్లు బహువిధంబుల నభిరామమూర్తులు నాత్మారాములు నగు నా రాధామాధవు లభిమతరతిరహఃకేళీవిలాసంబుల నుల్లసిల్లుచు డెందంబు లానందమయంబులై నిగుడ మగుడని కాంక్షలఁ ద్రిలోకగణ్యం బగు బృందారణ్యంబున మనోహరులై యేకాంతస్థలంబుల ననర్గళోత్సాహవిభవంబున విహరించి యమునాప్రవాహంబున జలక్రీడలు సల్పువారై యొయ్యన నొయ్యారంబు నడకల గిల్కు పసిండిగొడుగుల పావలు ఘుళ్ళుఘుళ్ళు మన నన్యోన్యదత్తహస్తపంకజులై యక్కడక్కడఁ దరుశాఖాశీతలచ్ఛాయల నిలిచి మలయమారుతంబు చేతఁ బరిభ్రమశ్రమంబపనయింపుచు ముకుందినియుఁ గింకరవల్లవకుమారులు సేవింప నమ్మహానది సేరంబోయి. 187

1. చేష్టలుగని చొక్కి రాత్మ జలజంబుల. మూ.

సీ. తమ్మితేనెలు గ్రోలి దట్టమై దివి నాడు
కోదమతుమ్మెద పిండు కొప్పుగాఁగ
జలచరోల్లంఘనంబుల మించు తళుకులు
ప్రణయకటాక్ష సంపదలుగాఁగఁ
గల్లోల వల్లిపైఁ గనుపట్టుకోక దం
పతులు వక్షోజకుంభములు గాఁగ
వాయువిధూత నవ్యపరాగపటలంబు
కట్టిన చిత్రాంశుకంబు గాఁగ

తే. యమున సాక్షాత్కరించి తమ్ములకి పిలుచు
సాంత్వనము లట్లు హంస నిస్స్వనము లొలయ
రాధికయు మాధవుండుఁ దీరమున నిలిచి
ప్రస్తుతించిరి దాని సౌభాగ్యమహిమ. 188

వ. అప్పుడు. 189

క. గోపీసహస్రములతో
గోపాలవిభుండు రాధఁగూడి పయఃక్రీ
డాపాటవములు చూపెడు
నేపున వ్రేపల్లెలోని కెఱుకవడంగన్. 190

వ. సంజ్ఞానిస్వనం బొనర్చు వాఁడై తత్తీరంబున నొక్క పారి
జాతము క్రీనీడనొప్పు చంద్రకాంతమణివేదికామధ్యంబున.

సీ. పసిఁడిపావలమీఁద నొసపరి మువ్వంక
బాగున దివ్యరూపంబు దనర
డాపలికర్ణకుండల మొకించుక వ్రాలి
యంసదేశంబున నత్తమిల్లఁ
దిర్యక్కృతంబులై తీఁగవెన్నెలమించు
తళుకుఁజూపులు కెలంకుల నటింప
లాలితోదంచితభ్రూలతాయుగళి నే
ర్పడినవళిత్రయీఫాలమలర

తే. రాధికాభుజనిహితదోర్దండుఁడై స
మంచితాంగుళి పల్లవన్యాసములను
రంధ్రముఖముల సప్తస్వరములుగూర్చి
మురళి వాయించె నాజగన్మోహనుండు. 192

చ. హరిమురళీనినాదమున నంబరవీథి విమానపఙ్క్తులం
దిరిగెడు దివ్యకాంతలుమదింబ్రసవాస్త్ర వికారమొందియం
బరముల కట్టుజాఱఁగ చభారభరంబులు వీడిపుష్పముల్
దొరఁగఁగనిల్చిచూచిరివిలోలకటాక్షములం బ్రసక్తతన్.

చ. అమృతరసోపమానజలజాక్షమనోహరవేణుగాననా
దమునఁబ్రమత్తబర్హిణకదంబము నాట్యము సల్పెఁదన్మనో
రమవనవీథిఁ బింఛనికరంబు లుదంచితలీలఁ గ్రాలఁగా
సుమధుర[1]షడ్జమఃస్వరముఁజూపు మఁదన్న యనాభిరామమై.

1. షడ్జమస్వర. మూ.

చ. కలమురళీసముల్లసితగానకళన్ వికసించి కల్పకం
బులుహరిఁ బుష్పమంజరులఁబూజలుచేసెన్మృగీమృగావళుల్
సులలితధీరనేత్రముల సొంపులఁ దేల్చెఁ గరంగి నిర్ఝరం
బులగతిఁబాఱెఁదన్నికటభూమి మహీధరరత్నజాలముల్.

క. చిత్తములు వోదల గోపా
లోత్తము వేణుస్వరముల నుప్పొంగి రయ
శ్రోత్రలితకర్ణములతో
న త్తటి సురధేనుబృంద మరుదెంచెఁదగన్. 196

ఉ. ఆనలినాయతాక్షుమధురాధరవేణురవామృతంబుతో
వీనులు నిండి వేడుకలు వెల్లిగొనన్ స్మరమోహపాశసం
తాననిబద్ధబుద్ధిఁ బ్రమదంబున ఘోషము వాసి వల్లవ
స్త్రీనికరంబువచ్చె వనసీమ కనేకసహస్ర సంఖ్యమై. 197

వ. ఇవ్విధంబున లావణ్యయౌవన మదవిలాసితలును సంపూర్ణ
పూర్ణిమాచంద్రబింబవిడంబిముఖపంకజలును ఘనజఘనభా
రచారుసంచారిణులును నురుపయోధరభరాందోళాయమా
న తనుమధ్యలతికలును మత్తమయూర బర్హిసుషమాకూ
లంకషచికురబంధలును విలోలాక్షులు నగు రాజకుమారిక
లును మదనగోపాలలీలావాగురికలన దగిలి యుల్లంబులు పల్ల
వాయుధవికారసమాకులంబులై నిగుడ గములుగములై బృం
దావనవీథులవనదేవతలకు మెఱుంగుఁ జూపులను నీరాజనం
బులు సేయుచుఁజరణతులాకోటిమణినిక్వణమధుపూరంబుల

శ్రవణపుటకటాహంబులు పూరించుచు మోహినీదేవతలమా
డ్కిఁ గన్నులపండువై కుసుమకోదండుండు విడంబించిచ
క్రి పై నొక్కతెగఁ దొడిగియేసినవచ్చు నమోఘసమ్మోహన
బాణసహస్రంబు లనుబాగున నరుగుదెంచి గోపాలమన్మథు
నిఁ బరివేష్టించి రప్పుడు జగన్మోహనుం డందఱహృదయం
బులయందు ముందరియట్లయొక్క చందంబునఁ బ్రణయాకా
రక స్నేహంబులు తొంగలింపంజేసి వారును దానును న
య్యేటిలోనికి డిగ్గి యొక్కపులినదేశంబున. 198

గీ. హారకేయూర మకుటమంజీరముఖ్య
భర్మమణిభూషణంబులు పైపసిండి
దుప్పటియు నూడ్చి ధమ్మిల్ల మొప్పముడిచి
పద్మలోచనుఁ డాయత్తపడియె నపుడు. 199

ఆ. రాధతోడ గోపరమణులు జలకేళి
సమయభూషణముల నమరి వచ్చి
[1]యొడలికంటు వలిపయొల్లిపయ్యెదలలోఁ
జన్నుఁగవలరుచులు చౌకళింప. 200

క. వేడుక నంజనగిరి గో
రాడి చతుర్దంతి సిరికై కరిణులతోఁ
గూడి సురతటిని జేరిన
జాడఁ జతుర్భుజుఁడు నదికిఁ జనె సకియలతోఁ. 201

1. వొంటి. మూ.

గీ. పసిఁడి ముద్రల కొమ్ములు పద్మనాళ
యంత్రనాళంబులును గూర్చి యతిముదమున
సారగోరోచనాగంధసారఘుసృణ
హేమమయపాత్రికలఁ దోడ నిందుముఖులు. 202

క. కొందఱు రాధికవల నొక
కొందఱు మాధవుని వంకఁ గూడిరి వారున్
జింది వసంతము లాడిరి
చందనగంధులు సుగంధి జలపూరములన్. 203

గీ. తమ్మి పుప్పొడి యొకతటిత్తరళనేత్ర
జలజదళలోచనుని మీఁదఁ జల్లెనగుచు
నెంత గయ్యాళి చూడవే యిది యటంచుఁ
దోడి వ్రీడావతులు చూచి తొంగలింప. 204

క. శౌరి వ్రజస్త్రీకరకా
శ్మీరద్రవగంధసారమేళనరుచిరా
కారుఁ డయి మూఁడు మూర్తుల
సారము దాననుచుఁ దెలుపు సంగతినొప్పెన్. 205

మ. చివురుంజిమ్మనఁగ్రోవిముంచుకొనికాశ్మీరాంబుపూరంబుమా
ధవుపై రాధికడాసి చిమ్మ నలరెన్ దద్ధార కందర్పరా
ణ్ణవమత్తద్విరదేంద్రు శిక్షకొఱకై నాటించు రాకోలకున్
సవతై[1] యప్రచలత్కృణావళుల రుక్చ్యస్ఫూర్తి శోభిల్లఁగన్.

---

1. తైమప్రచలత్కృణావిమనరుచ్య. మూ.

చ. చలమున రాధయుఁ హరియుఁ జందనవారి వసంతమాడ న
వ్వల నొకబోటి కేళ్లుఁటికి వచ్చె హిమాంబువు చల్లిపోవ లీ
లలరఁగనిల్చె దాని వన రాంధ్రము పట్టున నీతిదూటి నె
చ్చెలులు హసింపఁగా నదివసించెవడింబజు తెంచిలోపలన్.

ఉ. తక్కరిలాగునన్ విభుఁడు దాకొని కస్తురి మెత్తు నేర్పుతో
నొక్కటఁజన్నుఁ గ్రేవసఖ మొత్తినఁదక్కకయాలతాంగియున్
జిక్కఁగఁ దమ్ములంబుఁగొను చాతురిఁదన్మధురాధరంబునన్
గ్రక్కఁబల్లుమోపెఁజెలి కత్తెబళీయని తన్ను మెచ్చఁగాన్.

గీ. చారుకుంకుమ ధూళీధూసరితగాత్ర
వల్లులై యుల్లసిల్లిరి గొల్లసతులు
కమలరజమునఁ దోఁగి స్సైకతతలమున
నెలమిఁ గ్రీడించు పసిఁడియంచల విధమున. 209

గీ. ఓలగందంపుఁ బసుపులనూని వెలుఁగు
గోపికల దేహదీప్తులు గొనలుసాగెఁ
జారు ధమ్మిల్ల పుష్పవాసనలఁ బొలయు
మిండ తుమ్మెద మొయిలుకు మెఱుపులగుచు. 210

క. సింధురవరమని పైఁ బు
ష్పంధయ కుంతలలు చల్లు ప్రాలేయపయో
గంధభరంబులఁ బవనము
గంధవహత్వంబు సార్థకంబుగఁ బడసెన్. 211

సీ. ఘనసారకర్దమంబునఁ దోఁగు నవ్వేళ
నిల జరించెడు చంద్రకళ లనంగఁ
గాశ్మీర చూర్ణపంకమునఁ దోఁగినవేళఁ
జిత్తజుక్రోధాగ్నిశిఖలనంగఁ
గమనీయ మృగమదాఘమునఁ దోఁగినవేళ
నీలాంగతనురుచిశ్రీలనంగ
సారగోరోచనావారిఁ దోఁగినవేళ
దీపితహేమపుత్రికలనంగ

తే. సకల సద్గంధ వస్తువాసనలఁ దోఁగి
నపుడు చిత్రాకృతులు నాఁగ నతిమనోహ
రాంగులై రాధికాదిగోపాంగనలు సు
రాంగనలచూడ్కి కింపు లొసంగి రపుడు. 212

ఉ. చక్కని రాధ బిత్తరికుచంబుపయిం దన గోరునొక్క లోఁ
జిక్కిన కుంకుమద్యుతులచేఁ జెలువారుచుఁ బశ్చిమాద్రి బెం
పెక్కిన సాంధ్యరాగ లలితేందుకళాకృతి శౌరిచూడ్కికి
న్నక్కువఁ గొల్పెఁగట్టెమరమారుతధూతపటాంచలంబునన్.

క. బింకములాడుచుఁ బాడుచు
జంకింపుచు నీరు మీఁదఁజల్లుచుఁ గడఁకన్
బంకజముఖు లెలయించిరి
పంకజనయనుని వసంతపాటవలీలన్. 214

చ. పలుమఱుఁబొంచిపొంచితనుఁ జాయకకుంకుమునీరుచల్లఁగా
నలికులవేణి యొక్కరితెనంటఁగఁ బట్టి విభుండు నీటిలోఁ
బెలుచన ముంచుచుం బెఱుకుచుం గాఁగిటఁ జేర్చి దానిగు
బ్బలఁ బరిరంభ కేళి[1] నొగిఁ బట్టుచుఁ జే వదలం దలంకెడున్.

గీ. రాధయును మాధవుఁడు మత్సరమునఁ గడిసి
యంగములయందు గుంకుమ లలఁదియలఁది
దర్పకస్నానమునఁ జేయి దాఁక నులికి
నవ్వి రిద్దఱు నాలింగనం బొనర్చి. 216

సీ. పవమానవశమునఁ బసిఁడి చీరచెఱంగు
లెడలఁ గ్రొమ్మించుల యొడలు చూచి
బలిమిఁ గర్పూరాంకు లలఁదెడు నెయ్యంపుఁ
గైలాటములఁ జన్నుఁగవలు దొడికి
సంభ్రమోల్లంఘనసరణి ఝల్లునవిచ్చు
ధమ్మిల్లమునఁ బువ్వు దావిగ్రోలి
యెడనెడఁ దమ్ములమిచ్చుచో నిచ్చలు
తియ్యఁగెమ్మోవులఁ దేనెలాని

తే. యొకరికొక్కరి యంసంబు నొలిఁ జేరి
పలుగు జంకెన మాటలఁ గొలఁది వినుచు
శ్రీవిభుఁడు గోపకన్యలతో వసంత
కేళిఁ బంచేంద్రియోత్సవశ్రీలఁ దేలె. 217

---

1. నొగిఁబారుచుఁ జేవిదలందలంకుచుణ్. మూ.

క. పన్నిటఁ దోఁగి వలువలు
కన్నెల మై నంటి లేని కై వడిఁ దోఁపన్
నున్న దొడలు జఘనంబులుఁ
జన్నులు బంగారు తళుకుఁ జల్లెన్ దిశలన్. 218

సీ. ప్రోవులుగొన్న కర్పూర ధూళీపాళి
కుప్పలై రాలిన కుంకుమంబు
మేటులై యొదవిన మృగమదనాభులు
జిట్టలై తొట్టిన తట్టుపునుఁగు
కొండలై నిలిచిన గోరోచనాపంక
మేఱులై ప్రవహించు హిమజలమ్ము
గుంపులై పొదిగొన్న కుసుమగంధంబులు
రాసులై పడియున్న ప్రసవరజము

తే. గలిగి యమునాతరంగిణీపులినతలము
త్రిజగదభిరామమై యొప్పె దేవదేవుఁ
డచ్యుతుఁడు గోపకన్యాసహస్రసహితుఁ
డై వసంతోత్సవము సల్పు నవసరమున. 219

క. హరి[1]కరపుటమున వల్లవ
తరుణీకుచకుంభమధ్యతలములవలనన్
దొరఁగిన కుంకుమరేణువు
తరుణీ సమ్మోహనౌషధము ధరియించెన్. 220

1. హరి హార పల్లవ మూ.

వ. ఇవ్విధంబున లోచనోత్సవంబై మదనాధ్వరావభృథస్నాన సంరంభంబున విజృంభించి మాఱు లేక, విరహిసమాలోకభీకరంబులై ప్రజ్వరిల్లుచుఁ బరిభ్రమించు నించువిలుకాని యాగ్నేయాస్త్రపరంపర లను సొంపునఁ బెంపారుచుఁ బ్రత్యగ్రసమగ్రఘుసృణరస విసృమరశరీరలైన బింబాధరలును, విటమనఃపుటకుటీక్రోడంబు లను బంధురాంధకారమగ్నంబులు గావింపంబడిన సిరిపట్టి దట్టని మాయాతమోవికారధూమరేఖ లనుచొప్పున నొప్పుచు నస్తోకకస్తూరి పంకంబులమూర్తులై యాకర్షించు చంచరీకవేణులును బాంధసంతానధుర్యధైర్యాంతరిక్షంబులు పెంపుసొంపున ముంపుదుర్వారసమాకీర్ణసుధాసముద్రకల్లోల వల్లికలను పెల్లుననుల్లసిల్లుచు ఘనసారకర్పూర వారిధారాభిషేకనిషిక్తగాత్రలై, మైత్రిం జెందునిందుముఖులును, విస్రస్తకబరీభారపరిగళదవిరళకుసుమవిసరంబుల వలనను సమున్నత ఘనస్తనస్తబకవికీర్ణపుష్పపరాగంబులవలనను గర్ణావతంసకహ్లార మధురమధూళీసంభ్రమద్భ్రమరచారు ఝంకారంబులవలనను బల్లవాయుధుని మోహావల్లికలపెల్లున నల్లిబిల్లిగొనుచు విరసంపుమాటలలోనికీలును గసరుఁ జూపులలోని బిత్తరంబులును నొయ్యారంపు నడకలలోని గరువంబులును మెలపులలోని మెలపులును జిఱునగవులలోని కలికితనంబును బలుకులలోని పలుకును దొడువులలోని . నిలుకడలును

జిక్కుపాటులలోని చనవులును రారాపులలోని నిరాకరణంబులును దమకంపుడగ్గఱింతలలోని కౌఁగిలిమేలును రహస్యవర్ణంబులలోని చిక్కులును జరణకరపీడనాదులలోని సరసత్వంబును బరిచ్ఛటకరాకర్షంబులలోని యనుసరణంబులును బరస్పరసంజ్ఞాభంగులలోని సమ్మతంబును గలిగి వినయగౌరవస్నేహంబులు చెలువార సంభ్రమోల్లంఘన ధావనంబుల మనంబు రంజిల్లఁ బయ్యెదలుజాఱియుఁ బోఁక ముళ్లువీడియు వసంతగంధతోయంబులఁ దడిసియు జిలుఁగుదువ్వలువలు సడలిన నిగనిగలు నిగుడు మృదూరుకాండజఘననాభిమూల పయోధరకక్షప్రదేశంబుల మెఱుఁగుఁదీఁగెలందడుకనుదోయినుయ్యాల లూఁగుచు నేపునూపుఁ బూవుంబ్రాయఁపు గొల్లగుబ్బెతల కందఱు కన్నిరూపంబులై విహరించి యనంతరంబ ప్రాణవల్లభాతిలకంబగు రాధికకుఁ గై దండయిచ్చి మెలుపున మరకతమణిసోపానమార్గంబుల డిగ్గి యగ్గోపాలమన్మథుండు నదీప్రవాహంబుఁ బ్రవేశించిన. 221

క. జలజాక్షుల తెలిగన్నుల
తళుకులుఁ దనురుచులుఁ బులినకోలమూల నిగుడన్
గలహంసకలితయమునో
ర్ముల [1]సవిబయమిఁ దిమొక తెకము [2]నుకలు సలిపెన్. **222**

---

**1.** సలిబయపలిందెనొక తె. **2.** ప్రోడవులు. మా.

గీ. మాగ్ధ్యమున నేటిలోఁ జొర మదిఁ గలంగి
తనువు గరుపాఱ నొకతె మాధవుని గాంచి
యెంత బంటని యడిగిన నింత బంటి
యనుచు నాజాడ చనుగుబ్బలంటి చెప్పె. 223

క. నవచంద్రకాంతసోపా
నవితానము మెట్టి ప్రౌఢ నలినాక్షులు నా
ట్యవిధిజ్ఞ లరిగి రొక్కట
జవమున యమునాతరంగసంఘము లంటున్. 224

క. పొలఁతులు యమునానదిలో
పల నుఱుకుట యొప్పెఁ బుష్పబాణుఁడు హరితూ
పులఁ జిక్కనదీదేవతఁ
బెలుచన నాటించు నంపపింజను బోలెన్. 225

సీ. తమకేళి నవమరాళము లంచు నంచలు
రాకలు గని యనురాగ మొందెఁ
దమతోడి చక్రవాకము లంచుఁ గోకముల్
చన్నుగుబ్బలు గని సంతసించెఁ
దమజోక చంచరీకము లంచుఁ దుమ్మెదల్
భ్రమరకంబులు గని పరిణమించెఁ
దమలోని జలచరతతు లంచు మీనముల్
దృక్పరంపరఁ గని తివుటఁ బొదలెఁ

తే. గాని బెదరవ యింపైన - మానసముల
గొల్లగుబ్బెత లుల్లంబు - లుల్లసిల్ల
నాత్మవల్లభుఁ గూడి య - య్యమునఁ జొచ్చి
కలికి తరఁగలఁ బడి యీఁదు - క్రంచు దగిలి. 226

క. ఆ లోలాక్షుల చలదృ
గ్జాలములకు స్రుక్కుఁ జ - క్రచయమిందురుచి
శ్రీలని యిందీవరదళ
మాలిక లని సుడియు మ - త్తమధుకరరాజుల్. 227

క. తరుణీకంకణ నినద
స్ఫురణలు గాదంబ చ - క్రములరవము మదో
ద్ధుర మధుకరోత్కరశ్రుతి
విరావములు యమున లో - నవీనులు దనిపెన్. 228

సీ. కలువఱేకులుగావు - కలికి బేడిసలివి
కావు చంచలకటా - క్షములు కాని
క్రొన్నురువులుగావు - కుముదషండములివి
కావు క్రొమ్మించున - గవులుగాని
వీచికల్ గావర - విందనాళములివి
కావు దోర్వల్లీయు - గములుగాని
చక్రముల్ గావు కం - జాతకోశములివి
కావు బిత్తరిచన్నుఁ - గవలుగాని

తే. యనఁగఁ గల్హారమీన కటాక్షఫేన
కుముదదరహాస వీచికాకమలనాళ
హస్త కోకాంబురుహముకుళ స్తనములు
పడఁతుకలు నీళులాడ విడ్వడఁ దొడంగె. 229

క. వనజాక్షు లోలలాడఁగఁ
జనుగుబ్బలువచ్చి తాఁకి జర్జరితములై
చనువీచులు కొండలుదాఁ
కిన యట్టుల భంగతతులు కెలఁకులఁ జిందెన్. 230

చ. మలయుచు వల్లవాంగనలు మధ్యమదఘ్ననదీజలంబులో
పలనితరేతరాకలితబాహులఁ బాయగ నాచరింపఁ ద
ద్విలసదురోజకంఠముఖ విభ్రమమొలిఁదనర్చె వీచికాం
తలలిత చక్రచంచు సముదంచిత నాళయుతాబ్జసంగతిన్.

చ. జలరుహకోరకంబులని సంతసమారనొకర్తు చూచుకం
బుల నెలదేఁటులున్న నొకముద్దియయబ్బురమందిచూచియా
నలినదళాక్షుతోడ నలనాఁటికిఁ జూలుఘటిల్లెఁ జూడు నీ
కలికి విరాళిసేఁత ననఁగా విని నవ్విరి ప్రౌఢకామినుల్.

వ. అప్పుడు. 233

గీ. పసిఁడి యనఁటులు నవహేమ పద్మనాళ
జాలములఁ బువ్వుఁదెప్పలు సంఘటించి
జలజ కర్పూరఖండ పుష్పప్రవాళ
ఫలము లొడఁగూర్చి యెక్కె నప్పతియుఁ దాను. 234

క. కాంతలు వెల్వడఁ దరఁగల
బంతులు తద్గురుకుచములపైఁ బడి చెదరెన్
బంతమున సమతకధికుల
నంతరమెఱుఁగక యెదుర్చు నల్పులువోలెన్. 235

ఉ. ముప్పిరిగొన్న వేడుకల మూఁకలుగట్టి మరాళచక్రముల్
తెప్పలఁగట్టినట్టి నవదీర్ఘమృణాళులు వట్టి యెల్లెడన్
దెప్పలనుల్లసిల్లి సిరిదీకొని పువ్వులఁ బువ్వుఁ దేనెలన్
బుప్పొడిఁ బల్లవంబులను భూపతిముంచిరి మిండగోపికల్.

చ. జలరుహనేత్రలున్ హరియుఁ జల్లఁగఁ బెల్లుగఁ దూలు [1] సాంద్రనీ
రలసితమైన పంకజపరాగముఁ దద్రమణీయ సార భో
చ్ఛలదళినీరజాలముఁ బొసంగె హితంబునఁ బొత్తుగూడి యి
చ్ఛలనలచంద్రికాంధతమసంబులు వర్తిలుచున్నవోయనన్.

సీ. ప్రియయుడ్డకలువపూఁబేరుల నెలదేఁటి
దండులఁ దాపించు తరువువోలె
దయిత గుప్పినపైఁడి తమ్మిపుప్పొడి నరు
ణారుణాంశువుల నీలాద్రివోలె
రామ చల్లిన మకరంద పూరంబుల
దానధారల మత్త దంతివోలెఁ
బ్రమద వైచిన నవకుముదజాలమున న
క్షత్రజాలమున నాకసమువోలెఁ

1 చంద్రనీ, రలభయంబు.

ఆ. గోమరు మిగులు మదనగోపాలకృష్ణుఁడా
రమణిఁ గౌఁగిలింప రాధయొప్పె
సజల జలధర ప్రకాస క్తమై మహనీయ
దీప్తి వెలుఁగు మెఱుఁగుఁ దీఁగవోలె. 238

సీ. వడినొండొరులఁ ద్రోవ సుడిగుండములఁబడ్డ
లీలమైఁ ద్రిప్పి పుళినముఁజేర్చు
[1]నీఁదీఁడియలసి కాలూఁదిననడిలోఁతు
పట్టునన్నైనను మెట్టఁజూపు
గుఱుతెఱుఁగక మడుఁగున లోఁతుపట్లకుఁ
జొరఁబోవఁ దరఁగలఁ దిరుగఁద్రోచు
వడిపెట్టునందెప్పు వెడలిపోవచ్చిన
వక్రభంగులఁదొంటి వలననిలుపు

తే. నందసూనుండు గోపికాబృందములును
సరసగతులను జలకేళి సలుపునపుడు
తత్కృపాశ్రీలు వడయఁ దద్భావలీల
కనుగుణంబుగ యమున నెయ్యంబుచూపె. 239

సీ. నాభితలమునఁ జక్కవఁజేతు లిడియెత్తి
యీఁతనేరనినాఁతి కీఁతగఱపుఁ
దగుపాటి నీఁదుసుందరి యీఁదియలయు వే
ళను దెప్పకుంజేర్చ లంచమడుగుఁ

---

1 నిఁదిందిరలలసి. మూ.

దనతోడ గూడి పంక్తిమున నెక్కటియైయాఁడు
గరువంపు సతిమెచ్చి కౌఁగిలించుఁ
గడుఁగోలయైన యంగన నురస్స్థలి నుంచి
వెన్నునఁ దగనీఁది వేడ్కఁ సలుపుఁ

తే. దానెయొక్కఁడు నీఁది యద్దరిఁ జరించి
కమిచియచ్చటఁ జక్రవాకములఁ దెచ్చి
తమకుఁ దమకనివచ్చి హస్తములుసాఁచి
నందఱకుఁ నన్ని పంచిచ్చు నచ్యుతుండు. 240

క. తమపోషిత రాజమరా
ళముల నదీహంసికలఁ గలపి యవి మదనో
ద్యమమతిఁ గవగూడఁగ నా
ప్రమదలు నవ్వుదురు గోపపతి వీక్షింపన్. 241

క. ఇందుద్రవ కుంకుమరస
చందన మృగనాభిపంకసంకలనలఁ గా
ళిందీ సలిలోర్మి ఘటా
బృందంబులు వేడ్కఁదేల్చె బృందారకులన్. 242

క. కమలాక్షుని దేహస్వ
ర్ణమునుం గోవాంగనాంగ చందనశశికుం
కుమసౌరభ్యముఁ గలిగెను
యమున సుకృతభాగ్యమహిమ లలవియె పొగడన్. 243

క. వనమాణిక్యము బృందా
వనము; నదీజనని యమున; వనరుహనయనా
జనతిలకము రాధిక; య
వ్వనజాక్షుఁడు దేవదేవవల్లభుఁ డౌరా! 243

వ. ఇవ్విధంబున బహువిధప్రియ విహారణంబుల రాధయుఁదాను మాధవుండును వల్లవవధూజన సహస్రంబుల తోడఁ గూడి జలక్రీడలవధరించి తీరభూమికి విజయంచేసెనప్పుడు. 244

క. తడి పసుపుటొల్లె లంటినఁ
దొడలు నితంబములుఁ జన్నుదోయియుఁ గడునే
ర్పడనొసరిలుచు నగుచుం
బడఁతులు నది వెడలి రాత్మపతి దముఁజూడన్. 245

క. ఆతడివన్నెలసికలును
వాతెఱ తెలుపులును బసుపువన్నెయొడళ్లున్
బ్రీతి యొనర్చె మురారికి
నాతరుణులు తీరభూమి కరుదేరంగన్. 246

క. మురుకై సేసినయవిగా
వని వేఁడినఁ గల్పతరువు లాఁగూభీరాం
గనలకొసఁగెఁ బుష్పాంబర
ఘనకనకవిభూషణములు కల్పితములుగన్. 2 7

గీ. కోమల శ్యామలాంగకి ధామమడర
రామయొక్కతె పీతాంబరంబుఁ గట్టి
యల్లనాఁ డమరవరుల కమృతమొసఁగి
నట్టిహరిమోహనస్త్రీత్వ మభినయించె. 248

గీ. చంద్రముఖి యొర్తు సంపూర్ణ చంద్రచంద్రి
కానిభంబైన వెలిపట్టుఁ గట్టి నిలిచె
దీప్తిపుంజంబు దిక్కులఁ దేజరిల్ల
దర్పకునికీర్తి శుచిమూర్తిఁ దాల్చినట్లు. 249

గీ. మేలుముత్యాల నిద్దంపుఁ జేలఁ గట్టి
చూడనొప్పారె నెలదీఁగెఁ బోఁడియొకతె
విమల కలికావళీకీర్ణ విశదరేఖ
నుల్లసిల్లెడు మల్లికావల్లివోలె. 250

క. నారీమణి యొక్కతె సం
ధ్యారాగము పట్టుఁ గట్టి తనరె మనోభూ
వీరశ్రీనిలిచిన దిదె
శౌరివరించుటకు ననెడు చందము దోఁపన్. 251

వ. మఱియుందక్కినవారు పెక్కువన్నెల మనోహరాంశుకం
బులు ధరించి పుండరీకదళవిలాసంబును నపహసించు వెడంద
నిడువాలుఁ గన్నుల నల్లగలువఱేకుల మురిపెంబు చూపి
నం గాని ముఖచంద్రచంద్రికలకు సౌహార్దంబు లేదనియుం
బోలె వాలికగాటుక రేఖలు దీర్చి, 252

క. సరసపుఁ గొన గోళుల వే
కురులు వడిం దీర్చి సురభికుసుమంబులు ని
బ్బరముగ నిడి ముడిచిరి మధు
కరవేణులు వింతవింతగతులన్ గొప్పుల్. 253

గీ. రామయొక్కతె కాశ్మీరరజములంది
పసపుఁజాయల నునుమేనఁ బొసఁగెఁ జూడ
బాగుగా జాజు చేసినఁ బ్రజ్వరిల్లు
కనకనిర్మితపాంచాలికయును బోలె. 254

గీ. కప్పురపు గందవొడి యొక్కకాంత నుదుటఁ
బొందుగా వ్రేల నొసపరిబొట్టువెట్టి
కంఠకక్షకుచాగ్రభాగములఁ జల్లెఁ
గమ్మగాడ్పులు ప్రియుమీఁదఁ గ్రమ్ముకొనఁగ. 255

గీ. కప్పురపుధూళి పన్నీటఁ గరఁగి యొక్క
ముదిత నెలవంక తిరునామము నుదుటఁ దీర్చి
నందసుతునకు లోచనానంద మొసఁగె
నసమబాణుని యర్ధచంద్రాస్త్ర మట్లు. 256

గీ. సలిలకేళీవినిర్మలచారుమూర్తు
లై విభూషణపుష్పగంధాదు లంది
పొలఁతుకలు చూడ నొప్పిరి పుష్పశరుఁడు
పూజచేసినదివ్యాస్త్రములును బోలె. 257

వ. ఇట్లు మనోజ్ఞ మండన మండలాభిరామ వేషంబుల రాధాది ఘోషయోషాలలామంబులు కర్పూరవీటికామధురరసరంజితంబులై కోమలారుణబీజసుందరంబులగు పరిపక్వదాడిమ ఫలభిన్నదళప్రదేశంబులుం బోలెఁ బాటలప్రభాపటలకాంత దంతంబులం గలిగి పరిమిళితంబు లగుచు వాతెఱలు సొంపారఁ బ్రాణవల్లభు డగ్గఱి యయ్యైవిధంబుల సేవలు గైకొని రటమున్న యవ్విభుండును, 258

గీ. పసిఁడికప్పటి రింగులు వాఱఁ గట్టి
మృగమదంబునఁ దిరునామువిదగ నొనర్చి
దివ్యగంధమలఁది యభినవ్యపుష్ప
మాలికలు దాల్చె మదన గోపాలుఁ డపుడు. 259

గీ. నీలవర్ణుని తనురుచిశ్రీలలోన
లలితనాసాగ్రముక్తాఫలంబు వెలిఁగెఁ
జారు శృంగార రసమున సంభవించు
హాస్యరసమును బోలె నందంద మొుంది. 260

క. శ్యామల కోమల పల్లవ
ధామశ్రీతులసిమాల్యధరుఁడై రాధా
కాముఁడు దనరెఁ బయోధా
రాముఁడల నీలజలధరంబును బోలెన్. 261

గీ. గోపకాంతల నవనీల కుంతలములు
దువ్వి కూర్చిన యట్టి తద్రుచములువోలె
నలరఁ జెంగల్వరేకుల నలరు శౌరి
మే[1]ను సుమగర్భమున నిడ్డ మృగమదంబు. 262

వ. ఇట్లు సముచితాలంకార భాసితుండై, 263

సీ. యమునాతటంబున నమరభూజము నీడ
మహనీయ కర్పూర మండపమునఁ
బుష్పసింహాసనంబున రాధవామాంక
పాళిక లీలాంక పాళిఁదనర
ధవళముక్తాతపత్రద్యుతుల్ నిగుడఁ జా
మరములనునుగాలిఁ గురులుదూల
నాభీరకన్యాసహస్రదృక్చంద్రిక
లర్చనాపుష్పోపహారములుగ

తే. హారకేయూర మకుటమంజీర మకర
కుండలశ్రీలు దిక్కుల మెండుకొనఁగఁ
గొలువు గూర్చుండె గోగోపకులము గొలువ
సమధికస్ఫూర్తి గోపాలచక్రవర్తి. 264

---

1. నసమ. మూ.

సీ. ఆకిరీటప్రభ । లాపింఛరింఛోళి
యాశ్రవణావతం । సాబ్జయుగళి
యాకుంతలశ్రేణి । యాతిరునామ సాం
ద్రావర్ణితభ్రూల । తావిలాస
మాసుందరఘ్రాణ । మాకృపావీక్షణం
[1]బాదరహాస మా । యధరబింబ
మాకోమలశ్మశ్రు । లాకపోలద్వయ
మాకంఠ మాబాహు । లానఖాళి

తే. యాయురస్థ్సలకౌస్తుభ । మాకటీర
భర్మశృంఖల మాపచ్చ । పట్టుసుప్ప
టాశుభాంఘ్రుల రత్నంబు । లందెదోయి
మన్మనశ్శ్రీకి నభిరామ । మాడనంబు. 265

సీ. బహురూపధర మనో । భవధనుర్లతికావి
నిర్ముక్తనారాచ । నికరమట్లు
పవమానవశపరి । ప్లవబాలమల్లికా
గళదచ్ఛసూనని । కాయమట్లు
కలశపాథోధి రం । గద్వీచికోద్వాంత
లలితముక్తాఫల । కులములట్లు
కనకారవింద రే । ఖాసముదంచన్మ
దస్ఫారభృంగ బృం । దములయట్లు

1. దరహాసయధరదనము. మూ.

ఆ. కారుమెఱుఁగు లట్లు కలువఱేకుల యట్లు
ఉల్లసిల్లి వలపు వెల్లివిరిసి
కడఁగి ముంచె రాధికామాధవులగోప
బాలికాకటాక్షజాలకములు. 266

గీ. ఊరులతికలఁ గదిసి కూర్చుండిరాధ
మేలమునఁ జన్ను మొనఁ బ్రియుమేనువ్రాఁడిచి
తరళ కందర్ప గర్భ నేత్రములఁ జూపెఁ
బ్రథమరతికేళి సంకేతభవనసీమ. 267

సీ. బ్రహ్మాదిసురముని ప్రకరంబులకుఁ బర
బ్రహ్మస్వరూపమున్ భావశుద్ధి
యాహూఢయోగక్రియా శుద్ధిబుద్ధుల
కానందరసపూర మనెడు తెలివి
సహచరగోపాలజనులకు నిజసుహృ
ద్వరుఁడను వత్సలత్వంబుకలిమి
రాధికాప్రముఖ నీరజలోచనలకును
బ్రాణవల్లభుఁ డను ప్రణయభంగి

తే. గలుఁగఁ జేయుచుఁ గారుణ్యకలితలీల
దృష్టి భక్తుల కమృతంపువృష్టిగురియ

నలరు శృంగారి నట్టిమోహనమురారిఁ
దగిలి వర్తించు ధన్యుల దలఁపు దలఁపు. 268

శా. ఆరాధాముఖగోపకామినులతో నజ్జాయతాక్షుండు బృం
దారణ్యంబున నవ్విధంబున సముద్యల్లీలలన్ మన్మథో
దారప్రక్రియఁ గ్రీడసల్పుట మదిన్దర్కించుటల్ బ్రహ్మవి
ద్యారంభం బొనరించుటల్ సకలవిద్యా కోవిదశ్రేణికిన్.

వ. ఇవ్విధంబున సంతతంబును ననంత తేజోవిలాసంబున రాధావి
లాసినియుం దానును మాధవుండు మదనసహస్రశృంగార
రేఖ యంగీకరించి సకలలోకహృదయనయనాహ్లాదకరచ
రణకరలాఘవంబు లగు ద్వాత్రింశన్మదనగోపాల లీలా
రూపంబులఁ గ్రీడింపుచుఁ ద్రిభువనపాలనపరాయణుండై
నిజభక్తజనమనోరథపరంపరలఁ గరుణింపుచు నిజనిశ్చల
ధ్యానయోగారూఢులయందు దర్పణమండలంబులఁ బ్రతి
ఫలించు నమృతకరుండునుంబోలె శుభకరమూర్తిం బ్రవ
ర్తింపుచు నాత్మారామాభిమతక్రీడల విహరించె.

సీ. వేదాంత చింతాతపోదాననియతులఁ
బడయరాని పదంబుఁ బడయఁజేయు
గంగాదిపుణ్యా తరంగిణీ తీర్థాళిఁ
బోనిపాపంబులఁ బోవఁద్రోచు

సీశ్వరబ్రహ్మ సురేంద్రాదిదేవత
లీలేనిసంపద లెల్లనిచ్చు
ననుపమదివ్యమహామంత్రజపములఁ
బొందనివిద్యలు పొందఁజేయు

తే. నిరవలోకనతత్పరనిష్ఠులకును
జూపరానట్టి నిజమూర్తి చూపునెపుడు
రాధికామాధవ ప్రబంధాధినాథ
కృష్ణలీలావిహార సంకీర్తనంబు. 271

క. అని శుకమునిమౌళి వచిం
చిన శ్రీకృష్ణునకుఁ జెప్పెఁ జింతలపూడి
ల్లన రాధామాధవమి
ట్లనుపమమధురముగ నాశశాంకార్కముగన్. 272

శా. దీవ్యచ్ఛంఖసుదర్శనాంబుజగదాదీప్తప్రభామండలీ
భవ్యోద్దండభుజాచతుష్టయ రమాపద్మాయతాక్షీమనో
జ్ఞవ్యాపారవిరాజమానఘనవక్షః పీత వేణుస్వన
న్నవ్యశ్రావ్యనినాదమాధురికథానందజ్జగన్మానసా. 273

క. లాలితరాధాఘనకుచ
పాళీకస్తూరిపంకపంకిలవిలస
త్కాళిందీతటినీక
ల్లోలాంబువిహారసౌఖ్యలోలమనస్కా. 274

మాలిని. కనకపటకటీరా ! కంధర శ్రీశరీరా !
మునిహృదయవిహారా ! మోహనిర్మగ్నదూరా !
సనయగుణవిచారా ! సర్వవేదాంతసారా!
మనసిజజయధారా ! మానినీచిత్తచోరా ! 275

గద్య. ఇది శ్రీమన్మదనగోపాలచరణకమలసేవాధురీణ సత్కళా
పారీణ కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభు
సుపుత్ర సుకవివర్య రాధామాధవయెల్లనార్య
ప్రణీతంబైన రాధామాధవం బను
శృంగారప్రబంధంబు నందుఁ
బంచమాశ్వాసము.

సంపూర్ణము.

ఉ. సంతతభావశుద్ధియుతసంస్థితియున్ [1]సదయక్రియాపరి
భ్రాంతియు సర్వలక్షణవిచారణయున్ ఫలియించె రాధికా
కాంతుఁడు ప్రాణవల్లభుఁడు గావునఁ బావనమూర్తియైనయా
చింతలపూడి యెల్లకవిశేఖరు కోమలకావ్యకన్యకున్.

---

1. సనయ (మూ).

# తప్పొప్పులపట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 18 | వచస్ఫూర్తి | వచస్స్ఫూర్తి |
| 5 | 5 | చాటను | చోటను |
| 6 | 7 | తోడ | తోడఁ |
| 18 | 12 | వాంగినక్రొ | వాంగినఁగ్రొ |
| 21 | 20 | గృష్ణవర్మ | గృష్ణవర్మ |
| 25 | 8 | పాప | పాఁప |
| 30 | 6 | లోద వె | లోద వెఁ |
| ,, | 7 | పుప్ప | బుప్ప |
| ,, | 11 | సమ్ముఖుడ | సమ్ముఖుఁడ |
| 33 | 12 | జవ్వనంబు | జేవ్వనంబు |
| 34 | 6 | మందలము | మండలము |
| 40 | 2 | గొలసులఁ | గొలుసులఁ |
| ,, | 10 | నెఱకులు | నెఱఁకులు |
| 43 | 17 | అనినపలికిన | అనిపలికి |
| 46 | 5 | బోలగ | బోలఁగఁ |
| 47 | 5 | కలువలు | కలువలుఁ |
| 54 | 20 | సేయుఁడయ్యో | సేయుఁడయ్యోఁ |
| 55 | 1 | త్రిజగ | ద్రిజగ |
| ,, | 19 | కృష్ణుఁడు | గృష్ణుఁడు |

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 58 | 17 | వరింతు | వరింతుఁ |
| 61 | 17 | ముణిగింపఁ | ముణిఁగింపఁ |
| 73 | 14 | చత్కుల్ | జత్కుల్ |
| 81 | 3 | తెరి | తైరి |
| ,, | 6 | దేవీంద్రుల | దేవేంద్రుల |
| 87 | 17 | స్త్రీలలో | స్త్రీలలోఁ |
| 88 | 2 | బొప్పగ | బొప్పఁగ |
| 92 | 2 | బూదావి | బూఁదావి |
| 93 | 17 | పొగరుగుత్తు | పొగరుఁగుత్తు |
| 94 | 15 | భారంబునజ | భారంబునఁజ |
| 97 | 19 | లనుచు | లనుచుఁ |
| ,, | 20 | కొలుక | గొలుక |
| 99 | 18 | బెసిర | బెరసి |
| 109 | 6 | పూ | పూఁ |
| 119 | 5 | కూఁతుఁరని | కూఁతురని |
| 124 | 3 | విన్నాఁడ | విన్నాఁడఁ |
| 126 | 7 | నిండు | నిండుఁ |
| 129 | 17 | హారి | హార |
| 132 | 6 | నభవు | నభవుఁ |
| 138 | 10 | పట్టణంబు | బట్టణంబు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 139 | 5 | నొకడిడుఁ | నొకఁడిడుఁ |
| ,, | 6 | గోటికిపడగ | గోటికిఁబడగ |
| 140 | 17 | యనఁగ | యనఁగఁ |
| 143 | 15 | నునుగెంపు | నునుఁగెంపు |
| 145 | 4 | జల్ల | జేల్లఁ |
| ,, | 12 | వ్రేగువడి | వ్రేఁగువడి |
| 146 | 11 | మొఱయు | మొరయు |
| 153 | 7 | బువ్వపొన్నగ | బువ్వఁబొన్నగ |
| 155 | 17 | తెఱఁగుతప్పరి | తెఱఁగుఁదప్పరి |
| 157 | 12 | మొత్తుచు | నొత్తుచు |
| 161 | F. N. | వరలన్ | వఱలన్ |
| 162 | 5 | యనుచుఁ | అనుచుఁ |
| 165 | గద్య | సంసాతృతీ | సంసుఁదృతీ |
| 178 | 5 | వంధి | నంది |
| 182 | 21 | మగువ్రుల | మగువల |
| 186 | 16 | బవిత్రంబు | పవిత్రంబు |
| 187 | 12 | 61 | 71 |
| 192 | 11 | మగడూ | మగఁడూ. |
| 195 | 1 | నయ్యాది | నయ్యావి |
| 196 | 10 | సంధులజిక్కి | సంధులఁజిక్కి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ,, | 19 | వోయుజుమీా | వోయుఁజుమీా |
| 218 | 14 | త్రాళంబు | తాళంబు |
| 222 | 13 | పూర్లేందు | పూర్ణేందు |
| ,, | 14 | పక్షచ్చవి | పక్షచ్ఛవి |
| 224 | 3 | సూరసేన | శూరసేన |
| ,, | 4 | చోట | చోళ |
| 258 | 13 | బైపె | బైపై |
| 261 | 21 | అనుచు | అనుచుఁ |
| 268 | 14 | దానికిఁ | దానికి |
| 278 | 10 | దూతకొమ్మ | దూఁతకొమ్మ |
| ,, | 15 | వీరరసావేశంబున | వీరరసావేశంబునఁ |
| 280 | 7 | దఱుచుగ | దఱుచుగఁ |
| 281 | 18 | భంగి | భంగ |
| 287 | 9 | యొడ్డగడవై | యొడ్డగెడవై |
| 294 | 5 | ఔఁదల | ఔదల |
| 301 | 3 | గాలిదూలి | గాలిఁదూలి |
| 302 | 14 | లెసగ | లెసఁగ |
| 305 | 11 | బువ్వదేనె | బువ్వఁదేనె |
| 306 | 13 | పుష్పరాగ | పుష్యరాగ |
| 310 | 8 | నల్లఁదెకోమలాంగి | నల్లఁదేఁగోమలాంగి |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| **326** | **2** | నిల | నిలఁ |
| **327** | **2** | నొక్కరతె | నొక్కరితె |
| ,, | **6** | యందు | యందుఁ |
| ,, | **7** | స్థా | స్థా |
| ,, | **14** | బువ్వదావి | బువ్వఁదావి |